# హిమబిందు

చారిత్రాత్మక నవల

అడివి బాపిరాజు

• సాహితీ సమితి •

హైదరాబాద్ (దక్షిణ)

అంకితము

నా స్వప్నాలకు అమృత పయస్సు కురిపించిన
మా తల్లి సుబ్బమ్మగారికి

సమాలింగిత భూతలుడనై
ఈకృతిని సమర్పిస్తున్నాను.

కుమారుడు అడివి బాపిరాజు

# ప్రథమ భాగం

## ౧

## వణిక్సార్వభౌముడు

కృష్ణవేణీ ప్రవాహమున నీడ చూచుకొనుచున్న శ్రీ ధాన్యకటక దుర్గాధి లక్ష్మికి, వణిక్సార్వభౌముడగు చారుగుప్తుని మహాసౌధము శ్రవణావతంసమై విరాజిల్లుచుండెను. అచట కిన్నూరు ధనువుల దూరమందున్న మహాసంఘా రామచైత్యమును, చారుగుప్తుని సౌధమును చక్కదనమున నక్కా సెల్లెండ్రవలె నున్నవి. నున్ననై నిగనిగలాడుతూ పాలరాతిగోడలపై చిత్రించిన బుద్ధదేవ జాతక గాథలతో నలరారు చారుగుప్తప్రాసాదము కనులు చల్లజేయుచూ రూపెత్తిన శిల్పలక్ష్మివలె నున్నది.

చారుగుప్తుడానాడు వ్యాఘ్రాజినము పఱచిన దంతపుబీట పై నధివసించి, తూలికోపధానములపై నొఱగి, గోష్ఠపాలకుడగు నింద్రగోపునితో సంభాషించుచుండెను.

చారు: మన శూరనేత్ర సంజీవకములు ఉజ్జయినిలో పందెముగెలిచి, ఱేనిచే బంగారు కట్లబండిని బహుమానముగా దెచ్చినమాట నిజమేకాని, కామందక కుల పాలకముల కవి తీసికట్టే. మన జతల నన్నిటిని మా మేనల్లుడు, సమవర్తి, పరీక్షించి కామందక కులపాలకయుగళమే అన్నిటికి మిన్నయని తేల్చినాడు. సార్వభౌముని జన్మదినోత్సవము నాటి పందెములలో ఆ జతనే కట్టినచో మనకు జయము లభించునన్నాడు. మఱి, నీ యభిప్రాయమేమో!

ఇంద్ర: చిత్తము. తమ మేనల్లుడుగారా జత నిదివర కెన్నడైన బండి తోలి చూచిరా యని సంశయించుచున్నాను.

చారు: ఆ! రెండుసార్లు బండి తోలినాడు. స్నేహితుడగు శశాంక వసువుగారి మ్లేచ్ఛాశ్వముతో సమానముగ రెండు గోరుతములు[1] పరువెత్తెనట. విజ్ఞానకంఠీరవుడుగూడ సుళ్ళు, రూపురేఖలు పరిశీలించి ఉత్తమోత్తమములని నుడువుటచేతనేకదా ఈ ఎడ్లజతలకు పదునేనువందల పణాలిచ్చి, కొంటిని.

ఇంద్ర: చిత్తము. అయినచో అంత బలవత్తరమైన జతను మన సారథి నడపగలడా?
చారు: నిజమే. ఇదివరకు చారుగుప్తునితో పందెమువేసి యెవ్వరును జయమొందలేదు. ఇప్పుడు ఈ కోడెల నడుపు మగటిమి గలవాడు లేక మన మోడిపోయిన తలవంపులు. సమవర్తియే బండితోలుగాక.

ఇంద్ర: కాని....

చారు: “కాని” యని మాట్లాడకూరకుండెదమేమి? అంతకన్న ధాన్యకటక నగరమున సారథి యెవ్వడు? అతని నిదివరకొక్కరైన మఱి ఓడించిరా? ఎంత పొగరుగిత్తలనైన నాతడు సులభముగ లోబరచుకొన లేదా?

ఇంద్ర: చిత్తము. దేవరకు పూర్తిగా నిష్టముండిన నా అభ్యంతర మేమియులేదు. ఇక నాకనుజ్ఞ.

అని ఇంద్రగోపుడు చేతుల జోడించి వీడ్కొని చన, చారుగుప్తుడు యేమేమియా

యాలోచించు కొనుచుండెను. ధాన్యకటక నగర వర్తకులలో ముఖ్యుడును, వణిక్సంఘాధిపతియునగు చారుగుప్తునకు పందెములన్నచో ప్రాణము. అతని గజాశ్వవృషభశాలలలో, చక్రవర్తిశాలలలో నున్న మృగముల కెంతమాత్రము వెనుదీయని ప్రాణులున్నవి. అతని శకటములు దేవవిమానములు. ఆతని సేవకులు పరాక్రమవంతులగు యక్షపుత్రులే. ధనరాసులు సమకూర్పనెంతయో కష్టపడు చారుగుప్తుడు భోగముల ననుభవించుటలో ఆ ధనరాసుల నశ్రమముగా వెచ్చించును.

హిమబిందు కుమారిని మహారాజు నింటికోడలిని కావింప నెంచియున్నాడు. సౌందర్యఖనియు, ఆనందకందము, తన బహిఃప్రాణము నగు హిమబిందుకుమారి మహారాజ్ఞి కాకపోయినచో తన కుబేరవైభవము గాల్పనా? తనతనయకాక, భరతఖండాన ధాన్యకటక సింహాసనాసీనురాలగుట కింక నేబాల తగును? రాజకుమారిక లుందురుగాక! వారు తెచ్చెడిదేమి, ఇచ్చెడిదేమి! సర్వవిద్యాపరిపూర్ణ సర్వకళాశోభిత, దివ్యసుందరగాత్రయగు తన బాల, హిమబిందుకుమారి. చక్రవర్తులు కని విని యెరుగని మహానిధులతో, అతులవైభవముతో వచ్చుచుండ ఏ సార్వభౌముడు మోకాలొడ్డును! ఈ కార్యసిద్ధికై తాను రెండవ చాణక్యదేవుడు గావలసివచ్చిన వచ్చుగాక.

ఇట్టి యాలోచనలనేకములు చారుగుప్తుని హృదయాకాశాన వెలుగువలె ప్రజ్వరిల్లి పోయినవి. ఆ ఆశయే అతని తపస్సు; ఆతని యైశ్వర్య మాతపస్సాధనము; అతని జీవిత మా తపస్సిద్ధి కంకితమైనది.

చారుగుప్తుడు సన్నగా పొడువున ధనువునకొక గుప్పెడు తక్కువగా నుండును. తప్తకాంచనవర్ణమువాడు. కమ్మెచ్చులు తీసినట్లుండు అంగసంపద గలవాడు. దీర్ఘమై చివర వంగిన గరుడనాసికవాడు. అతివిశాలమగు ఫాలము గలవాడు. గరుడపక్షికి వలె నాసికామూలమున లోతులై ఆతని కన్నులు దీర్ఘములై విశాలములై తీక్షణములై ఎదుటివాని మనసు లోతుల జొఱబాఱుచుండును. పెద్దదగు నాతని బట్టతలపై, అచ్చుటచ్చుట తెల్లని వెండ్రుకలు లంకలలోని రెల్లుపూవుల జ్ఞప్తిగొల్పుచుండును. మెడలోని ఆణిముత్యముల పేరును, స్వచ్ఛమగు యజ్ఞోపవీతము నాతని బంగారు వన్నెకు మెరుగులు దిద్దినవి. సువర్ణదీప శోణరత్నాలు, సింహళదేశపు గరుడపచ్చలు నాతని కుండలముల మెరుగు లీనుచు కంఠరేఖలలో లీనమగుచుండును. “బాలనాగీ! బాలనాగీ! చిరంజీవను తోడ్కొనిరా” యని చారుగుప్తుడు కేకవేసెను.

చారుగుప్తుడు కూర్చుండిన మందిరాన గోడలన్నియు రమణీయచిత్ర లేఖనావిలసితములు, రత్నకంబళాచ్ఛాదితములు. నలువైపుల మణిఖచితధూప కరండాలనుండి అగరు జవ్వాజి కస్తూరి పునుగు మంచిగంధపు పొట్టు యందుగుబంక మొదలగు ధూపద్రవ్యముల పొగలు సువాసనల వెదజల్లుచు చిన్న మేఘాలరీతి ప్రసరించుచున్నవి.

ఇంతలో ఘల్లుఘల్లని బంగారు చిరుమువ్వల చప్పుడు వినసైనది. అంతఃపురమున కేగు ద్వారమధ్యమునుండి పూలప్రోవు, రూపముదాల్చిన చంద్రకిరణము, ఒక్కబాలిక, కొండవాగువలె ప్రవహించివచ్చి చారుగుప్తుని యెదుట వంగి పాదాల నంటినది.

చారు: సత్వరసామ్రాజ్య సింహాసన సిద్ధిరస్తు. అమ్మా! రేపటి ఉత్సవములకు పోయెదవుగాదా?

హిమబిందుకుమారి: అత్తయ్య, అమృతలతాదేవి, రమ్మని వార్తపంపినది

నాయనగారూ

చారు: వారి మండపమునకా?

హిమ: అవును.

చారు: పుణ్యాత్మురాలు మీతల్లి నిర్యాణమైన ఈమూడు సంవత్సరాలనుండి మన మండపము కళాహీనమైన పుష్పాలులేని వృక్షమైనది. తల్లీ! ఈ దీర్ఘవిచారమున కింక స్వస్తి చెప్పుదము. మన హృదయాల ఆవరించిన మేఘాలుమాయమగు శుభసమయ మరుదెంచుచున్నది. బంగారు తల్లీ! నీ యమూల్య విభూషణాలన్నియు నలంకరింప పరిష్కర్త్రి తారాదత్త కాజ్ఞ నిచ్చితిని. మన మండపమును హర్షుడను మండనకుడు అలంకరించుచున్నాడు. మా చెల్లెలు అమృతలతను నీవే యాహ్వానింపుము. నీముత్తవ ముక్తావళీదేవియు నిన్ను వెంబడించుగాక. అప్సరసలతో లక్ష్మివలె చెలికత్తెలతో నందవతరింపుము తల్లీ!

హిమ: నాయనగారూ! మనబండిని బావ సమవర్తి తోలునటకాదూ!

చారు: అవునమ్మా, అవును సమవర్తి శకటపరీక్షలో విజయ మంద గలడు. ఆ ఉత్తమ వృషభయుగ్మము శ్రీకృష్ణశాతవాహన మహారాజకుమారులకు నివేదనమగుగాక.

హిమ: నా కేదో భయము కలుగుచున్నది నాయనగారూ!

చారు: చిట్టితల్లీ, ఆ మాటలేమిటే! మనధాన్యకటక పురిని జరుగు మహోత్సవమునకుబోవ చారుగుప్తునితనయ భయపడుటేమి!

హిమ: అదికాదండీ, ఏదో భయము. మహోత్సవమునకు బోవ భయము కాదు.

చారు: వెఱ్ఱితల్లివి! వెళ్ళిపాడుకొనుము. వీణ బాగుగా వాయించు కొనుచున్నావా? నృత్యాచార్యులు నీ నాట్యము చూచి హర్ష మొందుచున్నానని వచించినాడు. నీ తల్లి ఎంత ఆనందించియుండునో!

అతని కన్నుల విచారమేఘము లావరించినవి.

హిమబిందుకుమారి తండ్రికి నమస్కరించి వెడలిపోవుచుండ నశ్రుసిక్తములగు చారుగుప్తుని కన్ను లామెను ద్వారతోరణమువరకు సాగనంపినవి.

## ౨
## శిల్పి

అతని హస్తములు లలితములయ్యు శిలాశిక్ష నశ్రమముగ నిర్వహించుచున్నవి. పాలరాయితునుకలు దెబ్బదెబ్బకు ఉల్కలవలె నెగిరిపోవుచున్నవి. పాషాణధారణముపై సుత్తె అతివేగముగ, సున్నితమున వాలుచుండ, టంకగమనము నృత్య మభ్యసింపుచున్నది. క్రిందనున్న రాయి నిముస నిముసమునకు కావ్యరూపము దాల్చుచున్నది. ఆ శిల్ప మప్పటికే తెరచాటునుండి వచ్చిన వేషమువలె స్పష్టరూపము దాల్చినది. ఆ శిలాఫలక శిల్పమునం దొకటి రెండు విగ్రహములు మాత్ర మింకను పూర్తికాలేదు.

అప్పుడే కోటయం దాఅవ ముహూర్తము దెలుపు భేరీని మ్రోగించినారు. ఆ బాలకుడు లేచి వెనుకకు బోయి తన నేర్పరితనమును సవిమర్శ తీవ్రదృష్టితో కనుబొమ్మలు ముడిచికొని పరిశీలింప సాగినాడు.

ఒకచో విషయాసక్తుండగు రాజు ఉద్యావనమున అవరోధజన పరివేష్టితుడై క్రీడించుచున్నాడు. ఒక బాల రాజుతో మేలమాడుచున్నది. వేరొకతె మృదంగము వాయించుచున్నది. ఒక కృశాంగి నృత్యమున తన్మయత్వమునొంది, నిమీలిత నేత్రయైనది. ఒక చకోరాక్షి కాముకుడగు మనో నాయకుని వక్షోవిస్ఫూర్తి నవలోకించుచు నానంద పరవశయై యతని భుజమును చిగురువంటి హస్తతలముచే తాకుచున్నది.

ఈసమూహామునకు కుడిప్రక్క విజ్ఞానదము పుణ్యపురుషకథా పవిత్రమునగు దృశ్యము. బుద్ధుడు భిక్షార్థియై వీధులవెంట నరుదెంచినాడు. ఉపదిష్టధర్ములు, అష్ట మార్గావలంబకులు నగు ప్రజలు సందర్శనాభిలాషులై చేరుచున్నారు. బండివాడు, కాపు, నీరు తెచ్చు సుందరాంగి, పాలనమ్ముగొల్లది, భక్తిపూరిత నయనాల నా తథాగతుని నవలోకించుచున్నారు. వారందరితో పాటు రాజు, రాణులతో వెడలివచ్చి బుద్ధదేవుని సందర్శించుచున్నాడు. రాజు మోకరించియున్నాడు. రాణులు ఫలాదుల భిక్ష నర్పించు చున్నారు.

వ్యాఘ్రాజినముపై నిలుచుండి తదేకదృష్టితో శిల్పమును కనుంగొను నా యువకునకు పదియుతొమ్మిది సంవత్సరముల ప్రాయమున్నది. ఆతని మూర్తి సమున్నతము, కండలు తిరిగిన బాహువులు, విశాలవక్షము, తల పెద్దది, కోలమోము, సాధారణపు టాంధ్రనాసిక. అయినను ఆ బాలుని కన్నులు తీక్షణములై, నవ్వుచును సొగసులు ఒలకబోయును. ఆ కన్నులను జూచినవారు అతని మరుక్షణాన ప్రేమించి తీరవలయును. అందమున కన్నులతో నీడుజోడైన యాతని పెదవుల అరుణకుట్మలత్వము, నాసికా సాధారణత్వమును కప్పిపుచ్చి ఆతని ముఖ మంజులత్వాని కలంకారము దిద్దుచున్నది.

ఆతని కన్నులను, విశాల ఫాలమును, సుందర వదనమును వెలిగించునది. అతని భ్రూకుటి. అది యమునా గంగా సంశ్లేష పవిత్రము. అది హిమాచల సుమేరు పర్వతాలింగన సుందరము. అది కన్యాకుమారీ హృదయస్థ ప్రాక్పశ్చిమ సముద్రతరంగ సంయోగ గంభీరము.

ఆతని విశాల నయనాలు తీక్షణదృష్టులతో ఆ శిలాంతరాళమును జొచ్చిపోయినవి. ఆతడు నిట్టూర్పుపుచ్చి చేతనున్న టంకమును, అయోఘనమును ప్రక్కనున్న పనిముట్ల మందసమునందుంచెను. ఈ సాయంత్రమునకిది పూర్తి కావచ్చును. అప్పుడే ఆరు ముహూర్తములైనది. కోటలో భేరియు, స్తూపఘంటయు మ్రోగించినారు.

"రెండు మెతుకులు నోటవైచుకొని వచ్చి...." అను ఆలోచనములాతని హృదయమున పరువులిడినవి.

ఆ మందిరమం దెచ్చుట చూచిననూ పాలరాతి విగ్రహములు వివిధ శిల్పావస్థలలో నున్నవి. చిత్రశోభితములై తోరణయుతములైన ద్వారకవాటములతో వర్ణమనోహరములైన కుడ్యములతో వర్ణములు కలుపుకొను పాత్రలతో, తూలికాది పరికరములుంచు మంజూషలతో, శిల్పశాస్త్ర తాళపత్ర గ్రంథములుంచిన పేటికలతో నా మందిరము విచిత్ర సౌందర్యము తాల్చినది.

మిసిమి వయస్సులోనున్న ఆ బాలశిల్పి అటుల నాలోచనాధీనుడై యుండ, ఇంతలో

నొకజవ్వని ఇంటిలోనికి బోవు గుమ్మముకడకు వచ్చి "బాబూ సువర్ణ! భోజనమునకు రావా? మీ తండ్రిగారు కనిపెట్టుకొని ఉన్నారు. మీ అమ్మగారు వడ్డించుచున్నారు" అని పిలిచెను. బాలకుడు ఉలికిపడి.

"ఇదిగో, అందుకే లేచితిని, ఆరవ ముహూర్తనాదము వినబడినది ఇప్పుడే కాదా" అనెను.

"ఒక నాళిక పైగా దాటినది బాబూ!"

"ఏమిటీ! నాయనగారు బుద్ధారాధనచేసి నా కొరకు కని పెట్టుకొని యుందురు. ఎంత మందమతిని! పాద ప్రక్షాళనముచేసి ఉడుపులు ధరించుకొని వచ్చెదను." అనుచు నాతడు త్వరత్వరగా దొడ్డిలోనికి పోయెను.

ఇంతలో మహాలి మహానసగృహమునకుబోయి

"అమ్మా! కుమారుడు పాదప్రక్షాళనముచేసి శుభ్రవస్త్రములు ధరించి వచ్చుచున్నాడు. అది యెచ్చటి శిల్పదీక్షయో కాని మన సువర్ణకుమారునికి బాహ్యస్మృతియే ఉండదమ్మా!" అని పలికినది.

"అయ్యో, చిన్నతనాన వారును ఇంతే. ఆ తండ్రికి కొడుకుగాడూ! పోలిక లెక్కడికి పోవును! వారి జపమైనది, నా వడ్డనయు పూర్తియైనది. అబ్బాయివచ్చి కూర్చుండెనేమో చూడు, వానికి ఇష్టమని మామిడికాయ పచ్చడి చేసితిని."

మహాలి భోజనాగారములోని కడుగిడి చూచి, వెనుకకువచ్చి, "అమ్మా! వచ్చి కూర్చున్నాడు. నేను పోయి, అమ్మాయిలకు స్నానాదికముల కేర్పాట్లు చేసెద" నని యామె గృహమున వేరొకభాగాన కేగెను.

తండ్రి కొడుకు లిరువురు భోజనము చేయుచుండిరి. తటాలున ధర్మనంది పుత్రుని గని, "రేపు సార్వభౌముని జన్మదిన ఖేలనోత్సవములకు వెళ్ళుదువా?" అని అడిగెను.

"చిత్తము,"

"ప్రదర్శనములో పాల్గొనుచుంటివా?"

సువర్ణశ్రీ మాట్లాడలేదు.

"పందెగాళ్ళలో నొకడవని వింటిని. బాబూ! శకటవేగ పరీక్షకు నీవు వెళ్ళుటా! నీవు ఎడ్లబండి తోలడ మెపు డలవరచుకొంటివిరా!"

సువర్ణశ్రీ కుమారుడు భోజనము చేయుటమాని బంగారుకంచా న వ్రేలు రాయుచుండెను. ధర్మనంది తన తనయుడు విద్యాసక్తితోపాటు దేహబలము వృద్ధి నొందించికొనుటయు గమనించుచునే యున్నాడు. మల్లయుద్ధవిశారదులలో మేటి, ఉప సేనానాయకులలో నుత్తముడు నగు సోమదత్తుని వ్యాయామ వనములందు కుమారుడు సుశిక్షితుడై ప్రఖ్యాతి నందుచున్నాడనియు ఎరుంగును. అయినను తన కుటుంబము పూర్వకాలము నుండియు శిల్పవిద్యయందు యశము సముపార్జించుకొనుచున్నది. ఆ దివ్యవిద్యను వదలి పామరజనోచితమగు వీరవిద్యయందు కాలము గడుపుట

యంతయవివేకము! ఆత్మరక్షణమునకు ఆర్త రక్షణమునకు యుద్ధాశక్తి అవసరమగును. అంతమాత్రమే.... అయినప్పుడు....?

"బాబూ! నీవు దిగులుకొనకు; నిన్ను వీరవ్యవసాయమునుండి మరల్చు పిరికిమానిసిని కాను. మనవిద్య భగవత్ప్రీతికరము, సర్వోత్కృష్టము. తథాగతుని గాథలు శిల్పంలో రూపించి తనకు ద్రష్టకు నిర్వాణ మార్గ సోపానములు కట్టుశిల్పి యెక్కడ, వీరవిద్య లెక్కడ? భిక్షులువాగ్ధార బోధించిన ధర్మమునే, మనము టంకణ ధారతో ప్రసరింప చేయుదుము."

ధర్మనందుల ధర్మపత్నియగు శక్తిమతి భర్తనుజూచి "బాబు శిల్పదీక్ష మీకు తెలియదుకాబోలు. చిన్ననాటి మీ శిల్పవ్యసనమంతా జ్ఞాపకముచేస్తూ వుంటాడు. పోలిక లెక్కడికి పోతవి! అభయబాహు మహారాజుతో మీరుచేసిన మల్లయుద్ధ వినోదాలు జ్ఞాపకము లేవూ?" అని పలికినది.

సువర్ణ శ్రీజనకుని పవిత్రభావము నిముషమున ద్యోతకము చేసికొనెను. కాని శకటాధ్యక్షులగు మహాశ్రీకి తన విజ్ఞాపనపత్రమును సోమదత్తులవారు పంపియుండిరే! ఇప్పుడు వెనుదీయుటకన్న బేలతన మేముండును?

కుమారుని మోము తిలకించుచున్న ధర్మనంది "వత్సా! సరియే, కానిమ్ము. మనకుటుంబమున వెన్నిచ్చినవా డింతవరకు జన్మింపలేదు. నీవు క్షేమముగ విజయివై వచ్చెదవుగాక!" అని నయనములు ప్రకాశింప పలికి, భోజనము పూర్తిచేసెను.

సువర్ణశ్రీ కుమారుడును పై కుబుకు సంతోషము నడంచుకొన ప్రయత్నించుచు పితృభక్తి పూరితములగు నశ్రుబిందువులు నేత్రముల దొలక భోజన మెట్లెట్లో చేసెను.

## 3
## సేనాధికారులు

సమదర్శి మధ్యమ వర్చస్వి. అయిదడుగుల ఎనిమిదంగుళముల పొడవు. కండలుదేరిన అవయవస్ఫుట రేఖలతో రాతివిగ్రహమువంటి కఠినదేహముకల పోటుమానిసి. అనేక యుద్ధముల ఆరితేరిన బంటు. మదించిన మగధ మహిషమువలె మత్తిల్లియుండి, వాహినీపతులలో నుత్తముడై, మహారథుడై యిరువదిరెండువర్గాల పడుచుప్రాయంపు వీరుడై వెలయువాడు.

ఉత్తమాశ్వారూఢుడై, ఎడమచేతనున్న కళ్ళెము గుర్రము మెడమీద వదలి, మీసాలు మెలికలు తిప్పుకొనుచు, జనుల కేలుమోడ్పుల చిరునవ్వుతో నందికొనుచు ఒక నా డాతడు ధాన్యకటక నగరవీధుల హుటాహుటి స్వారి చేయుచు కోటనానియుండు యోధాగార గోపుర ద్వారముకడకు బోయినాడు. అచ్చట కావలిగాయు దళపతికి సంకేతము దెలిపి స్వారి చేయుచునే లోపలికి బోయెను.ధాన్యకటక నగరమునందు కోటలో రెండును, నగరములో రెండును, నగరము వెలుపల పదియు యోధాగారము లున్నవి. కోటలోని యోధాగారములు రెండును పెద్దవి. ఒక్కొక్కదానిలో అయిదువేల కాల్బలమును, వేయి గుర్రములును, వేయిమంది అశ్వికులును, అయిదువందల ఏనుగులును, వేవురు గజారోహకులును, మావటీలు వేవురును, అయిదువందల రథములును, అయిదువందల రథికులును, సారథి సహస్రమును, చక్రరక్షకులు వేవురు నుందురు. దళపతులు, ముఖపతులు, గణపతులు, వాహినీపతులు, చమూపతులు, ఉపసేనాపతులు, సేనాపతులు అని సైన్యాధికారులు

తరతమములై యుందురు. నాలుగు ఏనుగులుగాని, నాలుగు రథములుగాని, పదిరెండు గుర్రములుగాని, ఇరువదిమంది కాల్బంటులుగానీ-ఏదియైనను దళమనబడును.[2] మూడు దళములు ఒకముఖము, పది ముఖములు ఒక గణము, మూడు గణములు ఒక వాహిని, మూడు వాహినులు ఒక చమువు. నాలుగు చమువులు ఒకసేన అని ఆంధ్ర సైన్యములు విభజింపబడినవి. ఒక్కొక్కసేనకు ఒక్కొక ఉపసేనాని అధిపతి. సేనాపతి రెండు సేనలను నడుపగలడు. సర్వ సైన్యములకు నాయకుడు సర్వ సైన్యాధ్యక్షుడు.

యోధాగారము సమచతురస్రమై, ఆవరణషట్కముతో నొప్పియుండును. నడుమనుండు ఆవరణలో సేనానాయకశాలయున్నది. ముఖపతులు సైనికులతోపాటు దళపతులు ఉత్తమ గృహములలో నివసింతురు. గణపత్యాద్యుత్తమ సేనాధికారులు నగరములో భవనములలో నివసింతురు.

సమదర్శి అట్లు ఆవరణలన్నియు దాటుచు పోయి సైన్యాధికారిభవనము ముంగిట నిలిచినాడు. అనేక సైన్యాధికారు లీతని చుట్టునుమూగిరి. పరుగిడి వచ్చిన అశ్వరక్షకుని చేతులలోనికి కళ్ళెమును విసరి, గుర్రమునుండి ఛంగున నురికి, “ఆంధ్రవీరా!” యని తన్ను సంతోషమున సంబోధించు స్నేహితుల జూచి నవ్వుచు, వారితో లోనికిజని, ఉచితాసనము నలంకరించినాడు.

“రేపటి మహోత్సవములో విజయము సమదర్శిది” యని ఆనంద వసువు వాక్రుచ్చెను.

“సార్వభౌములకు సమదర్శిపై అందుకే గదా అంతప్రీతి” యని ప్రభాతశూరుడు పలికినాడు.

సైన్యాధికారులు తళతళమను వెండిబంగారు చెక్కడపురేకు పొదిగిన తామ్ర శిరస్త్రాణములు తలలందును, మెడలో హారములు, భుజముల కేయూరములు, మొలల పట్టుకోకలు అలంకరించికొని యుండిరి. వారిలో ఆశ్వికులకు కూర్పాసములును[3], రథికులకు కంచుకమును[4], పాదచారులకు వారవానకములు[5], గజపతులకు దేహత్రాణములును, దేహమునకు విడివిడిగా ధరించు లోహపుగొట్టములు గలవు. కంఠత్రాణములు, నాగోదారికములు[6] అందరును ధరింతురు. ఆ పరాక్రమమూర్తుల నవలోకించినచో ఆంధ్రసైన్యములు సకల భారతవర్షమున నేల దుర్జయములో తెల్లమగును.

వీరలోకమంతయు వివిధాసనముల నుపవిష్టమైనది. “సమదర్శి! సర్వసైన్యాధ్యక్షుని భవనము చుట్టుప్రక్కలవారికి యుద్ధమనుమాట వినబడుచున్నదట?” అని అమలనాథుడు సమదర్శి దిక్కు మొగంబై ప్రశ్న వేసెను.

ఆనందవసువు: సమదర్శి సమవర్తే. సార్వభౌములు “సాతవాహన శత్రు సమవర్తి” అని బిరుదము ప్రసాదించినారా! చెప్పవయ్యా.

ప్రియదర్శి శాతవాహనుడు తన కొమరునకు సమదర్శియని నామకరణ మీడికొనినాడు. శాతవాహన సామ్రాజ్యము పై ఎత్తివచ్చిన ఆభీరులపైని శ్రీముఖ శాతవాహనుడు సమదర్శిని సైన్యమిచ్చి పంపినాడు. సమదర్శి ఆభీరులను పూర్తిగా ఓడించి తరిమివేసి వారి పతాకములన్నియు కొనివచ్చి సార్వభౌముని పాదములకడ నర్పించెను. అప్పుడానందహృదయుడై చక్రవర్తి “సాతవాహనశత్రు సమవర్తి” యని బిరుదమును నిండుసభలో సమదర్శికి ప్రసాదించెను. అందుచే అతని బందుగులు, మిత్రులు సమవర్తియనియు పిలుచుచుందురు.

సమ: ఏమున్నది? మొన్న బేగిరావు నాడువార్త తెచ్చుటయు మహామంత్రులవారు శీఘ్రముగ మహారాజ దర్శనమున కేగిరట. సర్వసైన్యాధ్యక్షులను పిలిపించిరట.

ప్రభాతశూరుడు: ఆవార్త మాళవమునుండి కాదా?

అమల: మాళవము తిరుగుబాటు చేసిందనే ఊహిస్తున్నాను.

ఆనంద: ఊరుకోండి మామగారూ! మొన్నకదా చండవిక్రములైన వినీతమతుల ఆధిపత్యమున మాళవమునకు సైన్యము లంపుట, అంత కొన్ని దినములకే వార్తాహరులు మాళవము శాంతముగ నున్నదని తెలుపుట జరిగినది?

ప్రభాత: ఆనంద! నీకు తెలివితేటలులేవు. ముగ్గురు సార్వభౌములకడ పనిచేసిన అమలనాథ సేనాపతులు నీపాటి ఆలోచన చేయలేదని అనుకొంటివా?

ఆనంద: చేయలేదనికాదు.

అమల: ఏమో! వృద్ధులమాటలు పడుచువాళ్ళు పాటింతురా? మా చిన్నతనమున పెద్దలకెన్నడు నెదురుచెప్పి యెఱుగము.

ఆ వీరు లొకరిమొగము లొకరు చూచుకొనిరి.

సమ: మామగారూ! కోపగించకండి. ఆనంద చనువుకొద్దీ ఏవో తెలివితక్కువ మాటలు అన్నాడు. ఆ దోషమునకు ప్రాయశ్చిత్తం మీరు విధించదగుదురు. మనలో మనకు అరమరలు కూడవని వీరలోకమునకు మనవి.

ఆనందవసువు విచారమావరించిన మోముతో అమలనాథునికడ మోకరించి “ఈ యపరాధికి దండనమే ప్రసాదము” అని తలవాల్చికొనెను.

అమలనాథు డాతని రెండుచేతులు పట్టుకొని లేవనెత్తి “నాయనా! నీవు రెండురోజులు మౌనవ్రతము దాల్చి మహాచైత్యమున ఆదిశ్రమణునకు దీప మర్పించి, ఆంధ్రమహారాజుల పతాకము సర్వదిశల విజయ కాంతులతో తేజరిల్లవలయునని ప్రార్థించుము, కళ్ళెములేని అనవసరోత్సాహమును కనుగొనిన నాకు విచారము కలుగునుగాని కోపమురాదుసుమా” యని పలికినాడు. వీరులందరును లేచి అమలనాథుని అభినందించిరి.

అమల: ప్రస్తుత మాలోచింపుడయ్యా! రేపు మనలో వృషభశకట పరీక్షకు ఎవరెవరు నిలబడిరో సమదర్శిని చెప్పనిండు.

సమదర్శి: సార్వభౌముల పక్షమున వరాలకుడును, మా మేనమామగారి రథము నడుపుచు నేనును, కళింగదేశాధిపతి పంపిన శివస్వాతియు నుందుము. మాళవ ఘూర్జర మగధ పాండ్య చోళ కేరళ పాంచాలములనుండి దిట్టరులగు వారు వచ్చిరట. ఇంకను పెక్కుమంది యున్నారు.

ప్రభా: గెలిచినవారికి కానుకలమాట చెప్పవైతివి?

సమ: ప్రతివర్షము నిచ్చునదిగాక, ఈ ఉత్సవమున అన్ని పరీక్షలకు అదనపు కాన్కల నిత్తురట సార్వభౌములు.

ప్రభా: ఉక్షశకటపరీక్షకు అదనముగా ఏమిచ్చెదరో చెప్పుకోండి. ఇవిగో పదిపణాలు పందెం.

చాలమంది వివిధ వస్తునామము లుచ్చరించిరి. ఇంతలో ప్రతీహారియగు నొకదళపతి లోనికి విచ్చేసి నమస్కరించి "జయము జయము వీర శ్రీమంతులకు! ఉపాధ్యక్షులవారు విజయము చేయనున్నారు. వారి రథము మూడవద్వారము దాటినది" అని నిర్గమించెను.

ఆయుధపాణులగు నలువు రంగరక్షకులు వెంటరా నుప సైన్యాధ్యక్షులగు కాకుండకులు సంపూర్ణ కవచధారియై విచ్చేసిరి. ఒక్కసారిగా సేనాధికారులందరు లేచి నమస్కరించిరి. అందరికి ప్రతినమస్కృతులిడి కాకుండకు లోక దంత పీఠ మలంకరించి వారిని "కూర్చుండు"డని సంజ్ఞచేసిరి.

"రేపటి మహోత్సవమునకు శతస్కంధుడు, ప్రమానందుడు, చండకేతుడు, గుణవర్మ రథ గజ తురగ పదాతులతో రక్షకులై వచ్చునది. ముప్పది ఏనుగులు, రెండువందల రథములు, అయిదువందల గుఱ్ఱములు, మహాఖేలనా స్థలము చుట్టును విడిసి ఉండవలసినది. సార్వభౌముల ఊరేగింపు మహోత్సవమున నూరు ఏనుగులు, అయిదువందల రథములు, రెండువేల పదాతి దళము, వేయి గుర్రములు కావలికాయునది. అందులకు వలయు నాయకులను అమలనాథులవారు ఏర్పాటు చేయుదురుగాక. వారే ఆ ఉత్సవమునకు అధిపతులు. వారి నాయకత్వమున ఇంక నన్ని సైన్యములు ఊరేగింపు టుత్సవమున పాల్గొనవలసినది. కుంభీరకులు, ఉపపాదులు, అనుగ్రహులు, ఉద్ఘాటకులు యీ నలువురు సేనాపతులు చక్రవర్తికి అంగరక్షకులుగా వెళ్ళవలయునని సర్వసైన్యాధ్యక్షుల ఆజ్ఞ. అమలనాథులు ఎన్నుకొనిన ఉపసేనానులూరేగింపుటుత్సవ సైన్యములు నడుపునట్లు ఆజ్ఞ. ఆయా యోధాగారాలలో వంతు వచ్చినవారు కావలియందురు గాక. తక్కినవారు మహోత్సవమునందు పాల్గొనవచ్చును. ఈ ఉత్సవము నవదినముల నీ యాజ్ఞయే వర్తించును. తథాగతుడు మీకు రక్ష" అని కాకుండకులు యథోచితముగ వెడలిపోయిరి.

## ౪
## విషబాల

"బుస్సు" మని యా పాము లేచినది. దాని కన్నులలో నవ్వుతాండవ మాడినది. ఆ కన్య యా పాము నెత్తుకొని, కుడిచేతితో పడగనందికోని, ముక్కుతో ఆ ఫణిరాజు ముట్టెను ప్రియమార రాచినది. అది భయంకర కాలోరగము. ఆరడుగుల పొడవుతో మిలమిలలాడు నీలనీరధి కల్లోలము అర్జునుడను ఆ పన్నగేంద్రు డాయోషాతిలకమును అలmeను. నాగవల్లివలె చుట్టుకొనిపోయెను.

"అర్జునా! నీవు మంచివాడవోయీ! నీ కన్నులు వజ్రాలవలె మిలమిల లాడుచున్నవి. నీ తలమానికము తళతళ తోచుచున్నది. నీ దేహన నీలరత్నాలు మిరుమిట్లు కొలుపుచున్నవి.నీకును ఉలూపికిని ప్రణయకలహము తీరినదా? నీవు సంతోషాన నింత జ్వలించు చున్నావు? నీ నాల్కలు చాచి నా పెదవుల నంటెదవు. వద్దు! నా కెంగిలి అసహ్యాము. ఈరోజున పరుగుపందెములో నిన్ను ఓడించగలనుసుమా!" అని సౌందర్య రాశియగు నాబాల పకపక నవ్వినది.

ఇంతలో మొగలిరేకువంటి శ్వేతోరగి యోర్తు ఆ బాలకడకు వేగాన ప్రవహించుచు వచ్చినది. దానిని చూడగనే అర్జునుడా కన్యకా హస్తాల నుండి నేలకుజారి, ఓంకారరూపమై ఆడజొచ్చెను. ధవళఫణియు, గ్రక్కున నా యువతిపై కెగబ్రాకి ఆమె మూర్ధాననుండి ఫణము

క్రిందకువాల్చి యాబాలిక ముక్కు బుగ్గలు, పెదవులు, గడ్డము, నాల్కలనంట సాగెను.

చంద్రకిరణమువలె మిలమిలలాడు స్నిగ్ధస్విన్నాంగముతో నాభుజగి ఆ జవ్వని లేతపొన్నాకు చెవికడ సంగీత స్వనాన బుసకొట్ట నారంభించినది. బాలికయు "ఏమి ఉలూపీ! భర్తపై నేరాలుమాని ప్రేమవాక్యాలు పలుకుచున్నావు! ఆహా! మూడునాళ్ళ కలహపు ముచ్చట నేటితో తీరెనేమి? ఏది! నాయెదుట ఒకరినొకరు కౌగిలించుకొను "డని కోకిల పులుగుపలుకుల కుహుకుహూలాడినది. తక్షణమే యా పన్నగి క్రిందకుజారి అర్జునుని మెలివేసికొనిపోయినది.

ఆ మందిరమునం దెల్లయెడల విషోరగములు భయంకరములై తిరుగాడుచున్నవి. పాములు నివసించుటకు గోడలపొడుగునను మట్టితో కృత్రిమ వల్మీకములు నిర్మింప బడినవి. ఆ బాలిక అందలి నాగములతో మంతనమాడుచు, నాడుకొనుచు ఒక ముహూర్తకాలము వినోదించి యా మందిరము వెల్వడినది.

ఒక కక్ష్యాంతరముదాటి యామె ఉద్యానవనవాటిక ప్రవేశించెను. అందు నాభితీగెలు కంచెలయందు దట్టముగా నల్లికొని ఎర్రని పుష్పములు పూచి యున్నవి. శృంగి, మదనబేరి, ముష్టి విషక్షీర విసబొద్ది వృక్షములు అచ్చుటచ్చట తమ విషపత్రముల నాడించుచున్నవి. అది భయంకర సుందర వనవాటిక. అది మృత్యుబాలికా నృత్యరంగము.

ఆ వనాంతమున వివిధవర్ణ శిలలతో నిర్మింపబడిన జలాశయము నాకృశాంగి సమీపించి విగతవస్త్రయై, యందు దుమికి, యీదులాడజొచ్చినది. ఆ నీరములందు అగ్నికీలాసదృశములు నగు వివిధ విషాదులు సమ్మిళితము చేయబడియున్నవి.

ఆ తన్వంగియందు గాలికి నూగులాగు బడబానల జిహ్వావలె నీదు కొన్నది. పిల్లిమిరెములు, బల్లటీలు కొట్టినది. ఆ విష దిగ్ధనీరముల బుక్కిట బట్టి పై కెగ జిమ్మినది. మునిగి తేలినది. ఓలలాడినది.

జలక్రీడలైన వెనుక సువ్వునలేచి పదునెనిమిదేళ్ళ చుఱుకు ప్రాయంపు టద్భుతసౌందర్య మొలుక బోసికొనుచు మెట్లెక్కిగట్టునకు వచ్చి, కురుల తడియార్చుకొని ద్విగుణీకృత దేహకాంతితో వెలుగుచు, కాటువేయబోవు పామునోటి కోరవలె తళతళమన్నది.

ఆమె సౌందర్యము సువాసనాలహరు లెగబోయు తరులగర్భములోని అగ్నివంటిది. తియ్యని విషము. విద్యున్మాలినీ విలసితము, పాయము తాల్చిన వ్యాఘ్రరాణి, పదునుపెట్టిన నిశితకృపాణము.

కుంతలములను వలిపెముతో తుడుచుకొనుచు దిసమొలతో నొయారముగ నడుగులిడుచు ఆ వనవాటి నంటియున్న భవనమార్గమును జేరినది. ఆమె దేహచ్ఛాయ తప్తకాంచనము. నల్లనై విడబారు కేశభారము జానువులవరకు వ్రేలాడినది. పరువములు తొంగిచూచు ఆమె వక్షోరుహద్వయము తరుణకదంబము పూచిన తొలిపూతగుత్తులు. ముగ్ధత్వమువీడని యా బాలికా తనూరేఖలు అపశ్రుతిరహిత రాగమాలికా మోహనతరంగములు. మత్స్యాకారములై దీర్ఘములైన యామె లోచనాల కలలు తిరగవు. అవి నిశితసారాచ ముఖధగద్ధగితములు. ఆమె అధరోష్ఠములు మధురములు, కరుగని అరణ్యక బింబ ఫలములు, నాభి కుట్మలములు.

ఆ బాల యభ్యంతరగృహమునకు విసవిసజని, సన్నని దుకూలము ధరించి

స్తనవల్కలము జుట్టుకొని నగలుదాల్చి నాభీగంధకదంబితమగు పచ్చి సాంబ్రాణిబంక పొగవేసుకొని కుంతలా లార్చుకొనుచుండ నామందిర కవాటము తెరచుకొని పండువంటి యొకవృద్ధతపస్వి స్థాలతిష్యులు లోనికి వచ్చిరి. మిసమిసలాడు నా బాలికాసౌందర్యము ఆపాదమస్తకము గమనించుచు, చిరునవ్వు మోమును వెలిగింప నాతడు చేరవచ్చినాడు.

"తాతయ్యా! నాకేమి తెచ్చినారండి!" యని యామె యాతని కౌగిలిలోనికి వ్రాలినది.

"కన్నతల్లీ! నీవు నా కోర్కెలీడేర్చు దివ్యముహూర్తము సమీపించుచున్నదిసుమి. అప్పుడు నీ ఇష్టమువచ్చినట్లాడుకొని, నాశనమొనర్ప అమూల్యము, సజీవమూ నగు నాటవస్తువు నీ కర్పించెదను. ఈలోన ఇతర వస్తువులు నీకు వలయునవి ఒసగుచుంటినిగాదా!?"

"ఆ వస్తువు అందముగా నుండునా తాతయ్యా?"

"ఆ సౌందర్యమునకు దేశదేశములు తలలొగ్గుచున్నవి."

"ఎప్పుడా ముహూర్తము తాతగారూ?"

"బ్రహ్మ సరస్వతిని విద్యాతేజఃపుంజముచే సృష్టించినాడు. కమలాక్షుడు కంటకుల నిర్మూలించుటకై చక్రమును సూర్యరజముచే త్వష్ట కల్పించినాడు. పరివేదనాతప్తమగు నాహృదయతాపమువోసి నిన్ను పెంచికొన్నాను. తల్లీ! నీ కన్నులు జాజ్వల్యమాన హాల హాలధారలై పోవుగాక! నీవక్షోజములు ప్రళయాగ్ని స్ఫులింగకలశములౌగాక! నీ దేహము జృంభా విస్ఫురన్మృత్యు ముఖదంష్ట్ర యగుగాక! ఆ దివ్యముహూర్తము ఇదిగో వచ్చుచున్నది. వచ్చుచున్నది తల్లీ!"

అతని కన్నులు ఫాలము భయంకరములగు కాంతులచే ప్రకాశించి పోయినవి. వణుకుచున్న అతని చేతులు ఆమె మూర్ధమును తడివినవి.

ఇంతలో "ఘణఘణ" యొక జేగంట మ్రోత వినవచ్చినది.

ఆ తపస్వికి మెలకువవచ్చి తీవ్రత తగ్గిన కంఠముతో "అమ్మా! పూజా వేళయైనది. పరమశివుడు యోగనిద్రనుండి లేచి నా పూజకై నిరీక్షించుకొనియున్నాడు. నేను వెడలెద" నని పలికి రూపొందిన బ్రహ్మవిద్యవలె నున్న యాతడా గదినుండి వెడలిపోయినాడు.

తాతగారు వెడలిపోయిన వెనుక ఆ బాలిక వేరొక కవాటమును తెరచుకొని వివిధములగు ఆటవస్తువులున్న వేరొక మందిరమునకు బోయినది.

ఆ బాలిక బొమ్మలతో నాడుకొనుచు, కూనిరాగముల తీసికొనుచు ఆ క్రీడలో మునిగిపోయినది. వ్యాఘ్ర సింహాదులు కురంగాది జంతువుల తినుచున్నట్లు, దేవి రాక్షసుల వధించుచున్నట్లు కీలుబొమ్మ లనేకములందుగలవు.

బొమ్మల పెళ్ళిళ్ళు, బిడ్డబొమ్మల గుజ్జనగూళ్ళు ఆ పాప చిన్ననాటి నుండియు నెరుగదు. ఆమె ఆట పాట లన్నిటిలో వీరభయానకరౌద్రములే మెదిపి యుంచిరి. ఆమె చూపులకు విలయపయోద నీలిమలు కాటుకలైనవి. ఆమె యూర్పులు మృత్యు నిశ్వాస భుగభుగలతో సహాధ్యయనము చేసినవి.

# శ్రీకృష్ణశాలివాహనుడు

శ్రీముఖ సాతవాహన మహారాజు అభయభాహు సాతవాహన చక్రవర్తికి ప్రథమ తనయుడు. బౌద్ధశకము 426వ సంవత్సరమున ధాన్యకటకాన కౌశికీదేవి గర్భశుక్తి ముక్తాఫలమై శుభలగ్నమునందు జన్మించినాడు. శ్రీముఖుడు బౌద్ధశకము 453వ వర్షమున ఆంధ్రసింహాసన మధివసించి మహాప్రజ్ఞతో రాజపాలన మారంభించినాడు.

సార్వభౌముడు బంగారు ఛాయవాడు. సంపూర్ణముగ ధనువు పొడువు గలవాడు. కోలనగు మోము, చక్కని కోరమీసములు, దీర్ఘసమ నాసిక, విశాలములై, అరమూతలై నిమ్నములుకాని కళ్ళు, సమఫాలము, పెద్దనోరు శ్రీముఖుని ముఖము సర్వసార్వభౌమ జయశ్రీ విలసితము. కండలు కట్టిన దేహము, కొంచెము చిరుబొజ్జ ఆ విగ్రహానికి ఒకనిండు తెచ్చినవి.

శ్రీముఖుడు మరి మూడేండ్లకు పట్టాభిషిక్తుడగుననగా పెద్దకుమారుడు శ్రీకృష్ణుడు జన్మించినాడు. శ్రీకృష్ణసాతవాహన యువమహారాజు వెనుక, చక్రవర్తికి ఇరువురు రాకుమారికలు, ఒకరివెనుక ఒకరు నాలుగేండ్లు భేదముగా జననమొందినారు. ఆ వెనుక ఇద్దరు కుమారులు పుట్టిపురిటిలనే సందుగొట్టి చనిపోయినారు. తర్వాత రెండేండ్లకు శ్రీకృష్ణునికి పదునారు సంవత్సరముల ఈడున అతనికి తమ్ముడు మంజుశ్రీ రాకొమరుడు జన్మించినాడు. పదునారవ సంవత్సరమున శ్రీకృష్ణుడు యౌవ రాజ్యాభిషిక్తుడై ప్రతిష్ఠాన నగరపాలన భారము వహించెను. ప్రతిష్ఠాన నగర పాలకత్వము నందిన యువరాజులు మహారాజను బిరుదము వహింతురు.

శ్రీకృష్ణసాతవాహనమహారాజు ఇప్పు డిరువదిరెండు వర్షముల ప్రాయమున సింహకిశోరమువలె విస్ఫారితవక్షుడైమధ్యమోన్నత శరీరుడైయౌవన పరిమళార్ధ్రి వయస్కుడై, మహావీరుడై, శతృహృదయ విదారకుడై, ప్రతిష్ఠాననగరాన రాజ్యపాలన మొనర్చుచున్నాడు.

సార్వభౌముని జన్మదినోత్సవములకు మహారాజు శ్రీకృష్ణసాతవాహనుడు ప్రతిష్ఠానమునుండి ధాన్యకటకమునకు సేనాపరివృతుడై సర్వవైభవోపేతుడై విచ్చేసినాడు. యువరాజు ధాన్యకటక నగరానికి మూడు గోరుతము లెగువను కృష్ణాతీరముననున్న విజయస్థలిత యనుకోటలో విడిదిచేసెను. వచ్చిన మరునాడు శుభముహూర్తమున శ్రీకృష్ణుడు సపరివారుడై, మాతాపితలకు పాదాభివందన మాచరింప సార్వభౌముని మహాభవనమునకు వెడల సన్నద్ధుడగుచున్నాడు. అలంకరణ మందిరమునుండి మంజులశ్రీ మూర్తియై, కిరీటకేయూరాది సకల భూషణాలంకృతుడై, మందహాస వదనుడై బయలుదేరెను. మౌక్తికాలంకృత దుకూలాంబరావృత ధవళచ్ఛత్రముతాల్చి ఛత్రవాహనుడు వెనుక నడువ, చామరగ్రాహిణులగు సుందరులు కరకంకణక్వణన మనోహరముగ నిరుదెసల వీచోపులిడుచుండ, పార్శ్వవర్తిని యగు మనోహరాంగి భుజమున ఎడమచేయినిడి, దక్షిణ హస్తమున లీలానీలకుముదము ధరించి, వేణు, కాహలాది వాద్యముల మధురగీతములు సెలగుచుండ సాయుధులగు నంతఃపుర రక్షకవనితలు పరివేష్టించి నడువ, శ్రీకృష్ణ సాతవాహనమహారాజు బయలుదేరి గుమ్మము దాటుటకు కుడిపాదముంచినతోడనే ఒక శ్వేతోరగము బుస్సుమనుచు, ఎట్టఎదుట ఆడుచు ప్రత్యక్షమైనది. భయావృతమనస్కులై ఎచటి వారచట ఆగిపోయారు. పార్శ్వవర్తిని కెవ్వున అరచి రెండుచేతుల కళ్ళుమూసికొనినది. శ్రీకృష్ణకుమారు డాశ్చర్యమున, ఒక్కతృటికాల మట్లే యుండిపోయినాడు.

ఇంతలో నీలాంబుదావృత విశాలాకాశము వెలిగించి, మాయమగు విద్యున్మాలవలె నా శ్వేతపన్నగి వారందరు చూచుచుండగనే మాయమైపోయినది.

అద్భుతాశ్చర్యహృదయులై, వారందరు శ్వేతఫణి తమతమ పాదాలను చుట్టినదేమో అని చేష్టలుదక్కి ఆ సుందర మందిర పురోభాగమున మలచిన ప్రతిమలవలె క్షణకాలము గన్పట్టిరి.

రక్షకభటులు, దౌవారికులు, పారిపార్శ్వకులు, ముఖపతులు, మంత్రు లొక్కసారి సాయుధహస్తులై యా మందిరమంతయు వెదకనారంభించిరి.

శ్రీకృష్ణమహారాజు ఆ శ్వేతపన్నగినే తలంచుకొనుచు, చిరునవ్వు వెలుగులు మరల మోమున నలమికొన, పార్శ్వవర్తినితో "మన ప్రయాణము సాగనిమ్ము" అని యాజ్ఞనిడెను.

అయిదు లిప్తలలో మరల పరివార జనము, మంత్రులు, సేనాధిపతులు యథాస్థానములకుజేరి మహారాజు కనుసన్నల ముందుకు సాగిరి.

మహారా జిట్టు దుర్గప్రవేశమొనర్చి అంతఃపురముచెంత దన పరిజనమును నిలిపి, లోనికరిగి, దర్శనసభలో సింహాసనాసీనులైయున్న తల్లిదండ్రుల పాదములకు సాష్టాంగ ప్రణామ మాచరించినాడు.

బుద్ధభిక్షులు, విప్రులు ఆశీర్వచనములు పలుక, సార్వభౌముడు, సామ్రాజ్ఞియు సింహాసనములనుండి లేచి, నయనముల ఆనందబిందువులు నృత్యమాడ, వంగి కుమారుని చేరియొక చేయిపట్టి లేవనెత్తుచు, "చిరంజీవివి, సత్వర వివాహితుడవు, సిద్ధసకలాభీష్టుడవు కమ్ము తండ్రీ" అని ఆశీర్వదించిరి.

జననీ జనకుల నోటినుండి ఆశీర్వాదము వెలువడుచున్నప్పుడు శ్రీకృష్ణకుమారుని హృదయమున తెల్లని పామొకటి ఆడుచు కనిపించినది.

సార్వభౌముని అనుమతిగొని యువరాజు తల్లితో అభ్యంతరమందిరమునకు బోయినాడు.

మహారాణి: కుమారా! ప్రయాణము కుశలముగ జరిగినదా?

శ్రీకృష్ణుడు: దేవమూర్తులైన తమ ఆశీర్వాదబలము నాకు వజ్రకవచముగదా తల్లీ!

మహారాణి: మా కడుపును పవిత్రము చేయుటకు పుట్టినమూర్తివని నేను వేయిదేవులకు సర్వదా నమస్కరించుకొందును తండ్రీ!

శ్రీకృష్ణుడు: మా తమ్ములు బంగారు తొనల బొమ్మ, మంజుశ్రీ మూర్తి జాడలు తెలియలేదుకదా?

మహారాణి: నాయనా నా కడుపులో ఆ బాధ ఎప్పుడును కుములుచునేయుండును. ఏ దుర్మార్గునకు చేతులు వచ్చినవో!

శ్రీకృష్ణుడు: ధనమునకాశించి ఇట్టిపని జరిగి ఉండదు. అమ్మా! మీరు పరిపూర్ణ ధైర్యమువహించి ఇంకను కొన్నినెలలుమాత్ర మోపికపట్టుడు.

మహారాణి: నాయనా! నేను పైకి ధైర్యమువహించినా, అసలు నా హృదయములోని బాధ ఏలాగు తీసివేసుకోగలనయ్యా! నీవు తమ్ముని వెదకి ఆరునెలలలో అమ్మగారి ఒడిలో కూర్చుండపెట్టుదునని ప్రతిజ్ఞపట్టితివని వింటిని. తండ్రీ! నా చిన్ని బాబును ఒడిలో కూర్చుండ బెట్టుకోగల భాగ్యము మాకు వచ్చునా! అందుకు మీరందరు ఏమరుపాటులేక ప్రయత్నములు చేయుచునే యున్నారు, అయిన నా అదృష్టమెట్లుండునో!

శ్రీకృష్ణుడు: అమ్మా! మీరు కంట తడి పెట్టకుడు. తమ్ములు బ్రతికి క్షేమముగ నున్నారని తెలిసికొన్నాను. ఆ సాక్ష్యము అనుమాన రహితమైనది, శుకబాణులవారే తెచ్చినారు.

మహారాణి: అవును తండ్రీ, మహారాజుగారు ఆ విషయమును చెప్పినారు. అందుకే ఈ మాత్రము ధైర్యముగ నున్నాను. నేనును, మహారాజుగారును త్రయంబకమునకు...

శ్రీకృష్ణుడు: అవును జననీ! తామును చక్రవర్తియు ఎప్పుడు త్రయింబక గౌతమీ జన్మస్థలమునకు రాగలరు?

మహారాణి: సార్వభౌముడు ఒకసారి పశ్చిమదేశాలకు రావలెనని యనుకొన్నారు. త్వరలోవారు ఏదియేని నిర్ణయమునకు వచ్చెదరనుకొందును.

శ్రీకృష్ణుడు: అమ్మా! తమ పాద సేవ చేయుటకు వచ్చుచుండ, నాకీదినమున ఒక తెల్లని తాచుపాము శకునమైనది. దానికి ఫలమేమో యని ఆలోచించుచున్నాను.

మహారాణి: ఏమిటి తండ్రీ! పామా! బుద్ధభగవానుని రక్ష, నీకు పరమేశ్వరామృత రక్ష! చిరంజీవ! చిరంజీవ! ఎచ్చట ఈ పాము కనబడినది? రాచబాటనా!

శ్రీకృష్ణుడు: లేదు తల్లీ! మహాభవనానికి పయనమై అలంకార మందిరము దాటివచ్చిననాకు మందిరాంగణమునం దది ఆడుచు ప్రత్యక్షమైనది.

మహారాణి కొమరుని శిరము పొదవిపట్టుకొని తనమోమున కాన్చి కొని మరల వదలినది.

శ్రీకృష్ణ సాతవాహనుడు ఇంచుక నవ్వుచు తల్లిమోమున చూడ్కివఱపి

"జననీ! తాము మహాంఘారామానికై కట్టించు విహారము పూర్తియయినదను కొందును. గురువులగు అమృతపాదార్హతులకు దాని నర్పించు శుభ ముహూర్తమెపుడు?" అని ప్రశ్నించెను.

"బాబూ! మీ తండ్రి గారును, నేనును సౌందర్యనిధియగు కోడలిని వరియించినాము. బాలిక చిత్రమును జూచి నీ యభిప్రాయము చెప్పవలయును. నీ వివాహమును, విహారార్పణము ఒకమారే" అని కుమారుని వైపునకు తిరిగి యా సామ్రాజ్ఞి చిరునవ్వు తెచ్చుకొనుచు పలికినది.

శ్రీకృష్ణసాతవాహనుడు నవ్వుచు "శ్వేతపన్నగ సందర్శన ఫలితమా తల్లి!" అనుచు వంగి తల్లిపాదముల నంటెను.

సార్వభౌముని దేవేరి, పుత్రుని నవ్వుచూచి, ఏదియో అవగతము చేసికొన ప్రయత్నించుచు, చిరునవ్వుతో తీవ్రాలోచనసలిపి, సుతునిశిరముపై చేయినుంచినది.

శ్రీకృష్ణసాతవాహనునకు తన తమ్ముని, మంజుశ్రీని, చోరులు తస్కరించుకొని పోవుటలోని ఉద్దేశ్య మెంత ప్రయత్నించినను అర్థముకాలేదు.

చక్రవర్తి అంతఃపురములోనికి చొచ్చుకొనిపోయి, మాయావేషములతో మహాధైర్యముతో వేయిమంది రక్షకభటుల, రక్షకస్త్రీల, కంచుకుల, ద్వారపాలుర దాసీజనముల మధ్యనుండి రాజకుమారుని ఎత్తుకొనిపోగల దిట్టరి ఎవడు?

ఇది ఒకరిపని కాదు. అత్యంత సమర్థుడైన పురుషుడు కొన్ని వేలమంది సహాయంతో, అంతఃపురములోని దాసదాసీజన సహాయముతో, కొందరు రక్షకభటుల సహాయముతో జరిపియుండుననికదా శుకబాణుల వారు అభిప్రాయ మందినారు. వారితో మహారాజును, మహామాత్యులు, సర్వ సైన్యాధ్యక్షులు ఏకీభవించినారు.

రాజ్యమునకై ప్రయత్నమా? కసితీర్చుకొను ప్రతీకారమా? ముక్కుపచ్చలారని బిడ్డను కొనిపోవ వారి హృదయ మెట్లొప్పినది? శుకబాణుల చారులు దేశమునంతయు దువ్వెనతో దువ్వినారు. ప్రభువు అనుమానమును శుకబాణుల అనుమానమును, స్థాలతిష్యమహర్షి మీదనే ఉన్నది. కాని ఎన్నివిధములైన మాయలు పన్నినను, అనుమానాత్మకమగు ఒక చిహ్నమైన స్థాలతిష్యమహర్షి యాశ్రమమునందు గోచరింపలేదట. వారి ఆశ్రమములో వైద్యశాలలున్నవి. సర్పవైద్యమునకై అష్టఓషధుల తోటలున్నవట. మంత్రములకు కట్టుబడి పెద్దపులులు, సింహములు, చిరుతలు మొదలగు క్రూరమృగములెన్నేని యాతని మృగశాలయందున్నవట.

విద్యార్థులై దేశదేశములనుండి ఎందరో పండితులు, ఋషులు, కాపాలికలు, యోగులు వచ్చుచుందురు. వైద్యమునకు ముక్తికి మంత్రోప దేశములకు లక్షలమంది ఆ పవిత్రాశ్రమమునకు వచ్చుచుందురు. ఆ మహర్షి రాజకుటుంబమన్న ప్రేముడికలవాడు. తన తాతగారి సహాధ్యాయుడు సర్వతంత్ర స్వతంత్రుడు.

వారణాసిలో, తక్షశిలలో, విష్ణుప్రయాగలో, హృషీకేశములో, నవద్వీపమునందు, ధాన్యకటకమునందు, నర్మదాతీరమున, కావేరీతీరమున ఇట్టి మహాపండితుని, ప్రజ్ఞావంతుని ఎచ్చటను చూడలేము? అయినను స్థాలతిష్యునిమాట తలచుకొన్నచో ఏదియో తనకు భయము కలుగును. శుకబాణులవారు కొందరిని అనుమానించి తనతమ్ముని మంజుశ్రీరాజకుమారుని తస్కరించుకుపోయినవారు వారేనని నిర్ధారణ చేసినారు. అయినను మూల కారణుడు స్థాలతిష్యులవారేననియు శుకబాణుల యనుమానము. శ్రీకృష్ణుడట్లు కక్ష్యాంతరముల గడచి, చక్రవర్తియున్న సాహిత్యమందిరము చేరెను.

శ్రీముఖుడు చిరునవ్వుతో, “బాబూ, మీకు ధాన్యకటక నగరాతిథ్యము ప్రీతికరముగ నున్నదా?” యని ప్రశ్నించెను.

“మహాప్రభూ! నా విడిది యథానందదాయకమైయే యున్నది. అయిన నొక్కచిన్న సంఘటన జరిగినది. ఎచ్చటనుండియో ఒక తెల్లనిత్రాచు నేను తమ దర్శనార్థము వచ్చుచుండ నెదుటబడి, ఆడి, మరుక్షణమున మాయమైనది” అని శ్రీకృష్ణుడు జనకునకు విన్నవించెను.

ఇంతలో మాంత్రికుడగు నొకభిక్షుకు డచ్చటికివచ్చి “మహాప్రభూ! మహారాణీగారు యువరాజులుంవారికి పాము కనబడినదనియు, తత్సంబంధ మంత్రోచ్చాటనాదులచే యువరాజులకు ఆపద ఘటిల్లకుండ చూడవలె ననియు మహాసంఘారామమునకు గురుపాదులకు వార్తనంపిరి. వెంటనేవారు నన్నిక్కడకు పంపిరి” యని విన్నవించెను.

మహారాజు ప్రశ్నార్థకముగ నా భిక్షుకునివంక చూచుచు "దయచేయు" డని యొకపీఠము చూపించెను. ఆతడు పీఠ మధివసించుటయు,

"అది పాలవలె, వెన్నెలవలె తెల్లటిపాము" అని యువరాజనియెను.

"మహాప్రభూ! శ్వేతపన్నగములు మనుష్యుల కండ్లపడవు. పడినచో నా పురుషునకు గాని, వనితకుగానీ ఏదియో ఉత్తమశుభము చేకూరగలదని సర్పశాస్త్రము శకునశాస్త్రము చెప్పుచున్నవి. శ్వేతపన్నగ సందర్శనమునకు మంత్రతంత్రములేమియు నవసరములేదు. యువరాజులకు త్వరలో శుభము కల్యాణమగునని మా శాస్త్రము చెప్పుచున్నది" అని యా భిక్షుకుడు తేల్చినాడు.

"స్వామీ! మీ మాటలు మాకు ధైర్యమొసగుచున్నవి. యువరాజుల వారును, మేమును మహారాణియు గురుపాదులకు, తమకు ఎంతేని కృతజ్ఞులము" అని సార్వభౌముడు పలికెను. ఆ భిక్షుకుడు "బుద్ధదేవుడు మిమ్ముర‌క్షించుగాక, ధర్మము మిమ్మురక్షించుగాక, సంఘము మిమ్మురక్షించు గాక" యని ఆశీర్వదించుచు అటనుండి మహారాణి కడకు జనియెను.

భర్తయు, జ్యేష్టపుత్రుడును తనకన్నతండ్రి దొరికితీరునని ధైర్యము చెప్పుచున్నారు. అబ్బా! ఎంతటి చిన్నబాలకుని ఆ కఠినాత్ములు కొనిపోయినారు! ధనమునకై యాశించికాదు. రాజ్యసంక్షోభము కల్పించుటకుగాదు. అందాలబిడ్డను కన్నతల్లి చేతులనుండి ఊడబెరికి, ఆ తల్లిని దుఃఖ పెట్టుటకు మాత్రము ఆ కరుణహీనులు అట్లు చేసినారు.

ఆ అయిదేడుల బాలుడు ఎన్ని కడగండ్లు పడుచుండెనో. అతని బంగారు పనసతొనలు ఎండిపోయెనో? తల్లియైన ఆ మహారాణికి కన్నుల నీరు తిరిగినది.

ఇంతలో ఒయ్యారముగ నడచుచు మహారాజు కొమరికలగు మాయాదేవియు, శాంత శ్రీదేవియు, పరిచారికలు కొలువ తల్లికడకు విచ్చేసి తల్లిపాదములకడ మోకరించిరి. ఇరువురిని చెరియొక చేతితో లేవనెత్తి, మహారాణి తన హృదయమున కత్తుకొన్నది.

"మాయాకుమారీ! రేపుమీరు సలుపు నాట్యమేమి?" అని మహారాణి అడిగినది. వర్షమువెలిసి, మబ్బులు మాయమైనవెనుక వెన్నెలవలె, ఆమెమోమున చిరునవ్వులు ప్రసరించినవి.

"మాయాదేవి జనకుని పోలిక, శాంతశ్రీదేవి అచ్చముగ తల్లిపోలిక, వారిరువురు చక్కనిచుక్కలు. రాజశ్రీవారి కన్నులలో, చంపకపుష్పనాసికలలో మందారకుట్మ లార్ధ్రములుగు పెదవులలో వెలిగిపోవుచుండెను.

వారిరువురు తల్లికి చెరియొక ప్రక్క నధివసించిరి.

మాయాదేవి: అమ్మగారూ! అన్నయ్యగారు తమ అంతఃపురములోనికి వచ్చినారటకదూ!

శాంతశ్రీదేవి: అన్నయ్యగారు మా మందిరానికి ఎందుకు వచ్చినారు కారండీ?

మహారాజ్ఞి: అరుగో ఈ దారినే యువరాజు వచ్చుచున్నారు.

అప్పుచెల్లెళ్ళిద్దరు లేచి ముందుకు త్వరితముగ బోయి అన్నగారి పాదములకు నమస్కరించిరి. శ్రీకృష్ణుడు వారిరువురకు మాయామాత రక్షచెప్పి, లేవదీసి, ఇద్దరినీ చెరియొక చేతితో నడుములుచుట్టి తనకదుముకొని, వారి తలలను తన చెంపలకాన్చి, వారి ఫాలములు ముద్దుకొని, మరియు వదలెను. ఆనందదేవియు లేచి వీరి ముువ్వురికడకు వచ్చెను.

"మా అన్నయ్యగారు ఈదినము మా ఇంట నాతిథ్యముపొందరా?" అని మాయ అన్నది.

"రండి అన్నగారూ, నేను వీణమీద ఇరువదియైదు మూర్ఛనలు నేర్చుకొంటిని. అవి అన్నియు పాడి వినిపింతును" అని శాంతశ్రీ యన్నది.

"నాయనా! మీరు ఈ పూట వీరి మందిరానికే భోజనమునకు పొండు. ఈ రాత్రియు, రేపుదయమునను మహారాజు మందిరమున మీకు ఆతిథ్యము" అన్నది ఆనందదేవి.

## ౬

# నాగబంధునిక

ధాన్యకటకనగరము కృష్ణానదీతీరమున నాలుగు గోరుతముల పొడవున నున్నది. నదీతీరమునుండి నగరగర్భమున ఒక గోరుతమున్నర యున్నది.

ఈ మహానగరము చుట్టును అనేక గ్రామములు వనములు, ఫలపుష్పోద్యాన వాటికలు, ధనికుల ఉత్తమ అధికారుల సామంత ప్రభువుల ఉత్తుంగకుడ్య రక్షిత భవనములు, హర్మ్యములు, మందిరములు, మహాగృహములు, సౌధములు కలవు. ఈ నగరమునకు తూర్పున కృష్ణానదీతీరమున ద్విశతనివర్తన ప్రదేశమునందు మహా సంఘారామమున్నది.

మహాసంఘారామ మధ్యమున మహాచైత్యమును, ఆ చైత్యముచుట్టు చైత్య మందిరములున్నవి. మహాసంఘారామమునకు, కులపతియగు అమృతపాదార్హ చేతుల విహారము ఇరువది ధనువుల దూరమున నున్నది. ఆ విహారమును చేరి కుడ్యరక్షిత వనాంతరమున బాలికా విద్యాలయ విహారమున్నది. ఉత్తమ విద్యాదీక్షితలగు నగర బాలికలందరునందు సర్వ విద్యాగ్రహణోన్ముఖులై, ప్రజ్ఞాపరిమితాదేవీసదృశలై, శుక్లపక్ష సప్తమీచంద్రికలవలె, వసంత నవోదయ హరివల్లభాపుష్పములవలె, రాగరంజిత పరీమళ హృదయలై, విద్యామృతాప్లావితచిత్తలై ఆంధ్రనగరమునకే యశము సముపార్జించు చుందురు.

ఆ బాలిక లందరిలో ఉత్తములు హిమబిందు, నాగబంధునికయును. నాగబంధునిక శిల్పాచార్యులగు ధర్మనంది కొమరిత పదునేడేండ్ల యెలప్రాయపు జవ్వని. పొడుగరి పదహారువన్నెల బంగారుఛాయగలది. వీర్యయుత దేహపుష్టికలది. పరుగులో, ధనుర్విద్యలో, కత్తిసాములో ప్రసిద్ధాంధ్ర యువకవీరుల కేమాత్రము నామె తీసిపోదు.

ఈ బాలికకు కాటుకకండ్లు. మోము ఫాలముకడ విశాలమై, చుబుకముకడ సన్నమై పవిత్ర బోధిపత్రమును తలపింపజేయును.

నాగబంధునిక కడ హొయలు గురిపించు శృంగారలక్షణములకన్న నిశితకృపాణ సదృశమగు వీరవనితాలక్షణములు పెక్కులున్నవి. ఆమె తోడి బాలికలు ప్రాచీన శృంగార గాథాపరిస్ఫురణానంద హృదయలై, అర్ధనిమీలిత నేత్రలై, నిట్టూర్చుచు, అజ్ఞాతనాయకుల కలలగాంచుచు నుప్పొంగుచుండ, నాగబంధునిక ఆంధ్రవీరగాథలు, రామాయణ భారతాది గాథలు, భూర్జపత్ర గ్రంథసంపుటముల తీక్షణదృష్టితో సర్వకాలా పోశనము చేయుచుండును. నాగబంధునికకు శిల్పము, చిత్రలేఖనము ఉగ్గుపాల విద్యయాయెను. చిన్ననాటనుండియు జనకహస్తగతశిల్ప జ్యోత్స్నాపరిపోషిత యగు నా బాలిక చిత్రకారిణి యగుటలో నాశ్చర్యమేమున్నది.

నాగబంధునిక అల్లరిపిల్ల, అన్నగారగు సువర్ణశ్రీకుమారునితో కలసి అశ్వారూఢయై నగరబాహ్య ప్రదేశాలకు విహారార్థము పోయి అన్నగారితో పందెము వేయుచుండును. ఇంటికడ వారితోటలో అన్నగారితో కత్తిసాము చేయును. చెల్లెలగు సిద్ధార్థినిక నవలీలగనెత్తి, బంతివలె నెగుర వైచి పట్టుకొనుచుండును. సిద్ధార్థినిక కేకలు వేయుచు, "అమ్మా చూడవే! అక్కనన్ను బంతివలె చుక్కలవరకు నెగురవేయుచున్నది" అని అల్లరి చేయును. వారి యన్నయగు సువర్ణశ్రీ పరుగిడివచ్చి, నాగబంధునికను భుజముపట్టి యూపి, నవ్వుచు,

చిన్న చెల్లెలి నెత్తుకొని, ముద్దులు పెట్టుకొని, బుజ్జగించి, నాగబంధునిక కందకుండ వారి తోటయంతయు పరుగిడును.

ఆ రోజున నాగబంధునిక చిన్నచెల్లెలు చేయిపట్టుకొని, వయసు రాబోవు ఆడుపులివలె అన్నగారి శిల్పమందిరములోని పోయెను.

ధర్మనంది హర్మ్యము, భవనము, శిల్పమందిరము ఒక విశాల వనవాటికయందు మహాసంఘారామమునంటి, ఆ సంఘారామమున కాగ్నేయమున కృష్ణానదీతీరమున నున్నవి. కృష్ణానది పొంగి, పరపళ్ళు తొక్కుచు ప్రవహించునప్పుడు, ధర్మనంది శిల్పమందిర సోపానముల నెక్కి మందిరోత్తరకవాట ప్రాంతమునకు వచ్చి, యా యుత్తమశిల్ప విన్యాసముల నవలోకింప తొంగిచూచు చుండును.

జనకుని శిల్పమందిరమునకు ముప్పదిరెండు ధనువుల దూరమున కుమారుని శిల్పమందిరమున్నది. సంపూర్ణ విన్యస్తశిల్పమైన వజ్రభూగర్భస్థ చంద్రశిలాఫలకము పదుగురు సేవకులచే నెత్తించుచుండిన అన్నగారి కడకు నాగబంధునిక పరుగునవచ్చి “అన్నా! నీవు ఎద్దులబండి పందెమున గెలిచితీరెదవు. అట్లు జయమందినప్పుడు నాకేమిబహుమతి నొసంగెదవు?” అని ప్రశ్నవేసినది.

సువర్ణశ్రీ నవ్వుచు, తనకన్న గుప్పెడుమాత్రము తక్కువ పొడుగున్న చెల్లెలి భుజముచుట్టు చేయిడి, దగ్గిరకుతీసికొని, యామె మూర్ధముపైచేయుంచి, కేశభారము సవరించుచు “చెల్లీ! గిరిపురమునం దుత్తమలోహ కారుడు నిర్మించిన వనితాకృపాణమొకటి, అగ్ని శిఖవంటి దానిని శుక్లపక్ష విదియనాటి నెలవంకవంటిదానిని, కాన్కనీయగలను సుమా! నీకు నగలయం దభిరుచి లేదాయెను. మొన్ననే ప్రసిద్ధ వ్రాయసకాడగు గోపాలకుల వారు తాళపత్రముల లిఖించిన దివ్యగుణాఢ్య పండిత విరచితమగు బృహత్కథను కాన్కతెచ్చితినాయెను! నీవు వలదంటివి. వ్యాసభగవద్విరచిత భారతమును, వాల్మీకి విరచిత రామాయణము నెన్నిమార్లు చదువు చుందువో. ఒక్కసారియైన త్రిపీటకమును చదువవు. నీవు నాకు తమ్ముడవై ఏల జన్మింపలేదో!” అని యనుచు పకపక నవ్వినాడు.

నాగబంధునిక: అన్నా! బుద్ధభగవానుని బోధ నాకు విసుగుజనింపచేయును. అహింసయట, అష్టమార్గములట, కాలము చెల్లిన వృద్ధుల కీశ్రమణకుని బోధ నచ్చునేమో. నాకుమాత్రమూ స్థాలతిష్యమహర్షి బోధనలు ఆనందోత్సాహములు కలుగజేయును. వృషభేశ్వరుడైన కాలకంఠుడు చండ విక్రముడు, ఆయన అర్ధాంగి దుర్గ వీరధర్మస్వరూపమైన దివ్యమూర్తి. కాదుఅన్నా?

సువర్ణశ్రీ: వెర్రితల్లీ! నీ యభిప్రాయములు నాన్నగారికి తెలియవు. ఆయన అవి విన్నచో భయకంపితహృదయులు కారా?

నాగబంధునిక: నాన్నగారికి భయమా? అమ్మ కేభయములేదే!

సువర్ణశ్రీ: అవును. నీవువట్టి మాటలప్రోవువని అమ్మకు తెలియదా?

నాగ: నేను మాటలప్రోగునా? నీవు పనులప్రోగువా? నీపనులన్నియు నీ ఎదుటనే ఉన్నవి. పలుచనివి, గంభీరరాగములు లేనివి, రుచులు లేనివి, చప్పిడిభావాలు తెలియజేయు నీ బొమ్మలన్నియు నీ పనులేకావూ?

నాగబంధునిక చప్పట్లు కొట్టుచు పక పక నవ్వెను. సిద్ధార్థినిక అక్కమాటలకు వెరగుపడుచు - “అక్కా! ఇప్పటికిని నీ వాడదానివను నమ్మకము నాకులేదే” అన్నది. సిద్ధార్థినిక మితభాషిణి. తొమ్మిదియేండ్ల యీడుగల యా చిన్నబాలిక ఎప్పుడు నేదో యాలోచనముననే యుండును. ఇతర బాలికలతో కలసి యాడుకొనదు.

తల్లితండ్రులు బుద్ధపూజవేళ పాడుకొను ప్రాకృతగీతముల నాబాల యెప్పుడును తనలో తాను పాడుకొనుచుండును. ఆమెకంఠ మతి మధురమైనది. ఆమె యాటగది యందున్న బొమ్మలన్నియు బుద్ధారాధన సంబంధములైనవే. బుద్ధపాదములు, ఛత్రములు, ధర్మచక్రములు చిన్న చిన్నవి పాలరాతితో, వెండితో, దంతముతో గంధపుతరువుతో విన్యాసము చేసి ధర్మనంది తనయకు బహుమానము లిచ్చెను. ఆ గదినంతయు నవి యలంకరించుకొని యామె పుష్పములు సేకరించి, ఫలములు ప్రోగుచేసికొని, మహాలి నడిగి, ధూపవత్తియలు, సువాసనాద్రవ్యములు తెచ్చుకొని పూజలు సల్పుచుండును. అన్నగారి శిల్ప మాబాలికకు ప్రాణము. నాగబంధునిక కన్నగారి వీరవిద్య హృదయా నందకరము. అన్నగా రేనాడు కవులు రచించు కావ్యానికములు మనోహర గాంధర్వ యుతముగ పాడుకొనునో అప్పు డన్నగారికడ చేరి, యాతని యొడిలో తలనుంచుకొని పెద్దవియైన లేడికళ్ళరమూతలుగా నన్నగారి ముఖమును, ఆకాశము నవలోకించుచు సిద్ధార్థినిక వినుచుండును. అన్నగారు పాటలు పాడుకొనునప్పుడు నాగబంధునిక ఆ చుట్టుప్రక్కలకు రాదు.

అన్నగారు శృంగారరసభావపూర్ణములగు పాటలు పాడినప్పుడు నాగబంధునిక “ఛస్ ఈ శర్కరకేళిపండ్లు నాకిష్టముండవు” అని నవ్వుచు వెడలిపోవును. సిద్ధార్థినిక కప్పు డక్కపై అమితముగ కోపమువచ్చును. అన్న పాడు పాట అర్థమై కాదామె ఆనందించుట. అన్న పాటలలో దూరదూరమున యశోధరాదేవి యున్నదని యామె చిరుహృదయము, చిట్టి భావముల చిన్న ఆలోచనలతో ఉప్పొంగిపోవును.

ఈరోజున నాగబంధునిక సువర్ణశ్రీ వీపుపై ఒక గ్రుద్దు గ్రుద్ది “అన్నా! పదిక్షణము లీశిలము సంగతి మరచిపోకూడదా? రా; వృషభశాలకుపోవుదము. శైబ్యా సుగ్రీవకము లేమిచేయుచున్నవో కనుగొందము. చెల్లి గిత్తలకడకు రానేరాదు. చిన్నదూడలు, ఆవులు, ఆబెయ్య లీ వెర్రితల్లికి ప్రాణము చెల్లీ! ఓ వెన్నమ్మగారూ! ఓ మామిడిపండురసంగారూ! ఓ చెరకు పానకంగారూ! ఈ వేళనైన కొన్ని మిరియములు తినవే! కొంచెము నల్లజీలకర్ర రుచిచూడవే. అల్లము లవణముతో కలిపి తినవే. రా; అన్నను పందెము నెగ్గించే కైలా సశిఖరములను చూచెదము రా; జజ్జమ్మతనము వదలు” అని నవ్వింది.

“ఓ మగక్కా! నీవు గడనెక్కి యాటలాడుము. భీమునివలె నేనుగులతో బంతులాడుము. తాటకివలె చంటిపిల్లలను మూటగట్టుకొనిపో. నిన్ను చూచిన నాకు భయము వేయుచున్నది. అన్నచాటున దాగు కొనవలెను” అని సిద్ధార్థినిక కోపము నటించుచు నవ్వసాగెను.

## ౭
## సార్వభౌముని జన్మదినోత్సవములు

ధాన్యకటకమునకు అయిదుగోరుతముల దూరమున కృష్ణానదీ కూలమున పురబాహ్యోద్యానమునకు సమీపముననే మహాఖేలనా ప్రదేశమున్నది. అది సుమారు నూరు నివర్తము లున్నది. (నివర్తము సుమారు మూడు ఎకరములు) ఆ విశాలస్థలమున సర్వకాలములయందు మల్ల యుద్ధములు, పందెములు, ఆటలు మొదలగునవి

జరుగుచుండును. ఒకచో మల్లయుద్ధ మొనర్చుచుందురు. ఒకచో రథములు పందెముల కొరకై పరుగెత్తించెదరు. ఒకచో ధనుర్విద్య నేర్చుకొనుచుందురు. వేరొకచో గుఱ్ఱపు స్వారియందు నిమగ్నులయియుందురు. పలువురు మల్ల ముష్టి యుద్ధాల నలవరచుకొను చుందురు. మహావీరులకు ఉనికిపట్టయిన ఆ ప్రదేశమునకు చిక్కిపోయిన బక్కవారిని రానీయరు. అచటికి వెళ్ళలేనందుకు పలువురు ఆంధ్రబాలురు ప్రాణ త్యాగమునకైన ఆయత్తులగుదురట.

మహోత్సవములప్పు డచ్చట ప్రదర్శనములు, పందెములు జరుగుచుండును. ఆంధ్ర సార్వభౌముడు శ్రీముఖుని పుట్టినదినమున ప్రతిసంవత్సరమును మహోత్సవాల నేకము లందు జరుగును.

నగరమధ్యము, సార్వభౌముని కోటకు సుమారు రెండు నూర్లధనువుల దూరమున, నగర క్రీడామందిర మున్నది. క్రీడామందిరమును చుట్టి నగర వసంతోద్యానమున్నది. వసంతోద్యానకుడ్యములనాని చిన్నక్రీడా పర్వతమున్నది.

నగరనర్తశాల యా క్రీడా పర్వత శిఖరముపై నున్నది. పర్వత పాదము నుండి ఆ చిన్ననగరము అరువది అడుగుల ఎత్తు మాత్రము. నర్తనశాలలో సార్వభౌమ జన్మదినోత్సవ సంగీత సభలు, నాట్యప్రదర్శనములు జరుగును. కోటలో నున్న రాజనర్తనశాలకు, ఆనందమందిరమని పేరు. అచ్చట ముఖ్య నాట్యప్రదర్శనములు జరుగును.

ఉత్తమగాయకులకు, నటకులకు, కవులకు, శిల్పులకు, చిత్రకారులకు భూరి పారితోషకముల సార్వభౌము డర్పించును. దేశమంతయు సంతోషమున నోలలాడును. గ్రామములు, ఘంటా పథములు, పట్టణములు, నగరములు అలంకరింప బడును. కారాగృహముల బంధితుల విడుదల చేతురు. పల్లెల, పురముల నృత్య గానకావ్యాది వినోదములు ఎడతెగక జరుగును.

విస్తారాంధ్రమహారాజ్యమందెచ్చటను, ఏవిధమగు పన్నులను నెలరోజులవరకు వసూలు చేయరు. దేశమంతయు నానందడోలికల తేలియాడి పోవుచుండును.

ఖేలనాస్థలములలో ముష్టియుద్ధ, మల్లయుద్ధ, ఖడ్గయుద్ధాది ప్రదర్శనములు, గుఱ్ఱపు పందెములు, రథముల పందెములు, ఏనుగు పందెములు జరుగును. వీధినాటకములు, తోలుబొమ్మల నాటకములు, దొమ్మరవిద్దెలు, సాముగరిడీలు, గాథాకాలక్షేపములు ఎన్నియేని జరుగును. జనులు ఆనంద పరవశులై, శుభ్ర వస్త్రములు ధరించి, భూషణాలంకృతులై, మద్యాదికములు త్రాగువారును, జూదముల పాల్గొనువారును, ఆఖేటనోత్సాహులు నగదురు. ఆంధ్రసుందరీమణులు అప్సరసలే యై నృత్యగీతాదుల వినోదించుచు, ప్రదర్శనముల పాల్గొనుచు, సర్వభూషణాలంకృతులై ఒయారపు నడకల ఏ గంధర్వ నగరమునో తలంపునకు దెత్తురు.

ఆంధ్రులకు ఎడ్లబండి పందెములు (ఈవలావల ఎడ్లు, మధ్య గుఱ్ఱమును కట్టిన బండ్లపందెములు), రథ పరీక్షలు అత్యంత ప్రీతికరములు. ఈ పందెముల పాల్గొనని ఉత్తమాంధ్రు డాయుగమున ఆంధ్ర మహాసామ్రాజ్యమునం దెచ్చటను గానరాడు.

ఈ వివిధోత్సవములలో నానందించుటకు, వివిధపరీక్షల పాల్గొని బహుమతు లందుటకు ఆసేతుహిమాచలమునసున్న దేశములందలి మహారాజుల, మండలాధిపతుల, సామంతుల, చక్రవర్తుల, అర్హతుల, కులపతుల, మహాభిక్షుకుల, ఋషుల, పండితుల, కవుల, గాయకుల, నటుల, వీరుల, పోటుమగల నాహ్వానింతురు. కురు, పాంచాల, సాల్వ,

మద్ర, శూరసేన, మగధ, మాళవ, కుంతల, పాండ్య, చోళ, కాంభోజ, గాంధార, కామరూప, ఘూర్జర, త్రికళింగ, వంగ, లిచ్ఛవాది దేశముల కన్నింటికిని; సువర్ణ, యవ, బలి, పూర్వకాంభోజ, సింహళాది ద్వీపములకును, యవన, బాహ్లిక, తురుష్క, పారశీక, రోమక, నీలకా, త్రివిష్టప, చీనాది లాతివిలాతులకును సందేశ గ్రాహకులు ఆహ్వానముల గొనిపోదురు.

ఆ యా దేశములనుండి వీరులు, పండితులు, రసజ్ఞులు, రసస్రష్టలు, ప్రభువులు ఈ యుత్సవముల పాల్గొని యానందతరంగడోలికల నూగిపోవుటకు యాత్రలుసాగి యరుదెంతురు.

వృషభశకట పరీక్షకు ఘనదారువినిర్మితరథములకు పూన్చిన కైలాసశిఖర సదృశములగు గిత్తలపూన్చి జయాభిలాషులై దేశదేశముల నుండి వీరు లరుదెంతురు.

మగధనుండి సుశర్మకాణ్వాయన చక్రవర్తి కాత్యాయనుని పంపినాడు. ఉజ్జయిని నుండి మహారథియగు పహ్లావుడు వచ్చినాడు. సౌరాష్ట్రమునుండి పొట్టివియు, బలము కలవియు, లేళ్ళవలె చురుకు గలిగిన పసరముల వివిధ వర్ణాలంకృతమగు రథమునకు పూన్చి జీవనప్రభువీరుడు వచ్చినాడు. నిడుపాటి కొమ్ములు కలిగి వాలుకన్నుల బెదరుచూపు చూచుచు, శ్రమయనునది యెరుగని నల్లగిత్తల గట్టుకొని దక్షిణమునుండి వీరత్తుణి వచ్చినాడు. ఆ రోజున నలుబదిమూడు దేశములు పందెమునకు తమతమ రథికులను పంపినవి.

తెలుగురౌతులు పదునేనుగురు పందెమునకువచ్చిరి. సమవర్తి మేనమామ బండినడుపుటకు నిశ్చయింపబడినది. శిల్పికుమారుడగు సువర్ణశ్రీ కూడ పరీక్షకై పేరిచ్చెను. పట్టణమంతయు కోలాహలముగా నున్నది.

సమవర్తి జయముగాంచునని అందరికీ దెలియును. పట్టణ ప్రజా సమూహమునకు సమవర్తియనిన ప్రేముడి యెక్కువ. లాతిదేశములకు బోయి యచ్చట జరిగిన ప్రదర్శనముల విజయమొంది ఆంధ్రగౌరవము నిలిపినది సమవర్తియేగదా! ఆతడు నడపజాలని రథములేదు, ఎక్కడ్రాలని గుఱ్ఱమునులేదు. ఆతడు చెప్పిన వినని బలీవర్ద మున్నదా?

మహాభేలనాస్థలమంతయు నలంకరించినారు. ఆంధ్రవైభవమంతయు నచట చిత్రితమయ్యెను. చిత్రవర్ణవస్త్రాలంకృతమై, వివిధాకృతమగు ప్రజ భూమి పై వాలిన మహేంద్రచాపముల తలపించెను. ఉత్తరాంధ్రదేశపు సన్నని దుకూలములు చిరుమబ్బుల వలె గాలికి తేలిపోవుచున్నవి. ఆంధ్రదేశమునకు వజ్రభూమి యని పేరు. ఆంధ్రులు రత్నాలరాజులు. స్త్రీలును, పురుషులును ఇప్పుడు మన మగవారివలె ఒక్క అందమగు వస్త్రమును పాదములవరకు రాకటి వస్త్రములు గట్టుకొందురు. ఒక వస్త్రము పైన గప్పుకొందురు. వలిపెముల కొందరు తలచీరలుగా ధరించి యుండిరి. కాళ్ళకు బంగారు కడియములు చేతులకు కంకణములు, మెడలో వివిధములగు హారములుండును. మొలనూళ్ళు ధరించిన యువతులచే నా ప్రదేశము మెరుగు లీనుచున్నది. అనేకులు రాజవంశమువారు తలపై వివిధరూపముల రత్నములు, ముత్యాలహారములు పొదిగిన కిరీటములు ధరించియుండిరి.

ప్రేక్షకస్థలమధ్యమున రాజమందిరమున్నది, అనేక దంత హేమగంథాసనములు అందమర్చిరి. మధ్యమున సార్వభౌముని సింహాసనమును, దానిం జేరియే రాణుల పీఠములును గలవు. ఆ మందిరమున కీవలావల మంత్రుల, దండనాయకుల,

సేనాధిపతుల మందిరములు వారి వారి గౌరవముల ననుసరించి వెలుగుచున్నవి. సార్వభౌముని మందిరమునకు కుడిప్రక్కగా, అన్ని మందిరముల తుద సామాన్యజనము చూచుటకు తగిన పెద్ద పందిరియొక్కటి తగు అలంకారములతో నిర్మాణమొనర్చిరి.

రాజమందిరము ఎడమప్రక్కగా మూడు మందిరములావల చారుగుప్తుని మందిరము సూర్యకాంతమణివలె నా ప్రదేశమును వెలిగించుచు ఆ వచ్చిన లక్షలకొలది ప్రజల చూపుల నాకర్షించుచుండెను. మూడేండ్లనుండి వెలవెల పోవుచున్న ఆ మందిరము నేడు పూర్ణాలంకార మనోహరమై సుధర్మను పరిహరించుచున్నది. "రాజమందిరమునకు జోడగునది, ఆ మందిర మొక్కటియే" యని ప్రజ లొకరి నొకరు చూచి చెప్పుకొనిరి.

"పదునొకండవ ముహూర్తము మ్రోగించినారు. సార్వభౌముడు వచ్చువేళ అయినది" అని మహాశ్రీచండకేతునితో ననియెను. వారిరువురు గుఱ్ఱముల పై నధివసించి రంగస్థలమున నిటు నటు తిరుగుచుండిరి. అంత చండకేతుడు పురమార్గమువంక చేయి నడ్డమునుండి చూచుచు "అదిగో సార్వభౌములు వచ్చుచున్నారు" అని అరచెను.

## ౮
## శకటచోదక పరీక్ష

మహాశ్రీ: ఆ వచ్చునది సార్వభౌములుకారు. ఎవరు చెప్పుమా అంతవైభవమున వచ్చుచున్నది?

చండకేతుడు: ఆర్యా! తెలిసినది, తెలిసినది! రత్నకలశధ్వజము! ఆర్యచారు గుప్తులవారు, కోటీశ్వరుల వైభవము ఒక్కొక్కప్పుడు భూమీశుల సంపదను మించిపోవును కదా!

మహాశ్రీ: అవునయ్యా! చారుగుప్తుడు సకల భారతవణిక్సార్వ భౌముడు. ఆయన ఎన్నికోట్లకు నాగదేవుల కాపుంచినాడో! ఎన్నిమందసముల రత్నరాసులున్నవో! వివిధదేశ సువర్ణము లెన్ని మందిరముల లెక్కకురాక, ప్రోవులుపడియున్నవో!

చండకేతుడు: మూడేండ్లనుండి చెన్నుదరగియున్న ఆ వర్తక చక్రవర్తి మండపము ఎంత పరమాద్భుతముగ నలంకరించినారు! ఏమి విశేషము స్వామీ?

మహాశ్రీ: విచార మెంతకాలము మానవునకు! ఆతని భార్య చనిపోయి మూడేండ్లయినది. ఇప్పుడు కొమరిత పదునారేండ్ల వయసునందినది. ఆంధ్రయోషా రత్నములలో ఆ బాలిక కౌస్తుభమే.

చండకేతుడు: ఆమె యందము తనివితీరని వేడుకతో చెప్పుకొందురు. అంత అందగత్తయా ఆర్యా?

మహాశ్రీ: ఓయి అజ్ఞానీ, అందగత్తె అనుమాటను కృష్ణానదీ గర్భమున పడద్రోయుము. ఆమె అపరాజితాదేవి. ఆమె ప్రజ్ఞాపరిమిత. ఆమె శ్వేతతార! ఆమె అనంత సౌందర్యభావోజ్వలమూర్తి!

చండకేతు: ఆర్యులు కవులగుచున్నారు.

మహాశ్రీ: దివ్యసౌందర్యాభిముఖుడగువాడు మొరకుడైనను మహాకవికాడా

చండకేతూ?

చండకేతు: మీ వర్ణన విను నాకే కవిత్వము గంగోత్తరస్వరూప మందాకినీ ప్రస్రవణమై వచ్చుచున్నది, శకటాధ్యక్షులవారూ!

ఇంతలో చారుగుప్తుని రథము పరివారపరివేష్టితమై, ఆశ్విక గజవీర సంరక్షితమై, భేరీ మృదంగ శంఖ కాహళ వాద్యములు చెలగ మహాఖేలనాస్థలము దరిసినది.చండకేతుడు ముఖపతులతో, గణపతులతో, పదాతివీరులతో చారుగుప్తునకు ఎదురేగి, సార్వభౌమవాద్యమేళములు వణిక్సార్వభౌముని మేళములతో మేళకముగా సగౌరవముగ తోడితెచ్చి, చారుగుప్తుని మందిరముకడ విడియించుటయు, వారందరు రథావతరణ మొనర్చిరి. చారుగుప్తుడు ఇంద్రగోపుని చేయి నూతగొని రథము దిగెను. వేరొక రథమునుండి హిమబిందుకుమారియు, ముక్తావళీదేవియు, అమృతలతాదేవియు, చెలియగు బాలనాగియు, అలంకారికయగు తారాదత్తయు దిగిరి, వేరువేరు శకటముల నుండి హిమబిందు సేవకురాండ్రు పెక్కండ్రు దిగినారు. అశ్వికులు మండపమువెనుక కావలి కాయుచుండిరి. చారుగుప్తాదులు వివిధాసనముల నాసీనులైరి.

రథమునుండి అవరోహించుచు హిమబిందుకుమారి మేలిముసుగు తీసి, వివిధాలంకారులు, వివిధవర్ణ వస్త్రశోభితులు, కోలాహలపూర్ణులైన యా మహాప్రజలను కౌతుకముగ పర్యాలోకించినది.

ఆమె అందాలప్రోవు, విలాసములమూట. ఒయారములకుప్ప. ఆమె పరమాద్భుత సౌందర్యమునకు ముగ్ధులై, ప్రజలును దళ ముఖ గణచమూపతులు, రాజోద్యోగులు, మంత్రులు, దండనాయకులు, ప్రాడ్వివాకులు, ఒకరననేల అందరును ఆమెనే చూచుచుండిరి.

మహాకాండూరనగరపు బంగారు సరిగపూవుల లతల దుకూలము, పసుపుపచ్చ ఎరుపు వెలుగునీడల నేతచీర ధరించి, నీల చీనాంబర స్తన వల్కలము బిగించి, ఆమె పాము కుబుసముబోలు కాశ్మీరసువర్ణమృగీ రాంకవము వల్లెగా ధరించినది.

పదునారేండ్ల ఎలప్రాయమున పాటలవర్ణ జాంబూనదభాసురయగుచు పారిజాత కుసుమమును దలపించిన దా బాల. ఆమె నాలోకించిన యువకులు పురుషులు ఎందరు నిట్టూర్పులు వదలిరో, ఎందరి గుండియలు కొట్టుకొనెనో, ఎంద రెట్టి స్వప్నలోక విహారులైరో, ఎందరు సమ్మోహనాస్త్ర పీడితులైరో? అప్పుడు ప్రజలు సార్వభౌముడు ఇంద్రునివలె, బోధిసత్త్వునివలె అరుదెంచుటయే గమనింపలేకపోయిరి.

శంఖ వేణు ముఖవీణ కాహళాది సుషిరములు, భేరి ఢంకా మృదంగాది వాద్యములు, తాళములు, తప్పెటలు సముద్రఘోషాగాంధర్వము సర్వదిశల నావరింప యథోచితవేషుడై, సూర్యుని రథాశ్వములవలె కలశాంభోధీ వీచికోపమానములైన ధవళతురంగములు పూన్చిన సువర్ణరథ మారోహించి, అతిరథుడైన శ్రీముఖశాతవాహన మహారాజు మంత్రులు, సామంతులు, దండనాయకులు, కవులు, ఆచార్యశ్రమణకులు, ఉత్తమ గాయకులు, మహాశిల్పి ధర్మనంది, సర్వసేనాధ్యక్షుడు, ఉపసేనాధిపతులు కొలువ ఇంద్రవైభవముగ విచ్చేసి రాజ మందిరము ముందాగి రథావతరణ మొనర్చెను. వందిమాగధులు కైవారములు చేయుచుండిరి.

సార్వభౌముని రథము పరివార సమేతమై వచ్చుచున్నదనగనే మహాఖేలనాప్రదేశస్థులగు ప్రజలెల్లరు జయజయధ్వానములు సలుపుచు, లేచి

నిలుచుండిరి.

సార్వభౌముడు సింహాసన మధిరోహించుటతోడనే బ్రాహ్మణులు, శ్రమణకులు సామ్రాట్టుకు ఆశీర్వాదము లొసంగిరి.

ఇంతలో శకటాధ్యక్షులు, మహశ్రీ సార్వభౌమునికడకు వచ్చి మోకరించి, నమస్కరించి, లేచి, ఉక్షశకటపరీక్షకు వచ్చినవారి నందరిని సార్వభౌమునను జ్ఞకై మందిర ప్రాంగణమునకు తీసికొనివచ్చెను. వారందరు సార్వభౌమునికి సాష్టాంగదండప్రణామంబు లాచరించి తమతమ నామధేయములు తెలిసికొని, చక్రవర్తి యనుజ్ఞనొంద, తమతమ శకటములకడకుబోయి, వాని నారోహించి ప్రారంభస్థానమున, ముందు కురకబోవు వృషభముల నయభయముల నిలువ వారింపుచుండిరి.

రథపరీక్షామార్గము విశాల సమతలము. దారి పొడుగునను దిమ్మెస చేసి, గట్టిచేసిరి. బయలుదేరిన స్థలమునుండి శకటములు ఒక గోరుతము దూరము పోయి యచ్చట నర్ధచంద్రాకృతిని కుడివైపునకు మళ్ళి, వేరొక విశాలమార్గమునవచ్చి, ప్రారంభ స్థలమునకు పోయి, మరలనట్లే ఇంకొక పర్యాయము తిరిగి గమ్యస్థానమునకు రావలెను.

ఆంధ్రు లందరకును తమవారిలో నొక్కడు నెగ్గితీరునని దృఢనిశ్చయము. శకటములు తేలికగల తరువాతి కాండముల నిర్మించినవి. లాక్షావర్ణాలంకృతములై, భూషణానేకసుందరములై, దేవవిమానముల నవి తలపించుచున్నవి.

ప్రారంభప్రదేశమందవి శ్రేణిగా నిలువబడియున్నవి. కండరములు కట్టి, లేడికాళ్ళవలె పలుచని కాళ్ళు కలిగి, పొట్టివియు, నెత్తయినవియు, శ్వేత, కపిల, శబల, ధూమ్ర, లోహితవర్ణవిగ్రహములై కొమ్ములకు వెండి బంగారు తొడుగులు, కాళ్ళకు వెండి బంగరుగజ్జెలు, నడుములకు పట్టుదట్టీలు, మూపుల వర్ణకంబళములు, కంఠముల బంగారువెండిమువ్వలు, ఘంటికలు, మూర్ధముల చర్మపుదట్టీలు, బాసికపుదండలు కలిగిన కోడెలు, గోవృషభములు, ఉక్షములు - భయమున కొన్ని, గర్వమున కొన్ని, నిశ్చలత్వమున కొన్ని, రౌద్రమున కొన్ని, తొందరపాటుతో కొన్ని నిలిచి తోకలు ఇటునటు నాడించు చున్నవి. అంకెలు వేయుచున్నవి. డెక్కలెత్తి నేలను రాయుచు, కొట్టుచున్నవి. మోరలు చూచుచున్నవి. చెవులనాడించుచున్నవి. కన్నుల త్రిప్పుచున్నవి.

ఆ శకటముల నడుమ అద్భుతదారుశిల్ప సుందరమగు రథముపై పగ్గముల సడలించి పట్టి, లీలాభంగశరీరియై, చిరునవ్వున వెల్లకోడెలతో "శైబ్యా! సుగ్రీవక! ఏమది? తొందరా మీకు?" అనుచు తీయతీయని మాటలాడు బాలకుని, ఆ ప్రక్కనే శకటచోదకుడై యున్న కరూరవుడు విని, కాళింగునకు కన్నుగీటినాడు.

"తెలుగుదద్దమ్మలకు తొందర ఏల అచ్చటనే యుండవచ్చునులే" అని పాలీభాషను కాళింగుడు కరూరవుని ముఖము చూచి పలికినాడు. సమవర్తి శాతవాహన వీరశ్రేష్ఠుడు సగర్వముగ ఛంగున నురికి తనకంబళివ్యాహకమారోహించి, పగ్గములుపట్టి ఆసీనుడైనాడు. చారుగుప్తుని వదనమున సంతోష హాసరేఖ లుదయించినవి.

హిమబిందు తన మేనబావ సమవర్తిని జూచి, ఆనంద ప్రపుల్ల వదనయై "సెబా" సనుకొన్నది.

## శకట వేగములు

ప్రేక్షకులందరు తమతమ యాసనముల పై, మొదట నిశ్చల మనస్కులై కూరుచుండిరి. తరువాత వారి హృదయముల విజయలక్ష్మి ధవుడెవ్వడగునా యను నాలోచనలు పొడసూపినవి. ఆ వెనుక సమవర్తి నెగ్గితీరవలయునని కొందరి హృదయముల, ఆంధ్రులలో నెవ్వరైనను సరియని కొందరి మనఃపథముల, కాంక్షలు మొలకెత్తి పెరిగి మహావృక్షములైనవి. అందువల్ల మాటలు, వాదనలు, కోపములు, హర్షములు, హాస్యములు వికటహాసములు చెలరేగినవి.పందె మింకను ప్రారంభముకాలేదు. ప్రజల హృదయములలో విసుగు, ఆవేగము పరువులెత్తినవి. నిశ్చలాసీనత వికలమై ఆసనములలో ఇటునటు కదలువారు, వంగువారు, వెనుకకు వాలువారు, చక్రవర్తి మందిరమువైపు చూచి, ఆలస్యమునకు కారణమేమి యనుకొనువారునై యుండిరి.

అంతలో సృష్ట్యారంభమం దుద్భూతమగు శబ్దబ్రహ్మముంబోలి, ఒక్కసారి పదునారు శంఖములు “భోం, భోం, భోం, భోం!” అని ధ్వనించినవి.

ఆ ధ్వనికి భీతచిత్తములై మాళవుని ఎద్దులు, పాండ్యుని వృషభములు అడ్డగోలుగా పరుగిడినవి. శకటములు తలక్రిందులై శతశకలములైనవి. తక్కిన బండ్లన్నియు సమవేగంబున పరువిడి వచ్చుచు, పరీక్షా పథమున నడ్డముగ పడియున్న బండ్లను తప్పుకొని, చుట్టి ముందుకు సాగినవి.

భరుకచ్ఛపువీరుని బండిగిత్తలు పడిపోయిన బండ్లను చూచి, ముందుకు సాగక, వెనుకకుతిరిగి, విశ్రమారామములవైపునకు పరుగిడిపోవ, గొల్లుమని ప్రజలొక్కుమ్మడి లేచిరి. అంత గజదళాధికారియగు ప్రమానందుడు అచ్చటనే యుండుటచే, నేనుగుపైనుండి పాశము విసరి ఒక్కఎద్దును పడగొట్టెను. తోడనే బండి తలక్రిందై పడినది. ఏ ప్రాణికిని అపాయము రాలేదు.

పందెపుబండ్లు. పడిపోయినబండ్లను దాటిపోవగనే పలువురు సేవకులు వైద్యులు అచటకు పరువిడి, శకటశకలములను, దెబ్బలుతిన్న వృషభములను, సారథులను కొనిపోయిరి. ఆ స్థలమును తక్కినబాటతో సమముచేసి వేసిరి.

కాళింగుడగు మల్లినాథునిబండి అన్నింటికి ముందు ఛెంగు ఛెంగున పరువిడి పోవుచున్నది. అతని వెన్నంటీ వీరత్తుణితలైయాళ్లై తనబండిని తోలుకొనుచు అరవమున నేదియేని మాటలాడుకొనుచు పోవుచున్నాడు. వీరత్తుణికి ఎడమప్రక్క కేరళ, ఘూర్జర, వంగవీరులు రథముల పరువెత్తించుచుండిరి. ఆ వెనుక లిచ్ఛవుడు, ముప్వురాంధ్ర వీరులు సమముగ బోవుచుండిరి. వారిని వెన్నంటి సమవర్తి, సువర్ణశ్రీ, మాగధుడును, వారికి కొంచెము ఎడములో పలువురును బోవుచుండిరి.

సువర్ణశ్రీ నిర్మల నీలాకాశచంద్రమూర్తివలె నిర్వికారుడై పోవుచున్నాడు.

ఎద్దులన్నియు మోరలెత్తి ఊర్పులూర్పుచు, కనుకొలుకుల కెంపులు గ్రమ్మ, చిరునురుగులు సెలవుల ప్రసరింప, పాలసముద్రతరంగమువలె, ధవళ కాదంబినీ మాలలవలె, గంగానదీపతనములవలె గంగడోల్యాడుచుండ మహా వాయువేగమున పరుగు వారుచుండెను. తేలికయగు శకటము లిటునటు నాడి పోవుచున్నవి. సారథులు వంగి, ఎద్దుల నదలించుచు, పసరముల ప్రార్థించుచు, కోడెలతోటి సరసంభాషణములాడుచు బోవుచుండిరి.

మొదటిసారి సగముదూరము పోవునప్పటికి లిచ్ఛవుని దూడలు పరుగిడలేక ఆగిపోయినవి. మొదటి చుట్టుకడకు పోవునప్పటికి కేరళ, కామరూప, గాంధారుల శకటములన్నియు వెనుకకుపోయినవి. చుట్టి, తిరిగి సగముదూరము వచ్చునప్పటికి మిగిలినవారు కళింగుడు, మాగధుడగు శివస్వాతి, సమవర్తి, సువర్ణ శ్రీకుమారుడు, ఇంక నిరువు రాంధ్రులు, సుశర్మ కాణ్వాయనుని రథము తోలు కరూరవుడు మాత్రము.

ప్రేక్షకుల ఆలోచనలు బిగుసుకుపోయినవి. ఆ మహారంగస్థల మంతట నిశ్శబ్దత ఆవహించినది. రెండవసారి మిగిలిన శకటములన్నియు తిరిగి ముందుకు పోవుచున్నవి. చెమటలు నిండ, నాల్కలు జాపుచు, నురగలు గ్రక్కుచు, నల్లగ్రుడ్డులు క్రిందికి తిరిగిపోవ, ముట్టెల క్రిందికి దించి ఎద్దులన్నియు పరుగిడిపోవుచున్నవి.

బండ్లన్నియు తిరిగి రెండవమార్గమున నర్ధచక్రాకార ప్రదేశమునకు వచ్చుసరికి, కరూరవుని రెండుగిత్తలు గరుడము, హనుమంతము అనునవి ఫెళ్ళున విరుచుకొని పడిపోయినవి. రథము పడిపోక ఆగిపోయినది. కరూరవునకు కొంచెము గాయములు తగిలినవి.

సుశర్మకాణ్వాయనుని ప్రియసూతుడగు కరూరవుడు విషాదము నొందుట మగధప్రజానీకము ఎన్నుకొని పంపిన కాత్యాయనునకు సంతోషమయ్యెను. ఇరువురును సుశర్మకు ప్రియులే. కాని వారికి అంతఃకలహములున్నవి. కాత్యాయను డిదివరకే సిగ్గునంది వెనుకకు పోవలసివచ్చెను. కరూరవుడు తనతోడివాడగుట కాతడు ప్రార్థించిన క్షుద్ర దేవతలు అతని కోర్కెనెరవేర్చినారు.

వృషభములన్నియు నలసిపోయినవి. అన్నిటికి వెనుకవచ్చుసువర్ణశ్రీగిత్తలు అలయిక లేక సునాయాసముగ తేలివచ్చుచున్నట్లునన్నవి. పావుగోరుతదూరము ఇట్లు పరుగిడి వచ్చిన పిమ్మట సమవర్తి తన చబుకు తీసికొని కామందక కులపాలకుల వీపులపై చురుక్కున నంటించెను. ఆ యుత్తమ బలీవర్దనములు తమ బలమంతయు చూపి కాళింగుని బండి దాటివేసినవి. కాళింగుడంత ధైర్యవిహీనుడై యొక్క పెద్ద నిట్టూర్పుబుచ్చి తన యెద్దులనుగూడ వడివడిగా తోల యత్నించెను. కానీ యవి యంత కన్న, నంతకన్న నీరసించి, వెనుకవచ్చు సువర్ణశ్రీ శకటముతో కలిసికొనెను.

ఆ యువకు డంత చిరునవ్వు నవ్వినాడు. ఆతని బండి వేగము సమవర్తి బండిని వెన్నంటిపోయినది. ప్రజలందరు గొల్లున నొక్కసారిలేచి “సమవర్తీ విజయ! సమవర్తీ విజయ!” అని గొంతులు బొంగురుపోవ నరచుచుండిరి. సమవర్తి వెనుకకు చూడవీలులేదు. ఒక్కసారి వెనుకకు చూచిన, అలసట చెందియు పౌరుషము చూపుచున్న ఆ విఖ్యాత వృషభములు తప్పక కూలిపోవును. కాని పందెకాని సూక్ష్మబుద్ధి, పాముచెవుల వంటిది. తనకు కొంచెమయిన ఎడములేక ఒక డతిసునాయాసముగ దూడల తోలుకొని వచ్చుచున్నాడని సమవర్తి తెలిసికొనెను. పందెము మొదటి నుండియు ఆతడా కొత్తపిల్లవాని గిత్తల చూచినాడు. పసరముల సంగతి బాగుగా తెలిసిన సమవర్తి గుండెలా లేళ్ళవంటి గున్నల చూడగానే నదటునొందినవి. కామందక కులపాలకుల అవయవముల పొంకము వానికి లేదు. కమ్మెచ్చులు కట్టి దిమ్మచెక్కలవలె వట్రువులైయుండి కైలాసగిరి శృంగములకు మూపురములుగల తన బలీవర్ధముల ముందు ఆ కొత్తగిత్త లేమి చేయగలవు? కొమ్ములింకను వచ్చిరానట్లున్నవి. తన కోడెలకు, శంకరశూలవామదక్షిణపు మొనలవలె కొమ్ములు మెరయుచున్నవి. తన వృషభరాజములేడ, ఈ చిన్నగిత్తలేడ? అని సమాధానపడెను.

మొదటనుండియు సమవర్తి ఆ వచ్చిన నలుబదిబండ్ల ఎద్దులను చూచి పెదవి విరిచికొనెను. కలకలలాడు కాటుక కన్నులతో, మామిడిపిందెల బోలు నాసికా రంధ్రములతో గంభీరములై, శ్రీవక్షములగు ముట్టెలతో, వెలిపట్టు వస్త్రపు మడతలవలె నున్న గంగడోళ్ళతో, మెరుముల వలె, అస్త్రములవలె, సన్నమై మహావేగవంతములై కన్పట్టు కాళ్ళతో ఆ యువకుని గిత్తలు మాత్రము సమవర్తిని వికలుని చేసినవి. ఇంక విజయలక్ష్మి ఆసీనయైయున్న తావు అర్ధగోరుతదూరము మాత్రమున్నది. తన్ను వెన్నంటివచ్చు పెనుభూతపు పిన్నవాని పిప్పిచేయవలేనని సమవర్తి తలపోసెను. అతని కన్నులయందు క్రోధము ఫాలాక్షుని మూడవచూపై, ఆ సుందర ముఖమును వికృత మొనర్చినది. అతని ముక్కుపుటములు కామందక కులపాలకుల ముక్కుపుటముల వలె విస్తృతములైనవి. అతని పసరముల ముక్కులనుండి రక్తపంబొట్టులు తొలకరి సతుంపరులవలే చెదరిపోవుచుండెను.

చారుగుప్తుడు వంగిపోయి తనపీఠము గట్టిగా పట్టుకొని గృధ్రపుదృక్కుల పరుపుచు పందెకాండ్రవైపు చూచుచుండెను. ఆతడి పెదవులు వణకుచుండినవి. అస్పష్టమై ఏవియో మాటలు పైకి వెలువడుచున్నవి. మొదటినుండియు తన వృషభములు తప్పక నెగ్గితీరునని యాత డనుకొన్నాడు. ఆ సందడిలో నా కొత్తబాలుని బండిదూడల కనుగొన్నవారు లేనేలేరు. మొదటిసారి వెళ్ళివచ్చి, మరలివెళ్ళువరకు ఎవ్వరును ఆ యువకునివైపే కనుగొనలేదు. ఇప్పుడాతడు చారుగుప్తునకు ఎక్కడనుండియో అవతరించిన విఘ్నరాక్షసునివలె తోచినాడు. ఆ బాలుడు తనకును, తన కోర్కెలకును ఎడబాటుమంత్రమైనాడని చారుగుప్తుని గుండెయందు గుభిల్లని ఆలోచన కలిగినది. ఒక్కసారి లేచి సునాయాసముగ పరుగిడివచ్చు నా కొత్తబండిగిత్తల కూల్పవలెనని యాతనికి వెర్రియాలోచన పుట్టినది.

ప్రజలందరు చెప్పగారాని ఆలోచనాభావమున తన విజయనాదములు మానివేసినారు. ఒకసారి వాన వెలిసినట్లు, నిమ్మకు నీరువోసినట్లు హృదయభీకరమగు నిశ్శబ్దత నింగి నావరించినది. అందరును చారుగుప్తుని మందిరమువైపు చూచినారు. మరల పరుగిడు పందెకాండ్ల పరికించినారు.

ఇంక పావుగోరుతమున్నది. సమవర్తి “కా-మం-ద-క! కుల-పాలక!న-డు-డు!” అని వగర్చుచుండెను. వజ్రతుల్యమగు నా శూరుని శరీరము వణకినది. కామందక కులపాలకులు ప్రజలోకమునకు విస్మయము కలుగునట్లు ఆతని పలుకుల నాలకించగనే మహాజవమున అరపావుగోరుతము కనుమూతలో గడచిపోయినవి. కాని పాడునీడవలె యా కుర్రవాని బండి ఆతని బండిని వెన్నంటియే వచ్చినది. ప్రథమమున జనులు “కామందక విజయ! కులపాలక విజయ!” అని యరచినారు. ఉత్తరక్షణముననే వెన్నంటివచ్చినయా పిల్లవాని చూచిరి. వారందరి హృదయములు నాతనిపట్ల కోపముచే క్రూరములైనవి.

## ౧౦
## విజయలక్ష్మీధవుడు

ఇంకను కొన్ని ధనువులు గడచినవి. సమవర్తికి తన్ను వెన్నంటు పిశాచరూపుని బండి ఇంకను కూడనున్నదనే తోచినది. ఇంతలో మెరుమువలె ఆతనికి ఒక్కసంగతి గోచరించినది. ఆతని ముఖము ప్రఫుల్లమయినది. ఆతని పెదవులపై మబ్బులు కమ్మినరాత్రి మబ్బులమాటునుండి తొంగిచూచు చంద్రరేఖవలె చిరునవ్వు కలకలలాడినది. గుండెలపైనుండి పెద్దబరువు తీసివేసినట్లయినది. కొన్ని పసరములు మంచి పరుగుగలగిత్త లైనను, తమంతట తాము దారిని పరుగిడలేవు. ఏ బండియైనను ముందుండిన తాము వెనుక నడువగలవు. ఆ ముందుబండి ఎంత వేగవంతమైన అంతవేగమున ఆ విచిత్రజాతి

వృషభములు పరుగిడగలవు. అంతియ.ఈ ఆలోచన సమవర్తికి వేయి ఏనుగుల బలము నిచ్చినది. క్రుంగిపోయిన మనుష్యుడు ఒక్కుమ్మడిలేచి కామందక, కులపాలకలను ఎలుగెత్తి పిలుచుచు, "ఇదిగో గమ్యస్థానము ఒక్కఅడుగు, వెనుదీయకండి, పౌరుషము నిలబెట్టుడు!" అని అరచినాడు. ఆ ఉత్తమ బలీవర్దములును తమ శక్తికి మించిన బలమును తెచ్చుకొని పది ధనువులురికినవి.

చారుగుప్తుడు, సమవర్తి మోమును చూచినాడు. ఆతని ఆలోచనా పథము తనకును సువ్యక్తమై తోచుటతోడనే చిరునవ్వున ఆతనిమోము ప్రఫుల్లమైనది.

హిమబిందు తండ్రివదనమును, తమ శకటమును, వెనుకవచ్చు ఆ ఆంధ్ర యువకుని శకటమును, ఆ విచిత్రంపు కోడెలను, ఆ వెనుకబండ్లను ఆలోచనారహితయై, అదటువహించిన హృదయముతో పరిశీలించుచుండెను. వ్యాకుల మేఘాచ్ఛాదితమైన జనకుని వదనము ఇంతలో నిర్మలమై హాసయుక్తమగుట కనుంగొని, యామె ధైర్యమువహించి, యా నూత్నబాలకునివైపు అపహాసము పరపినది.

ఇంక నూటయిరువది ధనువుల దూరమున మాత్రమే గమ్యస్థానమున్నది. అప్పుడే ప్రజలు విజయ మెట్లయినను సమవర్తిదే యని కేకలు వేయుచుండిరి.

ఇంతలో దావానలాంతరాళమునుండి జనించి శిఖల నన్నింటిమీరి గుప్పున దుముకుజ్వాల సామ్రాజ్ఞివలె, అనేక వాయుసమీకరణోద్భవమై మహాపవనము లన్నింటి దాటి విసవిసబోవు సుడిగాలిరీతి, పూర్వాదిసమీపమున సంభవించి చదలుదాక లేచి అమితవేగమున తరలి తరలి సాధారణ కల్లోలములపై దూకివచ్చు ఉత్తుంగకల్లోలము విధాన, సునాయాసముగ వెనుక వచ్చు నా కుమారుని ఎద్దుబండి సమవర్తి శకటమును దాటి ముందునకు గడిచిపోయినది. ఆ సమయమున నా ప్రఖ్యాతవీరుడు రౌద్రమూర్తియై, గాఢక్రోధమున ఎట్లయిన తన విరోధి బండిని నిలుపు దురుద్దేశమున విడిగానున్న యొక పగ్గపుత్రాడు చటుక్కున అత్యంత నిపుణముగ తన యెదిరివాని యెద్దుల మెడలమీదికి విసరెను. అది చూచి అంద రొక్కసారి హాహాకారముల సలిపిరి. కాని మగటిమి గల ఆ కుర్ర పోటీదారుడు తన చబుకు చురుక్కున పేలించి సమవర్తి చేతిపై మేరుమువలె, బాణమువలె, నాటించి పగ్గము హస్తమునుండి సడలిపోవునట్లొనర్చెను.

సమవర్తిచేయి పట్టువీడిన పగ్గముతాడీడ్చుకొనుచునే ఆ బాలకుని బండి గమ్య స్థానమునకుబోయి నిలిచెను. ఆ గిత్తలు వగర్చుచు ముట్టెలు భూమి నాన్చి, నాల్కలుజూచి, డొక్కలెగురవేయుచు నిలిచియున్నవి.

ఇరువది ధనువులవెన్క సమవర్తి వచ్చెను. శివస్వాతియు, కాళింగుడగు మల్లినాథుడును మూడవవారుగా వచ్చిరి.

ఒక్కుమ్మడి ప్రజలందరు "ఇదిమాయ! తంత్రము! ఇంద్రజాలము! వీడు బ్రాహ్మణ మాంత్రికుడు! వీనిపట్టుడు! కొట్టుడు! చీల్చివేయుడు!" అని కేకలువేయుచు దగ్గరనున్న ఆయుధముల సేకరించి హుమ్మని విజయలక్ష్మీ ధవుడగు నా బాలకునికడ కురికిరి. అచ్చటనున్న రక్షకభటులు ఇట్టిరంగ ముద్భవిల్లునని కలనైన తలచియుండకపోవుటచే, ఆ మూకల నాపుచేయలేకపోయిరి. చక్రవర్తి అంగరక్షకులు కొందరు తమ గుఱ్ఱముల నా విజయునికడకు బరువెత్తించి ఆతని చుట్టును శూలముల జళిపించుచు నిలిచిరి. వారి నెట్లు తప్పించుకొనిరో నల్వురైదుగురు వీరులు సువర్ణశ్రీ బండిని కత్తులెత్తుకొని సమీపించిరి. ఆ బాలుడు తనకుకలిగిన ఆయాసము నడంచుకొనుచు, చిరునవ్వు మోముతో నీ గడబిడ

చూచుచు, తనదూడల పల్కరింపుచు, ప్రేమచే వాని మూపురములు, గంగడోళ్ళు, ముట్టెలు దువ్వుచు, వాని ఆయాసము తీర్చుచు, తనపై దుముకువారివైపు చూచుచుండెను. ఎప్పుడీ నల్వురు కత్తులెత్తుకొని తనమీదికి దూకిరో, అప్పుడా బాలుడుచేతనున్న బంగారు కట్లుకట్టిన, మణులు పొదగిన పెద్ద పులితోలు తాళ్ళుగలిగిన, దంత కశాయుధము పట్టుకొని ముందున్న వాని మోముపై చురుక్కున నంటించెను. "హో" యని యార్చియాతడు కత్తి పారవైచి, కశాఘాతంబుచే రక్తము స్రవించు మోముపై చేతులనుంచుకొని కూలిపోయెను.

ఇంతలో అపరభీమునివలె మహాసత్త్వుడై పర్వతమువలె ఉన్నతుడై ఆజానుబాహుడై, అమూల్యవస్త్రధారియై, చిరుగంటలు గలిగిన పెద్దగదను ధరించి యొక పురుషుడు రాజాయము కడనుండి పరుగునవచ్చి, సువర్ణశ్రీ కుమారునికడకురికి, పిడుగుమాటలతో "ఎవ్వరీబాలుని స్పృశింప దలంతురో వారు ముందే గదాయుధంబు రుచిచూతు" రని పలికెను.

ధనుర్వేదాచార్యుండును, చండవిక్రముండును, సమస్తవీరహృదయా నందుడును, పవిత్రుడగు సోమదత్తు డానూత్న బాలునకు సహాయియై వచ్చెనని చూడగనే ప్రవాహము వలెవచ్చు ప్రజానీకము పర్వతము అడ్డమురా నాగినట్లయ్యెను. అందరును వెనుకకు తిరిగిరి. అప్పుడు సార్వభౌముని గజ తురగ రథ సైనికులు జవంబున విచ్చేసి మూకల నిటునటు తరిమివేసిరి. సార్వభౌముని కడకు విజయుని గొనిరా రాజాజ్ఞయయ్యెను.

ఈ కోలాహలమంతయు సమవర్తి జూచుచునేయుండెను. జనులు తన్నోడించిన యాబాలునిపై గవిసినప్పుడు సమవర్తిమోము హర్షప్రఫుల్ల మయ్యెను. సోమదత్తుడువచ్చి ఆ కుర్రవానిని ఆపదనుండి రక్షించునప్పుడు సమవర్తి పండ్లు బిగించి సోమదత్తునివైపు చురచుర చూచెను.

ఆ బాలుడు తన్ను రక్షింపవచ్చిన తన గురునకు పాదాభివందన మాచరించి ఆనందాశ్రువులతో నాయన మోము దిలకించెను. సోమదత్తుడు సంతోషమున శిష్యుడగు నా బాలుని బిగవుగిలించుకొని మూర్ధము ముద్దు గొనియెను. వారిద్దరు గజగమనముతో రాజమందిరము సమీపించిరి. ఈలోన ప్రజలకు కోపముతగ్గి ఎట్టి బహుమాన మా బాలుడు బడయునో, సార్వభౌముడేమి చెప్పునో ఆ బాలుడెవరో తెలిసికొన కుతూహలము కలిగి, ఎప్పటియట్లు తమ స్థానముల ఇష్టము చేతనైననేమి, సైనికుల యొత్తిడి చేతనేమి యధివసించిరి. అంతయు నిశ్శబ్దమయ్యెను. చీమ చిటుక్కుమన్న వినిపించునట్లుండెను.

సార్వభౌముని మందిరముకడ అమాత్యులు, సచివులు, సైన్యాధికారులు మొదలగు గొప్ప యుద్యోగులు, సామంతనృపాలురు, ఆంధ్రపండితులు, కవులు, వీరులు-అందరు అధివసించి యుండిరి. శ్రీముఖ సాతవాహనమహారాజు దేవేరితో గద్దెపై నధివసించి యుండెను. రాజసింహాసనము కుడిప్రక్కగా యువరాజాసనముపై చక్రవర్తి పెద్ద కుమారుడగు శ్రీకృష్ణసాతవాహనుడును, ఆ ప్రక్కపీఠికపై శ్రీముఖుని తమ్ముడగు సుధన్వ సాతవాహనుడును కూర్చుండిరి. వెనుక పరిచారికలతో అంతపుర స్త్రీలోకము మణిమయ స్వర్ణపీఠముల ఉపవిష్టమైయుండెను.

సోమదత్తు తనశిష్యుని రాజుమ్రోలకుం గొనిపోయినాడు. ఆ బాలకుడు సార్వభౌమునకు సాష్టాంగప్రణామ మాచరించి, యాతనిచే ననుజ్ఞాతుడై లేచి నిలువబడెను, అప్పుడు సోమదత్తుని మోము పరికించి చక్రవర్తి యిట్లనియె "వ్యాయామాచార్యా! సోమదత్తా! ఈ బాలకు డెవరు? ఈతని యుదంతమేమి?" అని యడిగెను.

“మహారాజాధిరాజా! ఆంధ్రసార్వభౌమా! సర్వరాజన్యకిరీటమణి ప్రభాస్నాత పాదుకా! జయ జయ! ఈ బాలుడు దేవరశిల్పియై విఖ్యాతి గాంచిన మహాభక్తుడగు ధర్మనంది తనయుడు. సువర్ణశ్రీకుమార నామధేయుడు. నా శిష్యులలో నుత్తముడు. ఉక్షాశకట పరీక్షకు మా పరిశ్రమాలయ పక్షమున నొకవీరుని పంపుట పూర్వమునుండియు ఆచారము. శ్రీ శకటాధ్యక్షులు మాకు లేఖ నంపుటతోడనే మే మొక పందెము నేర్పరచి అందు విజయుడగువాని నీ ఉత్సవపరీక్షకుపంపుట దేవరకు విశదము. ఈ సంవత్సర మీబాలుడు విజయియై ఇచ్చటకువచ్చి ఇక్కడను జయము గొన్నాడు” అని విన్నవించెను. అప్పు డొక్కసారి వందిమాగధులు పాడినారు. దుందుభుల మ్రోగించినారు. జయ జయధ్వానము లొనర్చినారు. వైతాళికులు కీర్తించినారు. మేళపతులు శంఖ కాహళ నాగస్వరాది వాద్యముల పల్కించిరి.

## ౧౧

# విజయ బహుమానము

సద్దుమణగినంతనే సార్వభౌముడు మహామంత్రివైపు చూచెను. మహామంత్రి ప్రధాన వైతాళికుని కన్నుసన్న జేసెను. అప్పుడు తళుకు తళుకుమను దీపలక్ష్ములు, సర్వభూషణాలంకృతలై హారతులగొనివచ్చి, పాటలు బాడి మంగళము లిడిరి. ఇరువురు బాలికలు వెంటనే వివిధ సుమమాలల గొనివచ్చి యాతని మెడను వైచిరి.

అంత వీణానాదము మృదంగము వేణుస్వనము వినవయినవి. ఈ వలావలనుండి సుందరులగు ఇరువదిమంది బాలికలు నాట్యము చేయుచు విచ్చేసి సువర్ణశ్రీ కుమారుని చుట్టును "ధర్మవిజయము"ను అద్భుతాభినయపూర్వకముగ నాట్యమొనరింప నారంభించిరి. ఆ బాలికలలో సార్వభౌముని ఇరువురి తనయులు, రాజకుటుంబములోని బాలికలు, సచివుల సేనానాయకుల కుమార్తెలు, కోటీశ్వరుడగు చారుగుప్తుని పుత్రి హిమబిందును కలరు. ఆ నాట్యమునందు పాల్గొనసుత్తమవంశ సంజాతలగు యువతీ రత్నములకే అర్హత.

మంగళవాద్యములు మ్రోగుచుండెను. దేవవేషమున నాట్యగురువు ప్రవేశించెను.

"ఈ విజయ గీర్తింప
ఈ వియచ్చరులెల్ల
గగన పథముల వచ్చి
కాంతితో ప్రసరించి
పూలవర్షము కురిసి
తేలుచున్నారదిగొ
ఈ విజయ గీర్తింప"

బాలిక లప్సరసలవలె నభినయించుచు,

"ఓయి యౌవనమూర్తి
ఓయి సుందరస్వామి
రావయ్య జయదామి
కావక్షుడవు కమ్ము"

నాట్యమాడిరి.

నాట్యగురువు:

ఇంద్రుడిచ్చును కీర్తి
చంద్రుడిచ్చును విద్య
వాయుదేవుడు బలము
వరుణుడిచ్చును శక్తి.

బాలికలు నాట్యము సలుపుచుండిరి.

నాట్యగురుని శిష్యుడు మారువేషమున,

"ఎవడవోరీ మానవాధమా!
ఇవ్వనవాటిని నిలుచున్నావూ?

ఇరువురు శిష్యులు అహంకారుడు, స్వార్థుడు అను దేవతలుగా పాడుచు తాండవింతును.

"లోకముకొరకై సేవనుమానుము
లోకము నిన్నేకొలుచునురా!"

మారుడు :

మారుడ నేనే, శూరుడ నేనే
మాయలకంతకు నేతను నేనే
జగము లన్నిటిని కాలనుత్రొక్కెద
జగములు నన్నే పూజలు సేయును
నన్నుకొలిచికొనువారికే విభవము,
నాకము వారికి పాదాక్రాంతము,
ఛత్రచామరము సర్వరాజ్యములు
సర్వసంపదలు వారికె దక్కును;
రారా! రారా! విజయరూపుడా!
రారా, వచ్చియు నన్ను కొలువురా!

కొందరు బాలికలు మారుని కొమరితలవలె దివ్య వేషములప్రవేశించి:

జగంబంతటు వీరహృదయులు
జిఘృక్షులుగా మోకరింతురు,
మాదగు సౌందర్యమ్మును చూచి
మమ్ములనే కామించి వత్తురు.
...జగం.
మన్మృణకినలయబాహువల్లరి
మధురముగ నిను కౌగలించును
వినముకాదిది వాతెరసుధరా
మెనవరా దేవుడై వెలిగెదవు.
...జగం.

ఇంతలో రాజపుత్రికలు, హిమబిందు, రాజబంధు తనయలు, అష్టమార్గ మూర్తులవలె విచ్చేసి నాట్యముచేయ నారంభించిరి.

చక్రవర్తి ప్రథమతనయ మాయాదేవి విజ్ఞానదేవిగా, ద్వితీయ పుత్రిక శాంతశ్రీ సత్యచింతనాదేవిగా, హిమబిందు ధర్మకర్మదేవిగా, నాగబంధునిక ఉత్తమాశయదేవిగా, ఇతర బాలికలు తక్కినవారుగా నటించిరి.

విజ్ఞానదేవి :

జన్మంబు మాయరా
జగమే హుళక్కిరా

సర్వభోగము లవియు
ఛాయలే ఎరుగరా,

సత్యచింతన :

జగములో ఎవ్వరికి
సలుపకోయీ హింస
పాపకాంక్షలు నీకు
చూపవుర నిజపథము.

ధర్మకర్మదేవి :

ప్రేమయే నీ కర్మ
ప్రేమయే నీ దారి
సర్వ ప్రాణులు నీవె
సర్వబాధలు నీవే!

ఉత్తమాశయదేవి :

మూడురత్నము లివిగొ
చూడరా! వేడరా!
నాల్గు సత్యాలనే నమ్మరా, ఎరుగరా!

సత్యవచనదేవి :

అనృత మాడబోకు
ఆనంద మొందరా
కానిచో మాటయే
కంఠాన రానీకు.

న్యాయజీవితదేవి :

పరధనము వలదురా
పరకాంత వలదురా
వలదురా పరభూమి
వదలరా వాసనల.

శీలదేవి :

వలదు భోగము మనకు
వలదు యశములు మనకు
కలలైన జన్మాలు
గాఢశత్రులు మనకు.

ఆనందదేవి :

ఏమి లేకుండుటే

ఎరుగు నిర్వాణంబు
కర్మరహితంబైన
జన్మరహితంబౌన
అదియ ఆనందమౌ
అదియె నిర్వాణమ్ము.

హిమబిందుకుమారి సమవర్తి ఓడిపోయి రెండవవాడుగా మాత్రము వచ్చుట చూచి వెలవెలపోయినది. ఆమె హృదయము క్రుంగిపోయినది.

పెన్నిధి పోగొట్టుకొనినవానివలె క్రుంగిపోయిన తండ్రిని జూచి, యామె కన్నుల నీరు తిరిగెను. ఇంతకు నా నూత్నబాలకు డెవ్వరో తన తండ్రికి దుఃఖకారణుడైనాడు. ఆతడు పిశాచి, రాక్షసుడు. ఆమె ఆ బాలకుని ఇచ్ఛామాత్రమున నాశనముచేయ నూహించినది.

విజయము నందుటకుగాని, ఓడిపోవుటకుగాని ఆ పందెమున ఎద్దులే కారణమయినను, సారథిని కారకునిగా ఎంచి నిందించువారిలో చారుగుప్తుడును చేరినాడు. ఇంతలో అతనికి జ్ఞానోదయమై, తన్ను తానే నిందించుకొనినాడు.

తా నెన్నివేల ఫణములు పెట్టి కొనిననేమి? మహోత్తమ వృషభముల కనుగొనలేక పోయినాడు. ఆ చక్కని గిత్త లెచ్చటివి? ఏ జాతివి? తన గోపాలురకు, గోరక్షకులకు తెలియకుండ నెచ్చట పెరిగినవి? అలాంటి దివ్యవృషభములు లక్షఫణములు మూల్యమిచ్చికొన్ననేమి?

తన స్వప్నములు పటాపంచలైనవి. తాను కౌశికునివలె పన్నిన మొదటి ఎత్తే విచ్ఛిన్నమైనదేమి? ఇది అపశకునమా? ఛా, ఎన్నిసారులు ఓడిపోయి చాణక్యదేవుడు జయమందలేదు? అదిగో తన బంగారు ప్రోవు, దివ్యమూర్తి. హిమబిందు తన్నుజూచి బెంగపెట్టుకొన్నది.

అనుకొనుచు చారుగుప్తుడు కలకల నవ్వుచు, “మనమును విజయునకు కాన్క నీయవలె, హిమబిందూ! హరగోపా! అలంకారికుని, కుయవుని ఇటు రమ్మను!” అని ఆజ్ఞ యిచ్చినాడు.

కుయవానందుడు అద్భుతశిల్పి, అలంకారికుడు. ఆయన మందిరము వెనుక ప్రక్కనుండి ముందునకు వచ్చి, చారుగుప్తునితో రహస్యముగ మాట్లాడి అశ్వము నెక్కిపుర మార్గమున వెడలిపోయెను.

తండ్రిగారి సంతోషము కనుంగొని హిమబిందు హర్షవదనయై నాట్యమున కలంకరించుకొన చక్రవర్తి మందిరము వెనుకనున్న నేపథ్య మందిరమునకు బోయెను.

అచ్చటనున్న యా చకోరాక్షుల, ఆ యిందీవరనేత్రల, ఆ కురంగ లోచనల నడుమ హిమబిందు మహాపద్మనేత్రయై, తారకామధ్యచంద్ర బింబమువలె కాంతులీనుచుండెను. రావి వనములోని వటవృక్షమువలె విలసిల్లెను. మొదట హిమబిందును సమవర్తి చూచుచునే యుండెను. ఆమెవదన మవనతమై సమవర్తి హృదయమును గ్రుంగజేసినది. చేయి పెట్టి కలచివేసినది. తన దురదృష్టముచే మేనమామకు అపజయము కలిగినది కదా యని యాత డనుకొనెను. ఇంతలో చారుగుప్తుడును నవ్వెను. సమవర్తి మనస్సు చకితమై వికారమునందెను. పదునారేండ్ల ఎలప్రాయపు ఆ జవ్వని తన మనస్సంకల్పమునకు, భావనేత్రమునకు ఇదివరకు గోచరము కాని పొంకముతో, అత్యద్భుతసౌందర్య రూపమున

ఎదుట ప్రత్యక్షమై నప్పుడు అతనికి మరేమియు కన్పట్టలేదు. నాగస్వరము నూదు పాముల వాని అభినయముల తదేకదీక్షతో చూచు సర్పమువలె నాతడు హిమబిందుగమనము చూపులతో ననుసరించుచుండెను. చక్రవర్తి సింహాసనపాదముమ్రోల విజయపీఠిక యమర్పబడినది. సువర్ణశ్రీ కుమారుని నందధివసింపజేసి వసిష్టు డాశీర్వాదముచేసి సువర్ణా క్షతల జల్లుటయు, సార్వభౌముడు, మహారాణియు, రాజబంధువులు, శ్రీకృష్ణసాతవాహన మహారాజు, మంత్రులు, సామంతులు, వేదపండితులు, శ్రమణకులు, ధర్మనందియు నక్షతల జల్లిరి. హిమబిందుకుమారి తన యపాంగవీక్షణముల సువర్ణశ్రీ కుమారుని గాంచెను. ఆమె హృదయము ఏలనో దడదడ కొట్టుకొనెను.

ఇంతలో నొక వైతాళికుడు శంఖమూదెను. అప్పు డా చంద్రరేఖలగు ముగుదలు నాట్యము చాలించి వారి వారి పీఠముల నధివసించిరి. చక్రవర్తి పీఠమునుండి లేచుటయు, మహాసభయంతయు లేచెను. శకటాధ్యక్షుడగు మహశ్రీ సువర్ణశ్రీకుమారుని చేయి పెట్టుకొని సార్వభౌముని కడకు గొనిపోయెను. ఆ బాలకుడు చక్రవర్తికి మోకరించి లేచెను. ఒక సచివుడు ప్రతీహారి అందిచ్చు నవరత్నఖచితమై, బంగారు పనితనముగలిగి, కన్యాకుబ్జ లోహకారకులచే నిర్మింపబడి, పదునేను మడతల ఉక్కురేకు కలిగి, పదునుకడ గాలిలో మాయమై, మొరవవైపు యవగింజ పరిమాణముకలిగి, జవజవలాడు, తళుకు తళుకులాడు, మహానిశితకృపాణమును సార్వభౌముడు దుకూలవస్త్రములతో, తాంబూలములతో బహుమాన మొనర్చెను. ఒక్కసారిగా భేరీ మృదంగాది వాద్యములు ఘోరుకొల్పబడినవి. మరల నిశ్చలత జనింపగానే, యువరాజు ముందున కేతెంచి సువర్ణ శ్రీకుమారుని మహశ్రీ తన వెనుక తీసి కొనిరా, మందిరముకడకు సూతుడు కొనివచ్చిన యొక కాంభోజాశ్వమును- నల్లనిదానిని, సన్నని ముట్టె కలదానిని, చామరమువంటి తోక గలదానిని కెరటములవంటి మెడజూలు కలదానిని, లేడి కాళ్ళవలె పాదములు కలదానిని పంచకళ్యాణము లున్నదానిని - కళ్లెముబట్టి సువర్ణశ్రీ కుమారుని చేతికందిచ్చెను. మరల దుందుభులు మ్రోగినవి. అప్పుడు మహారాజ్ఞి పరిచారికవచ్చి, యా బాలుని సింహాసనముకడనున్న రాణికడకు గొనిపోయెను. అప్పుడా సాధ్వి “ఇది నీ వివాహమునాడు నీ భార్యకి” మ్మని రత్నమంజూష నొకటి చెలికత్తెచే నిప్పించెను. సమస్తవాద్యములు ధ్వనించినవి.

ఇంతలో చారుగుప్తుడు ముందుకువచ్చి, ధర్మనంది చేయిబట్టి సువర్ణశ్రీ కడకు గొనివచ్చి “ధర్మనందులవారూ! మీ కుమారుడు సర్వతంత్ర స్వతంత్రుడయ్యా! మీ రిట్టిబాలుని కనుటచే ధన్యులు. ఈనాడు విజయమందిన మీ కుమారునకు, నేనును చిన్నకాన్కను సమర్పించుచున్నాను” అనుచు హరగోపుడందిచ్చిన రత్నఖచిత సువర్ణపేటికను మూత తెరచి, సువర్ణశ్రీ హస్తముల నుంచినాడు. అందు దంతపుటము లపై చిత్రించిన పరమపవిత్ర వినయపీఠిక గ్రంథమున్నది. సువర్ణశ్రీ ఆపేటికను కన్నులకు, శిరమునకు నద్దుకొని తన ప్రక్కనున్న రాజసేవకునకందిచ్చెను. ఉత్సవమంతయు నైనవెనుక సార్వభౌముడు మందిరము దిగి దురోన్ముఖుడై దంతావళ మారోహించెను. విజయ సింహుడగు సువర్ణశ్రీ కుమారుని అలంకారభూయిష్టమగు అంబారీ కల యొక మదగజముపై నధివసింపజేసి ధాన్యకటకపురిని ఊరేగింప బయలుదేరదీసిరి.

## ౧౨

## బంధితుడు

శోణనగ మను గ్రామము వేంగీవిషయమున గోదావరీనదీతీరమునకు మూడు గోరుతముల దూరమున నున్నది. శోణనగ మనుపేరు ఆ గ్రామము ప్రక్కనున్న ఎఱ్ఱటి కొండవలన వచ్చినది. ఆ గ్రామము ఫలమంతమగు భూములచే, తోటలచే నలరారుచు

నూరు బ్రాహ్మణగడపతో, రెండువందల క్షత్రియులైన రెడ్ల గృహములచేతను, ముప్పది వణిజుల ఇండ్లతోను, రెండువందల ఏబది చాకలి, మంగలి, కుమ్మరి మొదలయిన శూద్రగేహములతోను నిండియున్నది. నూరు బ్రాహ్మణ గృహములలో ఇరువది ఇళ్ళు శిల్ప బ్రాహ్మణులవి. ఆ గ్రామములోని క్షత్రియులు, శూద్రులు, వణిజులు బౌద్ధ దీక్షావలంబకులు. బ్రాహ్మణులు వేదధర్మ మనుసరింతురు. శిల్ప బ్రాహ్మణులు ఈ వైదిక సాంప్రదాయమన్నను, బౌద్ధసంప్రదాయమన్నను సమాన గౌరవము, భక్తియు గలవారు.

శోణనగ గ్రామవాసులు చైత్రశుద్ధపాడ్యమినాడు గ్రామ శృంగాటక ప్రదేశమున అశ్వత్థ నింబ వృక్షసంశ్లేష స్థల విశాలవేదికపై కూడినారు. గ్రామణియు, పూర్వసంవత్సర సంఘసభ్యులు వేదికపై తాటియాకుల చాపల పై నధివసించిరి. తక్కుంగల ప్రజలందరు వేదికచుట్టును నచ్చటచ్చట గుంపులుగా విడిగా కూర్చుండియుండిరి. గ్రామ పురోహితుడగు చంద్రస్వామి పంచాంగ శ్రవణము నొనర్చెను.

ఆపైనా సంవత్సర గ్రామపాలకులగు గ్రామణిని. పంచసంఘ సభ్యులను ఎన్నుకొనిరి. ఎన్నుకొనుట యనగా గ్రామవాసులు వారు వారు సభ్యులువారు గ్రామణులు అని పేర్కొందురు. తక్కినవారు వల్లెయని కేకలనిడుచుగాని, చేతులనెత్తిగాని తెల్పుదురు.

ఎన్నుకొనిన సభ్యులును, గ్రామణియు “దమ్మసూత్త” గ్రంథము చేత నుంచుకొని ఆ సంవత్సరము తాము శోణనగ గ్రామమును ధర్మయుతముగా, ప్రజాహితముగా పరిపాలింతుమనియు, తామాగ్రామప్రజలకు, భగవంతునికి సంపూర్ణ సేవకులమనియు వాగ్దానములు చేసిరి.

ఆ కాండ నెరవేరుటతోడనే గ్రామపురోహితుడును, తక్కుంగల బ్రాహ్మణులును వేదపనసల చదివి, వారందరి నాశీర్వదించిరి. పుణ్యాంగనలు పాటలుపాడి హారతులిచ్చి తిలకములిడిరి. వారిపై అందరు అక్షతల జల్లిరి. అచ్చటనుండి గ్రామోత్సవము లారంభమైనవి. ఆటలతో, పాటలతో, భజనలతో గ్రామమంతయు ఉప్పొంగిపోయినది. ఆంధ్రదేశమునం దాదినము ప్రతిగ్రామమునం దట్టి ఉత్సవములు, ఎన్నికలు జరుగును. రాత్రియంతయు భగవత్కథాకాలక్షేపము జరిగినది. ఆ వెనుక యక్షనాటకము ప్రదర్శింపబడినది.

కాని పురోహితుడగు చంద్రస్వామి ఉత్సవములం దేమియు పాల్గొనక, తలవాల్చికొని యింటికి వెడలిపోయెను. చంద్రస్వామి ఆపస్తంభ సూత్రుడు, కృష్ణయజుర్వేది, భారద్వాజుడు ఆతడు సాంగవేది, ధర్మశాస్త్ర కోవిదుడు, ఐతిహాసికుడు, గృహ్యసూత్రాల ఉద్దండవిజ్ఞాని. చుట్టుప్రక్కల గ్రామముల పురోహితులలో, బ్రాహ్మణులలో తలమానికము వంటివాడు. మధ్యమ వర్చస్వి బక్కపలుచని దేహపుష్టి కలవాడు. విశాలవదనము కలవాడు. ధనువునకు రెండుగుప్పిళ్ళు తక్కువ ఎత్తుతో, సమనాసికతో, చిన్న కళ్ళతో, పొడుగాటి మెడతో భుజములకంటు చెవులతో నాత డపర బృహస్పతి వలె తేజరిల్లుచుండును. ముప్పదిఏండ్ల ఈడువాడయినను బ్రహ్మచారియగుట నాతని గృహము నొక ముదుసలి మేనయత్త నిర్వహించుచుండును.

ఇంటికిబోయి దొడ్డిలోనికిజని కూపమున నీరుతోడికొని స్నానమాచరించి, సాయంకాల మూహించి, మడివస్త్రముల గట్టుకొని యాతడుసంధ్యార్చన చేయగడంగెను. సంధ్యార్చన పూర్తి చేసికొని యాతడు తన పూజాగృహము ప్రవేశించెను. మినుకు మినుకుమను అర్చనాదీపకాంతిలో మహావృషభమూర్తి, పదునాల్గంగుళముల తామ్ర విగ్రహమూర్తిగా ప్రత్యక్షమయ్యెను. ఆ విగ్రహమునకు చంద్రస్వామి సాగిలబడి ప్రార్థనా శ్లోకములు పఠించి

లేచి, పద్మాసనము వేసికొని జపముచేయ ప్రారంభించెను.

మేనయత్త ఫలహారము కానిచ్చి, ఇల్లంతయు సర్దుకొని, తలుపు వేసికొని వచ్చి, దొడ్డిలో నులకమంచము వేసికొని పక్క వేసికొని నిద్దుర కూరినది.

గ్రామపు తలవరి మూడవ యామపు కేకలు వేయుచు పోవునంత వరకు చంద్రస్వామి జపదీక్షపరుడై యుండెను. జపము పూర్తి యగుట తోడనే లేచి మహేశమూర్తి ఎదుట సమాలింగిత భూతలుడై లేచి, దొడ్డిలోనికి జనెను. చుక్కలు మిన్కుమిన్కనుచుండెను. దూరమున పొలములలో నక్కకూతలు వినవచ్చుచుండెను. దొడ్డిలోనున్న వృక్షములు నిశ్చలములై దేవదేవుడగు నీశ్వరునిగూర్చి తపస్సు చేయుచున్నట్లుండెను.

"అయ్యో భరతఖండమంతయు నాస్తికుల పాలయినదే. ఎక్కడ బుద్ధుడు! ఎక్కడవేదములు. వేదములు పౌరుషేయములట. భగవంతుడే లేడట. బుద్ధుడే భగవంతుడట. అతడే తాను భగవంతుడనుకాను భగవంతుడే లేడని చెప్పినాడు. గాని ఈ భిక్కులు బుద్ధుడే సర్వసృష్టి స్థితి లయకారకుడైన ఈశ్వరుడు అంటున్నారు. బుద్ధునిమార్గమే అనుసరించెదరు. కొందరపరశైలవాదులట. కొందరుపూర్వశైలవాదులట. ఈ చార్వాకమతము మశూచిరోగమువలె భరతఖండమంతయు నల్లుకొనిపోయినది. భగవద్గీత, వేదాంతసూత్రములు ఎంత యుత్కృష్టగ్రంథములు! "దమ్మసూత్తము" లట; దద్దమ్మసూత్తములు కావా? జాతక గాథలట! త్రిపిటకములట! వేదములు, ఉపనిషత్తులు, బ్రాహ్మణములు, ధర్మశాస్త్రములు, ఉపవేదములు, అన్నియు నాశనమైనట్లేనా? వినాశ కాలము వచ్చునది. ఏదియో మహా ప్రళయము ఆవహిల్ల బోవుచున్నది. చక్రవర్తులే బౌద్ధ దీక్షపరులైనప్పుడు ప్రజలగతి యేమి?

"శూద్రులందరు బౌద్ధ మతావలంబకులై బుద్ధచైత్యపూజాపరు లయ్యారు. ఏలాగు ఈ భయంకరస్థితిని మాపుట? గురుదేవులు అవతారమూర్తులు. వారే కల్కి అవతారదేవునకు వైతాళికు లగుదురుగాక!" అని ఆలోచించుకొనుచు ఇటునటు నడుచుచుండెను.

ఎవరో వీధి తలుపు తట్టినట్లయినది. "ఎవరువా" రని చంద్రస్వామి కేకవైచి ఇంటిలోనుండివచ్చి ముందరచావడి దాటి సింహద్వార కవాటము తెరచెను. కాగడాలతో కొందరు మనుష్యులు చంద్రస్వామికి కనిపించిరి. కాగడాల వెలుతురున నూత్న గ్రామణియగు శ్వితవుడు, గ్రామసంఘసభ్యులు, ఇరువురు తలారులు, కొందరు సైనికులు, నొక దళిపతియు నాయనకు గోచరించిరి.

చంద్రస్వామి "ఏమి ఇది?" యని ప్రశ్నించెను. శ్వితవుడు "అయ్యా నమస్కారములు. తాము చక్రవర్తిపై నేదియో దోష మెంచినారట. అందుకై తమ్ము బంధించి ధాన్యకటక నగరమునకు కొని తేవలయునని, మహా సైన్యాధికారి ముద్రవేసిన భూర్జపత్రముగొని యీ దళవాయి వచ్చినారు. కానీ మీ రీ క్షణముననే వీరివెంట పోవలయునని మే మందరము ప్రార్థించుచున్నాము. వీరు మీవంటి ఉత్తమ బ్రాహ్మణులను బంధిపకయే తీసికొని పోదురు" అని మనవి చేసినాడు.

వృద్ధుడగు నా క్షత్రియుని అవలోకించి చంద్రస్వామి "చక్రవర్తిపై దోషమా! నేనా!" యనుకొనుచు "చక్రవర్తి శ్రీముఖసాతవాహనుడు ధర్మమూర్తియే! ఎందరు బ్రాహ్మణుల కగ్రహారముల నాయన సమర్పింపలేదు? ఈ అఖండ మహారాజ్యము సుభిక్షమై యా ధర్మరూపుని చల్లని పరిపాలనములో సర్వ సంపదల కాకరమై రామరాజ్యమును దలంపునకు తెచ్చుచున్నదే! వారి పైన నేను దోష మేమి యాచరింపగలను?" యని

పలికినాడు. అతనిమోము వైవర్ణ్య మొందినది. విషాదమేఘము లాతని నావరించినవి.

ఆ దళవాయి చంద్రస్వామిని కనుగొని "స్వామీ! మీ రనునది నిజమే! కాని, ఏదో పొరపాటు జరిగి ఉండవచ్చును. తమ్ముగూర్చి వృద్ధశ్విత్రవులు ఘనముగా చెప్పియున్నారు. మీకు సకల సౌఖ్యముల నొసగ గూర్చుచు తీసికొని పోదుము. చక్రవర్తి జన్మదినోత్సవము లఖండముగ జరుగుచున్నవి. ఆ ఉత్సవములు పూర్తికాకుండగనే ఈ అభియోగము విచారింపబడగలదు. ఇప్పుడు జాగుసేయక తాము తొందరగ బయలుదేరినచో, మనము తెల్లవారునప్పటికి ఏ మూడు క్రోశములైన పోగలము. తమకు అందలము సిద్ధము చేయించినాము. మేము అశ్వములపై ప్రయాణము చేయుదుము. ఒక వారములోననే మనము ధాన్యకటక నగరము చేరగలము" అని మనవిచేసి నమస్కరించెను.

## ౧౩
## ప్రయాణము

ఆంధ్రదేశమునం దెల్లెడను మహారాజపథములు, ఘంటాపథములు, రాజ మార్గములు, బాటలు విరివిగా నున్నవి.

మహారాజమార్గము ఎనిమిది దండములు వెడల్పు (దండము = 8 అడుగులు, అడుగునకు 9 అంగుళములు). ఘంటాపథము ఆరుదండముల వెడల్పు. ఈ బాటపై ఏనుగులు ప్రయాణము చేయును. రాజమార్గము నాలుగుదండముల వెడల్పు. వీనినే రథ్యలనికూడ పిలుచుచుండిరి. సాధారణపు బాటలకు అశ్వికపథమనియు, ఖరోష్టపథ మనియు, చక్రపథమనియు పేరులున్నవి. ఆశ్వికపథమునకు ప్రక్కనే మనుష్యపథమనియు, పాదపథ మనియు మనుష్యులు నడుచు పథమున్నది. ఈ పథము రెండు అరత్నులు వెడల్పు (1 అరత్ని = రెండు అడుగులు). ఈ బాటపై మనుష్యులు మాత్రమే నడువవలసి ఉన్నది. అన్ని పథములు రాళ్ళతో, సున్నముతో తరతరము లుండునట్లుగా నిర్మింపబడినవి. గ్రామము, గ్రామము కలుపు సాధారణపథములు గట్టిగా దిమ్మెస చేయబడి, ఎడ్లబండ్ల, అశ్వముల యానమునకు ఉపయోగపడు నట్లమరింపబడియుండెను.

ఈ మార్గములన్నిటికి పై అధికారి సర్వమార్గాక్షుడను ఉత్తమోద్యోగి. సర్వమార్గములు సరియైన స్థితిలో నుంచుటయు, మార్గముల ప్రక్క ఆరు గోరుతముల కొకచోట జలగృహముల నుత్తమస్థితిలో నుంచుట, మార్గములవెంట సత్రములు, సత్రములలో భోజనగృహములు, పశువైద్యశాలలు, మనుష్యవైద్య గృహములు నుచితరీతి జరుగునట్లు పర్యవేక్షణ చేయుట-ఇవి ఈ యధికారి ధర్మములు.

ఆంధ్రదేశము ధాన్యకటకమునుండి మహారాజపథములు నాలు గున్నవి. ఒకటి ధాన్యకటకమునుండి కృష్ణదాటి వాయవ్యమూలగాబోయి, సువర్ణపురము, నాగేంద్రనగరము, పర్వతనగరము, మహానగరముల మీదుగా మంజిష్ఠానదీతీరముననున్న గంగా పట్టణమునకుబోయి యచ్చుట నుండి ప్రతిష్ఠాన నగరమునకు బోవును.

రెండవ మహారాజపథము ధాన్యకటకమునుండి తూర్పుగా ఇంద్ర కీలాద్రి పురమునకుబోయి అచ్చటనుండి ఆగ్నేయముగా కృష్ణానదీతీరముననే భట్టిప్రోలు పోయి, యచ్చుట కృష్ణ దాటి ఘంటికాశాలకును ఆ పురమునుండి శ్రీకాకులమునకును బోవును.

మూడవ మార్గము ధాన్యకటకమునుండి దక్షిణముగా ధనదపురమునకు,

నచ్చటనుండి ఉదయ పర్వతమునకు, నచ్చటనుండి కాంచీ పురమువరకు పోవును.

నాల్గవమార్గము ధాన్యకటకమునుండి ఈశాన్యముగాబోయి, వేంగీ పురము, అచ్చటనుండి గౌతమీతీరముననున్న గోతీర్థముకడ గౌతమిని దాటి దక్షిణకోసల రాజధాని, పిష్టపురమును, పూర్వాంధ్రదేశ ముఖ్య నగరమగు శాతవాహనగుండమును, ఆంధ్రగిరి పోయి, అటనుండి త్రికళింగ దేశము చేరును.

చంద్రస్వామిని శిబికారోహిని జేసి శాతవాహనసైన్య దళపతియు, సైనికులును రెండు దినములలో ఇంద్రకీలపర్వతము జేరినారు. ఇచ్చట కృష్ణానది ఇంద్రకీలపర్వత పంక్తి ఛేదించి, సింహమధ్యమయై, వేగవతియై సముద్రతీర భూములైన నాగవిషయమున ప్రవహించి, ప్రాచీనాంధ్ర ప్రభువగు సుచంద్రుడు, అవతారమూర్తియగు ఆంధ్రవిష్ణువు పరిపాలించిన శ్రీకాకులపురమును పవిత్రముచేయుచు, మూడుగోరుతముల దూరమున సముద్రమున జేరును. (ఇప్పుడు కృష్ణానది శ్రీకాకులపురమునుండి పదిమైళ్ళు తూర్పుగా నదిబంధ్రుచే వెనకకు జరిగినది.)

చంద్రస్వామి ప్రయాణము చేయుచు గ్రామగ్రామమున జరుగు చక్రవర్తి జన్మదినోత్సవములు చూచుచుండినాడు. ప్రజలందరు మేకల వంటివారు. వారీనాడొక మార్గము మంచిదందురు. రేపు వేరొక పథము శుభమందురు. ఎల్లుండి మరియొక్క టందురు. వారికి నిలకడ ఎక్కడ? ఈ రోజున వెర్రిభక్తితో నాగదేవులను కొల్తురు. గ్రామ దేవతలకు నరపశువునుగూడ బలియిచ్చుటకు సిద్ధమగుదురు. రేపు బౌద్ధసన్యాసి యొక్కడు వచ్చి అహింస బోధించగనే, మాంసాహారమునైన మానుదురు. కాషాయాంబరముల ధరింతురు. నగల నూడ్చివైతురు. రెండు మూడునూరుల సంవత్సరములలో ఈ పవిత్ర భూమి యంతయు నీ చార్వాకమత మల్లుకొనిపోయినదే. యాగములు పనికిరావట, చైత్యములకు పూజలట.

మనుష్యుడు దేహము వదలిన వెనుక నేమున్నది? ఖననమై భౌతి కేంద్రియము లన్నియు పంచభూతముల లీనమైపోవలెగదా! ఉపనిషన్మత విరోధముగ బోధించి దేహము మాయయని చెప్పుచు, నా దేహమున ఎముకయు, వెండ్రుకయు, దంతము, నఖముకూడా పూజనొందవలయునని శాసించిన యాతడు అర్హతుడట, బుద్ధుడట. చితిపై గట్టబడిన కట్టడము చైత్యమట, అద్దానికి పూజలట, అది త్రిరత్నముల నొకటియట!

అని యూహించుకొనుచు చంద్రస్వామి కృష్ణానదిలో ప్రాతఃకాలముననే గ్రుంకులిడి ఉదయ సంధ్యార్చన మొనర్చి, సూర్యున కర్ఘ్యమిడి పురసత్రమున వంటయొనర్చుకొని, భుజించి మరల శిబిక నారోహించి బయలుదేరెను. సాయంకాలమగునప్పటికి వారందరు ధాన్యకటక నగరము జేరిరి.

దళవాయి కోట ఈవలనున్న ఉప సైన్యాధ్యక్షుల భవనమునకు గొనిపోయి ఆజ్ఞలనంది చంద్రస్వామిని తోటలోనికి గొనిపోయి ద్వితీయ ముహూర్తపు భేరీలు మ్రోగకముందే రాజపురోహితాశ్రమమున ప్రవేశపెట్టెను. ఆ మరునాడు కోటలో ప్రాడ్వివాకసభా భవనమున చంద్రస్వామి విచారణము ప్రారంభించిరి. చంద్రస్వామికి అన్ని సౌఖ్యములు రాజపురోహితు లొసగిరి. ఉదయాస్తమయముల గాయత్రి జపించుకొనువాడు. తపస్సు చేసికొనువాడు. భగవన్నామ స్మరణానందప్రేంఖణమగు గానపరవశత్వ మందువాడు. చంద్రస్వామి భక్తుడు. భక్తులకు భయము, ప్రఫుల్లపద్మసూనంబులకు దుర్గంధము, పండువెన్నెలలకు వేడిమి యెచ్చట?

పూర్వకాలమునందు న్యాయవిచారణ నేటికన్న వేయిమడుంగులుత్తమముగ నుండెడిది. దేశమునకంతకు మహారాజసభ ప్రధాన న్యాయస్థానము. దాని వెనుక ప్రాడ్వివాకులసభ స్థానీయ, ద్రోణముఖ, ఖార్వతిక, సంగ్రహణ యనునవి పోనుపోను చిన్నవి. ఎనిమిది వందల గ్రామములకు ద్రోణముఖమును, రెండువందల గ్రామములకు ఖార్వతికము, సంగ్రహణము పది గ్రామములకు న్యాయస్థానములు. ఈ సభలు రెండు విధములు: ధర్మస్థీయము, కంటకశోధము అనునవి. ధర్మస్థీయము వ్యావహారిక ధర్మమునే విచారించును. కంటకశోధసభ వర్తకము, వృత్తి, రాజకీయము మొదలగు విషయముల ధర్మనిర్ణయ మొనర్చును. ప్రాడ్వివాకునిసభ ధర్మస్థీయ కంటక శోధ విషయముల రెంటిని విచారించును. ఆ పైన రాజే సభాపూర్ణుడై స్వయముగా న్యాయ విచారణ చేయును.

నేడు చంద్రస్వామిని కోటలోనున్న ప్రాడ్వివాకుని సభకు గొని వచ్చిరి. రాజభటు లిరువు రాతని తీసికొనివచ్చిరి. ప్రాతఃకాలోచిత కృత్యములు దీర్చికొని పిమ్మట ఉదయము రెండవ మూహూర్తఘటిక మ్రోగు నప్పటికి సభావ్యవహారము ప్రారంభింతురు. సభయందు ప్రాడ్వివాకు డొక ఉన్నతాసనముపై నధివసించియుండెను. ధర్మశాస్త్ర పండితులగు సభ్యులు ముప్వు రితరాసనములపై వేరొకయెడ వసించియుండిరి. ఒక వేదికపై నలువురు బౌద్ధభిక్షువు లొక మృదులమగు ఖర్జూరపుచాపపై నధివసించి యుండిరి. సంధ్యాపాలుడు, లేఖకుడు, గణకుడు (లెక్కలవ్రాయువాడు) వారి వారి యథాస్థానముల నుండిరి. ఏ న్యాయ సభయందును నొక్కపురుషుడు ధర్మనిర్ణయము చేయుట పూర్వకాలము నందెప్పుడును లేదు. వారుకాక నేర మెచ్చటనుండి వచ్చినదో అచ్చోటునుండి ధర్మ సహాయులు కొందరు వచ్చెడివారు. వారుగాక, ఏవిషయమున అనుమానము తటస్థించినను తమ అభిప్రాయములనిచ్చి సందేహము తీర్చుటకు ధర్మశాస్త్ర పారీణులగు భిక్షులు, బ్రాహ్మణులు కొందరు సభయం దుందురు. మహారాజే స్వయముగా విచారించినప్పుడైన నను వీరందరు నుండవలసినవారే.

ఎవరి పైనైనను నేరము మోపబడినపుడు ప్రాడ్వివాకానుజ్ఞాతుడై సంధ్యాపాలుడు రాజముద్రాంకితమగు "ఆ సేధ్యము" (పిలుపు) పంపును. ఆ పైన వారు వచ్చి తీరవలయును. బాలబాలికలు, ముదుసలులు మొదలగువారు మాత్రము రానక్కరలేదు. చంద్రస్వామిని రాజభటులు కొనిరా, పండితుడును యువకుడునగు నా ద్విజోత్తముని నొక చిత్రాసనమున కూర్చుండుమని ప్రాడ్వివాకుడు కోరెను. ఉత్తమకులసంజాతుడును, ధర్మశాస్త్ర పారీణుడును, సత్యవాదియు నగువాడే ప్రాడ్వివాకుడుగా నుండనరుడు.

## ౧౪
## నిర్దోషి

గణకుడు వచ్చి చంద్రస్వామి నవలోకించి "ఆర్యా! మహామంత్రి శ్వేత్రులవారు మీరు మహారాజుపై కుట్రలు సలుపుచున్నట్లుగా నేరము మోపినారు. దాని నిప్పుడుఋజువు చేయబోవుచున్నారు. తాము మీకోరిన ఋజుపత్రముల నావల కొనిరావచ్చును. నేరారోపణకానిచో అనగా మీపై నేరము ఋజువు కానిచో, తమ్ము క్షమింపుమని ప్రార్థింపుచు సభవారు మిమ్ము బంధవిముక్తుల గావించెదరు" అని వాక్రుచ్చెను.

తోడనే చంద్రస్వామి లేచి ప్రాడ్వివాకునిదిక్కు మొగంబై యిట్లనియె: "ఆర్యోత్తమా! ధర్మశాస్త్రములు నేరవిచారణ త్వరితముగ నొనరింపవలయు ననియు, లేనిచో సత్యము మరుగుపడిపోయి అన్యాయముగ నొకనికి శిక్ష కలుగుననియు ఉద్ఘోషించుచున్నవి. సత్పురుషుడును, మహాయోగియగు మీ తథాగతు డట్లు బోధించెను. పిఠకములట్లు సెలవిచ్చెను. ఆర్యధర్మము లట్లుపన్యసించినవి."

“ఓ బ్రాహ్మణోత్తమా! ధర్మశాస్త్రములట్లు ఘోషించుట నిజమే. కాని కాలమానస్థితులు నీ బంధనకు కారణములైనవి. అనవసరముగ న్యాయ నిర్ణయము చేయుట కాలసించిన మహాపాపమని శాస్త్రములు పలికినవి. ధర్మము దోషజుష్టము గాకుండ నీ పెద్దలందరును జూడగలరు. మహారాజెట్టి ధర్మ తత్పరుడో నీవు యెరుంగుదువు. బౌద్ధధర్మములైన నేమి, వేద మత సంప్రదాయములేమి అధర్మము చేయవలదని శాసించుచున్నవి. ఇచ్చట మతధర్మ విచారణ చేయ వీలులేదు. పవిత్రములు, భగవత్పూజాపరములు, నిర్వాణ సముపార్జన కారణంబులగు సమంతభద్రోపదేశములేమి, పురాతనములు, దైవస్వరూపములగు వేద మంత్రములేమి అవ్వాని విచారణ ఈసభది గాదు. మహారాజన్ని మతములయెడ సమానాదరణ కలవాడు. కాని యీ సభ వ్యావహారికసంబంధమైనది. జ్ఞానివి, విద్యా పారంగతుడవగు నీకు మే మేమియు చెప్పనవసరములేదు. విచారణ ప్రారంభించు చున్నాను” అని ప్రాడ్వివాకుడు చెప్పెను.

అంత గణకుడు నల్లచేవకర్ర పీటపై నుంచిన కొన్ని తాళపత్రములు, ఒక భూర్జపత్రము, రెండు మొగలిరేకులు గొనివచ్చి ప్రాడ్వివాకునికడ పీఠిక పై నుంచెను. “ప్రమాణములందు లిఖితసాక్ష్యమును, తరువాతి ఘటాగ్న్యుదక విషకోశ దైవికములు ముఖ్యమైనవి, ఉత్తమమైనవి. ఈ పత్రములు, చంద్రస్వామి వ్రాసిన లేఖలు, అతనికి వచ్చిన లేఖలును అని చెప్పి సభాధ్యక్షుడగు నా ప్రాడ్వివాకునకు ఒక్కొక్క లేఖయు వినిపింప నక్కడనున్న సభ్యులలో నొక్కరిని గోరెను. ఆ లేఖాపత్రముల నెవరు సముపార్జించిరో, ఏరు తెచ్చిరో తెలియదు.

“ఓ పితామహసమాన! మేరునిశ్చల! బుద్ధసన్యాసి చేసిన పాషండ బోధలు ప్రజల ముక్తిదూరుల చేసినను, మన ప్రయత్నములచే వారు దైవ భక్తులగుచున్నారు. గ్రామములు బౌద్ధమతమునుగొని దేవపూజల మట్టు పరచినని. వేదగానములు లేవు. పురాణ శ్రవణములు లేవు. హరిభజనలు లేవు. మహేశ్వరార్చనలు కానరావు. మన దేవులందరును సర్వవిశ్వరూపుడైన భగవంతుడును ఈ పాషండుని సేవకులట. మన్మథుడు మారపిశాచియై యా “దివ్యమూర్తిని భ్రమ పెట్టబోయి యోడిపోయెనట. అట్టిది నేడు మరల వేదగానములు, భగవద్గ్రంథపారాయణము వినుచున్నాము. కొన్ని యజ్ఞముల జరిపించినాము. ఇంతకును మన చక్రవర్తి బౌద్ధుడు. ఆతనికి వేద మతసంప్రదాయము బోధింపకున్నచో నేమియు లాభములేదు. ఆతనికి పాషండమత బుద్ధి నశించి, దైవభక్తి కలుగునట్లు ప్రయత్నము చేయవలయును.”

ఇట్టి లేఖలు నాలుగయిదింటిని సభ్యుడొక్కడు చదివెను. ఇంకొక లేఖలో చివర “ఆంధ్రమున బౌద్ధరాజ్యము నశించి వేదరాజ్యము ప్రబలమగు గావుత” యని యుండెను. అనేక సాక్షులను విచారించిరి. “చంద్రస్వామి వేదదేవతలను పూజించును. మహేశ్వరుడు ఆతనికి అధిదేవుడు” “గ్రామములో జరుగు నుత్సవముల కీతడు రాడు. పంచాయతీ సభ్యుల నెన్నుకొను సందర్భమున చంద్రస్వామి ఏ విధమగు నుత్సాహమును గనబరచలేదు.” “ఆతని ఇంటికి ఇతరదేశస్థులు కొత్తపురుషులు రాసాగిరి. అనేక రాజద్రోహసభ లాతని ఇంటిముందు జరుగుచున్నవని మాకు తెలియవచ్చినది.” “నేను చంద్రస్వామిచే బ్రాహ్మణమత దీక్ష గైకొంటిని.” “నాకు లేఖలిచ్చి వివిధ గ్రామములకు పంపుతారు” అని పలువురు సాక్ష్య మిచ్చిరి. “ఒకనాడు వేంగీపురమున సంచరణుని యింట నిట్టి సభ జరిగెను. నేను చంద్రస్వామితోకూడ అక్కడకు పోతిని. నన్ను వారు సభలోనికి రానీయలేదు. కాని యొక్కసారి పరధ్యానముతో నున్న నాకు మంజుశ్రీయను మాట వినబడినది” - అని చంద్రస్వామికి కొంతకాలము క్రిందట సేవకుడిగా నున్న యొకడు సాక్ష్యమిచ్చెను.

"అయ్యా! నేను మహేశ్వరానందుని సేవకుడను. శ్రీరాజకుమార మంజుశ్రీని తస్కరించుకొని పోయినవారలలో నొకడు మహేశ్వరానందుడు. ఆతడు చంద్రస్వామి, సంచరణుడు, సోమత్తరస్వామి మొదలగు వారలతో గూడియుండుట చూచితిని. అతడు శ్రీ రాజకుమార మంజుశ్రీని ఎత్తుకొని పోయెనని నాకెట్లు తెలిసెనన ఒకనాడు, అనగా ఇప్పటికి సుమారు పదునాలుగు నెలలవెనుక, అతడును ఒంకొకడును "మంజుశ్రీని మేము హుటాహుటిగా కొనిపోయినాము. అంచెల యేర్పాటు విచిత్రముగా చేసినారు మనవాళ్ళు" అన్న మాటలు నాకు వినబడినవి. అటు తరువాత వారు సన్ననియెలుగుతో మాట్లాడినారు గాన వినబడలేదు" అని యింకొకడు తెలిపెను.

పిమ్మట చంద్రసామి యీ విధముగా సభ్యులదిక్కు మొగంబై చెప్పెను. "న్యాయా న్యాయవిచక్షణులగు సభ్యులకు నేనేమియు చెప్పనక్కర లేకుండగనే నాయందు దోషయేమియు లేదని తెలియును. నా అంతరాత్మయందు ఆద్యంతరహితమై, భగవత్స్వరూపమై వెలుగు వేదములే ప్రమాణములని నమ్మకము. ముక్కోటి దేవతలును ఏకబ్రహ్మ స్వరూపముకొన, ప్రజల దైవదూరులచేసి, మహాపాపము నెలకొల్పుచు, జంబూద్వీపమునే యమలోకమొనరించు నీ పాషండ బౌద్ధమతము నశియించి ధర్మ స్వరూపమగు వేదమతము పునరుద్ధరింపబడవలెనని నా యాశయము. ఇప్పటికిని నాకోర్కెయదియ. వారణాసీపురము, తక్షశిల, పూర్వశైలము ఉజ్జయిని మొదలగు ప్రసిద్ధదేశముల తిరిగితిని. మూడు వేదముల నభ్యసించితిని. ఉపనిషత్తులు, ఇతిహాసములు మొదలగు సమస్త మహా గ్రంథము లెరిగితి. బౌద్ధమత రహస్యములు గ్రహింప పీఠకములు, ధర్మ సూత్రములు మొదలగు గ్రంథరాజములు పాటలీపుత్రమున అభ్యసించితిని. కాని బౌద్ధ మతమున నాకు ద్వేషము మెండయినది. నా జన్మభూమి కేతెంచిన నాటగోలె నా దేశమున బౌద్ధమతము నాశనముచేసి వేదమతము పునరుద్ధరింప సంకల్పము దాల్చితిని. అందుకై అనేకులకు బోధచేసితిని. అనేకులు బౌద్ధులను, వారి దీక్ష మాన్పించితిని. ప్రాయశ్చిత్తములు చేయించితిని. కాని అన్ని దేశములకన్న ఆంధ్ర దేశమున బౌద్ధమతము లోతుగా వేళ్ళుబారియున్నది. నాగవంశములవారు, క్షత్రియులు ఈదీక్ష పుచ్చుకొనినారు. కాన ప్రాబల్యముగాంచిన ఈ చార్వాకమతమును పెల్లగింప నాయొక్కనిచే గాదు. అయినను నాబోటివారు అనేకులు నాతో చేరినారు. మా యుద్యమము విజయము గాంచ సిద్ధమైయుండెను. చక్రవర్తికి ముందు మత దీక్షయీయవలె, దానికై మా ప్రయత్నము, అంతియకాని మాకు సార్వభౌమునిపై కుట్రలేల? మహారాజుకు మతదీక్ష యెట్లీయ వలయునను కుట్రతప్ప ఇతరము నేనెరుగ.

"నేనున్న సభయందు శ్రీ రాజకుమార మంజుశ్రీమాట వినబడెనని ఆ సాక్షి తెలుపుచున్నాడు. ఎవరయ్యా శ్రీ రాజకుమార మంజుశ్రీని తస్కరించుకొని పోయినది?" అని యప్పుడు మేమనుకొంటిమి, అంతియ. ఇంకొక సాక్షి శ్రీ రాజకుమార మంజుశ్రీని ఎత్తుకొనిపోయెనని యనుచున్నప్పుడు తాను వింటిననియు, వానితో నాకు స్నేహమనియు చెప్పినాడు. అది నిజమనుకొండు. అతడు శ్రీ రాజకుమారుని ఎత్తుకొనిపోయినవాడని మాకు తెలియగలదా? నా లేఖలలోగాని, నా నడతయందుగాని స్పష్టముగా శ్రీ రాజకుమార మంజుశ్రీని ఎత్తుకొనిపోయితినన్న నిర్ధారణయేది? అప్రత్యక్షసాక్ష్యము పనికిరాదని ధర్మశాస్త్రము విధించియుండలేదా? దైవాంశమగు శాతవాహనవంశము వైదికమతము నుద్ధరించుచు చల్లగా మనుగాక" అని చంద్రస్వామి చెదరని కన్నులతో, నవ్వుగదురు ముఖముతో, గంభీరమగు అభినయముతో తన నిర్దోషిత్వము నుపన్యసించెను. ఇంకొక యామము విచారణ జరిగినది.

శిక్ష విధించుటకుముందు ఇరువురు భిక్షులు లేచి "ధర్మచక్ర మీ సభాస్థానమున విలసిల్లుగాక! భగవాన్ మహాశ్రమణకు డిందు ప్రత్యక్షమగుగాక!" అని ప్రాకృతమున

శ్లోకములు చదివిరి. ఇరువురు బ్రాహ్మణోత్తము లప్పుడు ముందుకువచ్చి "సభాసదుల హృదయమున సర్వవ్యాపియగు ఆదినారాయణుడు నిండియున్నాడు. కాన వారు ధర్మదేవతాస్వరూపు లగుదురుగాక" యని మంత్రములు చదివిరి.

ప్రాడ్వివాకుడు సభ్యుల యభిప్రాయ మడిగెను. అందరును ఈతడు నిర్దోషి యని నమ్మజాలమని చెప్పిరి. అప్పుడు మహాపండితుడును, సకల మత ధర్మసారము నెరిగినవాడును, సత్యాన్వేషియునగు నా ప్రాడ్వివాకుడు చంద్రస్వామి నుద్దేశించి "ఓ బ్రాహ్మణోత్తమా! నీవు దోషివికావని చెప్పలేము. కాన నీకు ఒక సంవత్సరము పాతాళ గృహవాసము విధించితిని. నేను తప్పభిప్రాయము పడిన ధర్మము నన్ను శిక్షించుగావుత" అనియాతడు లేచెను. సభవారందరు లేచి నిలుచుండిరి.

అంత తేజస్వియు, ధర్మదేవతాస్వరూపుడు నగు ఒక భిక్షుకు డా సభాభవనము ప్రవేశించెను. అందనేకు లాయనకు సాష్టాంగనమస్కార మాచరించిరి. ప్రాడ్వివాకుడు మోకరించి ఆయన పాదములబట్టి కన్నుల నద్దుకొనెను. అంత నాతడు ప్రేమవంతములై, శక్తిసంపన్నములై, తేజోవంతములగు తన దృక్కుల నా ప్రాడ్వివాకునిపై బరపి "నాయనా! ఈ కుమారుడు నిర్దోషి కాన యీతని విడిచివేయు" మని సెలవిచ్చెను. అంతవృద్ధుడగు నా ప్రాడ్వివాకుడు నా నూత్నపురుషునికడ మోకరించియే "తండ్రీ! నేను శిక్ష విధించిన వెనుక తగ్గించుటకు నా కధికారము లేదని తమకు తెలియదా?" యని ప్రశ్నించెను.

ఆ తపస్వి నవ్వి "ఓయి! వెర్రికుమారా! నాకుమాత్రము ధర్మశాస్త్రము తెలియదా? ఇదిగో సార్వభౌముని ఆజ్ఞాపత్రము" అని యొకతాటియాకు పత్రము తన కాషాయాంబరములనుండి తీసి యాతని కిచ్చెను. ప్రాడ్వివాకుడు దానిని కన్నుల నద్దికొని చూచి, లేచి, యిట్లు చదివెను. "ఏ దోషములేదని శోణనగ గ్రామకాపురస్తుడగు చంద్రస్వామిని మేము విడిచిపుచ్చుచున్నాము. ఇయ్యది ప్రాడ్వివాకునకు మా ముదల. స్వహస్తనామాంకిత శ్రీ కౌశికీపుత్రశ్రీముఖశాతవాహన మహాశ్రమణ శక 483 పరాభవసం.ర చైతు. సప్తమి" అని యున్నది. అప్పుడు చంద్రస్వామి ముందుకరుదెంచి ఆ భిక్షుకునకు సాష్టాంగ నమస్కార మొనర్చెను. అతని కన్నులలో నీరు సుడిగుండములై దొన దొన జారినవి.

## ౧౫

## శృంగార విభావము

కామవిజయ నాట్యము, కామవిజయనాట్యమే అయినది. సువర్ణశ్రీ ప్రప్రథమమున హిమబిందును ఆ నాట్యమునందు చూచినాడు.

ఎవరీ బాలిక? ఎంత అద్భుతసుందరి! ఈ బాలిక స్వప్నమూర్తియా? నిజమా? ఏ మహాశిల్పి మలచినా డీ విగ్రహమును! ఏ చిత్రకారు డీ రూపరేఖలు దిద్దినాడో?

ఆ ఆలోచన లాతనికి కొంత వ్రీడాభావ మంకురింపజేసినవి. ఆ బాలికను చూడలేడు, చూడక ఉండలేడు. అతనికి తక్కిన ప్రపంచమంతయు మాయమైనది. తనచుట్టును ఆ బాలికలు నృత్యముచేయుచు, పాడుచు, అభినయించుచుండిరి. కాని ఆతని కా ఒక్క బాలికయే నాట్యమాడుచున్నట్లున్నది! ఆమె మనోహర కాదంబినీమాలికవలె క్షణక్షణము సుందరాతి సుందరరూపముల మారుచున్నది. ఆమె పాల్కడలి వాగులవలె భంగికా మనోహర యగుచున్నది. ఆమె వివిధకరణ నిమగ్నయై కుసుమమున మంద మలయానిలయమైనది. ఉధితస్వర రాగకంఠియై ఆ బాల శారదా కరచామీకర

విపంచియైనది. ఆమె భుజరేఖలు సువ్వున జారి అంగుళీ రేఖలో వికస్వరమైనవి. బాహుమూల పార్శ్వ శోభారేఖలు వక్షోపరిసమున్నత సుందరాకృతులు తాల్చి, వక్రపతనా వేగమున డిగ్గనురికి మధ్యదేశమున నించుక కాలూని, మలుపులై నితంబచక్రముల సుళ్ళుతిరిగి ప్రవహించి, ప్రవహించి పదరేఖలు మొగ్గలు దొడిగినవి.

ఇది సౌందర్యమా, సౌందర్యమూలకారణమా? ఆతని హృదయ వేగమునకు శ్రుతియైనది హిమబిందు బాలికాచరణసువర్ణమంజీరవేగము. రెండు వేగములు? మహారభటితవృత్తులై లయించినవి.

మహావైభవమున భద్రదంతావళమున సర్వమంగళవాద్యములుమ్రోయ ప్రజానీక సేవితుడై ఊరేగి, ఇంటికి చేరినాడు సువర్ణశ్రీకుమారుడు. కాని సుందరాతిసుందరమూర్తి ఆ బాలికయే ఆతని సమ్ముఖమున ప్రత్యక్షము.

తెల్లవారునప్పటికి ఇంటికి చేరిన సువర్ణశ్రీకుమారునికి శక్తిమతీ దేవియు, నాగబంధునికా సిద్ధార్థినికలు, మహాలియు, పుణ్యాంగనలు, బంధు స్త్రీలు హారతులిచ్చి, దృష్టితీసి, లోనికి తీసికొనిపోయిరి. సువర్ణశ్రీ తలిదండ్రులకు, బంధుగులకు పాదాభివందన మాచరించెను. రెండు దినములు గడచినవి. ఆతని పరధ్యానము తల్లిదండ్రులనే యాశ్చర్య పూరితుల చేసినది.

ఎప్పుడును శిల్పగృహమునందో లేక వ్యాయామప్రదేశములందో కాలము గడపువానికి బండిపందెముల గెలుపుచే నిప్పుడీ పరధ్యానమేమి అని ధర్మనంది యనుకొనెను. ధర్మనంది భార్యనుజేరి, “అబ్బాయి అట్లున్నాడేమి? కారణమేమో నీకు తెలిసినదా?” యని పలుకరించెను. శక్తిమతీ దేవి భర్తను కనుంగొని “నాకునూ ఆశ్చర్యము కలిగించుచున్నది. ఏమయియుండును? భోజనము తిన్నగా చేయుటలేదు. ఏవియో రెండు మెతుకులు నోటవేసికొని ఎక్కడెక్కడనో తిరుగుచుండును” అని ప్రత్యుత్తర మిచ్చినది.ధర్మ: ఇప్పుడు చిరంజీవికి మానసపథమున మహోత్కృష్టమగు మార్పు జరుగుచున్నదని నా తలంపు. పందెములకు బోయి నెగ్గివచ్చినాడు. బాహుబల గర్వమొందుట కంతకన్న ఏమికావలయును? దేహబలమునకు, ఆయుధవ్యాపారమునకు దగ్గరిబంధుత్వము. యుద్ధములో కీర్తిగొనుట సురాపానము నట్టిది. ఆనా డనేక బిరుదావళులు ధరించిన మేటి మగలగు శూరుల చూచినాడు. తానును జయశీలుడైనాడు. ఆ సమయము నందు వారివలె యుద్ధమున పేరుమోసి మహాసైన్యాధ్యక్షులలో నొకడేల కాకూడదు? ఈ ఆలోచన లోకపాయయై ప్రవహింప వీనికన్నిటి కతీతమై పవిత్రమై, బుద్ధదేవునకు ప్రియమై వెలుగునది, అర్హతమార్గములలో నొకటి యైనది, తానుచేయు శిల్పపుపని. ఈ రెంటికిని ఇప్పుడు సమరము జరుగుచున్నది. అబ్బాయిని మారదేవుడు పరీక్షించుచున్నాడు. ధర్మనంది ఇట్లు మాట్లాడుచు నిమీలితలోచనుడై ఒక లిప్తకాలముసర్వము మరచిపోయెను.

శక్తి: తామిట్టి సమయమం దూరకుండుట న్యాయమా?

ధర్మ: (కన్నులు తరచి) వెఱ్ఱిదానా! ఎవరియుద్ధమున వారు జయమందవలయును. “తేజోమూర్తి” కెవ్వరు సహాయము చేసినారు? చైత్యముపై నేను రచించిన మారుని కథాశిల్పము చూడలేదా? అబ్బాయికి రెండు మార్గము లిప్పుడు గోచరమైనవి. ఒకటి ప్రాపంచికము: పూలవాసనలు, సెలయేటి గానములు, నీలగిరి రూపసౌందర్యములు, కాంతామనోహరవాక్యములు, సువర్ణముల తళుకులు, నాట్యముల ధిమికిటలు, నవ్వులు హాస్యములు సుడిగాలి రీతి, సుడిగుండములవలె మనస్సును భ్రమింపజేయును. ఇంకొకటి: నిమీలిత నేత్రములు, ఆరాధనలు, ఉపవాసములు, దానములు, యాత్రలు, భిక్షులతోడి

సాంగత్యము, ఇది చిత్తసమాధిగూర్చును. బిడ్డ డీ రెంటిలో దేనిని వరించునో?

శక్తి: ఎవరైన చేయూత నీయకపోయిన. అబ్బాయి పని యేమగును?

ధర్మ: ఎవరికర్మకు వారే కర్తలు. నీవు చదువుకున్నదానవు. ఈ మాత్రము తెలియదా? దశకుశలములు, అష్టమార్గములు మానవుడాచరించునపుడు, అరిషడ్వర్గముల జయించుటకు సమర్థుడు కానిచో ఏరును సహాయము చేయజాలరు. కాముడు, మోహుడు మనుష్యు నవలీలగ తమబానిస జేసికొందురు. చిరంజీవి యీ యుద్ధమున పందెములలో వలె విజయముగాంచెనా మన కులము తరించును. లేదా....

శక్తి: మన మిందు చేయదగినది లేదందురా?

ధర్మ: భగవంతుని ప్రార్థించుటయే! ఆ "విజ్ఞానస్వరూపుడు" బోధిసత్వుడు భక్తుల సంరక్షింపలేడా!

నాగ: అమ్మా! మేము మాట్లాడుటకు బోయినప్పుడు మాతోడను యథాప్రకారము పలుకలేదు. పరధ్యానము! నాల్గయిదుసారులు ఎదియోచిత్రము లిఖించబోయినాడు. అది తాననుకొన్నట్లు లేదనియో ఏమో చెరిపి వేసి ఫలక మొకమూల పారవేసినాడు.

సిద్ధార్థినిక: అమ్మా! ఒక్కబొమ్మలు వేయుటే కాదు. విగ్రహము కూడా చెక్కుట ప్రారంభించినాడు. ఒక బాలికరూపమే! కాని తృప్తి గూర్పకకాబోలు, ఆ విగ్రహమును విసుగుదలతో వేయిముక్కలు చేసినాడు.

ఇంతలో మహాలి తన చీరకుచ్చుల మడతలలో ఒక విగ్రహశిరస్సు గొనివచ్చి శక్తిమతీదేవికిచ్చి చిరునవ్వు నవ్వెను. నాగబంధునిక యా శకలవను తేరిపారజూచి "అమ్మా యీ ముఖము ఎవరిదో నేను చూచినట్లున్నది! ఎవరు చెప్పుమా?" యని తలపోయ జొచ్చెను. అప్పుడు తొమ్మిదేండ్ల బాలికయగు సిద్ధార్థినిక ఒక్క గంతువేసి చప్పట్లు "ఆఁ నాకు తెలిసినది! మీరు చెప్పుకొనండి!" అని కిలకిల నవ్వెను.

శక్తిమతీదేవి యా రాతితలను తదేకదృష్టితో తిలకించి "యీముఖము నా బాల్యస్నేహితురాలగు ప్రజాపతిమిత్ర మోమువలె నున్నది" యనెను. అప్పుడు మహాలి "ఆఁ తెలిసినదమ్మా తెలిసినది. చారుగుప్త కోటీశ్వరునితనయ, ప్రజాపతిమిత్ర కొమరిత, హిమబిందుకుమారిక మోము. మొన్న ఉత్సవమునాడు అబ్బాయికి బహుమాన మిచ్చినప్పుడు నాట్యమాడిన బాలలలో హిమబిందు కుమారిక యొక్కతె" అని సాభిప్రాయముగ నవ్వుచు నామె యేమియో చెప్పబోవుచుండ, సిద్ధార్థినిక మోము చిన్నబుచ్చుకొని కన్నుల నీరు తిరగ "నన్ను చెప్పనీయక మీరందరు చెప్పుకొనుచున్నారు. ఈ మహాలి మంచిది కాదు. మీ ఎవరి జత ఉండను" అని మూతిముడుచు కొని గబగబ పరుగిడి పోయెను.

ఆమె యట్లు శిల్పమందిరములున్న తోటలోనికిబోయి యొక కేళాకూళికడ పూలవృక్షములున్నచోట పండుకొని వెక్కివెక్కి ఏడువజొచ్చెను. ఇంతలో సువర్ణశ్రీకుమారు డామెను చూసి, చెల్లెలినెత్తి తనయొడి జేర్చు కొని, చెక్కిలి ముద్దుగొనుచు కంట నీరుతుడిచి బుజ్జగింపుచు "ఏవమ్మా చిట్టితల్లీ! ఏమిటి యీ ఏడుపు? అమ్మ కూకలువేసినదా? లేక అక్క కలత పెట్టినదా?" అని ప్రశ్నించెను. సిద్ధార్థినిక మరియు వెక్కి వెక్కి యేడువసాగెను. అన్నగారు పరిపరివిధముల బ్రతిమాలి ఎత్తుకొని తీసికొనిపోయి తాను తన చెల్లెలికై చెక్కిన యొక బాలకుని బొమ్మను, ముద్దులమూట గట్టుదానిని, కిలకిలనవ్వు మోముగలిగిన

ప్రతిమను ఆమెకిచ్చి "ఇదిగో నీ అబ్బాయి బొమ్మ ఆడుకో. ఏడవకు. అక్కకు, ఎవ్వారికీ ఈయకు" అని ఇచ్చెను. తోడనే కళ్ళనీళ్ళు తుడుచుకొనుచు ఆ బాల చిరునవ్వు నవ్వుచు "ఈ అబ్బాయిని అక్కయ్యాను, అమ్మను ఎత్తుకోనివ్వనులే. మహాలికి కొంచెమైనా చూపించను. నేనే నీళ్ళు పోసుకుంటాను, నగలు పెట్టుకొంటాను. మరే అన్నా! నీవు చెక్కిన బొమ్మ తలకాయ వాళ్ళమ్మాయి హిమబిందుదని నేను చెప్పబోతుంటే వాళ్ళే చెప్పుకొని నాకు కోపం తెప్పించినారు!" అని యా వెఱ్ఱి బాగుల శిశువు అన్నగారికి చెప్పెను. సువర్ణశ్రీకుమారు డామాట వినుచునే ఉలికిపడెను. చెల్లెలిని సాగనంపి అక్కడనున్న యొకరత్న కంబళిపై చతికిలబడి యదేవిధముగ నాలోచింపసాగెను. ఉజ్వల సువర్ణవర్ణుడగు నాతని కపోలము లెఱ్ఱబారెను.

# హృదయ కుసుమపరాగము

ఆ బాలిక హిమబిందు. ఎంత చక్కని పేరు! స్నిగ్ధ శ్వేతకాంతి భాసమాన హిమబిందువా ఆ బాల! ఆ తెలుపు ఎరుపులు ఔత్తరాహికములు. ఆమెలో గాంధార రక్తమున్నది. రోమక, యవన జాతులు ఆర్యరక్త సమ్మిశ్రితములై, మహోత్తమమూర్తి తాల్చినట్లున్నవి. ఎవ్వ రాబాలిక? ఏ రాజతనయ? ఏ నందనవనమున అవతరించినదో! ఎంత హొయలున్నది యామే కదలికలో! ఆమె అద్భుతనాట్యనిమగ్నయయ్యె తన్నంతతీక్షణముగ గమనించినదేల? సాకూతములగు ఆమెచూపుల కొన్నింట ఎన్నియో ప్రశ్నలున్నవి. ఆమె కన్నులు! ఏ శిల్పియైన వానిని విన్యసింపగలడా? ఆ కన్నులలో వేయితారకల కాంతులు, ఆమె కనురెప్పలలో పదివేల గగననీలాలు, ఆ బొమలలో వేయి యమునానదీ ప్రవాహధారలు, ఆమె అపాంగములలో లక్ష కల్లోల నర్తనములు, ఆమె భ్రూభంగిమలలో కోటి ఇంద్రధనువు లున్నవి. ఆమె కనీనికలలో మహాపద్మనీల పథము లున్నవి. ఆమె ఎవరు?

తన శిల్పమున నా బాలికమోమును వారెట్లు గ్రహించిరి? తనకు పోలిక లేనట్లే కనబడెనే! ఆమె రూపమును తన అల్పశక్తి కళగట్టింప గలదా? తన కళానైపుణ్యము మంట గలిసెనా? అయోఘనము తప్పి జారి చేతికి రెండుమూడుసార్లు దెబ్బలు తగిలినవి. టంకము చేతపట్టినప్పుడు చేయి వణికిపోయినది. తద్రూపభావనామాత్రమున తనలో నింతటి వివశత్వమునకు గారణమేమి? తన వారితో కూర్చుండి సల్లాపము లాడలేడు, తానొంటిగ నుండలేడు. వేసవిని మిట్ట మధ్యాహ్నమున గాలిలేని సమయమున నిద్రయు పట్టదు. మేల్కొని యేపనియు చేయజాలడు. తన మానస పథమందు గాలివాన లేవైన రాబోవు చున్నావా? నిశ్చల శీతలమందాకినీ తుషారము లెక్కడున్నవి? గంటలకొలది ఇటునటు తిరిగినను తన హృదయమునకు శాంతి కలుగదు. గ్రంథములు చదువుటకు మనస్సుపోదు. పెద్ద చెల్లెలి వీణాగాన మాలకించుచు ఆ స్వనముతో శ్రుతిగలిపి మనోహర గాన మొనరించు దైనందినమగు అలవాటు తనకు నేడు అసహ్యమయినది. ఆతని ఆలోచనలు వాయుద్వంద్వపాతములైపోయినవి.

ఇంతకు ఎవ్వరాబాలిక? చెల్లెలి నడుగ సిగ్గు. తనకు సిగ్గెందుకు? నాగబంధునిక ఏమయిన ననుకొనునా? ఏమనుకొనగలదు!

అతడు కృష్ణ ఒడ్డున కూర్చుండి, మధుమాసవిరహకృశయగు నాధునీ బాలిక నిట్టూర్పుల నాలించుచు, దూరపుకొండల గమనింపుచు, నదీ గర్భమందెల్ల నావరించి యున్న ఇసుకతిన్నెల చూపులేని చూపులతో చూచుచు హిమబిందునే తలపోయుచు కూరుచుండెను.

ఇంతలో నాగబంధునిక వచ్చి యన్నగారి కన్నులు మూసెను. సువర్ణశ్రీ “నాగా చేతులుతీయవే!” యని విసుగుకొనెను.

“అవును! హిమబిందువే లోకమైపోయిన అన్నగారికి చెల్లెలంటే విసుగుకాదా మఱి?”

“ఏమి మాటలవి నాగా! ఇంతటా చాలించు.”

“అదుగో! కోపంకూడా వస్తున్న దన్నాయికి. అంత ఉలుకయితే పోనీ మాటాడనులే.”

"అవేమిమాటలే! ఏదోవిసుగున అన్నానే తల్లీ! ఇంతలో కోపమా?"

"నాకు ఎంత కోపముగా ఉన్నదో తెలియునా? నా స్నేహితురాలు, చారుగుప్తులవారి కొమార్త, తల్లిలేని పిల్ల, ముక్తావళీదేవి మనుమరాలు ఆ హిమబిందునుగూర్చి ఇన్నాళ్ళకా మా అన్న తెలిసికొన బ్రయత్నించుట అని. మా అన్నను, ఆ హిమబిందు తలలోనిపూలతో కట్టవలెనని ఉన్నది"

"ముక్తావళీదేవికి అంత స్వచ్ఛదేహం ఉన్నది. ఆమె తెలుగుజాతి ఆడ బిడ్డయేనా చెల్లీ?"

"ముక్తావళీదేవి యవనవంశ జాత అన్నా! ఆమెపోలిక హిమబిందు. హిమబిందు తన అమ్మమ్మకన్న ఎక్కువ స్వచ్ఛమైన శరీరము, అద్భుతమైన అందమును కలది. ఆమె హృదయము మా అన్న దొంగిలించినట్లు నా అనుమానము ఎక్కువౌచున్నది, అట్లాంటి దొంగతనాలకు రాజసభలో దేశాంతరవాసము విధింపబడుచున్నది. దొంగ అన్నగారూ!"

"ఏమిటి నాగా! నీకు నిజముగా పిచ్చి ఎత్తినది. కులవైద్యులు, ప్రఖ్యాతులు, అపర ధన్వంతరులు, ఆనందులవారు నీకు మందు త్వరగా ప్రారంభించగలరు. సేవకుని పంపి వారిని త్వరగా రమ్మని వార్తనంపవలసి ఉన్నది."

"మా అన్నగారికే మతిభ్రమణము కలిగినది. ఉత్తమశిల్పి బ్రాహ్మణ వంశజాతుడైన మా అన్న యవనవంశజాతను ప్రేమించుటేమీ?"

"ఓ భగవానుడా! నేను ఎక్కడికైన పారిపోవలసి ఉన్నది!"

"ఓ మాయాదేవీ, ఈ దీనురాలి ఇక్కట్లు తొలగింపవా?"

"చెల్లీ! నీవును, హిమబిందును కలిసి చదువుకొన్నారా?"

"ఆమెయు, నేనును కలిసి చదువుకొన్నాము. ఆమె కోటీశుతనయ"

"ఆమెలో భారతజాతి సుగుణములు, యవనజాతి సుగుణములు మేలు కలయిక పొందినట్లున్నదే!"

"అన్నా! బాలికలలో సామ్రాజ్ఞిని నా అన్న వరించవలె! జయములలో అఖండ విజయము నందవలె. ఆ దినమున నీ చుట్టూ మేమందరమూ నాట్యము సలిపినప్పుడు, హిమబిందు నీవంక అట్లు తదేకదీక్షను చూపులు పరిపినదేమి? చారుగుప్తుని బండిని సమదర్శి శాతవాహన సేనాని తోలినారు.

ఆయన నీవల్ల ఓడిపోయినారు. అందుకని ఆమె కొంచెము కించపడినది కూడ సుమా!"

"ఆమె దేవలోకమునుండి దిగివచ్చిన ఇంద్రాణివలె లేదటే తల్లీ!"

"నీవు ఇంద్రునివలె లేవా ఏమి?"

"సరి! సరి! అదేమి మాటలే?"

ఇంతలో సిద్ధార్థినిక వారిరువురు కూరుచున్న నల్లరాతి బండకడకు పరుగునవచ్చి వగర్చుచు, నవ్వుచు, “అన్నా! వచ్చినది! వచ్చినది!” అని అరచెను.

సువర్ణ: ఎవరు తల్లీ?

సిద్ధార్థినిక: హిమబిందు! హిమబిందే!

నాగబంధునిక: హిమబిందా!హిమబిందు ఎందుకువచ్చునే వెఱ్ఱి తల్లీ!

సిద్ధా: నేను వెఱ్ఱితల్లిని, నీవు తెలివిగల తల్లివి, పోనీలెండి. నా మాట ఎవ్వరును ఎప్పుడును నమ్మరు.

సువర్ణశ్రీ చిన్నచెల్లెలిని దగ్గరకు తీసికొని, “ఓసి బంగారుతల్లీ, అక్క వెండితల్లికాదూ? వెఱ్ఱితల్లి! నీమాటే నిజము! నాగా! నీ కొరకే వచ్చి ఉంటుంది. వెంటనే పో!”

నాగబంధునిక చఱ్ఱున పరువిడినది.

సువర్ణ శ్రీ గుండియలు గతులు తప్పి నడచినవి. ఏమది, ఆ దివ్య బాలిక ఎందుకు వచ్చినది? ఆ దేవీమూర్తి తన ఇంటికే వచ్చినదా? తన ఇల్లు పవిత్రమైనదా? ఓహో ఆమె వచ్చునా? నిజమా!

“అన్నా! హిమబిందు, ఆమె అమ్మమ్మ ముక్తావళీదేవి వచ్చినారు. రాగానే, హిమబిందు అక్కను అడిగినది. నాయనగారి బొమ్మలన్నియు చూడ వచ్చినదట. నన్ను కొంచె మటు తీసికొనిపోయి, “మీ అన్నగారు బొమ్మలు చెక్కునా?” యని యడిగినది.” “అలాగునా చెల్లీ!”

“అవును, నీ చెక్కడాలు చూచునట అన్నా! నాతోనే చెప్పినది. రా; నీ మందిరానికి పోదము రా, అన్నా!”

సిద్ధార్థినిక అన్నను చేయిబట్టి లాగినది. అతనికి ఏదియో భయము, ఏదియో ఆశ, ఏదియో త్రప కలిగినవి.

“చెల్లీ! నీవు పో! నేను వచ్చెదనులే!”

“అన్నా నీవు త్వరగా రావాలి.”

సిద్ధార్థినిక వెడలిపోవగనె, రేఖారహితమైన యాలోచనలు, మూర్తిరహితమగు స్వప్నములు అతని హృదయమున జన్మించుచున్నవి, మాయమగుచున్నవి.

ఆతడు వేయలేని బొమ్మలు, పాడలేని గీతాలు దూరాకాశనీలపథాలలో మేఘములై మందమందగతి పోయి మాయమైనవి.

## ౧౭
## హిమబిందుకుమారి

సమదర్శిశాతవాహనుడు మహారాజువంశమువాడు. సమదర్శితండ్రి ప్రియదర్శి శాతవాహనుడు. ఆతడు శ్రీముఖశాతవాహనుని తండ్రియగు అభయ భాహుశాతవాహనుని

పినతండ్రి మనుమడు.

శాతవాహనులు ప్రాచీనకాలమందుననే ఆంధ్రదేశానికి ఉత్తరము నుండి ప్రయాణమై వచ్చిన బ్రాహ్మణులు. భారతయుద్ధమైన వెనుక, దేశమున అనార్య జాతులవారైన నాగులు, రాక్షసులు, యక్షులు, కిన్నరులు, కింపురుషులు, వానరులు, పిశాచులు, గుహ్యకులు మొదలగువారు విజృంభించి రాజ్యము లెన్నియో యాక్రమించు కొనిరి. ఆ దినములలో ఆర్య సంప్రదాయములపై అసహ్యత జనించి, సాంఘిక దురాచారాలను ఖండించి, సంఘసాంప్రదాయములందు ఎందరో మార్పులు తెచ్చినారు. అట్టి వారిలో విశ్వామిత్ర సంతతివారయిన ఆంధ్ర బ్రాహ్మణులను చంద్రవంశ క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు మొదలగువా రుండిరి. వారందరు శైవపూజాధురంధరులు.

ఇట్లు కొన్ని సంవత్సరములు గడిచిన వెనుక పరీక్షిన్మహారాజు రాజయ్యెను. ఈయన పూర్వసంప్రదాయగాఢాభిమాని. పరీక్షిత్తు చండవిక్రముడై విజృంభించి అనార్యోద్యమ భూయిష్ఠములగు రాజ్యముల నాశము చేసి, వైదికాచారము పునరుద్ధరించి అనేకాశ్రమములలో యజ్ఞయాగాది క్రతువుల నొనరింపజేసి, తా నొనరించి నాగాదిజాతుల పొగరణచి వైచెను.

ఆతని దాడుల భరింపలేక ఆంధ్రులు కళింగదేశము వలసవచ్చిరి. ఆర్య జాతులవారైనను వారు అనార్యవాదులైనందున పరీక్షిత్తు వారిపై దండయాత్ర సలిపి, ఓడించి, దేశమునుండి తరిమివేసెను.

తూర్పు సముద్రతీరమున నదివరకే సింధునదీ ప్రాంతమునుండి రామాయణ కాలమునకు ముందుగనే వలసవచ్చియున్నవారు అసురులు. రాజ్యములు, ఆశ్రమములు స్థాపించి, ఆ తూర్పు తీరాననే పట్టణములు నిర్మించుకొని నాగరికత వృద్ధి చేసికొని యుండిరి.అసురులు హిమవన్నగ ప్రాంతీయులైన ప్రథమార్యులు. వారు హిమ వన్నగజములైన సింధు గంగా యమునా నదితీరముల మహానగరములు నిర్మించుకొని అచ్చటనున్న పచ్చిపొలసుదిండ్లను, నరమాంసభక్షకులను దక్షిణ దేశములకు దరిమి, యాప్రదేశములను లక్ష్మీపదముల గావించిరి.

ఆ అసురులకు తర్వాత హిమశైలీయులైన ఆర్యులు దక్షిణమునకు వలస వచ్చి, అచ్చట ఇదివరకే రాజ్యములు స్థాపించియున్న అసురులతో ఘోర యుద్ధములుచేసి, వారిని సింధునదీతీరమునుండి తరిమివేసిరి. అసురు లక్కడనుండి కదలి మెసపొటేమియా, ఈజిప్టులకు, భరతఖండ ప్రాక్పశ్చిమ దక్షిణ తీరములకు సముద్రయానము చేయుచునో, తీరములవెంట ప్రయాణము చేయుచునో వచ్చి వలసలుపోయి రాజ్యము లేర్పరచుకొనిరి.

పరీక్షిత్తు కాలమున తూర్పుతీరములకు వచ్చిన ఆంధ్రార్యులు అదివరకే పూర్వ సముద్రతీరమున వాసముచేయు అసురార్యులతో యుద్ధములు సలిపి, అసురరాజుల నిర్జించి తామురాజులైరి. ఆ కాలముననే ఆంధ్రవిష్ణువు గాథ జన్మించినది.

ఆంధ్రవిష్ణువు వంశమువారే ఆంధ్ర శాతవాహనులు. ఈ గాథయే బృహత్కథయందు వర్ణితమైనది.

ఆ శాతవాహనవంశమందు ప్రియదర్శి తన పెదతండ్రికొమరుడును చక్రవర్తియు నగు అభయబాహునకు దక్షిణబాహువై, చండవిక్రముడై, మహాసేనాధిపతియై ఆంధ్ర రాజ్యము పడమటి తీరమునుండి ఉత్తరమున ఘూర్జరమువరకు గొనిపోయెను. మాళవము జయించి ఆంధ్రరాజ్యములోజేర్చెను. అభయ బాహువు ప్రతిష్ఠానమున ప్రియదర్శి శాతవాహనునే

తనకు బ్రతినిధిగ నుంచెను.

ఆ దినములలో కోటీశ్వరుడగు వినయగుప్తుడు అభయబాహు సార్వభౌమునకు వామహస్తమై, తన వైభవమంతయు చక్రవర్తికి దాసిని జేసెను. ఆతడు ప్రియదర్శి శాతవాహనుని ఎక్కువగా ప్రేమించి ఆతని జైత్రయాత్రలలో సర్వవిధముల బాసటగా నుండెను. ప్రియదర్శిని ప్రేమించుటతో తృప్తిపడక తన కౌమార్త అమృతలత నా వీరపుంగవునకు కన్యాదాన మొసంగెను.

సమదర్శిశాతవాహనుడు ప్రియదర్శికి ఏకపుత్రుడు. అమృతలతాదేవి కుమారుని యందు గాఢప్రేమతో, మాళవయుద్ధమందు వీరస్వర్గమందిన ప్రాణేశుడగు ప్రియదర్శిని తలంచుకొని ఆంధ్రసైన్యమునందు చేర సుతుడనుజ్ఞ వేడినప్పుడు సమ్మతినొసంగ నిరాకరించినది.

సమదర్శికి పదునేడవ ఏడు వచ్చినది. ఆయేటి మహాలయపక్షములలో అన్నగారి భవనమునకు కుమారునితో బోయిన అమృతలతాదేవికి స్వప్నమందు ప్రియదర్శి ప్రత్యక్షమై, "ఆత్మేశ్వరీ! నా పేరునకు, నాజాతికి, శాతవాహనవంశానికి అపఖ్యాతి తెచ్చుచున్నావా? ఇది నీకు ధర్మమా?" అని ప్రశ్నించుచు విచారవదనమున కనబడినాడట.

అంతియ. అమృతలతాదేవి ఆ మరుక్షణమునుండి సంపూర్ణముగ మారిపోయి, కుమారునికి సైన్యమునజేర ననుమతి యొసంగుటయేగాక, స్వయముగా శ్రీముఖచక్రవర్తి కడకుబోయి సమదర్శిని వేయికన్నుల గాపాడవలసినదనియు, నాతనికి సైన్యమున ముఖ్యోద్యోగములనిచ్చి యా బాలుని తండ్రియంత వాని జేయవలయుననియు బ్రార్థించెనట. సమదర్శి మరునాడు దళపతిగా ఆంధ్ర సైన్యములలో జేరినాడు. ఒక సంవత్సరములో నాతడు ముఖపతియు, గణపతియు, వాహినీపతియు నైనాడు. మరు సంవత్సర మాతడు చమూపతియైనాడు. మొదటినుండియు ననేక యుద్ధముల వీరవిక్రముడై యాంధ్ర సైన్యములకు యశము సముపార్జించుచు నేడు విఖ్యాతినందిన ఉపసేనాపతులలో నొకడైనాడు. ఆతడు తా నెప్పుడు సేనాపతియగుదునా, ఉపసైన్యాధ్యక్షుడ నగుదునా, సర్వసైన్యాధ్యక్షుడనగుదునా, అందులకు తన మేటిమగటిమి చూపు సందర్భ మెప్పుడువచ్చునా యని ఎదురుచూచుచున్నాడు.

సమదర్శి తిన్నగా ఒకనాడు చారుగుప్తుని భవనమునకు పోయెను. తన మేనమామ కోటీశ్వరులలో కోటీశ్వరుడు. ధనము మాట యటుండ ప్రపంచమున ననన్యలభ్యమగు మహారత్నమువంటి సుందరాంగికి జనకుడు. మేనమామ కుమారిత ధర్మశాస్త్రప్రకారము తన స్వత్వము. హిమవంతుని తనయను కైలాసనాథుడు వివాహమాడినాడట. సముద్రుని పుత్రికను, సముద్రమున వసించు వటపత్రశయను దుద్వాహమయ్యెనట. చిన్న తనముననుండి తాను హిమబిందుతో ఆటలాడుకొన్నాడు. ఆమె "నాకిదికావలె" నని యనినంత తా నది తెచ్చినాడు. ఒకసారి యామె కృష్ణానది కావలియొడ్డుననున్న పచ్చ తురాయి పూలగుత్తులు పట్టుకొని రమ్మని నప్పుడు, తాను పదునారేండ్ల యాడువాడై యున్నప్పుడు, కృష్ణానది నీది ఆపూలు తెచ్చి యిచ్చినాడు. హిమబిందు తన్నెంతో మెచ్చుకొని "బావా! నీయంత గొప్పవా రెవరునులేరు నేను నిన్నే వివాహమాడెద "నని తన మెడచుట్టును బాహులతల పెనవేయలేదా? ఆనాటి కౌగిలింత యిప్పటికిని మధురస్మృతియై మరపునకురాదు. తాను బాహుబలమున అసమానుడు. తనవంశము అనేక తరములనుండియు ప్రసిద్ధికెక్కిన శాతవాహనవంశము అతిరథశ్రేష్ఠుడైన ప్రియదర్శి తన తండ్రి. తాను సేనాపతి. నేట రేపట ఉపసేనాధ్యక్షపదము, సర్వసేనాధిపత్యము, ఆ వెనుక?

ఈ ఆలోచనలు కన్నులకొక కాంతి నీయ, మోమున కొక విలాసముగూర, మూర్తికొక ఠీవి జేర్ప, గుఱ్ఱమును మంద మందగతుల నడుపుకొనుచు సమదర్శి శాతవాహనుడు చారుగుప్తుని సౌధము సమీపించెను. కోటవలెనున్న యా భవన ముఖ ద్వారము సమీపించగనే గుఱ్ఱముస్వారితో పోవుటకు మహాతోరణ వామ కవాటమును మాత్రమే ద్వారరక్షకులు తెరచిరి. స్వారిచేయుచునే సమదర్శి నిస్సరణము దాటి ద్వితీయ ద్వారము కడచి ప్రాంగణము జేరునప్పటికి అశ్వరక్షకులు గుఱ్ఱము కళ్ళెమును పట్టుకొన, సమదర్శి అవరోహణ మొనర్చుచు పగ్గపు త్రాడు వారికిచ్చి పాదరక్షలు చప్పుడుకా, మీసములు వడివేసికొనుచు, సభాశాల దాటి అభ్యంతర గృహములోనికి బోయెను.

అట్లు నడచి నడచి ప్రతిహారుల నమస్కృతులందుకొనుచు ఆ సౌధశాలలకు, అందున్న సమస్తమునకు ప్రభువునా విస విస నాతడు లోనికి జనెను. ఒక మందిరముకడ ఆగి, పాదరక్ష వదలి, యచ్చట నున్న పరిచారికతో తనరాక చెప్పిపుచ్చి అనుమతికై నిలిచియుండ ఆమె లోపలికిబోయి ఒక క్షణములో మరలివచ్చి “రావచ్చు” నని తెల్పెను.

సమదర్శిశాతవాహనకుమారుడు ప్రవేశించిన గృహము వైకుంఠమున లక్ష్మీదేవి నివసించు మందిరమువలె ప్రకాశించినది. బంగారముతో, దంతముతో, చందన తరువులతో నిర్మించిన పీఠములు, మంజూషలు, కాశ్మీర దేశపు కంబళ్ళు, సహ్యాద్రి పులుల, హిమవన్నగ శ్వేతచమరీమృగముల, వింధ్యాటవీ సింహముల, కామరూప ఖడ్గమృగముల, హిరణ్యద్వీప మార్జాలముల చర్మములతో సొగసుగా నమర్చిన మెత్తటి చర్మములు, శ్రీకాకుళ పల్యంకపురముల అద్దకములు, లిచ్ఛవీదేశ దుకూలయవనికలు, బ్రహ్మదేశమునుండి వచ్చు తళతళలాడు నొకరకము గడ్డి అల్లికలు, ఎచ్చటచూచిన కన్నులకు పర్వ మొనర్చుచుండెను. సర్జరసము, మల్లిగన్ధి, జోంగకము, శ్రీవాసము, జాయకము మొదలగు సుగంధముల తయారుచేసి యందుగు బంకతో మోటుపల్లి సన్నని వలిపములకు పులిమిచేసిన ధూపకళికలు హృదయము మత్తుగొలుపు సువాసనాధూమములను మందిరము నెల్లెడ విరజిల్లుచుండెను. ముత్యముల జాలరులు, నవరత్నములు పొదిగిన ఉపకరణము లెల్లయెడల చెన్నారుచుండెను.

## ౧౮

## చారుగుప్తుని ఎత్తు

ఇక అభ్యంతరమందిరమున, అమూల్యమగు నొక పర్యంకము పై తూలికల పానుపుపై ఉపధానముల నానుకొని ఊర్వశివలె బంగారుమేని జిగితో గాత్రానులేపనములు మెరుపులీన, ఒయ్యారమున హిమబిందుకుమారిక చెలులు వింజామరలు వీవ అధివసించి యుండెను. మేనబావ వచ్చుటయు దాపుననున్న నొక పీఠము పై కూర్చుండుమని సైగచేసి యా బాల “కుశలమా?” యని ప్రశ్నించెను. ఆమె కటిప్రదేశముచుట్టును అంతరీయము మనోహర నీలవర్ణముల జెలువారుచు నీటిమూట యుబుకుల మడతలలో శృంగారరేఖల కుచ్చులతో చెన్నారియుండెను. గంభీరవక్షోజములు పొగమంచులోనుండి అస్పష్టముగా గోచరించు బంగారుకొండలవలె ఊర్పులకు పొంగుచు, తగ్గుచు సుచేలవినీత బద్ధములై యుండెను. మంజీరములు కింకిణిద్వయములు నూపురములు పాదకటకములను, ఆమె పాదములకు మహత్తర హిరణ్యపూజ లర్పించినవి. వెలలేని హారములు శంఖమునుచుట్టిన ప్రవాళలతలవలె మెడను చుట్టి వక్షోజోన్నతతలముల పై వ్రాలి మిలమిలలాడుచుండెను. మణులు పొదిగిన మేఖల ఆమె నెన్నడుము క్రింద స్వర్ణదీ భాసమానమై వంకర వంకరల చుట్టి ప్రవహించు చుండెను. బాహుపురులు వేయి శిల్పవిన్యాసములతో నామె బాహువుల జుట్టి సౌందర్యతత్వోపదేశము నందుచున్నవి. నవమణివలయిత నీలరత్నలలాటికము రతీదేవి హృదయమై వలపుమంత్రములు జపించుచున్నది.

ఆమె కీ నగలున్నను, లేకున్న నొక్కటే! ఆమెయందము అకుంఠితము, అనన్యము, అప్రతిమానమునై నగలకే నగయైనది.

క్రీగన్నుల బావగారిని జూచుచు, మృదులాధరోష్ఠకాంతులు ప్రసరింప నెమ్మదిగ తాంబూలము నములుచు, విలాసముగా ముంగురుల సవరించుకొనుచు, బాలచంద్రుని శిశుకిరణములవంటి వ్రేళ్ళతో పూలచెండుల దొర్లించుచు "బావా! యుద్ధ వార్తలు చెప్పవూ?" అని ప్రశ్నించెను.

"సుందరీసామ్రాజ్ఞియైన మరదలు చెంతకువచ్చినపుడుగూడ యుద్ధ వార్తలేనా? లోకమోహనమైన నీ సౌందర్యమును జూచుచు ముగ్ధయైపోయే నా మనస్సు ఇతరాలోచనలకు చోటిచ్చుట లేదు."

"బావా! నీవంటి మహావీరులకు, యుద్ధములని, సైన్యములని, గుఱ్ఱపు పందెములని యుండవలెనుగాని స్త్రీ సౌందర్యవర్ణనముతో ప్రొద్దుపుచ్చుట నిరర్థకులగు కవుల పని.""ఆ! మరల మొన్నటి పందెములమాటజ్ఞప్తికి తెచ్చుచున్నావు. నే నా నాడే చెప్పితిని గదా? వాని కేవో శాంబరమంత్రాలు వచ్చియుండవలెను. కానిచో కామందక కులపాలకులకు ఓటమి యేమిటి?"

"అయితే, ఆ మంత్రం నీమీద ప్రయోగించెనా, కామందక కుల పాలకముల మీదనా?"

సమ: "అదుగో, దోషమంతా నాదేనని తేల్చుచున్నావు. రౌతుకొద్దీ గుర్రమనేమాటనిజమేగాని, బిందూ! నేనీవేళకొత్తగా సారథ్యంచేసినానా? ఇదివఱ కెన్నడైనా అపజయ మెఱుగునా నీ బావ?"

సరే నీమాట ఎందుకు కాదనవలెను? ఓటమికి నేనే కారణము. నీవంటి సౌందర్యరాశిమాట కెదురాడడం సరసత్వం కాదు."

హిమ: సర్వ సైన్యాధ్యక్షులు కావలసిన మా బావగారింతలో ఎంత అల్ప సంతుష్టులైనారు. సరసాగ్రేసరు డనిపించుకోవడంతో తృప్తిపడతావా? బావా?

సమ: బిందూ! నీయెత్తిపొడుపు లెన్నటికీ చాలింపవా? నీకు సంతోషం కూర్చలేని శౌర్యము, పరాక్రమము, సైన్యాధ్యక్షపదవీ నాకెందుకు? చిన్ననాటి నుంచి మనమాడుకొన్న ఆటలు, పాటలు, మనము పెంచుకొన్న నెయ్యము, ఇవన్నీ ఇలా మఱచిపోయి, నాఆశలన్నిటినీ యిలా నట్టేటకలుపుతా వనుకోలేదు.

హిమ: అదుగో! నీకు కోపం వచ్చినది. నా పెంపుడు వృషభము లోడిపోయినవిగదా అనే విచారంకొద్దీ నే నేదో అన్నానుగాని, నీ శౌర్య సాహసాలు నే నెరుగునా బావా? ఆంధ్రసామ్రాజ్యవైరులకు గుండెలో బల్లెమనే కీర్తి ఇంత చిన్నతనంలోనే సంపాదించు కొన్నావు. ఆంధ్రజగతి యావత్తూ నిన్ను చూచి గర్విస్తున్నది. ఆశలన్నీ నీమీద పెట్టుకొని ఉన్న అత్తయ్యా నీ వీర వినోదములు విని ఉప్పొంగిపోతున్నది. నువ్వు కాగలవాడవూ, కీర్తికాముడవూ అనియే బంధువులు, స్నేహితులమంతా ఎంతో సంతోషిస్తున్నాము.

సమ: నీకు ఉత్సాహభంగము చేసిన పిమ్మట ఎందరు సంతోషిస్తేనేమి? నా కీర్తి ప్రతిష్ఠలన్నీ ఏ దేవిపాదాలచెంత కానుక పెట్టుదామనుకొన్నానో ఆ దేవికి నాపట్ల అనుగ్రహంతప్పినది.

హిమ: ఎవరాదేవి, అంత నిష్ఠురురాలు? ఎన్నడూ చెప్పితివికావు! సమదర్శి శాతవాహనుల ప్రేమను తృణీకరించే కఠినాత్మురాలు, బావా నాతో చెప్పవూ, మా అక్కకానున్న ఆ యదృష్టవతి ఎవరో? నేను వెళ్ళి మందలించి ఆవిడను ప్రసన్నను చేసి వస్తాను. అవునుగాని మా అత్తయ్యా ఎఱుగునా, కాబోయే కోడలుగారిని? అవునులే అత్తయ్యా, నువ్వూ తోడు దొంగలు. మాకు తెలియనివ్వరు. కానీలే, మీ రెంతదాచినా పెండ్లినాడైనా చూడకపోముగా. అవునుగాని నువ్వు త్వరగా పెండ్లి చేసుకో బావా! మా అత్తయ్య కోడలికోసం మొగమువాచి ఉంది. మేమంతా నీ పెండ్లి ఎప్పుడెప్పుడని కానుకలతో కనిపెట్టి కొని ఉన్నాము. ఇదిగో, మా నాయనగా రీమధ్య పదియోడలమీద సరుకులు పంపితే రోమకమునుండి రెండు లక్షల సువర్ణాలు వచ్చినవా సరుకుల విలువ క్రింద. ఆ సువర్ణములతో ఇదిగో హారం చేయించాను. మా బావ పెండ్లినాడు మా అక్కగారికి కాను కివ్వవలెనని

అనుచు ఆమె తనచేతికి అందిచ్చిన హారమును సమదర్శి గైకొనెను. తనమాట చొరనీయకుండ నా బాలిక పలికిన పలుకులెల్ల నాతనికి దిగ్భ్రమ కలిగించినవి. ఆమె మాటలు నిజమో, నవ్వులో? బండ్లపందెమున నోడితినన్న కారణమున నన్ను నొప్పించుట కిట్లనుచున్నదా? లేక నిజముగా నాయెడ విరక్తయైనదా? తన యాశలన్నియు మఱదలిపై నిడికొని, తన కెన్నటికైన దేవేరియగు నన్న నిశ్చయముతో నుండ ఇట్లు విరసము లారంభించినదేమి? కానిమ్ము. ఈ బాల నీ మాత్రమునకే జుణిగిపోనిత్తునా అనుకొని “బిందూ! పుట్టనిబిడ్డకు పేరు లెందుకుగాని, ఈ యపురూప హారము నీకే తగును. దీనిని నీ కంఠమునకే అలంకరింతును” అని చెంతకేగెను.

హిమబిందు “వద్దు బావా! నా హారం నేనే వేసుకుంటాను” అని చేతులతో నందుకొనెను, సమదర్శి చిన్నబుచ్చుకొనెను. అతనికి దుఃఖమును, రోషమును నలముకొనెను.

తారాదత్త వచ్చి “అమ్మా! నాయనగారు వచ్చుచున్నా”రని నుడివి, సమదర్శిని చురుకుచూపుల చూచి, ఏమియు నెరగనట్లు వెనుకకుబోయెను.

రక్తచందన పాదరక్షలు చప్పుడుగా, చెక్కడపుబని లేని ఎఱ్ఱజువ్వి కఱ్ఱ కేల నూతగాగొని చారుగుపుడు వీరున్నమందిరమున కేతెంచెను. ఈ వారము దినములలో నాతడు విచారమున క్రుంగిపోయెను. అతని మొదటి యెత్తు భగ్నమైనది. కాని అంతటితో తా నూరకుండవలసినదేనా? మొన్న జయశీలుడగు నా బాలునియెదుట నాట్య మాడునప్పుడు, యువరాజగు శ్రీకృష్ణశాతవాహనుడు తదేకదృష్టితో హిమబిందు చూచినాడు. చక్రవర్తి కద్భుత మొనగూర్చు కార్యము లొకదాని వెనుకనొకటి తాను ఘటింపవలెను. తనవలన నెఱవేరు సమస్తకార్యములు నాత డెరుగవలె. మొన్న తన వేగులవారు తెచ్చిన జాడనుబట్టి బ్రాహ్మణ బ్రహ్మచారి నొకని పట్టితెచ్చిరి. ఇంకను తన కావిషయమై ఎన్నియో సంగతులు తెలియవచ్చినవి. కానియీ సమదర్శి యేమిటి? పలుసారులు హిమబిందుకడ కీతడు రాజనదు. యువరాజ్యకంఠయోగ్య మగు నా రత్నహారమున కీత డర్హుడు కాడు. హిమబిందు మనస్సు ఏ దుర్ముహూర్తమునయిన నీ వెఱ్ఱి మేనల్లునిపై చనవుకొలది లగ్నమైనచో తన కలలన్నియు శకలము లగును. ఈ బాల్య స్నేహమును తెంచుటకే సమదర్శిని దేశాంతర గతుని గావించవలెను. చక్రవర్తి మనస్సును సంతోషవార్ధిలో నోలలాడించగల కులపాలక కామందకములను యువరాజునకు బసదనమీయనెంచిన నవి యోడిపోయెను. కాని ఇంత మాత్రమున అధైర్యమేల? మహత్కార్యములు నెరవేర్ప వలయును, విధిని తన లెంకలలో నొకనిగాజేసి ఆంధ్రరాజ్యమును తన చేతులలో నాడించి, చక్రవర్తితో తాను వియ్యమందవలయును. తన

యీ సంకల్పము అమోఘము.

చారుగుప్తుడు గదిలోనికి వచ్చినతోడనే హిమబిందు లేచి తండ్రి కడకు వచ్చి మోకరించి, నమస్కరించి, లేచి చేయిగొని సుఖాసనముపై నధివసింపచేసి యాయనప్రక్కనే తాను గూర్చుండెను. సమదర్శి మేనమామకు పాదాభివందన మాచరించి నిలువబడి యుండ, చారుగుప్తుడు చేయియూపెను. అతడును తన పూర్వపీఠము పై నొరిగెను.

చారు: సమదర్శీ! నీకా కామందక కులపాలకములు కావలయునేమోయని మాట పంపినారు. ప్రత్యుత్తరము పంపినావు కావేమి?

సమ: మామా! అట్టి మేటిగిత్తలు నీకడనే యుండవలయును.

హిమ: నీకడ నేల నుండకూడదు బావా? చారు : ఉండుతల్లీ! నే నాతనికి సమాధానము చెప్పెదను. అవునయ్యా, నాకు వానియందు మక్కువపోయినది. ఓడిపోయినవని కోపమనుకొందువేమో, అది కాదు. నాకు కొత్త జతలపై మక్కువ. మహాకాండూర నగరమున ఈమధ్య మావాడు ఇంద్రగోపుడు అత్యద్భుతమగు జతను కొనినాడట. కతిపయ దినములలో నవి యిచ్చటకు వచ్చును. ఆర్యావర్తమునగాని, దక్షిణాపథమందు గాని అట్టి పసరము లుండబోవని స్పష్టముగ నాకు తెలియవచ్చినది.

సమ: అయినచో వానిని తప్పక చూడవలెను.

చారు: మాళవముపై కేగు సైన్యమున నీకు ఉపసేనాధ్యక్షత నిచ్చినారు. చక్రవర్తి ఆజ్ఞాపత్రము నీ కందినదా?

సమదర్శి చటుక్కున గంతువేసి లేచి "ఏమిటి మామయ్యా! నిజముగా! నీ కెప్పుడు తెలిసినది?" అని ప్రశ్నించెను.

చారు: ఇప్పుడే. కేరళపక్షులువచ్చి నా చెవిలో చెప్పినవి.

హిమ: (నవ్వుచు) వెఱ్ఱిబావా! బాబయ్యగారు చేసిన పనికి వారితో ఒకరు చెప్పవలెనా?

సమ: మామయ్యా! నీ యనుగ్రహానికి వేయివేల నమస్కారములు. ప్రయాణ మెప్పుడు? ఎన్ని సైన్యములు? అహో! నా కత్యంత సంతోషముగ నున్నది. నా కా శాసన మెప్పుడు చేరును? అయినచో నే నింటికిబోయి ప్రయాణసన్నాహమున నుండెద.

అనుచు నాతడు చారుగుప్తునకు నమస్కరించి, సంతోషస్నేహముల వెనుకనుండి తొంగిచూచు దైన్యముతో హిమబిందు ముఖముదెస గాంచి ఆ బాలికచే ననుజ్ఞాతుడై వెడలిపోయెను. చారుగుప్తు డాతడు పోయినదిక్కున బొమముడితోడి యనాదర దృష్టుల బరపి, పుత్రికవంక జూచి, "అమ్మాయీ! నీ వీతనితో చనువుగా నుండుట తగ్గించివేయుము. శస్త్రజీవనుడు" అని తెలిపెను. "లేదు, బాబయ్యగారూ! చిన్నతనపు స్నేహమున చనవు" అని హిమబిందు నవ్వుచు పలికెను.

౧౯

## రహస్యాలోచన

శ్రీముఖసాతవాహనచక్రవర్తి, మహామాత్యుడు అచీర్ణునితో, సర్వ సేనాధ్యక్షుడు స్వైత్రునితో రహస్యాలోచనమందిరమున మంతన ముండెను. శ్రీముఖుడు పొడుగరి. ఆరడుగుల రెండంగుళముల మనిషి. జబ్బపుష్టిగలవాడు. సింగముతో ఆయుధము లేకయే పోరాడునంతటి పోటుమానిసి, పచ్చని దబ్బపండువంటి ఛాయకలవాడు. జుట్టు పొడుగుగ ఉంగరములు చుట్టుకొని వీపుమీదను, భుజములమీదను పడుచుండును. ఒక్కొక్కసారి వలిపెములతో ముడులుగా రచియించుకొని, శిరోభూషణములచే అలంకరింపించు కొనును. కన్నులు మధ్యమ ప్రమాణములు కలవి. నాగమణులవలె తళతళలాడుచు, తీక్షణకాంతులచే నెదుటివాని హృదయము చొచ్చిపోగలవు. నాసిక గరుత్మంతుని ముక్కువలె పొడుగై మాటలాడునపుడు వట్రువలు తిరుగు సుందరమగు పెదవులను తొంగితొంగి చూచుచు ఆ వదనమునకు అందమిచ్చును. మీసమును, బవిరిగడ్డమును, విశాలఫాలమును అతని ముఖమునకు వన్నె తెచ్చినవి.

ఆలోచన మెండయినప్పుడు శ్రీముఖుడు అస్థిరుడగును. మొలనున్న కరవాలికా సువర్ణ మేఖలలపై చేతులువేయును. ప్రక్కనున్న విశిత కౌక్షేయకోశముపై దృష్టిసారించును. కిరీటరత్నకాంతులు దశదశల పర్వ దలయాడించును. అతని మొల కొక దుకూలమున్నది. మెడను హారములున్నవి. హస్తమున కంకణములు, బాహువుల గేయూరములు కలవు. అతడు మాటలాడునపుడు మణికుండలము లూగియాడి, భుజములు, మీసములు, గడ్డము కాంతులతో నిండిపోవును. తలత్రిప్పుచు ప్రభువు అందరి మోములను చురచుర చూచును.

శ్రీముఖుడు: నా ఉద్దేశ్యము మనము ప్రథమమున పుళిందుల పైకిపోయి వారికిబుద్ధిచెప్పి, యటువెనుక మాళవముపై దండువిడసిన మంచిదియని. లేనిచో మాళవముపైకి పోవు మనవెనుక నీ పుళిందులు క్రమ్మి అడుగు సాగనీయరు. ప్రప్రథమమున పుళిందులకు బుద్ధిచెప్పితిమా మాళవము సులభసాధ్యమగును.

అచీర్ణుడు: దేవర యాలోచన లెస్సగ నున్నది. రేపటి దినమున సైన్యసంఘములకు, జైత్రయాత్రాసంఘములకు శాసనములు పంపెదను.

సర్వ సైన్యములు నాయత్తమైన వెంటనే శుభముహూర్తము చూచి రణభేరి మ్రోగించెదముగాక!

స్వైత్రుడు: మహారాజా! వినీతమతికి బాసటగా సమదర్శినడుపున ఉజ్జయినికి కొన్ని సైన్యములు పంపుట లగ్గుగదా! త్వరలో సహాయము కావలెనని క్రమేలక వార్తాహరుడు తెచ్చినవార్త. లేనిచో దుర్గము బలహీనమై సమస్తసైన్యముతో నాతడు ఆహుతి కావలసిన ముహూర్తమరు దెంచునేమో? ఆతడు పంపినవార్త దేవరకు విశదము. ఆజ్ఞ!

శ్రీముఖుడు: సమదర్శి స్వతంత్రముగా సైన్యములు నడపగలుగు పాటివాడా? వీరుడు కావచ్చునుగాని తానై సైన్యమును నడపగలవాడా యని.

స్వైత్రుడు: అందునకు నేను పూట. మహామాత్యుల ఉద్దేశ్యము దేవర కనుగొనవచ్చును.

అచీర్ణుడు: సర్వ సేనాధ్యక్షులమాట బాగున్నది. ఉపసైన్యాధ్యక్షు లార్వురిలోను వినీతమతి మాళవమున, కాకుండుకులు ఈ నగరమున, అక్షఘ్నుడు కళింగమున, అఘబలుడు ప్రతిష్ఠానమున, చిత్రకుడు దక్షిణా పథమున, జఘన్యుడు సిద్ధపురమున నుండవలసినవారు. మనకు సమదర్శియో మరొకరో క్రొత్త ఉపసైన్యాధ్యక్షుడు కావలయును.

ఆ విషయమును స్వైత్రులవారే చెప్పవలయును. నా వినికిడి సమదర్శియే సేనాపతు లందరిలోను తగినవా డని.

స్వైత్రుడు: రాష్ట్రికులతో యుద్ధమున సమదర్శి ఉపసైన్యాధ్యక్షునికంటే అద్భుతములొనరించినాడు. కాన అతడే దీనికి తగును.

శ్రీముఖుడు: మంచిది. అతని నెప్పుడు పంపెదరు?

ఇంతలో ద్వారముకడనుండి పారిపార్శ్వకుడు “జయము! జయము! మహారాజాధి రాజులకు” అని వక్కాణించెను. అచీర్ణుడు “లోపలికి రా” యనుటయు, నాతడు వచ్చి యందరకు సాష్టాంగనమస్కృతులొనర్చి “జయము! జయము! దేవర యాజ్ఞానుసారము వణిక్సంఘాధ్యక్షులు చారుగుప్తులవా రేగుదెంచినారు” అని మనవి చేసెను. సార్వభౌముడు తలనూపెను. అచీర్ణుడది చూచి “తోడ్కొనిరా” యని యాజ్ఞయిచ్చెను. చారుగుప్తుడు లోనికివచ్చి యందరకు నమస్కారములు చేసి, మహారాజునకు మోకరించి నమస్కార మాచరించెను. అందరును లేచిరి, శ్రీముఖుడు చారుగుప్తుని హస్తముల బట్టి లేవనెత్తి పార్శ్వమున నున్న పీఠముపై నధివ సింపజేసెను.

శ్రీముఖుడు: వర్తకసార్వభౌమా! మాళవాధిపతి యేమి చేసెనో యెరుగుదువుగదా! ఇదివరకు మనచే విజితుడై కప్పము గట్టుచుండెను. తిరుగుబాటు చేయుచున్నాడని వినినంతనే వినీతమతిని పంపితిమి. ఆతనికి లొంగిపోయెనని వార్తాహరులు వచ్చియుండిరి. ఇంతలో ఏమరుపాటున పుళిందులచే తిరుగుబాటు చేయించి, భోజుల సహాయముగా గొనివచ్చి ఉజ్జయినిలోనున్న వినీతమతిని ముట్టడించెను. ఆతడు ధైర్యముతో కోట కాపాడుచున్నాననియు, త్వరలో సైన్యముతో సహాయము రానిచో తాను తన చమువులతో నశించిపోవలయుననియు వార్తాహరుల నంపుచున్నాడు. వినీతమతిని మాళవుడు ఓడించునట. పుళిందులు ప్రతిష్ఠాన నగరముపై దండు విడియనున్నారు. నీకు పుళిందులతోను, మాళవముతోను మహత్తరమగు వర్తకవ్యాపారమున్నది. నీ యాలోచన మా కత్యంతము ముఖ్యమైనది.

చారు: జయము దేవా! ఈ విషయమంతయు నేను శ్రద్ధగా నాలోచించితిని. కొన్ని సైన్యములను ముందు ప్రతిష్ఠానమునకు సహాయము పంపవలయును. మనము సర్వసైన్యములతో తరిమి నడచి మగధ పైకెత్తిపోయి అచట కాణ్వులకు, అగ్ని మిత్రుని సంతతివారికి బుద్ధిగరపి, వెనుక మాళవాధిపతిని నిర్జించి, ఆ వెనుక పుళిందుల నడంచి, భోజులపని పట్టించి వారి రాజ్యము మనము స్వాధీనము చేసికొనవలయును.

అచీర్ణుడు: అట్లయినచో పుళిందులు వెనుకనుండి మనయాత్ర సాగనీయరు గదా!

స్వైత్రుడు: చుట్టును శత్రువులు క్రమ్ముకొనియుండ మనము విరోధులపై బోవుట అపాయకరము. ఈలోపల మాళవమున వినీతమతి సంకట మధికమగును.

శ్రీముఖుడు: పుళిందు లెప్పుడును ప్రబలశత్రువులు.

చారు: మీరు తెలుపు కారణములు భయహేతువులుకావు. పుళిందులడవులు, కొండలు విడిచి సమప్రదేశములలోనికి వచ్చి శిక్షితులైన సైనికుల నెదిరింపలేరు. వారిని నడుపుటకు శిక్షితులగు సేనానాయకులు లేరు కావున వారివలన భయములేదు. మనము మగధమునకు కళింగము దారి ప్రయాణము సాగించెదము. విరోధులకు మన పోకడ తెలియవచ్చు మునుపే మగధ యందుండగలవారము. పుళిందుల నణచుటకు ఆ

అడవులలో మనకు చాలకాలము పట్టును. ఈలోన వినీతమతి దగ్ధమైపోవును. అటువెనుక ఏనుగులదండు అడవిబడినటుల, దావానలము కాంతారము చొచ్చునటుల వింధ్యాటవుల బడి పుళిందుల నుక్కడిగింపవచ్చును. పై భాగము లోబరచుకొని మనము అటునుండిరా, యువరాజు ఇటునుండి రా, మధ్య పుళిందులు చిక్కుకొనగలరు. భోజులుపూర్తిగ మాళవులకు బాసట కాకమునుపే మనము ఉజ్జయిని నుండవలయు. దీనివలన మనకు చెప్పరాని లాభ మింకొకటి యున్నది.

అచీర్ణుడు: ఏమది?

చారు: (సార్వభౌముని దిక్కు మొగంబై మధ్యమధ్య మంత్రిని, సేనానాయకుని జూచుచు) ఇది భరుకచ్ఛము. పశ్చిమ సముద్రపు రేవు పట్టణములలో ముఖ్యమైనది. దానిలాభము భోజులు పూర్తిగా అనుభవించుచున్నారు. ఇప్పుడు భోజరాజ్యము స్వాధీనము చేసికొని ఒక ప్రతినిధిని భరుకచ్ఛమున నుంచినచో, పాశ్చాత్యదీవులలో వర్తకము మచిలీపట్టణము నుండియు, మోటుపల్లినుండియు జరుగుటచే మనకు అమితనష్టము కలుగుచున్నది. కావున భరుకచ్ఛము ఆంధ్రచక్రవర్తుల స్వాధీనమందుండ వలయు.

శ్రీముఖుడు: బాగు! నీవు వర్తక చక్రవర్తి వనిపించుకొంటివి. నీవు చెప్పినదంతయు నాకు నవగతమైనది. మహామాత్యా! ఈవణిక్ శ్రేష్ఠుని యాలోచన లెస్సగానున్నది. సర్వసైన్యాధ్యక్షా! ఆ ప్రకారము సేనల నడుపుము. మేమును సిద్ధముగ నుండగలము. చారుగుప్తుడు మనతో వచ్చునది. కోశాధిపతికి మహామాత్యుడాజ్ఞల నంపునది. వలయునంతయు సిద్ధముచేయు యుద్ధ సంఘములకు ముదలనీయవలసినది. చైత్యాచార్యులు జయముగోరి బుద్ధ భగవానునకు పూజల సలుపునది. ప్రజాలోకము దైవారాధన చేయవలసినది. మరియు....

చారు: దేవా! తమకు అడ్డము చెప్పుచున్నాను. మన్నింపుడు. ఈ జైత్రయాత్ర కగు వెచ్చమంతయు చారుగుప్తుడు భరించగలవాడు.

## ౨౦
## రహస్య సమావేశము

బౌద్ధమతము విజృంభించియున్న కాలముననే వేదమతము పునరుద్ధరింప బ్రాహ్మణులు, ఋషులు, పండితపరిషత్తులు, ఆశ్రమములు ప్రయత్నము చేయుచునే యుండిరి. పండితులగు బౌద్ధ సన్యాసులకు కర్మకాండ మాత్రులగు బ్రాహ్మణులు బదులాడలేకపోయిరి. తిమిరమువలె గప్పిన ఈ పాడుమతమును నాశము చేసి, త్రయీభక్తిదేశమున నెలకొల్పుటెట్టులని వారాలోచనలు సలుపుచుండిరి. అనేక సభలు, సమావేశములు వారణాసి నైమిశారణ్యాది పవిత్రక్షేత్రముల జరుగుచుండెను, కొందరు భగవంతుడు మహాశక్తివంతుడు, ఆతడే సర్వము చక్కబరుచును అని వాదించిరి. కొందరు పురుషప్రయత్న ముండవలె ననిరి.

అశోకచక్రవర్తి నిర్యాణమందిన వెంటనే మౌర్య ప్రతిభ నానాటికి తగ్గిపోయెను. బౌద్ధ మతమును సామ్రాజ్యమతముగా నొనర్చి, యాత్రికుల, నాచార్యుల, భిక్కుల నంపి చీనా, తుర్కీస్థానము, పారసీకము, బ్రహ్మదేశము, సింహళములందా మతము నెలకొల్పి మహోన్నత దశకు తీసుకు వచ్చిన సార్వభౌముడు గతించుటనే అచ్చటచ్చట నణగియున్న వేదమతము పూర్వాచార సంప్రదాయములు తిరిగి విజృంభించెను. మౌర్యసంతతి రాజగు బృహద్రథుడు మగధ సింహాసన మధిష్ఠించియున్నప్పుడు పుష్యమిత్రుడను ఆతని

సేనానాయకుడు రాజును చంపి తాను రాజై బ్రాహ్మణమతము పునరుద్ధరణ చేయ సంకల్పించెను. అప్పటినుండి సామ్రాజ్య సింహాసనమెక్కిన రాజులు వేదాచార పరాయణులగు వారే. పుష్య మిత్రునిసంతతిలో శుంగవంశములో తుదివాడగు సుమిత్రుని మిత్రదేవుడు వధించి రాజయ్యెను. మిత్రదేవుని సంతతివారిని పదచ్యుతులజేసి మంత్రులగు కాణ్వవంశమువారు చక్రవర్తులైరి.

కాణ్వవంశమువారందరు వేదమతము పునరుద్ధరింప దీక్షవహించినవారు. అనేక పండితులీ రాజుల ప్రోద్బలముననను, పై మూడు వంశముల ప్రోత్సాహమునను వైదికధర్మనిష్ఠులై అత్యంత పురాతనములగు రామాయణ భారతాది గ్రంథములందు ఋషిప్రోక్తములవలె బౌద్ధమత ఖండనములను బ్రక్షేపించిరి. పురాతనములగు మనుధర్మాదిస్మృతుల దమ ఇష్టమువచ్చినట్లు మార్పు లొనర్పసాగిరి. రాజతంత్ర మందుకూడ నీ యావేశపరులు పాల్గొని వేదమత ముద్ధరింప సమకట్టిరి. గోదావరి నదికి పశ్చిమోత్తరముగా పదునేడు గోరుతముల దూరమునున్న మహావనశాల యను పట్టణమునందు క్రీస్తుశకము పూర్వము 74 వ సంవత్సరమునకు సరియైన బౌద్ధశకము 483 పరాభవ సంవత్సరమున ఫాల్గుణశుద్ధ ఏకాదశీదినంబున ఒక భవనమునందు పదమూడవ మూహూర్తమున పౌరసభాశాలవారు భేరి కొట్టకమునుపు పది పన్నెండుగురు పురుషులు సభ జేరియుండిరి. వారందరు క్రిందపరచిన రత్నకంబళులపై కూర్చుండి యుండిరి.

ప్రథముడు: కనుక వేంగీపురమునందున్న సంచరణుడు ఇప్పుడేమియు పని చేయుటకు వీలులేదని మీరంటారు. అవునుగదా, మహేశ్వరానందా?

మహే: ఏమిచేయగలడు? మన సంచరణుడు తానై ఏమియు ప్రయత్నించలేడు. ఇక్కడ చుట్టుప్రక్కలకు ప్రాణము, శక్తి, సమస్తము నయిన యాతడు ఈ స్థానబలము తప్పినంతనే రెక్కలులేని పక్షివలె నయినాడు. ఎంత బలమున్ననేమి? ఎంత సంపదయున్న నేమి? అంగ బలముండవలె గదా. చంద్రస్వామి ఉన్నంతవరకు బౌద్ధుల ఆజ్ఞల, నుప దేశముల తూ.చా తప్పక నిర్వర్తించుచు మన ప్రయత్న మత్యంతాభివృద్ధి చేసినాడు. చంద్రస్వామి కారాగృహమునకు బోగానే సంచరణుని పని అయినది.

ప్రథముడు: అయితే చంద్రస్వామి విచారణ సంగతి యేమయినది? ఎట్టి దండము విధించిరి?

మహే: మాకింకను ఆ వార్త రాలేదు. ఇప్పటికిని చక్రవర్తి దినోత్సవములు జరుగుచున్నవి. ఎద్దుబండి పరీక్షలైనవి. ఆయన విచారణ ఆపుచేయునేమోనని కోటలో ప్రతీతి. ఒకవేళ విచారణమవసరములేకయే శిక్షింతురేమోయని కోటలోనున్న మన వేగులవాడు విశాఖుడు చెప్పినాడు. ఏది యెట్లగునో?

ప్రథముడు: రాజధాని యందున్న బ్రాహ్మణు లూరకుందురా? విచారణ లేకుండ శిక్షించుట ధర్మదూరమని చెప్ప సాహసించు మతాభిమానులు లేరా?

మహే: ధాన్యకటకముగూర్చి సోనుత్తరుడు చెప్పవలసినదే.

అందరును మహాపండితుడును, ప్రతిజ్ఞానిర్వహగర్వియు నగు సోనుత్తరస్వామి వైపుచూచిరి. సోనుత్తరుడు సామవేదము పాడినట్లీవిధమున వాక్రుచ్చెను. ధాన్యకటకము నందున్న బ్రాహ్మణులందరును రాజాభిమానులు. బ్రాహ్మణ నామధేయము కలిగిన పాషండులు, చార్వాకులు పైశాచస్వరూపులు. ఒక్కడైనా మహాపండితుడనైన నన్ను

గౌరవము చేయరు. లేచి నమస్కారమునైన చేయరు సరిగదా నా మొగమైన చూడరు. నాకు కోపమువచ్చి "రండి. నాతో వాదమున" కని పిలిచితిని. ఆ శుంఠలు ప్రతి చెప్పరైరి. అయినప్పటికి చంద్రస్వామిని విచారణ చేయకుండ దండించుటకు చక్రవర్తికి గుండెలేదయ్యా ధర్మాతిక్రమణం చేయుటకు. అన్నిమతములయందును గౌరవము చూపుదునని ప్రతి సంవత్సరము మహాపరిషత్సభకు చెప్పుచుండునుగదా! ఆ మాట కిపుడు తప్పినచో నేనూర కొందునా? మీకు తెలియదా?"

ప్రథముడు: ఒకవేళ చంద్రస్వామిని విడుదల చేయకపోయినట్లయిన సంచరణునకు సహాయముగా మనలో దిట్టమైనవాని నొకని ఆ చుట్టు ప్రక్కల నెక్కడనో యుంచవలయును.

మహే: ఆ సంగతి మొదటినుండియు మహాభాగులు మనతో చెప్పనే చెప్పినారు. వారి ఉద్దేశ్యము కూడా చెడుగు చేయవలెనని కాదు. మనము చేయుకార్యము ఉత్కృష్టమైనది. పుణ్యదాయకము, మోక్షదాయకము. ఆదిమీనము వేదముల నుద్ధరించుట వంటిది. వేదోద్ధరణచేయుట సర్వేశ్వరునకు మహాప్రీతికరము. దానిని, సాధించుటయే మన లక్ష్యము. తక్కిన పాపపుణ్యములతో మనకు బనిలేదు. ఒకడు: అవునుస్వామీ! ఇట్టి మహాపవిత్రకార్యము చేయుటలో కొన్ని కష్ట కార్యములు చేయవలసి వచ్చినను వెనుదీయకూడదు. మనము దురుద్దేశముతో చేయుట లేదుగదా?

చండికుడు: ఇన్ని సంవత్సరములు వేదపారాయణముచేసి, శాస్త్రములు పఠించి, ప్రతిజ్ఞగైకొని యీనాడు నేను వెనుదీయుదునా? చంద్రస్వామిలేని కొరతలేదు. మనము ముఖ్యకార్యము నడుపవలసినదే.

మిగిలినవారందరును "నిజము నిజ" మని చెప్పిరి. అందరును ఆవేశపూర్ణులై యున్నారనియు, తన కార్యమునకు తోడ్పడెదరనియు, నా సభ నడుపు ప్రధానపురుషునకు దోచినంతట నా విషయమునుగూర్చిన సంభాషణమాని "మన మిక్కడనుండి వివిధములగు మార్గముల ధాన్యకటకము చేరవలయును. మహాయోగి, పుణ్యపురుషుడు, స్థాలతిష్యులవారు వారి పని కొనసాగు శుభముహూర్త మేగుదెంచినదనియు, దానిని గమనించుటకు మనమందరము రావలెననియు ముదల పంపినారు. మీరుదప్పనింక నెవ్వరిని తీసికొని రావలదు. రేపు త్రయోదశినాడు శుభముహూర్తము" అని యతడు పల్కెను.

౨౧
# పరిత్రాణము

సమదర్శి పోటుమానిసి. చురుకుపాలెక్కువ. వెనుకముందుచూడని సాహసి. తనకిచ్చిన ఆ అక్షౌహిణీసైన్యముగొని పిట్టను వెన్నాడు డేగవలె దుర్గమారణ్యములబడి రివ్వున పోజొచ్చెను. దిగంబరులు, క్రూర సత్వులగు రాక్షసులను ఆరణ్యక జాతివారు (ఇప్పటికిని బస్తరు సంస్థానపు దుర్గమారణ్యములలో నున్నారు. వారిని మేము చూడ గలిగితిమి) ఆ అడవులలో నుండిరి. ఆ మూకల స్నేహముచేసికొని వారికెన్నియో విచిత్ర వస్తువుల కాన్కలిడుచు, వారి మన్ననల గ్రహించుచు, తనజాడ పుళిందులకు తెలియకుండునట్లు కష్టతమములగు మార్గములనే రాక్షసులు చూప నడచిపోవుచు, సమదర్శి రెండు వారములలో మాళవరాజ్యపు సరిహద్దుల చేరునప్పటికి ఒక్క పుళిందుల మూక ఆతని నడ్డగించెను. కాని అర్జునగాండీవవినుర్ముక్త మహాశరమువలె పోవునాతనికి చిన్న సైన్యమొక లెక్కయా! ఆ మూకను చీల్చి చెండాడి ఉజ్జయినికి నాల్గు గోరుతముల దూరమువరకు నాక్రమించియున్న మాళవసైన్యములపై మబ్బులేని పిడుగులవలె దూకెను. కోటలోనున్న వినీతమతికి సమదర్శి సైన్యముల నడుపుకొని వచ్చినాడని వేగు తెలిసినది.

ఉజ్జయినీకోట చాల ముఖ్యమైనది. అది దేవనిర్మితమని ప్రతీతి. శ్రీముఖ శాతవాహనుని తండ్రి, సమదర్శి తండ్రి ప్రియదర్శి సేనాపతిగా ఉజ్జయినీపట్టణమును మహాసంగర మొనర్చి స్వాధీన మొనర్చుకొనెను. అప్పుడు మాళవాధిపతి నీరసముగ నున్నను చాలకాలము అద్భుతముగా కోట కాపాడుకొనగలిగెను. కాని తినుబండారములు నాశమొందుటచే కోట సాతవాహనునకు స్వాధీనమయ్యెను.

సమదర్శి ఆలోచనయొక్కటే. కోటచుట్టునున్న సైన్యములలో చాల భాగము తన్నెదిరించిన ఏ సైన్యమునెగ్గునో భగవంతునికెరుక. పుళిందులు, భోజులు, మగధ సైన్యములు, అవంతిదళములు సహాయము వచ్చుటచే మాళవ వాహిని ఉత్తుంగతరంగ పూర్ణసముద్రమువలె నున్నది. కోటలో వినీతమతికి భోజనాదికములు తగ్గిపోవుచున్నవి. సైనికులు వేనవేలు మడిసినారు. హీనబలులగుచున్నారు. ఆయుధసామగ్రి చాలవరకు నాశనమయినది. సర్వతో భద్రములు, జామదగ్న్యములు, బహుముఖములు, విశ్వశాఖతికములు, పర్జన్యకములు, ఊర్ధ్వబాహువులు చెడిపోయినవి, చెడిపోవుచున్నవి. కాన వినీతమతి తప్పక నశించును.

ఇవన్నియు స్ఫుటాక్షరముల నాతని దృగ్వీధిని నడయాడుచున్నవి. తనకడ నొక నెలకు సరిపడిన పుష్కలాహారపదార్థములు కలవు. గోధుమలు, బియ్యము, పప్పు ధాన్యములు, బెల్లము, కోళ్ళు, కౌజులు, మేకలు, గొఱ్ఱెలు, లేళ్ళునున్నవి. ఇప్పుడు కర్తవ్యమేమి? ఏది యెట్లయినను తాను కోటలోనికి చొచ్చుకొనిపోవలె, తనక్రింది సేనాధికారులు, చమూపతులు, దండనాయకులు అందరితో సమాలోచన చేసినాడు. కొందరు చక్రవర్తియే మహా సైన్యముతో వచ్చి తాకెనని బెదరించెదమనియు, కొందరు మన మచ్చటనుండియు, కోటలోనుండి వినీతమతియు తాకినచో నిరు సైన్యములు విరోధిసైన్యముల నుగ్గాడవచ్చుననియు దెల్పిరి. కాని సమదర్శియొక్కటే నిశ్చయించుకొనెను, ఝంఝూమారుతముచే సముద్రము మహా భయంకరముగా నున్నను నావికుని సామర్థ్యమున ప్రమాదముగా బోవు నౌకవలె, కట్టెను చీలగొట్టి చొచ్చిపోవు పరశుముఖము వలె, సమదర్శి మాళవ సైన్యముల జీల్చి కోటద్వారముకడకు బోవుటకు నిశ్చయించెను. ఏ ద్వారము కడకు తాను రానున్నాడో ఆ ద్వారముకడ సిద్ధముగనుండి గోపురద్వారము చటుక్కున తెరచి కొన్ని సైన్యములు వెలుపలికివచ్చి చీకాకుగూర్పవలె ననియు, రాత్రి అమిత వేగమున తాను వచ్చెదననియు

గోటలోనికి వార్తనంపెను.

రాత్రిపండ్రెండుగంటలగునప్పటికి కోటచుట్టుచున్న మాళవసైన్యములతో సమదర్శి తలపడెను. పేరుగాంచిన ఆంధ్రమల్లులు అయిదువేల సంఖ్యవారు పంక్తికి నాల్గువందల చొప్పున కలసి ముందునడచిరి. వారి ఎడమచేత దేహమంతయు గప్పు ఖడ్గమృగచర్మపు డాళ్ళుండును. కుడిచేత తొమ్మిదిఅడుగుల పొడవుగల వాడిశూలము లుండును. మొలను చిన్నకటారి యుండును. వీరందరు శూరులు, గజసత్త్వులు, చావవలెగాని వారు వెనుకకు తిరిగిరారు. వారిని ఆంధ్ర సైన్యాధిపతులు, చక్రవర్తులు ప్రాణాపాయములు వచ్చునప్పుడే గాని ప్రయోగింపరు. అట్టి ధీరులు ఆంధ్ర సైన్యముల ఏబదివేలున్నారు. భారతీయ సైన్యములు యుద్ధము చేయునప్పుడు గజముల గజములు, అశ్వముల అశ్వములు రథముల రథములుదాకింతురు. నేడు సమదర్శి మల్లులకీవలావల అశ్వదళములుంచెను. వీనివెనుక రథములు, అన్నిటికి వెనుక ఏనుగులనుంచి యుపాయముమై మోహరము పన్నెను.

ఆంధ్రవాహిను లిట్లమిత వేగమునవచ్చి తాకుటచే మాళవ సైన్యములు చీకాకు నందెను. అటు చటుక్కున దుర్గమహాగోపురద్వారము తెరువబడి వినీతమతి సైన్యములువచ్చి తాకుటచే మాళవులు చిక్కుపడిరి. ఈ కల్లోలములో సమదర్శి సైన్యములు జవమున మాళవ సైన్యములోనికి చొచ్చిపోవుచున్నది. ఆంధ్రమల్లులు తమ త్రోవ కడ్డమైనవారినెల్ల శూలముల కెరచేయుచు మరల నా శూలము లాగుకొనుచు ముందునకు సాగిపోవుచుండిరి. వారి కిరుదెసల అశ్వదళములు పార్శ్వరక్షణ మొనర్చుచుండెను. హిమ పాతమువలె వచ్చు నా సైన్యము బారిపడి రిపులు నడపొడ మాసిపోవుచుండిరి. సమదర్శి ప్రళయ కాలరుద్రుని వలె నుండెను. మహానది ప్రవహించుచున్నట్లు పోవుచుండెను. అతని సైనికులు సింహములవలె పోరాడిరి. మాళవదళములు ఆ రాత్రి యేమరుపాటునకు వెఱుగుపాటు తోడుగా గలగుండువడి, దిక్కు తెలియక, పంచ బంగాళమై విచ్చిపోయినవి. సమదర్శి సైన్యములకు దారి యిచ్చినవి. యుద్ధారంభమైన మూడుగంటలకు సమదర్శి సేనలు చెక్కు చెదరక భోజనాది వస్తు సామాగ్రితో దుర్గములోనికి చొచ్చిపోయెను. వినీతమతి సమదర్శిని కౌగలించు కొనియెను. కోటలో విజయనాదములు భేరీభాంకారములు మిన్ను ముట్టినవి. మాళవ సైన్యములు మొగములు వ్రేలవైచినవి.

మిడుతలదండువలెనున్న మాళవ సైన్యములు మరునాడు ధైర్యవిహీనములై యుద్ధము చేయనారంభించినవి. ఇంతలో సుశర్మ చక్రవర్తిపంపిన కొన్ని సైన్యములు వచ్చిచేరినవి. వానితో శివభూతివచ్చినాడు. అతడు మాళవాధి పతిని గలిసికొని యిట్లనియె: "మహారాజా! ఆంధ్రరాజు సైన్యములలో కొన్ని విడిపోవును. ఆతని కుమారుడు యువరా జీపాటికి నిర్వాణపథమునకు జేరి, బుద్ధుని గొలుచుచుండును. ఆ వార్త ఆంధ్రులకు తెలియజేయుటకు మేమే అంచెల నుంచినాము. ప్రతిష్ఠానము తక్షణము మన స్వాధీనము కాగలదు. మంజుశ్రీ యువరాజు కాగలడు. కాన మనకు భయములేదు. ఆంధ్రసైన్యము లింక కొన్ని నెలలవర కిచ్చటకు రాజాలవు. ఈలోన నీమూకలనుక్కడంచి మనము జాగ్రత్తపడి యెదము గాక. సార్వభౌముని సైన్యములు తేరుకొని వచ్చునప్పటికి కళింగమున సైన్యము లన్నియు తిరుగుబాటొనర్చును. విదేహరాజ్యము మనకు సహాయము నంపును. మన మహాసైన్యము లన్నియు కలసి ఆంధ్ర రాజ్యముపై దండెత్తి ఆ దేశమును ముక్కలు చేయవలయున. మంజుశ్రీ మనచేతిలోని కీలుబొమ్మ. ఫలవంతమగు ఆ రాజ్యమంతయు మన పాలిటిదగును కాన మనకేమి భయము" అని వచించెను.

మాళవుని మొగము విప్పారెను. ఆంధ్రసైన్యములకిక బాసటరాదనియు, కోటలోని సైన్యముల హతమార్చవచ్చుననియు, ధైర్యముగా నుండు డనియు, దొంగలవలె ఆంధ్ర

సైన్యములు రాత్రి శిబిరములు చొచ్చినవి కాని, లేకున్నచో పేరులేకుండ మాసిపోయి యుండుననియు సైన్యమంతట చాటిరి. జయజయనాదములు సల్పిరి. మాళవ సైన్యములు మహా సంతోషమున తేలియాడెను.

కాని శివభూతి తన పటకుటీరమున నస్థిరుడై గూర్చుండి ఇంకను ప్రతిష్ఠానము నుండి వార్తలేమియు రాలేదేమని మనోవేదన ననుభవించుచుండెను. "ఏమో! ఏమైనదో! ఏమికానున్నదో?" యని యాతడు పది సారు లనుకొనియెను.

## ౨౨
## ఆశ్రమము

కతిపయ దినంబులకు ధాన్యకటకమున కృష్ణాతీరమందు మహా చైతన్యమునకు కొలదిదూరములోనున్న స్థాలతిష్యాశ్రమమునకు మహేశా నందాది పండితులు చేరినారు. ఆ ఆశ్రమ భవనములన్నియు రాతివి. ఆ ఆశ్రమము చాల భాగ్యవంతమైనది. అన్నియు తోటలే. తోటల నడుమ ఆశ్రమగృహాలు, సమస్త ఫలపుష్పాదులు గల యా తోటలో ఒక భవనమున్నది. వృద్ధుడును, మహాయోగియు నగు స్థాలతిష్యుల వారందు వసింతురు.

స్థాలతిష్యులవా రాంధ్ర బ్రాహ్మణుడు. ఆపస్తంబసూత్రుడని పెద్దలందరు. తక్షశిలయందు, వారణాసియందు, నైమిశారణ్యమునందు పెక్కు సంవత్సరము లధ్యయన మొనర్చి, యందందు గురుత్వము సలిపి స్వగ్రామమగు కృష్ణాతీరస్థ రాజశైలమున వార్థకము గడుపుచుండెను.ఇట్టి మహానుభావుడగు యోగి తిరిగి విచ్చేసినాడని వినినంతనే మహా రాజాధిరాజు శ్రీముఖసాతవాహనుడు స్వయముగ నచ్చటికి విచ్చేసి ఆయనకు సకల సౌఖ్యముల సమకూర్చుట కనుమతినీయ బ్రార్థించెను. స్థాలతిష్యులు శాలివాహన సార్వభౌము నాశీర్వదించి, "మహారాజా! మీరు బౌద్ధ మతావలంబకులు. వేదములు పౌరుషేయము లనియు, యజ్ఞయాగాదిక్రతువులు హింసాత్మకములనియు, కర్మకాండ దూష్యమనియు వచింతురు. కలియుగ లక్షణములు మీ పాలనమున మూర్తిదాల్చుచున్నవి. మెలకువ నొందుట శ్రేయస్కరము. ఆంధ్ర వంశోద్ధారక! శాతవాహన వంశకులతిలకా! వృద్ధుడనగు నామాట వినుము. అనాదియగు వేదముల పుట్టుక నెవరు నిర్ణయింపగలరు? మీ శ్రమణకుడు వాక్రుచ్చిన భావనలు, నీతిబోధయు వేదములయందు లేవా? వేదనింద యొనర్చు నాస్తికధర్మమూని ఈ జాతిని భ్రష్టమొనర్పకుము. మహాచక్రవర్తులగు హరిశ్చంద్రాది నృపులవలె వేదధర్మ ప్రతిష్ఠచే యశము సముపార్జించుకొనుము. బౌద్ధదీక్షను వీడి పరబ్రహ్మదీక్షను గొనుము. భారతవర్షము నుద్ధరింపుము. సకలార్యలోకమట్టి చక్రవర్తికై ఎదురుచూచుచున్నది. మీచే రాజసూయంబు సల్పించెద. అగ్నిసమానుడు అర్థశాస్త్రవేత్త, కౌటిల్యుడు చంద్రగుప్తుని సామ్రాజ్యాభిషిక్తుని చేసినట్టు మిమ్ము నీ జంబూద్వీప సార్వభౌమ పదమున కభిషిక్తుని జేసెదను." ఈ ముక్కలని వృద్ధుడగు తపస్వి తేజోవంతములగు తన తీక్షణ దృష్టుల శాతవాహనుని మోముపై బరపెను.

సాతవాహనుడు చిరునవ్వు నవ్వెను. స్థాలతిష్యులు పట్టుదలగలిగిన ఆర్ష మతాభిమాని అని మహారాజెరుగును. "ప్రేమతత్వమే అహింసావ్రతోదరణమే మూల సూత్రముగదా యీ మతమున? ఇందలి పాపమేమి మహాఋషీ? బౌద్ధమతమునందు అశోకచక్రవర్తి కాలమునుండియు సామ్రాట్టులు దీక్ష వహించిరి. సమస్త మతములవారిని సమదృష్టితో పరిపాలించుచున్నారు. నే డా పద్ధతి మార్చుటకు మాకు కారణమేమియు కనబడదు. కాన మమ్ము క్షమింపుడు. స్నేహభావముతో మెలగితిరి. మహాభాగా! ఈ విషయమున మీతో తర్కింపజాలను. మమ్మనుగ్రహింపుడు" అని చక్రవర్తి వేడుకొనెను.

సోనుత్తర చండికాది పండితులు వచ్చిన యీదినమందు స్థాలతిష్యుని భవనమునం దొక్కమందిరమున నందరును సమకూడిరి. ఆ భవనమునందు విష్ణువు, శివుడు, బ్రహ్మ, ఇంద్రుడు, ప్రజాపతి, మహేశ్వరి, గజలక్ష్మి మొదలగు దేవతల విగ్రహములు కలవు. లింగమూర్తి పానవట్టమునం దొకచో ప్రత్యక్షమై యుండెను.

స్థాల్యతిష్య మహర్ష్యాశ్రమమునందు శిలామందిరాలలో తాపసులు, పండితులు, వేదవేదాంగ పారంగతులు, సర్వశాస్త్రవేత్తలు కుటుంబములతో నివసించియుండిరి. విశాలభవనములలో, మండపములలో, వృక్షచ్ఛాయాపీఠములలో బ్రహ్మచారులు దీక్షతో సర్వశాస్త్రములు అభ్యసించుచుండిరి. వారితోపాటు ఆశ్రమమున వేరొకచోటనున్న బాలికావిద్యా మందిరములో అనేకులు బాలికలు సర్వవిద్యలు నేర్చుచుండిరి. ఖేదనము, అశ్వారోహణము, రథచోదనము, గజ విద్య మొదలైనవి నేర్పుచుందురు. ఆశ్రమ మధ్యభాగమున కృష్ణానదీతీరమందు యజ్ఞయాగాది క్రతువు లొనరింపబడుచుండును. స్థాలతిష్యులు సర్వవిద్యా మహార్ణవ స్వరూపులు. వేదము లాయన ముఖమునందు ప్రజ్వరిల్లుచుండును. వేదభాష్యము లాయన ఫాలమున తేజరిల్లును. ఉపనిషత్తులన్నియు ఆయన చూపులలో తాండవించును. ప్రస్థానత్రయ మాతని హృదయము. అథర్వణవేద మాతని యీూడిగపుగత్తె. ధన్వంతరివలె ఆతని దక్షిణహస్తమున అమృతకలశమున్నది. తక్షకునివలె ఆతని వామహస్తమున విషకుంభమున్నది.

స్థాలతిష్యుని ఆశ్రమమునందు పురాణశ్రవణము, వేదాంతచర్చ, ధర్మశాస్త్రగోష్ఠి, సాహిత్యవిచారణ, ఆయుర్వేద, జ్యోతిష విచారణములు జరుగుచుండును.

సార్వభౌముడీ ఆశ్రమమునకు వలయు సౌకర్యములు అర్పించుచుండును. స్థాలతిష్యమహర్షి "నీ అర్పణయే నీకు నాశనము కాగల" దనిచిరునవ్వు నవ్వుకొను చుండును.

స్థాలతిష్యుని పూజామందిరమున ఎందరో పండితులు, మండలాధిపతులు, భూస్వాములు, మునులు, రాజకీయోద్యోగులు ఆ త్రయోదశినాడు చేరియుండిరి.

స్థాలతిష్యమహర్షి కృషభేశ్వరునియెదుట అలంకార రేఖావర్ణ సుందరమగు కాంకూరపత్ర కంబళిపై నధివసించి తపస్సు చేసికొనుచుండును. మండపమున చేరినవారందరు భక్తితో వివిధ కృష్ణాజినాద్యా సనములపై నధివసించియుండిరి.

స్థాలతిష్యుడు తపస్సు చాలించి, నీరాజన సమర్పించుచు, అచ్చట నున్న సువర్ణఘంటికను దక్షిణహస్తమునగొని క్వంక్వణ నినదము చేసెను. ఆ మందిరమున పూజాపీఠమునకు ఎడమవైపున నున్న ద్వారమున విషబాల ప్రవేశించినది.

తోడనే పీఠముదాపుననున్న నలుగురు భక్తులలో నొకడు శంఖము నూదెను. ఒకడు జేగంట గణగణ వాయించెను. ఒక డొక భాంకారముపై "భం భం" నినాద మొనర్చెను. ఒకడు ఉచ్చైస్వనంబున సూక్తపాఠ మారంభించెను. పలువురు భక్తులాతని కంఠముతో దమ కంఠములు మేళవించిరి.

## ౨౩
## అభిచారము

అచటనుండి స్థాలతిష్యమహర్షి ఆ మందిరముననే వేరొకయెడ ప్రజ్వాలించుచున్న

హోమకుండము కడ ఉత్తరాభిముఖుడై వ్యాఘ్రాజినముపై నధివసించి, గంభీరోచ్చాటనలతో అభిచారహోమము ప్రారంభించెను. ఆ అభిచార హోమము శత్రుమారణరూపమైనది.

"ఓ అగ్నివాయు సూర్య చంద్ర జలములారా!
మమ్మెవ్వడు ద్వేషించుచున్నాడో,
ఎవ్వని మేము ద్వేషించుచున్నామో,
అట్టివానిని మీ తాపశక్తిచే తపింపజేయుడు,
మీ దీప్తిశక్తిచే మండింపజేయుడు,
మీ దుఃఖదాయకశక్తిచే శోకింపజేయుడు,
మీ తేజశ్శక్తిచే నిస్తేజస్కునిగా జేయుడు."

"ఓ విషశక్తీ! నీవు ఈ భయంకర సౌందర్య నారీరత్నమునందు సంపూర్ణవేగముతో కూడుదువుగాక
ఓ కాలకూటవిషమా! నీవు లోకాలను దహింతువు. నీ దహనశక్తి మా శత్రువును దహించివేయుగాక
ఓ దంష్ట్రాకరాళ మృత్యుమూర్తీ! నీ వీ బాలికయందు ప్రవేశింపుము.
ఓ సౌందర్యనిధులైన దేవతలారా! ఈ బాలిక ప్రతి అవయవము నందు, ప్రతి ఇంద్రియమునందు, ప్రతి శక్తియందు ఆవేశింతురుగాక
ఓ ఉషోదేవతా! నీ వీ బాలిక ముఖమగుదువుగాక
ఓ చంద్రమూర్తీ! నీ వీ బాలిక వపువగుదువుగాక
ఓ మిత్రావరుణులారా! మీ రీ కన్య రెండు నేత్రము లగుదురుగాక
ఓ అగ్నీ! నీ వీ బాల కన్నులలో వెలిగెదవుగాక
ఓ మేరుపర్వతమా! నీ వీ యువతి స్తనముల శోభింతవుగాక
ఓ నదీ దేవతలారా, మీ రీ బాలిక నూగారులగుదురుగాక
ఓ శచీదేవీ! నీ వీ బాలిక పెదవులపై నర్తించెదవుగాక
ఓ ఆకాశమా! నీ వీ సుందరి నడుమునందు చేరుము
ఓ మరుద్దేవతలారా! మీ రీ యువతి ఉచ్ఛ్వాస నిశ్వాసములయందు మసలుదురుగాక
'ఓ మంత్రమా! నీవు మహాశక్తిచే మా విరోధుల నీ బాలికకడకు ఆకర్షింపుము.
నీవామె వాక్కులో, చూపులో, పెదవులలో, ఆమె స్తనములలో చేరుము.
ఈ బాలిక శరవేగ యగుగాక
ఈ సుందరి శ్రీకృష్ణ శాతవాహనుని అగ్ని శలభము నాకర్షించి నట్లు ఆకర్షించుగాక
ఈ బాలిక శ్రీకృష్ణశాతవాహన విగ్రహమునకు వలయగుగాక
ఈ సుందరి శ్రీకృష్ణసాతవాహనుని మృత్యువగు గాక
ఈ యువతి శ్రీకృష్ణసాతవాహనుని దగ్ధముచేయుగాక!"

అనుచు నభిమంత్రించుచుండ నా బాలిక మైమరచి, ఊగిపోవుచు, పద్మాకృతియగు రంగవల్లిలో నిలిచియుండెను.

ఆ బాలికపై స్థౌలతిష్యుడు మంత్రజలము జల్లినాడు. ఆమెను చుట్టి ప్రయోగహస్తము పట్టినాడు.

మధ్యాహ్నమార్తాండునివలె తేజరిల్లు మోముతో స్థౌలతిష్యుడప్పుడు సభ్యులదిక్కు మొగంబై,

"ఈ బాలిక దివ్యాస్త్రము
ఈమె ప్రయోగింపబడిన మృత్యువు
స్వచ్ఛమై స్నిగ్ధకాంతులలో మెరయు
నక్షత్రము లామె కన్నులు.

"అందు వెడలు చూపులు మృదులసువాసనాలహరీపూర్ణములగు మనోజ శరములు కావు, భయంకర దావాగ్నికీలలు.

పక్వబింబము లా యధరములు, ప్రవాళకాంతులు, కల్యబాలా పరమ సౌందర్య నర్తనములు, అవి సుధానిధానములు కావు, తక్షకవదనదంష్ట్రాయితములు.

సమస్తజీవరాసులకు ప్రాణరస మర్పించు పావననదీనదంబులకు పుట్టినిళ్ళు ధరాధరములా? మదగజకుంభములా? ఈ సుందరీవక్షోజములు, ఇవి దుగ్ధాంభోధి మథనసంజాతామృతకలశములు కావు, కాలకూటవిష కుంభములు.

ఆ దేహమున జాంబూనదరజఃపరాగములు రేగుచున్నవి. ఏమిమార్దవము! తరుణకేతకీ కోమలమగు నిది అగ్నితప్తకనక క్రకచము. రూపెత్తిన యీ పరమాద్భుతశిల్పాశయము, యీ మనోహర మృత్యువు, యీ సమ్మోహనశాపము, యీ రమణీయాగ్ని కీల, యీ మహోజ్వలవిద్యుజ్జిహ్వ యీ బాలిక!"

స్థాలతిష్యుడు కంపితహస్తము చాచి "పండితులారా! ఈమె నాముద్దుల మనుమరాలు. నా కుమారున కీమె యొక్కతే సంతానము. నేను నా పుత్త్రు నెట్లు ప్రేమించియుంటినో, నా ప్రేమకు పాత్రుడై యాతడెట్లు శుశ్రూష చేసెనో అది లోకమున కెరుక." స్థాలతిష్యులకు కన్నుల నీరు తిరిగినది. బొటనవ్రేలిచే నాతడు బాష్పముల విదిలించెను. "అట్టి మహాపండితుడు, సుకుమారరత్నము దివంగతుడైనాడు. మహాపతీవ్రత నా కోడలుపతి చిహ్నాతో సహగమనము జేసినది. తల్లిదండ్రుల ప్రేముడికి దూరమైన ఈ శిశువు మదేకగతి; ఈ వృద్ధుడు తదేకగతి. ఈమెను మనయజ్ఞమునకు ధార పోసితిని. ఈమె దేహ ప్రాణములు, మౌనము అంతయు జగద్ధాత్రి లోక పావని యగు మహాశక్తికి అర్పించినాను. తండ్రి చంద్రబాలయని నామకరణముచేసెను." స్థాలతిష్యుని కన్ను లంత జాజ్వల్యమానమై "ఈమెను పరమేశ్వరుని కంకిత మిచ్చితిని. నా నిధానమును వైదిక ధార్మాగ్నిలో కల్పితిని. ఈమెయే మన సర్వవాంఛలను దీర్చు కల్పవృక్షము. ఈమెయే ఈ పుణ్యభూమిని పవిత్రమొనరింపజన్మించిన కామధేనువు."

ఆతని తెల్లని గడ్డము, ఊర్ధ్వశిఖ రచించిన ధవళ జటాజూటము, పండువంటి దేహచ్ఛాయ ఇటునటు ఊగిపోయినవి.

## ౨౪
## శలభము

అంత నందరును జూచుచుండగనే చళుకవిషయపుగోడెవలె బలసియున్న పడుచువాడును, నాగవిషయమున గృధ్రమండలాధిపతియు నగు మలయనాగప్రభువు సోమపానము చేసి మత్తిల్లిన క్రతుకర్తవలె లేచినాడు. కండలు కట్టిన తన రెండుచేతులు ముందుకు చాచి, కెంపెక్కిన చూపులు విషకన్యకమోమున నిలిపి, ఉన్మత్తుడై అగ్నిని కౌగలింపబోవు శలభమువలె, వ్యాఘ్రమును జూచి మృత్యువశమున దద్వివృతాస్యమున నులుకు లేడివలె ఇతరులు అడ్డుపడులోపల ఆ బాలవంక పరుగిడిపోయి యామెను

కౌగిలించి యామె పెదవులు ముద్దిడబోయినాడు.

ఆ బాలిక భుజములు రెండును గట్టిగా నదిమిపట్టినాడు. మృదుల వల్లికామ తల్లికవలె నున్న యా విషకన్య యా కర్కశహస్తపీడనమున కోరువ జాలక, ఆతని చుంబనమున కేవగించుకొని తల వెనుకకు వంచినది. ఆమె నిశ్వాసములు భయంకర భుజగిపూత్కారములై మలయనాగుని నాసికారంధ్రములలోనుండి, తెరచియున్న నోటిలోనుండి లోనికి బోయినవి. సభాసదు లింతలో నా దురాచారుని చేతులనుండి బాలికను విడిపించిరి.

మలయనాగుడు ఆ విషవాయువుల పీల్చినలిప్తలో కనులు తిరుగ, నోట నురుగులు గ్రమ్మ చాపచుట్టవలె నేలపై విఱచుకపడెను.

సభ్యులందరు గొల్లుమనిరి. చంద్రబాల క్రోధరూపిణియై రోజుచు ఇటునటు ఊగిపోవుచుండెను. ఆ బాలికకేశపాశము ఊడిపోయి, మేఘములు క్రిందికి దిగునట్లు సువ్వునపడిపోయెను. తప్తజాంబూనదకలశముల వంటి ఆమె వక్షోజములు పైకి ఉబుకుచు తగ్గుచున్నవి.ఆమె మహాప్రళయము, భయంకర కాళికాదేవి, ఆమె శివత్రిశూలము, ఆమె చక్రధార!

సభ్యులందరు భీతులై వైవర్ణ్యమొందిన మోములతో దావానలము జూచు అరణ్యమృగములవలె వణకిరి. స్థాలతిష్యులు వికృతానందముతో కలకలలాడు పెదవుల నొకశంఖ మొత్తుటయు, పలువురు సేవకులు విచ్చేసి యా శవమును తరలించిరి.

మలయనాగుడు ఆంధ్రదేశములో నివసించు కొన్ని నాగవంశములకు ప్రభువు. ఆంధ్రార్యులకంటె ముందుగనే ఆంధ్రదేశమునంతను నాగులాక్రమించుకొని యుండిరి. ఉన్నతశరీరులు, శ్యామలాంగులు నగు నాగులుత్తరభూములనుండి వచ్చి దక్షిణాపథమును రామాయణ కాలానంతరమందాక్రమించిరి. అంతకుముందే స్వల్పసంఖ్యాకులగు నాంధ్రర్యులు కృష్ణవేణి ముఖప్రాంతమున నివసించియుండిరి. పాండవకాలము నాడార్యులు విరివిగా వచ్చి నాగదేశము జొచ్చి నాగులతో సంబంధబాంధవ్యముల నెరపు చుండిరి. ఉలూపి కథయు, పురుకుత్సుని గాథయు నిట్టివియే.

నాగులకు సామంతరాజ్యము లుండెను. అట్టివారిలో మలయనాగు డొకడు. నాగులందరు బౌద్ధమతావలంబకులే. కాని పట్టుదల కలిగిన బ్రాహ్మణులు కొందరు వీరికి ఆర్యదీక్షల నిచ్చి తమవైపునకు త్రిప్పుకొని వారిచే మిక్కుటమగు సహాయము నందుచుండిరి.

సభ్యులలో భయ మిసుమంతయు తగ్గలేదు. మహావనశాల గ్రామమున సభా కార్యక్రమము నిర్వర్తించిన వ్యక్తి లేచి భక్తియు, భయమును గదిరిన కన్నులతో స్థాలతిష్యుని దిక్కు మొగంబై యిట్లనియె. మహా ఋషీ! మలయనాగుడు నాగులలో నుత్తమవంశ్యుడు. ఆతడు మాయమగుట ప్రజలకును, ఆంధ్ర రాజునకును తెలిసినచో మన జీవయాత్రలు ధాన్యకటకపాతాళగృహంబుల గడుపవలసినదే! ఇప్పుడు మనకు దారియేది?"

స్థాల: ఓ శివస్వాతీ! నీవు మాగధుడ వగుట తెలిసిపోయినది. మలయనాగుని దేహము ఓషధీరసంబుల చెక్కు చెడకుండును. ఏ భక్తునకు ఫాలనేత్రుడు, సర్వసృష్టి కారణుడు, మహాలింగమూర్తి సర్వవిషశక్తుల నిచ్చెనో యాతని కా పరంజ్యోతి వాని విరుగుడుల ప్రసాదింపడా? హాలాహల విషంబుల నవలీలగ ద్రావిన లోకేశ్వరుడు విషనివారణ మంత్రముల నాతని పాదముల భజించు భక్తులకు సమకూర్చడా? అప్పుడే

మలయ నాగుని శరీరము ఓషధులచే తడుపబడెను. మహా విషపూరితయగు నా బాల నా ప్రాణములకు ప్రాణము, నా కోర్కెలకు నిధానము. చంద్రబాల యొక్క నిశ్వాసముల వడిని తగ్గింప ఒక వారము దినములు పట్టును. అంతవరకు నా తుచ్ఛుడటుల పడియుండవలసినదే.

ఆ వృద్ధుడు కన్నుల విస్ఫులింగములు రాలుచుండ, ఉచ్చైస్స్వనమున నిట్లనియె: "సభాసదులారా! మీరే యిట ధర్మవ్యవహర్తలు కండు. నా బాలను పరమేశ్వరున కంకిత మొనర్చితిమి. పవిత్రవేదమత పునరుద్ధరణ మహా కార్యమునకు నియోగించిన యీ శుభాంగియెడల పాతక మొనర్ప నెంచిన ఈ కర్మ చండాలుడు జీవింపవలసినదేనా? జీవమిచ్చినపక్షమున దైవాయుధమగు నీ బాలయందు మరల మరులుకొని మన ప్రయత్నములు భగ్నముచేయడా?"

మహేశ్వరానందుడు: స్వామీ! ఈతని మరణ మెట్లు కప్పిపుచ్చగలము? స్థాల: రెండు దినములలో నొక రథము ఈతని శరీరమును ఈతని పురమునకు గొనిపోగలదు. ఊరిబయట చేత నొక కత్తితో నీతడు పడియుండును. ప్రక్కనే నాకడనున్న పామొకటి రెండు తుండెములై కాలికడ పడియుండును. అతని కాలిమీద పాముకాటు స్పష్టముగ కనబడును.

అక్కడనుండు సభ్యులకు దేహము జలదరించెను.

వికృతహాసముచే బీభత్సమగు తాతగారి మోము చూచుచు చంద్రబాల చటుక్కున వచ్చి యాతని పాదములకడ మోకరించి వానిపై మోముంచి కన్నుల నీరు వెల్లువలు గానిట్లు పలికెను: "తాతయ్యాగారూ! ఈ తుచ్ఛుడు నిజముగా మరణించినాడా? నావలననే వీనికి జావు మూడినదా? నేనే వీనిపాలిటి మృత్యువునైతినా?" అని వాపోయెను.

స్థాలతిష్యుడు విసుగుదలతో నామెను లేవనెత్తెను. ఈమె ఓర్వలేకపోవుట యేమి? ఈ బాలిక తనచేతిలోని - కాదు, విధిచేతులలోని - శస్త్రము. నాశనముచేయుట, నాశనము చేయకపోవుట ఆ పని దీనిది కాదు. చిన్నతనము నుండియు నీమెకు హృదయము నశించునటుల తానొనర్చినాడు. ఈమె సుకుమారాంగములందు, మానసమునందు క్రూరత్వము నింపినాడు. మృత్యువును పూరించినాడు. పసితనమునందు లేగదూడల, హరిణముల ప్రాణములు హరించి ఆటగా కిలకిల నవ్వెడిది.

ఈ బాల కిప్పు డీ జాలి యేల పొడమెను? స్థాలతిష్యుని భ్రూయుగ్మము దరిచేరినది. ఆతని విశాలఫాలమున దున్నిన భూమియందువలె ముడతలు వేనవేలు జనించినవి. ఈ కన్యకాహృదయమున కింకను క్రూరత్వమే పోసెదగాక యని యాత డాలోచించుకొనెను.

"ఓ విషకన్యా! నీవు అగ్నికీలవు, విషకలికవు, మృత్యుధారవు. నీ దేహము కౌగలించిన పాపి నరకమునకుబోవును. నీవు ఉన్నతకులమున జన్మించిన మహాశక్తివి. ఈశ్వరార్పితవు. పరమపవిత్రవు. ఈ నీచుడునీపై చేయి వైచి కలుషమొనర్చినాడు. మహాగ్నికీలను గౌగిలించినవాడు బ్రతుకునా? అవితథమైన విధియెత్తికోలున కడ్డముపడి యీ నిర్భాగ్యుడు హతుడైనాడు. వీని నెవ్వరు రక్షింపగలరు? ఈశ్వరనివేదితమును ముట్టిన యీ కుక్కకై వగవకుము. వీనిపాపమే దీనికి మిత్తియైనది. సదాశివగర్భాలయమున వెలుగు దీపార్చివలె నీవు పరమపవిత్రవు. నీపావిత్ర్యము రక్షించు కొనుము."

చంద్రబాల ఆతని మరణమునుగూర్చి యాలోచించుచు మిన్నకుండెను. సభ్యులు భయము గదురు హృదయములతో తలలూపిరి.

స్థాలతిష్యులంత “ఈ ముహూర్తమున దోష మున్నది కాన వేరొక్క ముహూర్తము నిర్ణయింపబడును” అనెను. ప్రాయశ్చిత్తార్చన జరిగినది. పారాయణ మొనర్చిరి. దీపారాధన అయినది. నైవేద్యార్పణ జరిగెను. స్థాలతిష్యులా పుష్పముల విషబాలమూర్ధమున నుంచి గాన మొనర్చెను.

“చండమహానల ఫాలవిలోచన!
కాలకాల! ఖలగర్వవిదారణ!
అండజవాహనమిత్ర! శుభంకర!
హర! హర! హర! హర! యీశ
మహేశ మహేశ మహేశ!”

## ౨౩
## సమావేశము

హిమబిందుకుమారి తన ఇంటికి వచ్చినదని తెలిసిన వెనుక సువర్ణశ్రీ కుమారుడు ఆ బాలికకు కనిపించుటకు సిగ్గుపడినాడు.

పాపము, వారిబండి వెనుకబడిపోయినది. తనగిత్తలు అద్భుత వేగము కలవి. సమవర్తిసేనాపతి తోలిన బండి ఆ సుందరిదని తెలిసినచో తాను రెండవవాడుగా వచ్చియుండునే! ఇప్పుడామెను చూచితీరవలయును. ఆ దివ్య సౌందర్యము చూచినంత మాత్రమున తనజన్మ మంతయు పవిత్రముకాదా!

కాని తా నె ట్లామెయెదుట బడగలడు? ఆమె తనను మొరకు వానిని, సౌందర్య హీనుని, వట్టి బొమ్మలు చెక్కుకొనువానిని ఆ దీర్ఘవినీల పక్ష్మముల నెత్తియైన చూచునా?

అవి కన్నులా, లోక మోహన నిశ్చల యామినీ మాయలు కాని! ఆ కన్నులలోని చూపులు, నిర్మల రాకాసుధాకర కళాకోటి! ఓహో తా నెట్లు ఆ చూపులలో అమృతత్వ మొందగలడు?

సువర్ణశ్రీ చల్లగా తన శిల్పమందిరమునుండి వినిర్గమించి, కృష్ణయొడ్డునే యెటకేని పోయినాడు.

అతడట్లు పోయి పోయి, ఎటుల పోవుచున్నదియు తెలియక, కోటి దీప కళికాప్రజ్వలమై దివ్యరూపమైన మహాచైత్యముకడ కరుదెంచినాడు.

ఆ చైత్యమును బౌద్ధశకము నూటపదునారవయేట మహాభక్తుడగు హిరణ్యా వ్యాఘ్రపాదశాతవాహనుడు అప్పటి ధాన్యకటక నగరమునకు దూరమున కృష్ణాతీరమునకు కొలది దూరములో ప్రారంభించెనట.

అశోకచక్రవర్తి కాలమునకే ధాన్యకటక చైత్యము పేరునకు వచ్చి యుండెను. అప్పుడశోకుడా చైత్యమును పునర్నిర్మాణ మొనరింప శాతవాహన చక్రవర్తిని కోరి యుండెను. అశోకునకు సమకాలపు ఆంధ్ర ప్రభువు అజితదత్త శాతవాహనుడు. అత డా చైత్యమును ఇంకను పెంచి పెద్దదిగ నొనర్చెను.

అభయబాహు శాతవాహన చక్రవర్తి కాలమునాటి కా చైత్యము పూర్ణరూపము నంది బౌద్ధక్షేత్రమని పేరందెను.

శిల్పచక్రవర్తియు, శిల్ప బ్రాహ్మణవంశములో మహోన్నత యశో విరాజితుడును అయిన ధర్మనంది ఆ చైత్యమును దివ్యమొనర్చి ధర్మ చక్రములు, చతుర్ముఖములు, ఆయక స్తంభములు నిర్మించెను. ప్రదక్షిణాపథ మేర్పరచెను.

ప్రదక్షిణపథమును చుట్టి ప్రాకారరేఖ ధర్మనంది రచింప నారంభించి, శిష్యులచే ఊర్ధ్వస్తంభములు, సూచులు, ఆబంధికములు,ఉష్ణీషములు నిర్మించ ప్రారంభించినాడు.

బుద్ధధర్మము మహాస్థవిరవాద మనియు, మహాసాంఘికవాదమనియు రెండు మార్గముల ప్రవహించినది. మహా సాంఘిక వాదమున ఆంధ్రులు తమకున్న కళారక్తిచే, కళావేశముచే మహాచైత్యవాదము నిర్మించిరి.

ఈ శిల్పవాదము భారతవర్షమంతయు నిండి, యీ జంబూద్వీప మంతటి నుండియు శిల్పుల, ఆచార్యుల, శ్రవణకుల, భిక్షుల ఈ మహాపథ ప్రస్రవణ స్థానమైన ధాన్యకటకమునకు శిష్యులుగా పంపుచున్నది. ధర్మనంది మహాచైత్యవాదమునకు ముఖ్య శిల్పాచార్యుడు. అతని పవిత్ర హస్తము రచించిన త్రిరత్నములయిన పద్మములు, బోధివృక్షములు, చైత్యములును ప్రజ్ఞా స్వరూపములైన జాతక గాథలును లోక విఖ్యాతి నందినవి.

ఆ సంపూర్ణ జోత్స్నాకాంతిలో సువర్ణశ్రీ తన తండ్రిగారి శిల్ప చాతుర్యమును జూచుచు, ఉప్పొంగిపోవుచు, తన శిల్పపుంబనుల గమనింపుచు, ఆ పనులలో తక్కిన శిష్యుల పనితనముకన్న ఎన్నియోరెట్లు మిన్నయగు పనితనమున్నను, తన తండ్రిగారి పనితో పోల్చిచూచిన, తన పనితనములో ఏదో అపరిణతి యున్నదని యనుకొనెను.

ఈ ఆలోచనలచే మై గుబాళింప, ఆతడు ఆ పవిత్రచైత్యము ఎదుట సాష్టాంగపడి లేచి మోకరించెను. తన జనకుని మహోత్తమ రచనా ప్రజ్ఞ ధారణచేసిన ఒక బాలికా రూపముకడ నాత డధివసించి తన తల్లి శక్తిమతీదేవి పోలికలనందు గుర్తించినాడు. ఈ విచిత్రరహస్యము ఇంతకాల మెట్లుదాగున్నది?

ఆర్యకస్తంభ చూళికా వ్యాజమున దేవీప్రతిమగా తన తండ్రి యౌవనవతియైన తన తల్లి శిల్పచిత్రమును రచించినాడు. త్రిభంగియై కుబేరాక్షీ వృక్షము నానుకొని లతవలె వంగి, ఎడమచేత లేతకొమ్మ విలాసముగ బట్టుకొని, కుడిచేత లీలాపాటలీపుష్పము ధరించి హృదయము లీలగా స్పృశించుచు, జటాశిఖ ధరించి, సర్వాలంకారయై, యా బాలిక తోరణశిఖావాతాయనాంతర్గతాలంకార శిల్పరూపమున విన్యసింపబడి యున్నది.

సుందరీమణులగు లతాంగులకును, శిల్పమునకు నుండు అద్భుత సమయ రహస్యములు సువర్ణశ్రీకుమారున కెన్నడు ప్రత్యక్షము కాలేదు. ఇప్పుడాతని సర్వశిల్ప శాస్త్రమంత్రము లొక్కసారి పవిత్రగానశ్రుతులై స్పందనమొనర్చినవి. ఆ విగ్రహమును తదేకదీక్షతో గమనించుచు సువర్ణశ్రీ లేత రావి చెట్టువలె నిలుచుండిపోయినాడు. సమున్నత శరీరియైన యా బాలకుడు స్వర్గమునుండి దిగివచ్చిన దేవకుమారునివలెనున్నాడు. ఆతని హృదయములో శిల్పశక్తి ఊర్మికలై, ప్రవాహములై ఉప్పొంగి మహాప్రళయమైనది. ఆతడు సర్వము మరచినాడు. ఆ శక్తి ప్రవాహములు ప్రవహించి, వేరొకపుణ్యభూమి నుండి ప్రవహించి వచ్చిన సురదీర్ఘకానదీమతల్లియైన ప్రేమశక్తితో సంగమమైపోయినవి. ఆ ద్విప్రయాగ మూర్తియగు నొకదేవి యచ్చట దర్శనం బిచ్చినది. మనోహరగంధ మలయ పవనములు సువర్ణుని చుట్టివేసినవి.

ఆ దివ్యమూర్తి నాట్యదేవతవలె ప్రత్యక్షమై, వివిధాంగహార మనోజ్ఞ రేఖా విలాసినియై,

సంపూర్ణరాగరంజిత మనోజ్ఞ గీతికాగానాభినయ కంఠియై, విద్యున్మాలినీహార చలిత పీనవక్షయై తోచినది.

ఆ మూర్తి నాట్యము చాలించి ఎదుట నిలిచినది. సువర్ణశ్రీ ఆ స్వప్నసుందరివైపు బలపూర్ణములై, మహానాగములవలె శక్తివంతములై, మనోహర ప్రౌఢరేఖాసమన్వితములైన తన రెండుచేతులు చాచి మోకరించినాడు.

“ఓ శిల్పదేవీ! సకలమనోజ్ఞ భావపరిపూర్ణరూపా! సర్వరాగనర్తిత కల్యబాల! పరీమళ పుష్పాలంకార వైభవోపేత పారిభద్రతరుమూర్తీ! నీవు ఈ వెన్నెలలో నాకు ప్రత్యక్షమైనావా?” అని అస్పష్టవాక్కుల నమస్కరించినాడు.

పులకితానందశిరీషవృక్షమగు నాతని విగ్రహ మా వెన్నెలలో శ్రుతియై మంజుశ్రీ మూర్తివలె తేజరిల్లి పోయినది. ఆతని కంఠము ఇంకను స్పష్టత తాల్చినది. మధురాభిషేకోచిత శంఖ వినిర్గత స్వనములై యాతని మాటలు వెలువడినవి.

“హిమబిందువా నీవు! ప్రఫుల్లనీరేజహృదయస్థ ప్రాతఃకాల తుషార బిందువువా నీవు!”

అంత నాతని యా స్వప్న మధ్యమునుండి “బాలనాగీ దారి ఇమ్మనవే!” యన్న మాటలు వినవచ్చినవి. ఆతడులికిపడి తలయెత్తి స్వప్నలోకము పటాపంచలై మాయము కా, నెదుట హిమబిందుకుమారి నిజముగ నిలుచుండుట గమనించి సిగ్గునంది, చటుక్కున లేచి వెనుకకు తిరిగి పారిపోయినాడు.

# ౨౬

# రాగారుణచ్ఛాయలు

సువర్ణశ్రీకుమారుడు తన సౌధమున కెట్లెట్లో చేరెను. ధర్మనంది యిల్లు చతుశ్శాలాంతరమైన హర్మ్యము. ఈ హర్మ్యమునకు రెండు మేడలున్నవి. ఒకమేడ శుద్ధాంతజనము వసించునది. ఆ మేడ వెనుక స్త్రీజనాశ్రయమైన మండపగృహమును, సూతికాగృహమును ఉన్నవి. మేడల మీదకు పోవుటను రెండు సోపానపంక్తులు కలవు.

సువర్ణశ్రీకుమారుడు దక్షిణ సోపానపంక్తి నెక్కుచు సౌధములోని తన మందిరములోనికి పోయి యా మందిరముననున్న శయనాగారము చేరి పర్యంకమున బోర్లగిలపరుండి మహాచైత్యమందలి దివ్యదర్శనమును స్మరించుకొనుచు, భయపడుచు, ఉప్పొంగుచు వివిధాలోచనాధీనుడై జాగర స్వప్నవశుడైనాడు.

తనమాట ఆమె విని యున్మత్తునిగ భావించలేదుగదా! తా నట్లు చేసినాడేమి? తన ఇంటికి వచ్చిన యా బాలిక యింతటిలో నచ్చటి కెప్పుడు వచ్చినది? నిజముగ నామె యచ్చటికి వచ్చెనా? తలలోని కాంక్షయే యట్లురూపెత్తి వచ్చినదా? నిజముగ నామెయే వచ్చియుండవలయు. ఏలనన, యామెకు కొంచెము ఎడముగ వెనుక వేరొక్క బాలిక కనంబడినది. ఇంకను వెనుక దూరముగ నిరువురు వృద్ధ స్త్రీలమాటలు విననైనవి. తా నట్లు స్పష్టముగ ఉచ్చరించిన వాక్కుల విని యా దివ్యసుందరి నిజముగ తన్ను మతిహీనునిగ నెంచియుండును.

ఆమె పండు వెన్నెలలో పోతపోసిన స్వర్ణవిగ్రహమై సాక్షాత్కరించినది. ఆమె ఏమనుకొనిన నేమి? పూజా ద్రవ్యములే చెంతనున్నచో అట్టి యతిలోక సౌందర్యమునకు షోడశోపచారము లర్పించియుందునుగదా!

ఆమె యెక్కడ? తా నెక్కడ? వర్తకసామ్రాట్టయిన చారుగుప్తుని తనయ యేడ, దరిద్రశిల్ప బ్రాహ్మ కుమారుడైన తా నేడ?

మరల తన కా బాలిక సందర్శన మిచ్చునా? అతిలోక సౌందర్యమును పూజాపీఠిక నెక్కింపగోరని శిల్పియుండునా! ఆ దివ్యసౌందర్యము ఈ బీద యింటియందు వాసము చేయగలదా!

ఇంతలో అతనికి మహానసగృహమునుండి గంట విన్పించినది. తండ్రి గారి అర్చన పూర్తియైనదనుకొనుచు సువర్ణశ్రీ లేచి మేడమెట్లు దిగి స్నాన గృహమునకు పోయినాడు. పనికత్తె అచ్చట వేడినీళ్ళు తొలిపి పెట్టి యుంచినది. అంగ సంస్కారకుడు వచ్చి దేహమంతయు మార్జన నలంది ఉద్వర్తన మొనర్చి స్నానము జేయించినాడు, నాగబంధునికవచ్చి "అన్నా, యింత యాలస్యము చేసినావేమి, ఎచటకు పోయితివి? అట్లు మాయమై పోయినావు! నీ శిల్పగృహమునకు వారందరు వచ్చిరి. నీవు లేవైతివి. నీ కొరకు తోట యంతయు, దొడ్డియంతయు చెల్లి వెదకినది. నీవు అదృశ్యుడవైతివి. పాపము, నా స్నేహితురాలు కొంచెము భిన్న మైనదిసుమా! పలాయనమంత్రపారాయణ కథానాయకుడ వైతివేమి!" అని మేలమాడెను.

"నీ వేళాకోళముల కేమిలే!"

"నావి వేళాకోళములు; తాను పారిపోవుట వీరవిక్రమమట. ఇంటికి చుట్టములు,

స్నేహితులు వచ్చినచో పారిపోవు పెద్దమనిసితనము మా అన్నగారిది. ఆ శిల్ప మట్టిది, యీ శిల్ప మిట్టిది అని నీవు చెప్పనక్కర లేదా?"

"ఓ మగవీరుడు చెల్లీ, నీకు తెలియదా! నీ వేల చెప్పవైతివి? ఎవరో శుద్ధాంతకాంతా జనము వచ్చిరట! నేను వారియెదుటబడి యిది యిది, అది అది అని చెప్పవలెనట!

"ఎవ్వరికిని ఏమియు చెప్పనక్కరలేదులే శుద్ధాంతకాంతాజనము, వీరవిక్రమ విహారజనము ఎవరైన వచ్చినప్పుడు మా అన్నగారు లేడీ పిల్లవలె బెదరి, చెంగున నురికి పొదలలో మాయమైపోవునట. ఈ ధైర్యమే కాబోలు మొన్న శకటపందెములో నెగ్గించినది."

ఇంతలో సిద్ధార్థినిక వీరున్న తావునకు వచ్చినది.

సిద్ధా: అన్నా! నీ వెచ్చటికి పోయినావు? హిమబిందును, ఆమె అమ్మమ్మయు, ఆమె మేనత్తయు నాయనగారి బొమ్మలును, నీ బొమ్మలును దీక్షతో గమనించినారు. హిమబిందు అక్కను, నన్ను ఎన్ని ప్రశ్నలు వేసినదని! అక్కయెంతో చిత్రముగ మాట్లాడినది.

నాగ: నే నేమి చిత్రముగా మాట్లాడినానే? ఇంత వెట్టిదానవు. నాకు చెల్లెలివై పుట్టినా వేమే! హిమబిందు నిన్నట్లు ముద్దు పెట్టుకొనినప్పుడు నీ వంత సిగ్గుపడితివేమి?

సువర్ణ: ప్రపంచములో అందరును నీకు సిగ్గుపడువారే.

సువర్ణ శ్రీకుమారుడు భోజనమునకై దుకూలము ధరించి, అలంకార గృహమున కేగి యచ్చట మార్జనకునిచే తల దువ్వించుకొని, ముడి రచియింపించుకొని, పైన చీనాంబరమును కప్పుకొని తిలకము దిద్దుకొని, యీవలకు వచ్చునప్పటికి మహాలియు, శక్తిమతీదేవియు, సిద్ధార్థినికయు, నాగబంధునికయు ప్రత్యక్షమైరి.

నాగ:అమ్మా! అన్న భయపడి పారిపోయినాడే.

సిద్ధా:అన్న భయపడుటేమి! ఎవరో ఆడవారు వచ్చినారు గదాయని ఎచ్చటికో వెళ్ళినాడు.

నాగ: అవును. బెదరిన లేడివలె వెళ్ళినాడు.

శక్తి:ఊరుకోవే తల్లీ! కొత్తవారి యెదుటపడుటకు అన్నకు కొంత సిగ్గువేసిన, దాని నంతగడబిడ చేసెదవేమి?

నాగ: అన్న శిల్పములు చూచుటకు వారు వచ్చిరాయెను. పోనీ, నా స్నేహితురా లీయనకు క్రొత్తా? తన చుట్టును మేమందరము నాట్యము చేసితిమి కదా!

మహా:ఉండవమ్మా తల్లీ! అన్నగారి నట్లు దుయ్యపట్టుకొంటి వేమి? నీవు లేవా, అన్నియు చెప్పుటకు? వారు సువర్ణుని చూచుటకు వచ్చిరా, బొమ్మలు చూచుటకు వచ్చిరా?

సిద్ధా: అమ్మా, అక్క యెప్పుడును నన్ను, అన్నను యీ విధముగానే వేళాకోళములు చేయుచుండునే. నాకు ఎప్పుడో కోపమువచ్చును. నేను నాన్నగారితో చెప్పితీరెదను. సువర్ణ: అందరు ఇచ్చట చేరినారు. అచ్చట నాయనగా రీపాటికి జపము చాలించి యుందురు. పదండి భోజనములకు. అమ్మయు, మహాలియు వడ్డనమాటే మరచిరి.

తండ్రిగారును, సువర్ణశ్రీయు, ముప్పదినలువురు విద్యార్థులును భోజనము చేసిన వెనుక సేవకుడు కరదీపిక చూపించుచుండ, వారందరు ధర్మనంది శిల్పవిద్యాగారమునకు బోయినారు. అచ్చట దంతాసనముపై కృష్ణాజినముపై ధర్మనంది వసించెను. చుట్టును కుడ్యములనంటియున్న శాద్వలాసనములపై విద్యార్థులును, సువర్ణశ్రీయు నధివసించిరి.

ధర్మనంది గ్రంథపీఠముపై భూర్జపత్రశిల్ప శాస్త్ర గ్రంథమునుంచి, అదిచూడకయే బాలుర కుపదేశింప నారంభించెను. భరతనాట్య సూత్రములు, శిల్పసూత్రములు, రూపరచనా ప్రమాణము, అంకము, ధారణము, రూప ప్రతిరూపములు, మాన ప్రతిమానములు, దేవతా మనుష్య గుహ్యక వానరాదిప్రమాణములు, ఉత్తమపురుష లక్షణములు, స్త్రీల యాకారములు, పద్మ సుఖ వీర యోగాది వివిధాసనములు, అభయ, వరద జ్ఞానాదిముద్రలు, లంబ లీల లోలాది హస్తములు, సమద్విత్రి అతిభంగాది భంగిమములు, పద్మ పద్మపత్ర మత్స్య కురంగ చక్రవాకాది లోచనభేదంబులు, గరుడ సమ శుక తిలపుష్పికాది నాసికాభేదంబులు - ధర్మనంది గంభీరకంఠమున ఆ పవిత్ర సమయమున శిష్యుల కుపదేశించెను.

ఈ పాఠము జరుగుచున్నంతసేపును సువర్ణశ్రీకుమారుని మనస్సు హిమబిందు తన యింటికి వచ్చుట, తాను పారిపోవుట, స్థూపముకడ మరల నా బాలికను సందర్శించుట, ఏవేవో పిచ్చిమాటలు తాను పలుకుట, ఆమె “దారి యిమ్మనవే!” యనుట ఈ దృశ్యములన్నియు నాతని మనోనయనాల ఎదుట ప్రవాహతరంగములరీతి ఒకటి వెంటనొకటి వచ్చి మాయము కాసాగినవి.

## ౨౭
## వసంత సౌరభము

పదునారు సంవత్సరములు నిండి పదునేడవ సంవత్సరము రాబోవు తరుణ వయస్సున బాలికలకు వసంతోదయ ప్రారంభము. ఆ వసంతము నందు సౌరభము లలమికొన ఉప్పొంగి వికసించబోవు మల్లికాకుట్మలము హిమబిందు.

చిన్నతనమునుండియు మహారాజకుమారికలకు జరుగని వేడుకలు, లాలనలు, ముద్దులు, మురిపెములు హిమబిందునకు నెల నెలకు జరిగినవి.

హిమబిందుతల్లి ప్రజాపతిమిత్ర. ఈమె సర్వభారతీయ దేశములతో వర్తకమొనర్చు కీర్తిగుప్త వణిక్సంపన్నుని కుమార్తె. కీర్తిగుప్తుల వారు ధాన్యకటకనగరమునందు విశాలమైన రాజవీధిలో తన భవనము నిర్మించుకొని వర్తకము చేయుచుండెను. ప్రతిష్ఠానమునందు, పాటలీపుత్రమునందు, ఉజ్జయిని యందు, పిష్ఠపురము, దంతిపురము, కాంచి మధుర, తామ్రలిప్తి, భరుకచ్ఛము, కౌశాంబి, మహాశకవతి, కన్యాకుబ్జము, పురుష పురము, ప్రయాగ, పుష్కలావతి, కాశీ, తపిక, తక్షశిల మొదలైన ప్రసిద్ధనగరములందు తన వర్తకస్థానముల నేర్పరచుకొని మహోత్తమ వణిక్సంపన్నుడని పేరుపొందినాడు.

ఆ దినములలో గాంధారమున యవనులు రాజ్యము చేయుచుండిరి. యవన వర్తకుడైన డెమిత్రియసును, కీర్తిగుప్తుడును గాఢమిత్రులైనారు. వీరి వస్తువులు వారు, వారి వస్తువులు వీరు వర్తకమునకై మార్చుకొనుచుండిరి. వర్తకమున కంతయు వ్యవహార మనుచుండిరి. వస్తువులు వర్తకమునకై మార్చుకొనుట, వస్తువులు పణమునిచ్చి కొనుట, మూల్యమునకై అమ్ముట క్రయవిక్రయ మందురు. వ్యవహారమును పణమందురు. ఎగుమతి దిగుమతులు మొదలైనవన్నియు వ్యవహారమే. అమ్మకమునకు, కొనుటకు గల

వస్తువులన్నియు పణ్యములు. వస్తువులు వర్తకమునకై అమ్మువారు, కొనువారు వణిజులులేక వణిక్కులు. ఈ వ్యవహారములుసల్పు వారిలోకుల, మత, జాతి బేధములన్నియు నున్నవి. కాని భారతదేశమునందు యీ వ్యవహారము చేయువారు ముఖ్యముగ వైశ్యులు. వీరిలో వ్యవహారము చేయువారు వ్యావహారికులనియు, పాశుపాల్యులనియు, క్షేత్రసంస్కారు లనియు మూడువృత్తు లవలంబించు వైశ్యులున్నారు.

వ్యవహారము సలుపువారలలో క్రయవిక్రయులు వస్తువిక్రయ శాలలు పెట్టుకొను వారు వశ్నికులు వడ్డీవ్యాపారస్థులును, పెట్టుబడిదారులును. సంస్థానికులు యితర దేశములతో నెగుమతి దిగుమతి లొనర్చువారు. వీరినే సార్ధవాహులు, సార్ధకులు అనియు పిలుతురు. ఈ వణిక్కులలో ప్రభువులపక్షమున గనులు త్రవ్వించువారును, ఆటవిక వస్తువులను సేకరించువారుగ రెండువిధములవారున్నారు.

నిమి యను రాజు వర్తకశాస్త్రమును రచించినాడట. ఆ శాస్త్రమును చదివి వర్తకులు వైదేహులను పేరును సముపార్జించుకొనిరి. వర్తకులకు వర్తక సంఘములున్నవి. వానిని సంస్థానములందురు. సంస్థానికము లనియు పేరు గలదు.

కీర్తిగుప్తుడనేక జనపదములందున్న సంస్థానములలో సభ్యుడు. కొన్నింటికి అధ్యక్షుడు.

ఆంధ్ర వర్తకులలో కాశ్మీరముతో వర్తకము చేయువారు కాశ్మీర వణిజులు, గాంధారముతో చేయువారు గాంధారవణిజులు. కీర్తిగుప్తుడు నానా దేశవణిజు డని పేరుపొందినాడు. అతనికడ కౌశికులు, మాద్రులు, కాశ్మీరులు, గాంధారులు, మాళవికులు మొదలైన వర్తకులు ఎందరో యుండిరి.

కీర్తిగుప్తుడు గాంధారమునుండి ఔత్తరపథమున పారశీక, బాహ్లీక, తురుష్క వనాయు, కాంభోజ, కశ్యపసముద్ర, యవన దేశములతో వర్తకము చేయుచుండెను. అతనికి సర్వభాషలు గళగ్రాహములు. అన్ని దేశములవారాతని తమ దేశపువా డనియే భ్రమించియుండిరి.

ఈనాడు కీర్తిగుప్తులవారికి డెబ్బది రెండు సంవత్సరములున్నవి. ఆయనకు ఆంధ్రదేశములో వివిధప్రదేశముల ఉద్యానవనములు, ఫలవనములు లెక్కలేనన్ని యున్నవి. ఆర్యావర్తమునందు, దక్షిణాపథ మందు ప్రతిముఖ్యనగరమునందును కీర్తిగుప్తునకు వణిక్శాలలు, భవనములు ఉన్నవి.

కీర్తిగుప్తుడు ముప్పది సంవత్సరముల ఈడువాడై యున్నప్పుడు ప్రయాణము లొనరించి తక్షశిలానగరముచేరి తనభవనమునకు బోయెను. కీర్తిగుప్తుడు ప్రసిద్ధవర్తకు డగుటచే నాతనిరాక వచ్చిన మరుఘటిక యందే వర్తక లోకమున కంతయు దెలిసిపోయెను. నాలుగు గుఱ్ఱములు పూన్చిన రథము నెక్కి రాత్రి మొదటి యామములోనే స్నేహితుడగు డెమిత్రియసు అతితొందరగ పరువిడి వచ్చినాడు. వారిరువురు ఒకరి నొకరు కౌగిలించు కొనినారు.

డెమిత్రియసు వెంటనే కీర్తిగుపుని యాతనిభవనములో భోజనము చేయనీయక తన ఇంటికే కొనిపోయెను. ఆ యవనవర్తకుని భవనము భారతీయ భవనములరీతిగా నుండలేదు. ఆ భవన మొక అద్భుత వనాంతరమున నున్నది. ఆ వనమందు అపఫల, అలివ, యవననారంగ, అంజీర ఖర్జూర, దాడిమ, ద్రాక్ష, బాదమాది యవన ఫల వృక్షములు; లికుచ, రసాల, జంబు, పనస, ఐరావత, బదరీ. రాజాదన, బిల్వ, రంభాది భారతీయ ఫలవృక్షములు, నున్నవి. కరవీరాది అనేక పుష్పజాతు లున్నవి. వన మంతయు

కేళాకూళులు. వాని మధ్య వేదికలపై పాలరాతి యవన దేవతా విగ్రహములు కలవు.

ఆ విశాలభవనమున అనేకమందిరములున్నవి. మధ్యశాలలో శృంగార సరస్సులున్నవి. అపోలో యను సూర్యదేవుడు, అర్టెకమిస్ అను చంద్రదేవత, అప్రొదితీ గ్రీకు శృంగార రసాధి దేవత, జ్యూసు, జూనో ముఖ్య దేవదంపతులు, విజ్ఞానదేవి యగు ఎథీనీ, కామసుఖదేవు డగు బాఖస్, లోకవార్తాహరుడు హెర్మీస్, దేవకన్యలు మొదలగు పాలరాతివిగ్రహములు, యవన కలశములు అందందు అలంకరించబడి యుండెను. ధూపకరండములనుండి సువాసనధూపము లెగయుచుండెను.

ఇరువురు మెత్తని పరుపులపై సుఖోపవిష్టులైరి. పారశీక సేవకులు జలకలశముల హస్తప్రక్షాళన జలప్రతి గ్రాహకములు తెచ్చుటయు, వారిరువురు హస్తముల కడుగుకొనిరి. కొందరు బాహ్లికసేవకులు రెండు భోజన పీఠముల గొనివచ్చి వారిరువురి ఎదుట నుంచిరి.

భారతీయేతరమగు మ్లేచ్ఛదేశముల బానిసత్వ మప్పుడు విరివిగ నున్నది. కొందరు బానిసబాలికలు సౌందర్యదీప్తలగువారు వచ్చి, గ్రీకు వాద్యములపై వాయించుచు. యవన, బాహ్లిక, హీబ్రు, పారశీకాది భాషలలో పాటలు పాడుచు నాట్యమొనరింప నారంభించిరి. భారతీయ నాట్యమునకు నా నాట్యములకు ఎంతయో భేదముండెను. కీర్తిగుప్తున కివియన్నియు గ్రొత్తవి కావు.

అప్పుడు బానిసలగు న్యూబియాబాలికలు మోయు ఆందోళికపై యూద బాలికలు వింజామరలు వీవ, పారశీక బాహ్లికసుందరులు గొడుగులు తాల్ప, అత్యంత సుందరి యగు నొకజవ్వని వీరిరువురునున్న కడకు వచ్చెను. బానిసలగు సేవకులు కొందరు దంతసింహాసన మచ్చుట నుంచిరి. అందలము దిగి ఇరువది వరముల ఎలప్రాయంపు నా మిసిమి మిఠారి వొయ్యారముగ నడచివచ్చుచు నా సింహాసనముపై నధివసించెను.

డెమిత్రియసు కీర్తిగుప్తునిచేయి పట్టుకొని యామెకడకు గొనిపోయి ఎరుక పరచెను. ఈమె "పెర్లా" నా చెల్లెలు, ఈతడు "కీర్తిగుప్తుడు" నా స్నేహితుడు అని ఒకరికొకరి నెరుకపరచెను.

అది మొదలు కీర్తిగుప్తుడు "పెర్లా" (ముత్యము) దేవికి తన హృదయము, తన సర్వస్వము ధారపోసెను. పెర్లా కాతడు ముక్తావళీదేవి యని నామముంచుకొనెను.

రెండు మూడు నెలలలో వారిరువురికి వివాహము జరిగెను. ఆ దంపతుల జీవితము సకలానందపూరితమై మహారాగమైనది. కతిపయ మాసములలో వారు ఆంధ్ర దేశము తరలివచ్చిరి. ముక్తావళిగర్భమున ప్రజాపతిమిత్ర ఉద్భవించెను. ప్రజాపతిమిత్ర యవన భారతీయ సౌందర్యములను, సుగుణములను రెంటిని తనలో సంగమ మొనరించుకొనినది. ఆమె చిన్నతనమునుండియు ఏలోకమునుండియో వచ్చినట్లు తనలోనే తానై, ఇతరులతో కొలది సంభాషణమే జరుపుచు తా నొక్కరితయు ఆడుకొను చుండెడిది.

"వెఱ్ఱిది, విచిత్రమైనది" అను మాటలు చుట్టములు, పక్కములును, "ఏప్పటిపిల్లనో కొనివచ్చి చేసికొనిన వెర్రి సంతానము పుట్టదటమ్మా!" యని కీర్తిగుప్తుని అక్క చెల్లెండ్రును అనువారు. ప్రజాపతిమిత్రకు యౌవన మంకురించి దేవలోకమునుండిదిగివచ్చు మూర్తివలె నయినది. చదువులో మొదటిబిడ్డ, సంగీతములో ప్రథమ బాలిక, నాట్యములో ఊర్వశి. ఆ పరమసుందరాంగిని జూచి చారుగుప్తుడు ఆమె పాదములమ్రోల తన ప్రాణము, ఆత్మ పూజాపుష్పముల జేసినాడు. కోటీశ్వరుని తనయుడైనను సర్వవిద్యాపారంగతుడై,

బలసంపన్నుడై, రసగ్రహణపారీణుడైన చారుగుప్తునే వరించినది ప్రజాపతిమిత్ర.

ప్రజాపతిమిత్ర కాపురమునకు వచ్చినప్పటినుండియు చారుగుప్తుడు ఇతరము సర్వము సంపూర్ణముగ మరచిపోయినాడు.

## ౨౮
## స్వర్ణ ప్రతిమ

ప్రజాపతి కాపురమునకు వచ్చిన రెండేండ్లకు వారిరువురకు హిమబిందు ఉద్భవించినది.

ప్రజాపతిమిత్ర ఆనందముకు మేరలేదు. చారుగుప్తుడు సీతదొరికిన జనక మహారాజుకన్న ఎక్కువ ఆనందము నందినాడు. వారిరువురు ఉమనుగన్న మేనా హిమవంతులకన్న ప్రకాశించిపోయినారు.

కోటీశ్వరుడైన వినయగుప్తుడు శ్రీకాకుళమునుండి, కావేరి పట్టణమునుండి, తామ్రలిప్తినుండి, భరుకచ్ఛమునుండి, సువర్ణద్వీప, బలిద్వీప, యవద్వీప, సింహళద్వీప, రాక్షసద్వీప, మలయద్వీప, నీలద్వీప అను ద్వీపాది ద్వీపానేకములనుండి నారికేళ, ప్రవాళ, మౌక్తిక, శోణరత్న, లవంగ, జాయక, ఘనసార, చంద్రబాలా, కోరంగి మొదలైన వస్తువులను తెప్పించును. బంగారము, వెండి, రాగి, ఇనుము, కత్తులు, కరవాలములు, ఛురికలు, వర్మములు, దర్పణములు, నగలు, నాణెములు, విగ్రహములు మొదలగు వస్తువు లెన్నియో దిగుమతులు చేయుచుండెను. ఆతనికి వందల ఓడలున్నవి. కీర్తిగుప్తుడు సార్థవాహుడు, వినయగుప్తుడు సాయంత్రికుడు. సాయంత్రికులను పోత వణిక్కులనియు నందురు. ఇరువురు వియ్యమందుట సముద్రుని తండ్రియైన వరుణదేవుడు, గంగాదేవి తండ్రియైన హిమవంతుడును వియ్యమందుట యని దేశము లాడికొని ఆనందము నందినవి.

చిన్న మనుమరాలు పుట్టినప్పుడు కీర్తిగుప్తుడు, వినయగుప్తుడు హిమబిందున కెన్ని సుందరక్రీడావస్తువులు సమర్పించినారో, ఎన్నియలంకారములు, ఎన్ని భూషణములు, ఎన్ని వస్త్రాదికములు తెచ్చినారో! హిమబిందు క్రీడామందిరముల నెన్నియో సాలభంజికలు, లక్కబొమ్మలు, దంతపు శిల్పములు, గంధపు ఆటసామానులు, ముత్యపుచిప్పల పెట్టెలు, వివిధరకముల శంఖములు, గవ్వలు, పవడముల చందుగలు, పళ్ళెములు, అమూల్య రత్నములు, శిలలుదొలిచిన బరిణెలు, సింహ, శార్దూల, వ్యాళ, ఖడ్గమృగ, మృగాది జంతువుల చర్మము లున్నవి. పూసల పేర్లు, కోటుల ఫణములు విలువచేయు ఎర్ర ముత్యముల హారములు, నవరత్నహారములు, బంగారునగలు, రత్నఖచితహారములు, కేయూరములు, శిరోభూషణములు, మేఖలలు, మంజీరములు, లోలకములు, కర్ణభూషలు, చీనా దుకూలములు, బాహ్లీక పారశీకాది దేశ రాంకవములు, నీలదేశవల్కలములు లెక్కలేనన్ని ఆమెకై మందిరములు, మందిరములు నింపినారు ఇరువురు తాతలు.తన మేనకోడలిని చూచుటకు డెమిత్రియసు ఆంధ్రదేశమున కెన్నిసారులో వచ్చినాడు. చెల్లెలిని మేనకోడలిని తన బావ కీర్తిగుపుడు తక్షశిల కొనివచ్చునప్పు డెంతయు యానందమందినాడు. మేనకోడలు ఆతనికి ప్రాణమైనది. తన కొమరుడు హెరాక్లియసు ప్రజాపతిమిత్రను పెండ్లియాడి తీరవలయునని పట్టుపట్టినాడు.

ప్రజాపతిమిత్ర చారుగుప్తుని పెండ్లియాడనున్నదని శుభలేఖ వచ్చినప్పుడు హెరాక్లియసు డెమిత్రియసు లిరువురు కొంచెము హృదయ బాధకు లోనైరి. కాని వారు యాత్రలు సాగించి, మహదాంధ్రముచేరి, ధాన్యకటకమునకు బోవునప్పటికి వినయగుప్తుని

వైభవము వారికన్నుల మిరుమిట్లు గొల్పినది. వారి గాథలలో ధనమునకు ప్రసిద్ధికెక్కిన క్రోసియసురాజు వినయగుప్తునికడకు అప్పుకు రావలెను అనుకొనిరి. చారుగుప్తుడు వినయగుప్తునిమించి, యౌవనములోనే అనేక సముద్రయానములు చేసి సాహసియని కీర్తిగొన్నాడు.

అప్పుడా యవనజనక కుమారులకు చారుగుప్తుని ప్రజాపతి యెందుకు ప్రేమించినదో అర్థమయినది. డెమిత్రియసు ఆంధ్రాచారమున ప్రజాపతిని బంగారుతట్టలో మోసి కల్యాణమంటపమునకు గొనివచ్చినాడు. డెమిత్రియసు భార్య సెలినేదేవి ఆంధ్రాచారముల గమనించుచు, అక్కజంపడుచు. తానును ఆంధ్రాంగనావస్త్రాలంకార శోభితమై ముక్తావళీదేవిచే, వినయగుప్తుని భార్య గుణవతీదేవిచే ఎన్నియో మన్ననల నందినది. చిన్నతనములో యవనభూమియగు గ్రీసులో తా నెరింగిన పెర్లాదేవి వేరు, ఈనాటి ముక్తావళీదేవి వేరు.

హిమబిందు పదమూడవఏడు జరుగుచున్నప్పుడు వృద్ధుడగు డెమిత్రియసు దేవతల జేరినాడు. ఆమెకు పదునాల్గవఏడున ప్రజాపతిమిత్ర వ్యాధిగ్రస్తురాలయినది.

చారుగుప్తుడు మతిలేనివాడైపోయినాడు. దేశదేశముల ప్రసిద్ధి నందిన వైద్యులు చారుగుప్తునిచే నాహ్వానితులై వచ్చినారు. ఆంధ్రధన్వంతరులు, చరక శుశ్రుతాది మహాశాస్త్రకోవిదులు దివ్యసుందరి యగు నా సుశీల ప్రజాపతిమిత్ర రోగముచే ననేక విధముల పరిభవింపబడినారు. ఆమె ప్రజ్ఞాపరిమితాదేవిలో ఐక్యమైపోయినది.

చారుగుప్తుడు, వినయగుప్తుడు, కీర్తిగుప్తుడు ముప్పురును మంచము పట్టినారు. ముక్తావళీదేవికి కన్నుల నీరింకిపోయి యొకపక్షముదినములామె చైతన్యరహితయై పడియుండెను.

హిమబిందునకు తల్లి మాయమగుట యను భావ మర్థము కాలేదు. ఇతరులు ఏడ్చినప్పుడామె దుఃఖించినది. దినములు గడచినకొలదియు ఆమె బెంగచే కృశించి పోయినది. బాలిక దుఃఖము చూచి ముప్పురు వణిక్చక్రవర్తులూ దుఃఖమాపుకొనిరి. ముక్తావళీ దేవి తెలివినంది, తన ప్రజాపతి హిమబిందులో నున్నదని ధైర్యముచెంది యా బాలను దివ్యప్రేమచే చుట్టివేసినది. ఏడులు గడచినకొలది హిమబిందు తేరుకున్నది. కాని ఆమె తల్లి ప్రతిరూపము తన పూజామందిరమున నుంచుకొన యౌవనారూఢయైన హిమబిందు ఆశించినది. చారుగుప్తుడు భార్య నూత్నవధువై తన ఇంటికి వచ్చినప్పుడు, ధర్మనంది బావమరిదియు ప్రఖ్యాత స్వర్ణాదిలోహ శిల్పియునగు అమరనందులవారిచే భార్యా ప్రతిమను చిన్న స్వర్ణమూర్తిగా రచింపచేసినాడు.

ప్రజాపతిమిత్ర హిమబిందును చంక కెత్తుకొను రోజులలో శక్తిమతీదేవి ధర్మనందులవారిచే బాలనెత్తికొనిన మాతృమూర్తిని ధవళశిలా శిల్పముగ విన్యసింపఁ జేసెను. చారుగుప్తుడా రెండవప్రతిరూపము తన పూజామందిరమున నెలకొల్పెను భార్య దివంగతురాలైన రెండవసంవత్సరమున అమరనంది, ధర్మనంది ఇరువురు ఇదివరకున్న ఆమె ప్రతిమల విమర్శించి, తమ స్మృతి శక్తిని సహాయముగొని ప్రజాపతి మిత్రను పద్మాసనాసీనగా, ప్రజ్ఞాపరిమితాదేవిగా నిండు బంగారు విగ్రహముగ పోతబోసినారు. విగ్రహము హిమబిందు పూజాగృహమున పూజాపీఠ మలంకరించినది.

హిమబిందుకుమారి దినదినము ఉదయముననే స్నానాదికము లాచరించి సర్వాలంకారయుక్తయై శుభ్రవసనముల ధరించి మాతృవిగ్రహమును పూజసేయును, తన

హృదయమంతయు తల్లితో నివేదింపని దినమామెకు లేదు. పూజయంతయు సలిపి, ఒకనా డాబాలిక ఆ స్వర్ణదేవి కడ మోకరించెను. ఆమె రెండుచేతులు తల్లి బంగారు తొడలపైనిడి మోమామె పద్మాసనముపై నుంచెను.

"అమ్మా! పలుక వేమి?"

## ౨౯
## తల్లి అనుమతి

"అమ్మా, నీవు ఎక్కడున్నావు? ఎక్కడనుండి వచ్చితివి. అక్కడికే పోయితివి. నన్ను నీ గర్భమున గంటివి. అంత చిన్నతనములో నన్ను వదలి మాయమైపోతివి."

ఉత్కృష్టశిల్పరూపమగు ఆ జాంబూనద విగ్రహము హిమబిందు మాటలకు ఏమి ప్రతి వచింపగలదు!

హిమబిందునకు చిన్నతనముననుండియు దూరమున తోచు ఏదియో ఆశ. అది ధనము కాదు, సంపదకాదు, వైభవముకాదు. మహారాణులు కనీ విని యెరుగని నగలామె మందసముల నున్నవి. మానవమాత్రు డూహింపజాలని విచిత్రవస్త్రాదికము లామె పేటికలలో పాముకుబుసములై, పలుచని మబ్బుల మడతలై, పుష్పపుటములై, స్వప్నములై, శ్రీమద్రామాయణ శ్లోకములై జాలువారుచున్నవి. చారుగుప్త డాబాలిక ఊహకందని పూవుజాతులు దేశదేశమునుండి సేకరించి క్రీడావనముల పెంచుచున్నాడు. అవి జపాకుసుమజాతులు, ఇవి నీలనదీతరంగడోలార్ధ్రి సహస్రదళకమలములు. ఇవి మల్లికలు, అవి సంపెంగలు. ఇవి శేఫాలికలు, అవి కబంధములు. అక్కడ సూర్యకాంతములు, ఇచ్చట పారసీకమునుండి వచ్చిన గులేబకావళులు. ఇవి సంపూర్ణదాడిమీ పుష్పములు, అవి చీనాదేశమునుండి వచ్చిన అరుణచేరులు. ఇచ్చట కరవీరములు. అవి నాగ లింగములు, ఇవి వకుళములు. ఇవి మాలతీలతలు, అవి మాధవీలతలు.

తన చెలులకు పుష్పవనవాటులు చూపి హిమబిందు పొంగిపోయెడిది. పదునేడేండ్ల మిసిమి వయస్సున నున్న హిమబిందునకు నేడు పుష్పవనవాటులు, నగలు, నాణెములు, ఆటలు, పాటలు ఆనందము సమకూర్చ లేకపోయినవి.

ఒకప్రక్క ఆప్రాదితీదేవి భౌతికవాంఛలు, గాఢకాంక్షలు, ఉడుకు రక్తములు, తీరని కోర్కెలు ఆమెకు వరమిచ్చినది. వేరొకప్రక్క సాధుమూర్తియై చతుర్విధ పురుషార్థ ప్రదాయినియైన మాయాదేవి శాంతమును, శ్రద్ధాభక్తులను అరణమిచ్చినది. ఈ రెండు మహాశక్తులు చిన్ననాటనే ఆమెకు తెలియక ఆమెలో మహత్తరగంభీర సుడిగుండముల జన్మింపజేసినవి. ప్రేమయన నెట్టిదో యెరుగని మొదటిదినాలలో తాను సమవర్తిని ప్రేమించితి ననుకొన్నది. ఆమెకు ప్రేమోదంతములు రహస్య కాంక్షలు అవ్యక్తాందోళనమును కలిగించెడివి. గ్రీకు బాలికలు పురుషవాంఛలు తీర్చు దివ్యసౌందర్య మూర్తులు. పొంకములు తిరిగిన వారి యవయవముల ప్రత్యణువు పురుషస్పర్శ కాంక్షించును. భారతీయ బాలికలు పురుషులను ఉత్తమపథాలకు నడుపుకొని పోవు దేశికలు. ఇట్లు గ్రీకు యువతీ గాఢకాంక్షలు భారతీయాంగానాశేముషీసంపన్నతయు, స్వాతంత్ర్య భావ జనిత గాఢాభిలాషయు ఆమె హృదయ పథముల ప్రతిస్పందనము కలుగ జేయుచునే యున్నవి.

ప్రజాపతిమిత్ర పూర్ణభారతీయాంగన. ముక్తావళి పెంపుడు భారతీయ లలన.

అయినను ఆమె యవనస్త్రీయే.

హిమబిందు తనకు తెలియరాని ఆవేదన తన్ను పొదివికొనినప్పుడు చిన్నతనములో తల్లికడకు పర్వెత్తి, ఆమెఒడిలో తలదూర్చి వెక్కివెక్కి ఏడ్చునది. ఆ అతిలోక సుకుమారాంగి తన కొమరిత మూర్ధము పై చేయి నిమురగనె హిమబిందున కారాటము తీరిపోయి ఏదియో దివ్యానందము ముంచి వేయునది.

నే డా బాలిక తల్లికడకు పర్వెత్తినది. తల్లి సువర్ణవిగ్రహము. హిమబిందు ఆ తల్లి వక్షమున మోమును పొదివికొని "అమ్మా! నా కీవేదన ఏమిటే? నాయనగారిని ఓడించి దేవతామూర్తివలె ఆ యువకుడు విజయసింహాసన మధిష్ఠించియుండ నేను వెఱ్ఱిదానివలె అతనిచుట్టు నాట్యముచేసితిని. అది తప్పా అమ్మా!" అని వాపోయెను.

ఆ బాలిక కన్నుల గిర్రున నీరు తిరిగిపోయినది. మోమెత్తి తల్లి మోమును చూచుచు "నాకిట్లు ఆతనిచూడ యీ విపరీతపుకోర్కెలేమి అమ్మా! ఆతని చూడకపోయిన నేను బ్రతుకలే నను భయము కలుగుచున్నది. అది తప్పు కాదూ? ఏమియో నాయనగారి ఆలోచనల కాతడు అడ్డమువచ్చినాడని నా నమ్మకము. అమ్మా, అతని గురించి ఆనాటి నుండియు నే నాలోచింపని క్షణ మొక్కటియు లేదే! అది ఎంత తప్పు!"

మరల హిమబిందు కన్నులనుండి ముత్యములు స్రవించి, కరిగి పాటలములగు ఆమె కపోలములనుండి దొర్లిపోయినవి.

"నే నేమిచేయవలెనో చెప్పవా అమ్మా?" తల్లి ముఖమును తదేక దీక్షతో చూచు ఆ బాలికకు ఆ విగ్రహము పెదవుల కదిపినట్లు తోచినది.

"నీవు పో తల్లీ, అంతయు శుభము జరుగగలదు" అని తనతల్లి చెప్పినట్లమెకు స్పష్టముగ కాకలీస్వనములు వినబడినట్లయినది.

మరుసటి క్షణమున ఆ బాలిక గంతువైచి లేచి మాతృవిగ్రహమునకు సాష్టాంగనమస్కృతులిడి కలకలనవ్వులు పూలగుత్తులవలె యామె మోమున ప్రత్యక్షముగా నాట్యమాడుచు పూజాగృహమును వీడి, "బాలనాగీ" యని కేకలువేయుచు పర్వెత్తినది.

ఒక్కచిటికెలో బాలనాగి వచ్చి యెదుట నిలిచినది.

"మా అమ్మమ్మ ఎక్కడ నున్నదే?" అని హిమబిందు అడిగినది.

"భోజన మైనప్పటినుండియు వారు విశ్రమించియున్నారు" అని బాలనాగి యుత్తరమిచ్చినది.

హిమబిందు విసవిస తన ముత్తవ గదిలోనికి పోయినది. ఆమె యప్పుడే లేచి మొగము కడుగుకొనుటకు స్నానగృహమునకు చనినది. హిమబిందు బాలనాగి వెంటరా నా గృహంబునకు పోయినది. ముక్తావళీదేవి పన్నీట మొగము కడుగుకొని పరిచారిక లందిచ్చు శుభ్ర వసనములచే తుడుచుకొనుచు నొక పీఠముపై నధివసించియుండెను. ఆమె మాటలలో యవనాపభ్రంశోచ్చారణ కొంచెము కానవచ్చుచుండును.

"అమ్మమ్మా, అమ్మమ్మా" అని ఇంతలో హిమబిందు వచ్చినంతట మొగము తుడుచుకొను వస్త్రము తీసి ముక్తావళీదేవి మనుమరాలిని చూచి....

"అమ్మడు! ఇదేమి? యిటుల వచ్చితివి? ఆ పరుగులేమి? నీవెప్పుడును అల్లరిపిల్లవు. నీకు ఒక్కక్షణము నిలకడలేదాయెను. ఏ మంత తొందర" యని ప్రశ్నించినది.

హిమ: అమ్మమ్మా, నీవు శక్తిమతీదేవిని ఎరుగుదువా?

ముక్తా: ఎరుగుదునమ్మా. నా కన్నతల్లియు, ఆమెయు చిన్నతనమున అతి స్నేహమున మెలగువారు. వారిరువురకు సంగీతమున, నాట్యమున, సాహిత్యమున గురువులందరు నొకరే. శక్తిమతియింటికి నా కన్నతల్లి పోవునది. మా యింటికి శక్తిమతి వచ్చునది. అవియన్నియు యెప్పటికిని మఱపురావు.

ముక్తావళి కన్నులనీరు గిఱ్ఱున తిరిగినది. ముక్తావళీదేవి కిప్పుడు యేబది తొమ్మిది సంవత్సరములు మాత్రమే యెనను, తలయంతయు కొమరితపోయిన గాఢవిచారమున ముగ్గుబుట్టవలె నెరసిపోయినది.

హిమ: అమ్మమ్మా, యీ దినమున మన మా శక్తిమతీదేవిగారి యింటికి పోవలెనే. వారి అమ్మాయి నాగబంధునికయు, నేనును చదువుకొంటిమి. శక్తిమతీదేవిగారి భర్త నెరుగుదువా?

ముక్తా: ఆ, ఎరుగ కేమి తల్లీ! ధర్మనందులవారు మహోత్తమ శిల్పి. మా గ్రీసుదేశపు శిల్పములకన్న వీరిశిల్పములం దేదియో విచిత్రత, ఏదియో మహోన్నతి నాకు తోచును.

హిమ : అవి అన్నియు చూడవలెనే.

ముక్తా: తల్లీ! యీ మూడేండ్లనుండియు ఎచ్చటికైన కదలుచుంటిమా మనము?

హిమ: అమ్మమ్మా, మనము వెళ్ళితీరవలెను. నాకు అమ్మజ్ఞాపకము వచ్చి ఈ దినమున అతి బెంగచే బాధపడిపోయినాను. మన మెక్కడి కైనను వెళ్ళకపోయినచో నాకు మతియే పోవును.

ముక్తావళి హృదయమున గజగజలాడి "అలాగునే అమ్మా. అమ్మాయి అమృతలతకు వార్త పంపెదను, మీ తాతగార లిరువురును సంఘా రామము విడిచి రారాయెను. అన్నగారు వినయగుప్తులవారు బౌద్ధ దీక్ష తీసికొనెదరని అందరును చెప్పుకొనుచున్నారు. ఈ దినము సాయంకాలము మనము మువ్వురము బాలనాగిని తీసికొని శక్తిమతీ దేవిగారి యింటికి పోదములే" అన్నది.

## 30
## శిల్పసందర్శనము

హిమబిందు కేలనో భయము వేసినది. ఏమియు తోచదు. అలంకారికురాలగు తారాదత్తను పిలువనంపి తనకున్న మంచివస్తువులను, వస్త్రములను తీయుమన్నది. పాము కుబుసములబోలు సన్నని దుకూలములు చిత్రచిత్రవర్ణములు జెలువొందినవి యామె దూరముగా ద్రోచినది. వలిపెములు సముద్రవీచికాఫేన సదృశములై జిలుగుల తళుకు మనునవి నచ్చలేదన్నది. మిలమిలలాడు మడతల కులుకులీను అంబరములు గని పెదవి విరచినది. ఎట్టకేల కామె బంగారువన్నె ఆంతరీయము ధరించినది. వివిధవర్ణ సురేంద్రచాప సౌందర్యముగ సుచేలకము కటిభాగ మలంకరించినది. రత్నతారకలు పొలుపారు సువర్ణమేఖల నొయారంబుగ నెన్నడుము క్రింద మొలనూలు తాల్చినది. వక్షోపరిసానువుల

మేఘ మాక్రమించునట్లు ఆచ్ఛాదనోత్తరీయము నీలరుచుల వెలుగుగా సొబగుచేసినది. తుల్యరహిత హారపంక్తులు ఎత్తుపల్లముల ప్రవాహములుగా రచించినది. చంద్రబింబముపై రోహిణివలె రోహితలలాటికము తాల్చినది. వేణీభరమును ఆంధ్ర స్త్రీ లెప్పుడు నూహింపజాలని విధమున రచింపించుకొన్నది. వేణీరచయితలు మార్జనికలు, అలంకారికలు ఆమె యలంకారమగునప్పటికి నలిగిపోయినారు.

హిమబిందు ఠీవితో నొరులకడ గంభీరతవహించి సంచరించినను, చనవున్న వారికడ లో నడంగియున్న బాలికానందము మఱుగపరచలేదు. చంటి పిల్లవలె గంతులు వేయును, కలకల నవ్వును, ఆటలాడును. చిరు గాలులవలె సంతోషముమై సంచరించును, నెచ్చెలులతో హాస్యమాడును. చిన్నతనమునుండియు పిల్లలులేని చారుగుప్తుని కొమారిత బాలునివలె పెరిగినది. బాలికా విద్యతోపాటు బాలుర విద్యలును నేర్చినది.

నాల్గు ఉత్తమాశ్వములు పూన్చినరథము తెల్లకంబళి ఛత్రముగా గప్పబడినది. చిత్రశిల్ప కౌశల్యము కలిగి మెరుగులీనునది, ధర్మనంది మహాభవనముకడ ఆ సాయంకాలము పదమూడవ మూహూర్తనాదము పట్టణములో ననేక ప్రదేశముల ప్రతిధ్వనించునప్పటికి వచ్చి యాగెను. అందు స్త్రీ జనముండిరని తెలియుట తోడనే లోనుంచి పరిచారికలు వచ్చి వారి నెదుర్కొనిరి. తోరణముకడ మహాలియు, శక్తిమతియు ఎవరు? వీరా! యని యాశ్చర్యమందుచు ఎదుర్కొని తెలిసికొనిరి. సేవకురాండ్రు రజత పాత్రంబుల సుగంధజలంబుల నర్పించ కాళ్ళుగడిగికొని లోనికిపోయిరి. పరిచారికలు శుభ్రవసనముల వారిపదము లద్దిరి.

వారందరు అభ్యంతరమందిరములకు పోయిరి. అచ్చట సుఖాసీనయై వివిధవార్తల ముచ్చటించుకొనిరి. కొమార్తెను తలంచుకొని ముక్తావళీ వాపోయెను. అందరును కండ్లనీరు పెట్టుకొనిరి. ముక్తావళీదేవి శక్తిమతిని పిల్లలెంతమందియని యడిగెను. ఏమి చేయుచున్నారనెను. వారిరువురు యెరిగియున్న కాంతలగూర్చి మాట్లాడిరి. ఈలోన సిద్ధార్థినిక వీరువచ్చిరని అక్కతో అన్నతో చెప్పుటకుపోయినది. నాగబంధునిక సత్వరము వచ్చి హిమబిందును కలసికొన్నది. హిమబిందును నాగబంధునికయు నెయ్యముతో ముచ్చటించుకొనిరి, నవ్వుకొనిరి. నాగబంధునికకు హిమబిందు నే డేల యింత విచిత్రముగ, యింత సౌహార్ధముగ తమయింటికి వచ్చి తనతో మాట్లాడుచున్నదో అర్థమైనది.

అందరును ఇల్లు చూచుటకు బయలువెడలిరి. వైభవమునకు, వైశాల్యమునకు, ఔన్నత్యమునకు చారుగుప్తుని మహాభవనముతో ధర్మనంది సౌధము సరిపోకపోయినను సౌందర్యమునకు దానితో నేమాత్రము తీసిపోదు సరిగదా మించియుండును. హిమబిందు కళానిధి యగుట నా మందిరములు చూచి ఆనందించెను. ముక్తావళీదేవియు, అమృతయు, శక్తిమతియు వెనుకబడుటచే నాగబంధునికయు, హిమబిందు ముందుబోయిరి. హాస్యములాడుచు కెవ్వున నవ్వుకొనిరి. చప్పట్లు కొట్టుకొనిరి. అట్లా మందిరము లన్నియు తిరిగి బాలికలు సిద్ధార్థినికతోకూడి తోటలోనున్న శిల్పమందిరమునకు జనిరి. అచ్చటి మహా శిల్పభవనములు విశ్వబ్రహ్మాలోకములే! ఆ మందిరముల ఎన్ని సభాభవనములున్నవో వారు విభ్రమమంది గమనించ లేకపోయినారు.

ఆ విశాల శిల్పశాలలలో స్తంభములు గుండ్రముగ నునుపులైన పద్మశిరోపరి భాగముల పటములను మోయుచున్నవి. స్తంభములపై, పటములపై, చిత్రికలపై చిత్రలేఖనములు సహస్రమూర్తియుతములై, వివిధ వర్ణికాభంగసమ్మోహనములై, లలితాంగహారాంకితములై, సకలచిత్రలేఖన కళాలంకారశిల్పరూప మృగపక్షితరులతా పుష్పసమన్వితములై, రసజ్ఞుల వివశులచేయుచున్నవి.

ఆ మందిరముల ఎందరో విద్యార్థులు పనిచేయుచున్నారు. చిత్రములు లిఖించుచున్నారు. రాళ్ళు సరిచూచుచున్నారు. శిల్పకర్మకు ఉచితములైన శిలల శాస్త్రవిధానమున సరిచూచుచున్నారు, చెక్కుచున్నారు. కొలతలు చూచుచున్నారు. నునుపు చేసిన రాలపై చెక్కుటకు బొగ్గుచే రూప విన్యాసము చేయుచున్నారు.

ధర్మనందులవారు కొందరి శిల్పముల సరిచూచుచున్నారు. సరియైన రాల నేరి పరీక్షించుచున్నారు. విన్యాసములు సరియై యున్నదియు లేనిదియు కనుగొనుచున్నారు. కొందరికి శాస్త్రమునుండి సూత్రముల వివరించి, ఇది యిట్లు, అది అట్లు అని చెప్పుచున్నారు.

అతిథులై వచ్చిన యా ఉత్తమాంగనల తనభార్య కొనిరా ధర్మనందియు, బాలకులు లేచి నిలుచుండి వారికి గౌరవమొనర్చిరి.

ఆ బాలకులందరు హిమబిందు అందము చూచి, పనిమాని గురువుగారు చెంతనున్న మాటయే తలపక తదేకదీక్షతో నామెవంక చూడసాగినారు. ఈ దృశ్యము చూచి ధర్మనందియు నాశ్చర్యమందెను.

హిమబిందు తనముత్తవ మేనత్తలతో బాటా శిల్పపుంబనుల గమనించి యాశ్చర్యమందినది. లోన ఉబుకు ఆరాటమునకు కారకుడైన విజయి యగు నా బాలశిల్పి యేడి యని యాశ్చర్య మందినది. సిద్ధార్థినిక ఆ బాలికతో నడుచుచు తనతోటలో నున్నాడని చెప్పినది.

వారంద రా మందిరములలోని అనేక స్థితులలో నున్న శిల్పము, చిత్రలేఖనము లన్నియు తోటలో పరిశీలించినారు. ఆ మందిరములనుంచి వినిర్గమించి వేరొకచోట నున్న సువర్ణశ్రీ శిల్పమందిరములు చూడ బోయిరి.

అచ్చట హిమబిందునకు పరవశత్వమే కలిగినది. ఏమి ఈతని పనితనము! అవి అతని శిల్పములా, అవి చిత్రలేఖనములా!

అదేమిటి! ఆ గోడపై త్రిభంగిగా నిలుచుండిన బాలికామూర్తి ఎవరు? తానే! తా నేల? ఓహో! అందరును ఆ బొమ్మను గుర్తించిరి. హిమబిందును చిత్రలేఖనముగా రచించుట సువర్ణశ్రీ కేమి యవసరము? అని ముత్తవ ముక్తావళి అనుకొన్నది. ఎంత అందముగా నున్నదా బొమ్మ! అచ్చుముగ హిమబిందు. ఆమెను అచ్చట నొక దేవీమూర్తివలె రచించినా డీ బాలుడు.

అమృతలతాదేవికి తన మేనకోడలిని ఈ బాలకుడిట్లు లిఖించుట ఇష్టము లేకపోయినది. హిమబిందు పొందిన ఆశ్చర్యమునకు మేరయేలేదు. ఎందు కీ బాలుడు తన చిత్రము లిఖించినాడు? ఎంత పనితనము! ఏమి యా చిత్ర చమత్కృతి! ఆ వస్త్రాదికములు, ఆ నగలు పందెముదినమున నాట్యసమయమున తాను ధరించినవే.

ఆమె హృదయము రాగములు పాడినది. అమృతలత అందరిని ఆలస్యమైనదని కేకలువేయుచు త్వరితముగ బయటకి కొనివచ్చినది. హిమబిందున కెంతమాత్ర మట్లు పోవుటకు ఇష్టములేదు.

సువర్ణశ్రీ యెచ్చటను కనబడడేమి? దాగుకొనినాడా ఊర లేడా? ఎక్కడికైన ప్రయాణమై పోయినాడా? ఆమెకు ఆరాటము ఇనుమడించినది. ఒక అదనున ఆమె సిద్ధార్థినికను "మీ అన్న యేడి?" యని చెవిలో రహస్యమున నడిగినది. సిద్ధార్థినిక

పరుగెత్తిపోయి హిమబిందును, ఆమె చుట్టములును, వచ్చినారని అక్కతో చెప్పుటకు వేగమున వెళ్ళినప్పుడు కృష్ణాతీరమున వారిరువు రుండుట చూచి యక్కడకు బోయి యక్కతో చెప్పి పంపించి మరల తాను వచ్చినది. అన్న అక్కడ యుండు ననుకొని ఇప్పుడు నామె యచ్చుటకు బోయినది. అత డక్కడ లేడు.

తోటయంతయు వెదకినది. తోటమాలీల నడిగినది. వారిచే వెదకించినది. తన భవనముల వెదకినది. సేవకులచే వెదకించినది. సువర్ణశ్రీ ఎచ్చటను లేడు. ఏమైపోయినాడు?

ఆమెవచ్చి హిమబిందు చెవిలో అన్న ఎచ్చటకో పోయినాడని చెప్పినది. హిమబిందునకు ఆశ్చర్యము, కోపము, విసుగు, విచారము వచ్చినవి.

ఇంక నామె కేమియు తోచలేదు. తొందర తొందరగ అన్నియు చూచుట ముగించి "వెళ్ళెద" నని శక్తిమతితో నామె యనినది.

నాగబంధునికయు, శక్తిమతియు వారిని ఇంకను ఉండుడని కోరిరి. ముక్తావళీదేవి శక్తిమతితో నింతవరకు తనతనయను గూర్చి ఎన్నియో చెప్పి వాపోయినది. ఆమె కన్నుల అశ్రుధారలు ప్రవాహములై పోయినవి. శక్తిమతియు దన స్నేహితురాలి సుగుణముల వేనోళ్ళ పొగడుచు కన్నుల నీరునిండ విచారించినది. అందరికిని అశ్రుధారలు వాకలైనవి.

అమృతలతాదేవి వేగిరముచేయ వారు ముప్వురును బాలనాగియు బయలుదేరిరి.

కస్తూరిచే సమ్మిళితమగు కుంకుమబొట్టు శక్తిమతీదేవి ముక్తావళీ దేవికిని, హిమబిందునకును మోమున నుంచినది. నాగబంధునిక వారి పాదములకు లత్తుక నలదినది.

పద్మరాగమున నెఱ్ఱవారి, చిరుతామర మొగ్గలరీతి మంజులములై ఆర్ద్రములై నవకంబులీను వేళ్ళతో, ముక్తావళి హిమబిందుల ఇరువురి పాదంబులు తన చేతికాంతులతో వియ్యమొందునప్పుడు నాగబంధునిక ఆపాదద్వితీయ సౌందర్యమునకు నాశ్చర్య మందినది. హిమబిందు పాదములు తన యన్నగారి శిరస్సును, సత్యాదేవి పాదములు శ్రీకృష్ణుని శిరస్సునువలె తాడన మొనర్ప తగునని యామె యాలోచనల మునింగినది.

గంధ మలంది, సువాసనద్రవ్యము లర్పించి, చూతఫలములు, నారంగములు, ఖర్జూరములు, దాడిమాదిఫలములు, బాదమిపప్పు, చారపప్పు మొదలయిన పప్పులు; లవంగ, దాల్చిన, ఏలకీ, జాజి, జాపత్రి మొదలయిన సువాసనద్రవ్యములు, సుందర వస్త్రములు ముక్తావళీ హిమబిందులకు శక్తిమతీదేవి యర్పించినది. సిద్ధార్థినిక లోనికిపోయి అయిదు లిప్తలలో పరుగునవచ్చి హిమబిందునకు సువర్ణపాత్ర నొకటి అత్యంత మనోహర శిల్పవిన్యాసము కల దానిని తన తండ్రిగా రిమ్మనినారని చెప్పుచు సమర్పించినది. ఆ పనితనమునకు ఆ బాల ఎంతయో ముదమందినది.

వారందరు తమ స్యందన మారోహించి తమ భవనమునకు బోవుచుండ హిమబిందున కేమి తలంపు కలిగినదో, "అమ్మమ్మా, మహాచైత్యమునకు బోయి, ఆరాధన చేయవలె" నని యన్నది. ఆ మాటలకుముత్తవ ప్రతి అడకుండగనే సూతునకు రథము మహాచైత్యముకడకు పోనిమ్మని ఆజ్ఞ యిచ్చినది.

ఏ మధురభావఫలశ్రుతి నాశించి హిమబిందచ్చుటకు పోగోరెనో అది అచ్చుటనే ఆమెకు సిద్ధించి సువర్ణశ్రీ దర్శనమిచ్చినాడు. అది ఏమి విచిత్రమో తన కాతడు మోకరిల్లినాడు.

[1]సుమారు 1260 ధనువులు, ఇప్పటి 12 అణాల వెలగల వెండి నాణెము.
[2]ఒక ఏనుగు = 1 రథము = 3 గుర్రములు = 5గురు బంటులు
[3]నడుము వరకు నుండు ఇనుప చొక్కా
[4]మోకాళ్ళవరకు కప్పు గొలుసుల కవచము
[5]చీలమండలవరకు వ్రేలాడు కవచము
[6]చేతులకు తొడుగుకొను ఇనుపచేయి

# ద్వితీయ భాగం

## ౧
## ముట్టడి

సమవర్తి యుద్ధమున ఆరితేరిన బంటు. కాని వినీతమతికి సర్వ విధముల తోడగుటయేగాక, ఆత డుపశమించునప్పుడు తానే అధిపత్యము వహించి లగ్గల కెగబ్రాకు విరోధుల తోలివేయుచుండెను. కోటగోడలకు కందకమునకు దూరముగా విరోధిసైన్యముల అఖండయంత్రప్రయోగ వృష్టిచే తరిమివేయుచుండెను.

ఒకనాడు సమవర్తి గుల్మముపై నధివసించి, కోటగోడలకు, బురుజులకు, ద్వారములకు బోవు రహస్యపుదారులన్నియు గలియు మూలప్రదేశమున నిలిచి, తనకడనున్న చారులతో మాట్లాడుచు నాలోచించుకొనుచుండెను.

ఒకడు: స్వామీ, మనకడనున్న భోజనసామాగ్రులు కొంచె మెచ్చు తగ్గుగ అయిపోయినవి. శత్రువుల రహస్యచారులు మనము త్రాగునీళ్ళలో రెండుసార్లు విషము కలిపినారు. ప్రయత్నము విఫలమైనను ఎప్పటికప్పుడు భయముగా నున్నది.

ఇంకొకడు: ఆర్యా! ఉన్న నాలుగు సర్వతోభద్రములు (రాళ్ళు విసరునవి) చూర్ణములైనవి. పదునాలుగు జామదగ్న్యములు (వివిధబాణముల పరపు యంత్రములు) పాడై ఒక్క యంత్రము మాత్రము ఉత్తరద్వారముకడ పని చేయుచున్నది. ఆరు దేవదండములు (అనేకములగు పెద్ద మేకులతో వాడిగా నున్న దూలములను విసరునది), పదునొకండు విశ్వాశాఖలికములు (బరువువస్తువులను వేగముగా విస్తరి విరోధుల పిప్పిచేయు యంత్రములు), శతఘ్నులు, వరాహకర్ణములు, కనాయములు, కల్పణములు మొదలగు ఉపకరణము లయిపోనున్నవి.

మూడవయతడు: ఇంతవరకు పదిదినములనుండి మన వేగులవారు పైనుండి లోనికి వచ్చుటగాని, లోనుండి పైకి పోవుటగాని జరుగుటలేదు. మూడు రాత్రులలో పదునలుగురు చారులను పంపినాము. కాని విరోధులు వారిని గ్రహించి కారాగృహముల నుంచి నిజమునరయుటకు వారిని బాధించు చున్నారని తెలియుచున్నది. ఎంతమంది వెళ్ళినారో అందరి పేరులు తెలియజేసినారు.

నాల్గవదళవాయి: వీరోత్తమా, శస్త్రవైద్యుల మందులై పోయినవి. గాయములు తగిలినవారు అదృష్టవంతులైనచో జీవించవలయును. లేనిచో దివంగతులు కావలయును.

సమవర్తికన్నులు మిరుమిట్లు గొలిపినవి. అతనికి భయమనునదిలేదు. శత్రువులు తన్ను పెట్టు బాధలు అతనికి మరింత ఉత్సాహము కలుగ జేయును. మీసములు మెలి పెట్టుచు "ఆంధ్ర సైన్యముల నన్నింటిని నురుమాడినను, వారి అస్త్రముల నుగ్గుచేసినను, వారి ఆత్మలు విజయమొందును. మన కేమియు భయములేదు. చక్రవర్తి నా వెంటనే శుభదినమున బయలు దేరియుండును. వారు అడవులవెంట రారు. సైన్యము లనేకము లగుట కళింగమునుండి వచ్చెదరు కాని, ఇచటికి చేరుటకు ముప్పది అయిదు దివా రాత్రములు పట్టును. నేను వచ్చి యిరువది యేడు అహస్సులయినది. కావున నింక నొక పదునాలుగు దినంబులు మనము మహారణంబు సలిపి చక్రవర్తికై యెదురు చూడవలయును. శాతవాహన పతాకంబగు "సింహము" ఉజ్జయినీ కోటగోడలనుండి

పారిపోవునాడు కొనయూపిరితో సార్వభౌమునికై యెదురుజూడదా? ఇది నాయాజ్ఞగా తెలుపుడు. ఒక్క చారుడును ఉజ్జయినికోట వీడవలదు. వరితవుడుగంజి కాచి ప్రతివారును మధ్యాహ్నము త్రాగవలయును. యవధాన్యపుముద్ద ఒకపూటను, బియ్యపు ముద్ద రెండవపూటను ఉపయోగింపవలయును. విరోధుల ఆయుధములు వ్యయము కానిండు. ముఖ్యావసర మగునపుడే మనయస్త్రముల నుపయోగించెదము గాక! కోటబురుజులలో కొలది గాయము తగిలిన వెంటనే వేరొకడా స్థలము నాక్రమింపవలయును. ముఖ్యావసరములై నప్పుడుమాత్రము సగము బలముతో యుద్ధము సలిపెదము" అని మేఘగర్జనముల నాత డాజ్ఞాపనల నెరుకజేసెను. అందరును మహోత్సాహముతో "విజయ! సమవర్తవిజయ!" అని జయపెట్టిరి. శంఖముల నొత్తిరి. భేరీనినాదములు బయల్వెడలెను.

విరోధు లీ జయధ్వానములు విని నివ్వెరగందిరి. చక్రవర్తి వచ్చుచున్నాడేమోయని భయపడిరి. అప్పుడు మాళ్వాధిపతియు మంత్రులు తదితరులు నొక సభ కావించుకొనిరి. వారి కేమియు తోచుటలేదు. ఏ వార్తలు తెలియుటలేదు. ఒకవేళ చక్రవర్తి వచ్చుచున్నాడేమో! ఏది యెట్లయినను రెండు రోజులలోపల ఆంధ్రుల నుగ్గుచేసి కోటజొరబడి స్వాధీనము చేసికొనకున్న తమ ముందుగతి ఏమగునో?

## ౨
## జైత్రయాత్ర

శ్రీముఖసాతవాహనుని సైన్యములు ఆంధ్రరాజ్యరత్నమగు ధాన్యకటకనగరమున కృష్ణానదియావల మహాసైన్యస్థానమున విడిసియున్నవి. మహాసైన్య స్థానము - పది గోరుతముల పొడవున నున్నది. వెడల్పు మూడు గోరుతములు.

ఆ స్థలమంతయు మహానగరమువలె నేర్పాటు గావింపబడినది. చక్కని వీధులు, రాజమార్గములు, శృంగాటకములు, వీధుల పొడుగున శిబిరములు, వైద్యశాలలు, వర్తకవీధులు, క్రయ విక్రయశాలలు, వినోద మందిరములు, మదిర మందిరములు విశ్వకర్మ ఒక రాత్రిలో నిర్మించిన ఇంద్రనగరమువలె ఆ సైన్య స్థానము వికసించినది.

ఒకయెడ గజయూధముల భాగము. అచ్చట రెండువేల గజము లున్నవి. దేనినైన హింస యొనర్చిన ఊరకుందురేమో కాని, అడవిలోనైన గజమును ప్రబలకారణములేక చంపినవారికి మరణమే దండనము. గజముల పట్టుకొనుట, వానిని పెంచుట, వాని భోజనము, మావటి వాండ్రు, గజాలంకారములు, కవచములు, తోత్రకములు, నిగళములు, ఆలానములు, అంకుశములు, వరత్రములు, అంబారులు-ఇవి అన్నియు గజాధ్యక్షుని యధికారములో నుండును. ఒక్కొక్క ఏనుగునకు నలుగురు మావటీ లుందురు. ఇద్దరు పదాతులు, ఇద్దరు సేవకు లుందురు. భద్రదంతావళమునకు ఇద్దరు ఆలంకారికులు, ఎనమండుగురు మావటీలు, నలుగురు సేవకులు. అధివసించువాడు గజసాహిణి. అతనికి కవచరక్షకుడొకడును, ఆయుధకు డొకడును ఉందురు. భద్రగజమునకు రక్షణగా సాధారణగజములు రెండు ఈవలావల నుండును.

ఆంధ్రులు విదేహమునుండి అత్యుత్తమమైన ఏనుగులు కొనుచుండిరి. తమదేశములోని దశార్ణ, అపరాంతములనుండి మధ్యజాతి ఏనుగుల సముపార్జించెదరు. సురాష్ట్రమునుండి హీనజాతులు వచ్చును. సురాష్ట్రగజములు, సరకులు, శిబిరములు మోయుటకు మాత్రము పనికి వచ్చును. భద్రజాతి దంతావళము లన్నియు విదేహమునుండి వచ్చును.

సైన్యశిబిరములలో గజములకు శాలలు లేకపోయినను, సైన్యము రాజధానీ నగరమున నున్నప్పుడు వానికి శాలలున్నవి. శాల ఏనుగు పొడుగు ఎంత యుండునో అంత ఎత్తుండవలెను. ఏనుగు ఎత్తులో సగము శాలవెడల్పు. మగ ఏనుగు లన్నిటికి శాలలు వేరు, ఆడ ఏనుగులశాలలు వేరు. శాలకు వెనుకగా ఏనుగు నిద్రబోవు స్థలముండును. ఏనుగు దేనినైన యానుకొని నిద్రబోవును. కావున శాలవెనుక ఎత్తయిన ప్రదేశము నిర్మింతురు.

ఏనుగులకు శిక్షకులు వేరు, మావటివారు వేరు. శిక్షకులు గజశాస్త్రజ్ఞులు. మావటివారలలో ప్రథమశ్రేణివారు యుద్ధకాలమందు ఏనుగులను నడుపుదురు. వారికి గజయుద్ధపు మెలకువలన్నియు కరతలామలకములు. ఏ విధమైన అస్త్రము వచ్చినను దానిని తప్పుకొనునట్లు ఏనుగును నడప వలెను. గజవేగమును కాలమునకు తగినట్లు వృద్ధి చేయవలెను. ఏనుగునకు వంటవండువారు వేరు. సాధారణపు మావటివాండ్రు ఉదయమున నేనుగును నదికిగాని సరోవరమునకుగాని తీసికొనిపోయి కడుగవలయును. దినాంతమందు, మూడవయా మధ్య మందు మరల కడుగవలయును, యుద్ధ గజములకు తక్కిన యూధముతోబాటు నడచుట, పరుగిడుట, పక్కకు తప్పుకొనుట, యెదురుగ ముఖమునుంచి మూలగా ముందుకుసాగుట, చటుక్కున వంగుట, తొండముతో గజ గదాదండము పుచ్చుకొని గజమును రథమును ఆశ్వికుని తాడించుట, మూర్ధములతో గజముల రథముల తాకుట, వేగముగపోయి తాకుట, మూర్ధములకు బిగించిన శూలముతో తలవంచి దేనినైన తాకుట, రెండుకాళ్ళు పైకెత్తి నిలుచుండి కాళ్ళతో మర్ధించుట, తొండముతో గజముమీదనుండి రథముమీదనుండి గుఱ్ఱముమీదనుండి వీరుల లాగిపార వేయుట, కోటగోడల గోపురద్వారముల మూర్ధముతో తాకుట, గజ గదలతో మహా దండములతో తాకి పగులగొట్టుట, తనవారినీ ఎత్తుకొని కంఠమున మావటివానికి అందిచ్చుట, చప్పుడుచేయక నడచుట, కాళ్ళతో మర్దించుచు ఉరుకుట, ఈదుట, అగ్నిబాణముల పట్టుకొని మట్టిలో దూర్చి నీటిలోముంచి ఆర్పుట, తిరిగి విరోధులపై విసరివేయుట అగ్నిదండముతోడ విరోధుల కాల్చుట-ఇవి యుద్ధగజములు నేర్చుకొన వలసిన యుద్ధతంత్రములు.

ఏనుగులకు వైద్యము చేయువారును, భూతవైద్యులు నున్నారు. ఆంధ్రసైన్యముల గజహారము కొలత - ఒక ద్రోణము బియ్యము, అర్ధ ఆఢకము నువ్వులనూనె, మూడు ప్రస్థముల నేయి, పదిపలముల ఉప్పు, ఏబది పలముల నారి కేళములు అరటికాయలు, రెండు ఆఢకముల పెరుగు, పదిపలములబెల్లము, ఒక ఆడకము మదిరము, రెండు ఆఢకముల పాలు, రెండు భారముల యవగడ్డి, రెండుంగాలు భారముల ఆకుపచ్చగడ్డి, భారము లో ఆరవవంతు వట్టిగడ్డి ఆకు పప్పు దినుసుల మొక్కలును.

గజసైన్యము వెనుక ముఖ్యా యుద్ధాంగము రథము. రథములలో నాలు గుఱ్ఱములు పూనిన రథములు, రెండు గుఱ్ఱముల రథములు, ఏకాశ్వ రథములు అని మూడు రకములున్నవి. ప్రయాణమునకు, విలాసవిహారమునకు రథములు వేరు. యుద్ధరథములు వేరు. విలాస రథములకు ఎనిమిది గుఱ్ఱములుకూడ ఒక్కొకప్పుడుండును. యుద్ధరథములు తేలికయైన గట్టిదారువులతో నిర్మింపబడును. చక్రములు బరువైన గట్టిదారువుతో నిర్మింపబడును. రథనిర్మాణము, వానిని మంచి స్థితిలో నుంచుట, వానియం దుంచవలసిన ఆయుధములు, రథసూతులు, రథాశ్వములు, వారి పోషణఅంతయు రథాధ్యక్షుని అధికారమున నుండును.

రథము వెనుక అశ్వ సైన్యము ముఖ్యమైనది. దేశములోని గుఱ్ఱము లన్నిటి విషయము, వాని జాతి, సుడులు, వాని ఈడు, గుణగణములు మొదలైన విషయము లన్నియు ఒక గ్రంథములో వ్రాయుదురు. జాతినిబట్టి లక్షణములనుబట్టియు గుఱ్ఱముల

యుద్ధములో జేర్చుకొందురు.

వేగ, మధ్యవేగ, మందగతిగలవి; తీక్ష్ణ, మధ్యమ, శాంతి స్వభావములు గలవిగా గుఱ్ఱముల వేరుచేయుదురు. అవి ఉద్భవించిన దేశములబట్టి వానిని వివిధనామముల పిలుతురు. కాంభోజ, సింధు, ఆరట్ట, వనాయు, బాహ్లిక తురంగ, సౌవీర, సాపేయ, తైతల, పారసీకము లని వాని పేర్లు.

వీనిలో కర్కశములగు అశ్వములే రథములకు పనికివచ్చును. పారసీక వనాయుజ తురంగ జాతులు ఆశ్వికులకు మంచివి. కాంభోజ, సైంధవ ఆరట్టజ బాహ్లికాశ్వములు రథముల కుత్తమమైనవి. కులీనములు ఆజానేయములు చక్రవర్తి రథములకు ప్రత్యేకింప బడును.

మంచిజాతి అశ్వముఖము ముప్పదిరెండు అంగుళము లుండవలెను. అశ్వము పొడవు ముఖము పొడవునకు అయిదురెట్లుండవలెను. జంఘలు ఇరువది అంగుళములు, ఎత్తు ఎనుబది అంగుళములు, వక్షము చుట్టు నూరు అంగుళములుండవలెను అని ఏర్పరచిరి. రెండవజాతి గుర్రములు కొలతలలో మూడంగుళములు తక్కువ యుండును.

విరోధులు గుర్రములకు విషమిచ్చి చంపించుచుందురు. కావున వాటి శాలలు విశాలముగ కట్టుదిట్టములు కలిగియుండును. శాలలలో కోతులు ఆరోగ్యము కొరకు, పిల్లులు, మయూరములు, ముంగిసలు, జింకలు పాముల చంపుటకు రక్షకులనుంచుదురు. చిలుకలు, మైనపుగోరు వంకలు, పికిలిపిట్టలు విషము పరిసరముల నున్నపుడు అల్లరిచేయును. కోకిలలు విషము ప్రాంతములనున్న చనిపోవును. కౌజుపిట్టలకు విషాఘ్రాణముచే కన్నులెఱ్ఱపడును.

## 3
## మహాసభ

ఆంధ్ర సైన్యములలో అశ్వముల కిచ్చు యుద్ధశిక్షవర్తనము, కృప వేణుక వర్ధమానకము, యమకము, నీచైర్గతము, ప్రకీర్ణక, ఊర్ధ్వమార్స, త్రితాళ, శరభప్లుత, శరభక్రీడిత, సింహాయత, కపిప్లుత, భేకప్లుత, ఏకప్లుత, ఏక పాదప్లుత, కోకిలసంచారి, హ్రస్వ, బకచారి, ఘోరణకి, మయూర, నాకుల, వారాహ, సంజ్ఞాప్రతీకార, మార్గవిక్రమ, భారవాహ, ధారా, ఉపకంఠ, ఉపజవ, మొదలగు గతులతో, నడకలతో కూడియుండును.

అశ్వము ఎట్టిధ్వనికైనను బెదరకూడదు. అశ్వికుడు లేకపోయినను యుద్ధభూమిని వదలరాదు! ఉత్తమాశ్వము పన్నెండు యోజనములకన్న ఎక్కువ పరుగిడకూడదు. (ఇప్పటి ఆరు ముప్పాతిక మైళ్ళు) సాధారణముగ పదియోజనమున్నర పరుగిడవలెను. వృద్ధాశ్వములను పనిచేయించక ఆహారమిచ్చి పెంచెదరు.అశ్వసూతులు గుర్రమును బాగుగా తోమి కడిగి చందన మలందవలెను. రోజును రెండుసార్లు క్రొత్తపూలదండలు వేయవలెను. ప్రతి గుర్రమును గురించి భూతములకు ఫలాదు లర్పించవలెను. ఉత్తమ బ్రాహ్మణులు వచ్చి అశ్వినీదేవతలకు వేదమంత్రములు చదువవలయును.

ఆంధ్రపదాతిదళములు నాలురకము లున్నవి: ఎప్పుడును చక్రవర్తికడ జీతములు పుచ్చుకొనుచుండువారును, మాండలికాదిసామంతులకడ సర్వకాలము నుండవలసిన చమువులును, జైత్రయాత్రకై యితరదేశముల నుండి భత్యములకైవచ్చు దళములును, యుద్ధకాలమునందుమాత్రమే చేరు సాధారణ ప్రజానీకము.

పదాతిదళములలో సైనికులు వారి ఆయుధములనుబట్టి నాలుగు తరగతులక్రింద విభజింపబడియుండిరి. విలుకాండ్రు, దుర్గభేదకులు, శూలికులు, యాంత్రికులు.

విలుకాండ్రకు శిరస్త్రాణము, వక్షఃకవచము, హస్తపాదఫలకములు నుండును. వారు నడుమున, కటిభాగమున, వీపున, శిరస్సున అంబులపొదులను కట్టుకొందురు. ప్రతి విలుకానికి నాలుగు ధనుర్దండములు, పదునారు వింటి తాడులును, ఎడమచేతికి అంగుష్ఠ రక్షలు నుండవలెను. వారి నడుమునకు రెండు చురకత్తియలును, ఆయుధములు కూడ ఉండవలెను. శూలికులకు ఒకశూలము, మూడు శూలముఖములు, ఫలకఖడ్గము, ఛురికయు ఉండవలెను.

యాంత్రికులు సర్వతో భద్రాదియంత్రములు ఉపయోగింతురు. వానిని రక్షింతురు. వానికి తగిన పరికరములన్నియు సేకరింతురు. వలయునెడల కత్తిపట్టి పోరాడగలరు. దుర్గభేదకులు దుర్గములకు సొరంగములుచేయుట, లగ్గలకు తాటినిచ్చెనలువేసి ఎగబ్రాకుట, కందకముల నీదుట, కందకములకు వంతెనలు కట్టుట, దుర్గభేదకయంత్రము లుపయోగించుట, దుర్గరక్షణ చేయుట-వీనిలో అత్యంతకౌశలము కలవారు.

మహారాజగు శ్రీముఖశాతవాహనుడు తాను జైత్రయాత్ర కరుగుటకు మహాసభను పిలిపించెను. వివిధ విషయములనుండి సభ్యులు విచ్చేసిరి. గ్రామాణులు, దళనాయకులు, శతనాయకులు, వివిధ సమితి సభాధ్యక్షులు, వివిధ శాఖాధ్యక్షులు, మంత్రులు, బౌద్ధభిక్షుకులు, భిక్షిణులు, పండితులు, వణిక్సమూహాధిపతులు, వివిధశ్రేణి సంఘాధ్యక్షులు, చిత్రకారకులు, శిల్పులు ఆ మహాసభలో సభ్యులు. అందరకు రాజాజ్ఞలు అందగనే అధిపతి సలుపబోవు నుత్కృష్టకార్యమునకు అనుమతి నీయుటకుగాని, వీలు లేదని త్రోసిపుచ్చుటకు గాని విచ్చేసిరి.

విశాల మగు సభాభవనమున మహారాజు సింహాసనాసీనుడై యుండెను. సభికులు కొలువుదీరి యుండిరి. ప్రధానామాత్యుడగు అచీర్ణుడులేచి సభ్యుల దిక్కుమొగంబై ఈ విధమున నుడివెను: “మహాసభ్యులారా! మాళవాధిపతి మనరాజ్యమునుండి విడివడి, మహారాజుపై యుద్ధము ప్రకటించి, యుజ్జయినీకోటలో వినీతమతిని ముట్టడించినాడు. మాళవునికి సహాయముగా భోజులు, పుళిందులు, వైదేహులు, మాగధులు వచ్చి చేరినారట. ఆంధ్ర రాజ్యము గొడ్డుపోయినదా? గౌతమీ కృష్ణవేణి పవిత్రాంబువులు మీ రక్తాల ప్రవహించుట లేదా? ప్రియదర్శి యగు నశోకచక్రవర్తికి లోబడక సమముగా రాయబారముల నడిపి స్వతంత్రపూరితమై ఒరులకు తల యొగ్గక విశాలమై ఆంధ్రపతాక మగు సింహధ్వజభీషణారాహంబుల దశదిశల పర్వజేయు మనదేశము నేడు మాళవునిచే పరాభవింపబడవలెనా? ఉజ్జయినిలో మాళవుడు విజయ మందును. ఆ సైన్యముతో మనదేశము పై విడియును. ధాన్యకటకము కృష్ణలో కలియవలెనా? ప్రతిష్ఠానము గౌతమిలో లీనమై పోవునా? కాకుళము సముద్ర తరంగములలో మాయమైపోవునా? ఆంధ్రరాజ్యలక్ష్మి ఫాలమునుండి సౌశీల్యతిలకము మాసిపోవునా? లేక ఆంధ్రసైన్యములు మహారాజు స్వయముగా నడుపబోయి, విజయ యాత్రసలిపి విరోధుల నడంచి ఆంధ్రపౌరుష మెల్లయెడల చాటిరావలయునా? తెలియజేయుడు. ఇంకొకటి ఈ జైత్రయాత్ర కగు వ్యయము మహాభాగుడగు చారుగుప్తులవారు భరించెద మని వాగ్దానము చేసినారు.”

ఇటులనే సర్వసైన్యాధ్యక్షుడు ఉపన్యాసము సలిపెను. అనేకవేల జనులు ప్రోవైయున్న యా మహాసభ జయజయధ్వానములుసలుపుచు, మహారాజు ఈ జైత్రయాత్ర విషయమై ఏమి యొనరించినను వల్లెయని యొప్పుకొనిరి.

ఆంధ్ర సైన్యములు బయలుదేరినవి. శతాబ్దములనుండి ఆంధ్రవాహినులు భరతభూమిని ప్రసిద్ధిగాంచినవి. చంద్రగుప్తుని కాలమున ఆంధ్రులు సర్వస్వతంత్రత గలిగిన పరాక్రమపూరితములగు మహాసైన్యముల కలిగి యుండిరి. అశోకునికి మిత్రులైరి. అశోకునివెనుక భరతభూమిలో ఆంధ్ర సైన్యముల బలము వేరొక రాజ్యమునకు లేదు. రెండువేల ఏనుగులు, ఆరువేల అశ్విక సైన్యము, రెండువేల రథములు, రెండులక్షల పదాతిదళములు బయలుదేరినవి. ఎనిమిది వృషభములు, నాల్గువృషభములు పూన్చిన బండ్లు సామగ్రులను, సేవకులను, దాసదాసీ జనంబులను కొనిపోవు చుండెను.

ముందు అరువదివేల సైన్యములు బయలువెడలినవి. పదికోశముల తరువాత అరువదివేల సైన్యములు సాగినవి. అవన్నియు కృష్ణానది దాటి, వ్యాఘ్రదేశము కడచి, గోదావరికడకు పోవునప్పటికి తక్కిన ఎనిమిదివేల సైన్యములు పోయినవి. గోదావరికడ పడవలు వేలకువేలు సిద్ధముగానుండెను. రేవుస్థలములదాటి సైన్యములన్నియు ఆవలియొడ్డుకు బోయినవి. దక్షిణకోసలము గడచినది. కళింగము వెనుకబడినది. తెలివాహానది వారికి శీతలోదకములు ప్రసాదించినది. ఉప్పెనవలె, ఎడారులలో వీచు భయంకరమగు ఇసుకగాలులవలె ఆంధ్ర సైన్యములు కతిపయప్రయాణంబుల సాగిపోవుచునే యున్నవి.

## ౪
## చైతన్యోదయము

స్థాలతిష్యుని మహావిద్యవల్ల ఆ బాలికలోని మానవత్వము నెమ్మది నెమ్మదిగ వెనుకకుపోయి పశువులలో ఉత్తమమైన గోవు స్థితికిపోయినది. ఆ వెనుక ఆమె ఏనుగుస్థితికి దిగినది. ఒక్కొక్కవర్షము గడచినకొలది ఆమె శునకజాతికి పోయినది. మార్జాలజాతికి దిగినది. శార్దూలమైనది. ఈ నాడామె భయంకరశార్దూలోరగము.

స్థాలతిష్యుని అఖండ ఆయుర్వేద పాండిత్యము అమృతబాల కావలసిన ఆమెను కాలకూటవిషసన్నిభను చేసినది.

గుజ్జనగూళ్ళలో నామెకు గరళము తిలబీజ దశభాగము నిచ్చువాడు. ఆమె పాలలో నాభి యవగింజలో త్రింశతి భాగము కలుపువాడు. చంద్ర బాలకు మూడవయేడు వచ్చునప్పటికి సౌరాష్ట్రికము తిలప్రమాణ మామె ఆరగింప గలిగినది. ఆమె కైదవయేడు వచ్చునప్పటికి శాక్లికేయము యవగింజ తినగలిగినది. దారదము, వత్సనాభము ఆమెకు ఫలహారములైనవి. చంద్రబాలకు పన్నెండవయేట తొమ్మిదిరోజులు జపతపాది హోమంబులు చేసి, స్థాలతిష్యులు మహావిషమైన కాలకూటమును, దక్షిణ దండకాటవీ మహానాగ దంష్ట్రాంచిత కాకోలమును చంద్రబాలయందు ప్రవేశింప జేసినాడు. ఆ భయంకర ముహూర్తమునుండియు ఆమె విషకన్యకయైనది.

ఆనాటినుండియు ఆమె స్పర్శయే, ఆమె ఉచ్ఛ్వాసనిశ్వాసములే, ఆమె పరిసరమే దారుణమృత్యుస్వరూపమైపోయినది. ఆ ముహూర్తము నుండియు పెద్దపులులును ఆమెకడకు వచ్చుటకు భయపడును. ఆమెచేతిలో సాధారణ విషములు అమృత ప్రాయములు.

స్థాలతిష్యునిశిష్యులు ప్రతినిమేష మా బాలకు క్రౌర్యము పాఠముగ జెప్పుచుండిరి. మృత్యురూపమగు లాలనజేయుట, కులుకులుసూపుట, దరికి జేరుట, నశింపజేయుట యివి అనుదినము నామె నేర్వవలసినదే. ఆమె వివిధ భాషలతో

మాటలాడుటయందుత్తీర్ణురాలైనది. ఆమెకు చక్కని సంగీతము నేర్పబడినది.

ఎట్టి శ్రీశుకుడైనను ఆమెను దర్శించిన మాత్రమున, ఆమె హోయలు కనినంతమాత్రమున, ఆమె తీయనిపాట వినినంతమాత్రమున కరగి ముగ్ధుడయిపోయి ఆమె భయంకరాద్భుత సౌందర్యములో మగ్గి మసి యైపోవలసినదే.

మలయనాగుడు ఆమెకు ఆహుతియైన పిదప ఆ బాలయు తన నివాసము చేరినది. ఆమెకు నేదియో విషాదము, ఏదియో ఆవేదన. ఆమె హృదయాకాశమునందు కాలమేఘములు ఎచ్చటనో పొడసూపినవి. తన్ను తాతగారు ప్రయోగించిన దినమున విషకన్య తనచుట్టునున్న సభ్యులను జూచినప్పుడు వీరందరు నుసియగుదురో యను ఆలోచన పొడమినది.

చిన్న తనమునుండియు తనలాలనలచే మగ్గిపోయిన కురంగశాబక శవములను చూచి నవ్వునది. హస్తస్పర్శచే మాడిపోయిన మల్లికాది సుమములగని కిలకిలలాడునది. తనచుంబనములచే హతమారిన శుక శారి కాదుల చూచి గంతులువేయునది. మృత్యు వామెకు చెలియలు. అగ్ని యామెకు చుట్టము, కాళరాత్రి యామె అధిదేవత. అమావాస్య ఆ బాలిక ఆటలాడుకొను కాలము. అట్టహాస మామె విలాసము, భయంకర తాండవ మామె ప్రియనాట్యము.

మత్తిల్లిన పురుషు డుచితానుచితజ్ఞత కోలుపోయి, నిండుసభలో భయ మిసుమంతయులేక, ఆ సమయము పవిత్రము అను ఆలోచనయే లేక తన్ను కామించి తనకడకు పరువిడి వచ్చినాడు. మరుసటి నిమిషమున విగత జీవుడై పడిపోయినాడు.

ఈ సంఘటన ఏమియు నా విషబాల కర్థము కాలేదు. ఆమె కామమే ఎరుగనిది. ఆమె సంపూర్ణయౌవన. ఆమె దేహము, నరనరము, ఆమె వనితాత్వచిహ్నిత విచిత్రాంగములు విద్యుచ్ఛక్తిచే మేఘములు విలసిల్లినట్లు జ్వలించుట ప్రారంభించినవి.

స్త్రీ పురుషసంబంధ మన నేమో ఏమాత్ర మామే ఎరుగదు వానిని గూర్చి ఏరును చెప్పలేదు. వానినిగూర్చి యామె చదువనులేదు. పాములు, పిట్టలు సంగమించుట రెండు మూడు లామె చూచినది. ఆమె శిశు హృదయ మా విషయమై తాతగారి నడిగినది.

రెండు ప్రాణులు ఒకటికడ ఒకటి యుండుట కిష్టపడుననియు, అప్పుడవి చాలదగ్గరగ వచ్చుననియు, ఒక్కొకప్పుడా రెండు ప్రాణులు దేహము దేహముకూడ పెనవేసికొనిపోవుననియు, దానిని "ప్రేమ" యందురనియు స్థాలతిష్యు డామెకు చెప్పినాడు. స్థాలతిష్యుని ఘోరవ్రతము సమాప్తినొందవలె నన్న యా బాలికకు స్త్రీ పురుష సంయోగరహస్యము కొంతయయినను తెలియవలెను. కాబట్టి ఆతడామెను దూరదూరము నుండి జంతువులలో, పక్షులలో ఉన్న కలయిక దర్శింపజేయుచుండెను.

మహాతంత్రీవాద్యములలో ఒక తీగ స్పందించిన, ఆ స్వరమునకు శ్రుతియగు స్వరములన్నియు నొక్కసారి ప్రతిస్పందన మొనర్చును. అలాగుననే మృగవ్యాజంబున స్త్రీ పురుషుల సంయోగరహస్యము దర్శన మాత్రమున ఆమెకు నేర్పబడుచుండెను.

ఆమెకు ఆడుమగ భేదము స్థాలతిష్యుడు కొంచెముకొంచెముగ నేర్పినాడు. ఆ కారణముననే విషబాల పాములతో ఆడుకొనినప్పుడెల్ల వానిని ఒకటినొకటి కౌగిలించు కొనుమని కోరునది.

ఒక్కొక్కమాసము వచ్చినకొలదియు నామె జీవితము వెనుక నీడవలె మానవత్వము వచ్చుచున్నది. అది మరియు నామెను తారసిల్లినది.

మలయనాగుడు ఏ క్షణికమున అతికామాంధుడై తన భుజముల అదిమిపట్టి ఆ బాల సర్వదేహమును తనలో లయించుకొన వాంఛించెనో ఆ నిమేషమున ఎచ్చటనో దాగికొనియున్న ఆమె స్త్రీత్వమునకు చురుక్కుమను స్పందనము కలిగినది.

ఆ స్పందనముచే నిదురపోవు పామును పాములవాడు నాగసొర బుఱ్ఱ మొనతో పొడిచినట్లయినది. ఆ స్పందనము వేసవికాలమున భూమిలో నడగియున్న బీజమును ఆషాఢ ప్రథమ వర్షబిందువు చుంబించునట్టిది. ఆ స్పందనము ఆకురాల్చిన చెట్టుకొమ్మలో దాగుకొనియున్న లేచిగురును మధుర వసంత మంద మలయానిలములు మునివేళ్ళతో దాకినప్పటిది.

ఈ దినములలో ఆమె కప్పుడప్పుడు ఒడలు ఝల్లుమనుచుండెను. ఆమెకళ్ళు అరమూతలు పడుచుండెను. ఒకచోట నిలువలేదు. నిద్దురపట్టదు. పట్టినచో ఏవేవో కలలు! స్వప్నాలకన్నిటికి చివరిభాగమున మలయ నాగుడు చేతులుచాచి తన్ను వేడికళ్ళతో, మత్తుచూపులతో కౌగిలింపవచ్చుచున్నట్లు కనబడును. ఆమెకు దేహమంతయు నుప్పొంగును. ఏదియో తీయని బాధ వచ్చును. ఆతడు కౌగిలించిన ఏమి జరుగును? అని ఏదో వాంఛతోకూడిన ఎదురుచూపు. అతడు సమీపించును. ఆమెకు ఎంతయో భయమువేసి "ఆ, హో" యని కేకలువేయుచు లేచును.

ఆమె చెలికత్తెలగు యోగినులలో గగనియో, కాశ్యపియో, అగస్తియో ఎవరో ఒకరు చటుక్కున ఆమెకడకు పరుగిడివత్తురు. ఆమెపై చేయివైచి "అమ్మా చంద్రా! ఏమమ్మా కలవచ్చినదా?" అని లేపివైతురు.

ఆమె రోజుచు మేల్కొనును. "ఏడి ఆ దుర్మార్గుడు?" అని ఆమె కన్నులు తెరచి, భయమున కోపమున అడిగి ఇటు నటు చూచును.

గగని: ఎవరు తల్లీ!

విషబాల: మలయనాగుడు.

గగని: వాడు చనిపోయినాడు. నీకు కల వచ్చినదా?

విషబాల: కలా? కాబోలు! అమ్మా! నిజమైనట్లే ఉన్నది. వాడు నన్నెందుకు ముట్టవలె?

గగని: నిన్ను ముట్టడు. వాడు నీ శక్తివల్ల నాశనమైనాడు.

విషబాల: నాశక్తియా? ఇటుల ఆ బాలికకు రెండు మూడు కలలు వచ్చినవి. ఆమెలో పరిమళములు గుబులుకొనుచున్నవి. ఆమెలో తేనెలు చేరుచున్నవి. ఆమెలో మార్దవములు అలముకొనుచున్నవి.

## ౨౪

## నేనును ఆడుదాననే!

స్థాలతిష్యాశ్రమమందు ఆ మహాఋషి పూజామందిరశాలలనంటి విషకన్యక

వినీతమతి ఆశ్చర్యనయనములతో సమవర్తిని కనుంగొని "ఓయీ, నే నా మాటలను ఏ మాత్రము విశ్వసింపను. అంతయు కల్ల. వారికి కోటలోని సంగతి తెలిసికొన ఊహ కలిగి వీనిని పంపినారు. అదియే నిజము." "ఆర్యా! నేను జాగ్రత్త పడియే యుంటిని. కోటగుమ్మ మావలనే ఆతని కన్నులు కట్టి సభాభవనమున కట్టు విప్పినాము. వెడలిపోవునప్పుడు కోటగుమ్మమునకు వెలుపలనే కట్టువిప్ప ఆజ్ఞ యిచ్చినాను."

"మంచిపని చేసితివి! అయిన ఈ రాయబారమునుగూర్చి నీ వేమందువు? హిమబిందును పట్టుకొనుట వీరి కెట్లు సాధ్యమగును?"

"నా కేమియు నమ్మకము లేదు."

ఇంతలో శుకబాణు డచ్చటకు వచ్చెను.

సమవర్తి శుకబాణునకు సమస్తము వినిపించి వానియభిప్రాయ మడిగెను.

శుక: ఇప్పటికి పదిదినములవెనుక హిమబిందుకుమారిని చోరు లెత్తుకొని పోయినారనియు, ఆ చోరుల వెంటనే కొన్ని దళములు తరుము కొనుచు పోయెననియు వార్త వచ్చినది. ప్రతిష్ఠానమునుండి మహారాజు రెండు మూడు దినములలో వేట నెపమున బయలుదేరెను. సైన్యములు నాసిక కనియు, అటు వాతాపినగరమున కనియు బయలు దేరినవి. చక్రవర్తి మహా సైన్యములతో దంతిపురము దాటి, మహానదిని దాటి విదేహ రాజ్యము చొచ్చినాడు. మగధరాజధానిలో నున్న సైన్యములు తక్కువ కాబట్టి ఒక సైన్యము మన సైన్యములనుండి విడిపోయి ఉజ్జయిని వైపు తిరిగినది. మూల సైన్యమునే యడగించుటకు ఔఘలుడు విదర్భ సైన్యములతో, కొన్ని కళింగ సైన్యములతో మహానదికడ అడ్డగించినాడట. ఏనుగు తామరతూళ్ళను చిందరవందరచేసి కాసారము చొచ్చునటుల, దావాగ్ని కాంతారమును దహించుచు విజృంభించునటుల ఆంధ్రసైన్యములు ఆ సైన్యముల నాశనముచేసి, ముందుకు చొచ్చుకుపోయి పాటలీపుత్రము వైపుకు బోవుచున్నవి. ఇంక పదిదినములవరకు మన కోటకు భయము లేదని నిస్సంశయముగ చెప్పగలను.

వినీ: "అవును. కాని హిమబిందువిషయము...." అని వినీత మతి ఇంకను ఏమియో చెప్పబోవుచుండ, ఒక సైనికుడు లోని కేతెంచి వారికి ప్రణామమిడి "జయము! జయము! ఆ రాయబారి వెడలిపోవుచు "నేను సమవర్తి సైన్యాధ్యక్షునకు తెలిపిన యుదంతమునకు సాక్ష్యములివిగో, వీటిని వారి కందజేయుడు" అని యీ మంజూష మా కిడినాడు. ఇందేమున్నదో యచ్చటనే పరిశీలించి మరియు కొనివచ్చినాము. ఇందు ద్రోహమేమియు లేదు. అధిపతులు పరీక్షింతురుగాక" అని యా చిన్న పెట్టె వారి మ్రోల నునిచెను. వారా మందసము తెరచుటయు నందున్న భూషణముల చూచి సమవర్తి హాహాకార మొనర్చెను. నవరత్నఖచితములై మెరయు నా యాభరణములు హిమబిందు కుమారికారత్నము ధరించునవియె. వానికడ నొక మొగలియాకు పై లిఖించిన లేఖయున్నది. అది అందుకొని సమవర్తి యిట్లు చదివెను.

"శ్రీ మహారాజశ్రీలు, వీరాగ్రేసరులు, మేనబావలు నగు సమవర్తి సైన్యాధ్యక్షులకు హిమబిందు నమస్కారములు. నన్ను వీరు మా ఇంటినుండి హరించి మా అమ్మతోగూడ కొనివచ్చినారు. ఇది యే ప్రదేశమో తెలియదు. ఇందు మమ్ము బంధించినారు. మమ్ము వీరు గౌరవముగా జూచుచున్నారు, మేము ధైర్యముగా నున్నాము. కాని మమ్మేలనో వీ రనేకవిధముల బెదరించుచున్నారు. మీకు కమ్మ వ్రాయ మని కోరగా వ్రాసినాను. ఇంతవరకే వీరు నన్ను వ్రాయనిచ్చినారు.

చిత్తగింపుడు,
హిమబిందు"

అక్షరములు హిమబిందువే! ఇక నమ్మకుండుటెట్లు! వినీతమతికి మోము వైవర్ణ్య మొందెను. "హిమబిందు ప్రాణము రాజ్యములతో సంబంధించియున్నది. జంబూద్వీప వర్తక చక్రవర్తి యగు చారుగుప్తున కామె యొక్కతియు కుమారిత, అత డామె కెంతమాత్ర మాపదవచ్చినను ప్రాణములు విడచును. అతడాంధ్ర సామ్రాజ్యమున కేడుగడ. ఇక నే మున్నది?" అని వినీతమతి మతిలేని మాటలు వణంకుచు బలుకజొచ్చెను.

సమవర్తి స్థితి నుడువనక్కరలేదు. ఆతని నాశికాపుటములు విస్తరించెను. ఆతడు తనవిశాలవక్షము నింకను విపులముచేసినాడు. మృగ మొక్కటి పరిసరమున సంచరించుచుండ అపుడ పసిపట్టు సింహమువలె ఆతడు గర్జిల్లినాడు.

అయినను అస్థానకోపమువలన లాభమేమి? ఏమి చేయగలుగును? తాను ఆమెకై యుజ్జయినీదుర్గము వీడిపోయిన తనరాజ్యమునకు, ప్రభువునకు తీరరాని అగౌరవము తెచ్చి పెట్టినవాడగును. హిమబిందు తనకు ప్రాణాధిక. అది యటులుండ అబల, ఆర్త. తా నెట్లు పేక్షింపగలడు? ఒకవంక ప్రభుకార్యము, ఒకవంక ప్రియారక్షణము. సమవర్తి కామవశుడై రాజద్రోహముచేయునా? రాజవశంవదుడై ప్రేమదేవతకే విద్రోహము చేయునా? ఓహో చారుగుప్తతనయా రక్షణముమాత్రము రాజకార్యముకాదా? అవునని నే నెట్లు స్వతంత్రింతును?

"వినీతమతి సేనానాయకా! శుకబాణులవారూ! ఇప్పుడు మీరు నాకేమి యాలోచన చెప్పెదరు? మీ రనినట్లు హిమబిందు ప్రాణముతో, గౌరవముతో, మన సామ్రాజ్య గౌరవము లీనమైయున్నది" అని సమవర్తి తలవంచుకొని ముఖము హస్తములచే కప్పుకొనెను.

అట్లే, "ఈ యుజ్జయినీకోటతోగూడ మనసామ్రాజ్యప్రతిష్ఠ ముడి వేసికొనియున్నది. ఈ కత్తెరలో చిక్కుకొనియున్న మన మేమి చేయవలయునో" అని వినీతమతి యనెను.

శుకబాణుడు తీవ్రాలోచనలతో వారిమాటలు వినిపించుకొనియు వినిపించు కొననట్లు నిలుచుండిపోయెను.

## ౨
## అన్వేషణ

సువర్ణశ్రీ వెంటనే చారుగుప్తునిభవనములనుండి మరలి ఇంటికి పోయినాడు. తల్లిని కలుసుకొని హిమబిందును ఎత్తుకొనిపోయినమాట నిజ మనియు, ముక్తావళీ దేవి గారినికూడ ఎత్తుకొనిపోయిరనియు ఇంతలోనే వారు దొరికితీరుదురనియు, భయపడ నవసరములేదనియు చెప్పి లోనికి బరువిడి, వెంటనే కవచాదులు ధరించి, తిలకము తీర్పుమని నాగబంధునిక యున్న పెరటిలోనికి అంగలువేయుచు వెళ్ళెను. ఆ బాలిక అదిరిపడి ఎవరా యని చూచినది.

అన్నగారివేషము చూచి నాగబంధునిక "అన్నా, ఇది ఏమిటి? ఎక్కడనో దాచి ఉంచిన నాయనగారి చిన్న నాటికవచము తీసినావు? ఎవరోయని భయమందినాను. వేషమువేయుచున్నావా లేక ఉత్సాహము పుట్టినదా, మతిపోయినదా?"

"కన్న చెల్లీ! నాకు తిలక ముంచుము. చిన్న చెల్లి ఏదీ? ఎవరక్కడ? అమ్మాయి

సిద్ధార్థినికను పిలువుడు. త్వరగా లోనికి వచ్చి తిలకము పెట్టుము!"

"అన్నా! తిలక మెందుకు? యుద్ధమునకు రమ్మని నాన్నగారికడ నుండి ఆజ్ఞవచ్చినదా? లేక సేనానాయకు లెవరైన ఆజ్ఞ ఇచ్చిరా?"

"అన్నియు చెప్పుచుందును. నీవు ముందు నాకు తిలక ముంచవలయును, రమ్ము."

"అమ్మా!" అని నాగబంధునిక కేక వైచెను. తల్లి పూజాగృహము నుండి నిష్కుటములోనికి వచ్చినది. ఆమెయు కుమారుని జూచి, ఎవరో ఏమోయనుకొని, దిగ్భ్రమనంది, యట్లే నిలుచుండిపోయినది. నాగబంధునికయు, సువర్ణశ్రీయు పకపక నవ్విరి. అప్పుడు పుత్రు నాలవాలుపట్టి "ఇది ఏమిరా నాయనా?" యని యామె వా రిరువురికడకు వచ్చినది.

సువర్ణశ్రీ: అమ్మా! నేను యుద్ధమునకు బోవుటలేదు. హిమబిందును వెదుక బోయెదను. కొందరు సేనాధికారు లపుడే ఆమెను వెదుక బోయిరి. నేనును పోయెదను. హిమబిందునింట శ్రీ ఆనందులవారు కనబడినారు. నన్ను వెంటనే బయలుదేరి పొమ్మని ఆజ్ఞఇచ్చినారు. వెళ్ళు చున్నాను. చెల్లీ, తిలకముదిద్దవే, ఆరతితో అమ్మగారి ఆశీర్వాదము పొందవలెను. జాగు చేయకు.

శక్తి: వెదకుటకు ఈ వేషమంతయు వేసినావు, పోరాటము ఏమైన జరుగునా ఏమి? అంతమంది వెళ్ళుచున్నప్పుడు నీ వెందుకురా బాబూ?

నాగ: అమ్మా! నీకును మతిపోయినదా? అన్నను వెళ్ళనీ! ఇక్కడ ఏమియుతోచక మతిపోయినవానివలె నున్నాడు. వీరులైన ఆంధ్రయువకులింటి దగ్గర కూరుచుండు సమయమా? అన్న తీసికొని వెళ్ళునేని నేనుగూడ సిద్ధము.

శక్తి: నీ వెంతకైన తగుదువు! మగవీరుడవు.

ఇంతలో మహాలియు, సిద్ధార్థినికయు, పలువురు పనికత్తెలు, కొందరు చుట్టములు, సేవకులు అచ్చటకు పరుగిటివచ్చిరి. చిరుగాలివలె వచ్చిన చిన్నచెల్లెలిని సువ్వున నెత్తికొని సువర్ణశ్రీ యామెను ముద్దిడు కొని, క్రిందకు దింపి, "తల్లి నాకు ఆరతి ఈయవలయును, తిలక మిడవలెను, రా, లోనికి" అని ఇంటిలోనికి సాగినాడు.

యుద్ధములోనికి వెళ్ళుచుండెనేమో యని పనివారంద రనుకొనిరి. మహాలికంతయు నర్థమై, లోనికిబోయి, దేవతాగృహమునుండి బంగారు పళ్ళెము, దీపపుకుంది, కర్పూరము, అక్షతలు, పూవులు, అగరునూనెయు, తిలకకరండము సిద్ధముచేయుచుండ నచ్చటి కందరు వచ్చిరి.

బుద్ధభగవానుని పంచలోహవిగ్రహ మందున్నది. ఆ విగ్రహమున కీవలావల పంచానన బ్రహ్మవిగ్రహ మున్నది. క్రొత్త పూజ లెన్ని వచ్చినను శిల్ప బ్రాహ్మణులు అనాదియగువారి పంచముఖవిశ్వ బ్రహ్మపూజ మానరు. ఆ పీఠముప్రక్క వేరొక్క పూజాపీఠముపై మాయాదేవి విగ్రహమును, శారదాదేవి విగ్రహమును, పార్వతీదేవి విగ్రహము నున్నవి. ఆ పూజాపీఠము శక్తి మతీదేవిది.

శక్తిమతీదేవి నిర్భ్రాంతపడి మాటలాడక, తన పూజాపీఠమునుండి కాశ్మీరపుష్పమిశ్రిత మగు తిలకము తానే యాతనినొసట నుంచి, కొమరితలతో కూడి ఆరతినిచ్చి, మోకరించు

కొమరుని ఆశీర్వదించుచు అక్షతలు జల్లెను. ఆమె కన్నులు గిఱ్ఱున నీరుతిరిగినది. సిద్ధార్థినిక కేమియు నర్థము కానందున వెక్కివెక్కి ఏడ్చినది. నాగబంధునిక చిరునవ్వుమోమున ప్రసరింప, కన్నులు విస్ఫారితముగా, ప్రభాకలితవదనయై అన్నను జూచి, "అన్నా! నీవు క్షేమముగా వెళ్ళిరా. మాఅన్న వీరుడని చెప్పుకొన ఎంతో ముచ్చట నాకు. హిమబిందును రక్షించుకొనుము. ఆ పని ఇంక ఎవ్వరును చేయలేరు. నేను నీకు తమ్ముడనైనచో, ఈ విపత్తులో నీ వెను వెంట వచ్చియుందును. ఆంధ్రశత్రువుల నాశనము చేసి నీ ప్రియురాలిని నీవే తీసికొనిరా" యనినది.

శక్తిమతి తలవంచియున్న పుత్రుని శిరస్సుపై చేయినిడి "మహాశ్రమణకుడు నిన్ను రక్షించుగాక! నాయనా! జయశ్రీ శోభితుడవై యశో విరాజితుడవై తిరిగిరా. అనవసరముగ ప్రాణములు బలిగొనకుము. శరణార్థుల విడిచిపుచ్చుము. నీ శిల్ప బ్రాహ్మణ వంశమర్యాద మరువకు. ఈ రక్షరేకును నీ హృదయమున ధరించుకో, పోయిరా!" అని గద్గదికమున బలికినది.

అశ్వము సిద్ధముగానున్నదని ఇంతలో వార్త వచ్చినది. సువర్ణశ్రీ నాగబంధునిక వీపుపై తట్టి, సిద్ధార్థినికను ముద్దుపెట్టుకొని తల్లికి నమస్కృతులిడి, మహాలి మొదలగువారికడ సెలవునంది, సర్వాభరణభూషితము, సార్వభౌమ బహుకృతమునగు ఉత్తమాజానేయము కడకుబోయి సూతుడందిచ్చు ఖలీనము నందుకొని, చివ్వున నా అశ్వముపై నధిరోహించి సేవకుడందిచ్చు బాణములపొదియు, విల్లు నంది పుచ్చుకొని, పొది స్కంధమునకు బిగించుకొని కేడెము వీపున బిగించుకొని, ధనుస్సు ఎడమభుజమునకు తగిలించుకొని, శూలము, శూలశిరస్సులు, పరశువు, ఆహారపుసంచి, ధనపుసంచి, వస్త్రపుసంచియు జీవనమునకు గట్టిగా సేవకుడు కట్టినది పరిశీలించి "వెళ్ళివచ్చుచున్నా" నని కేకవైచి గుఱ్ఱమును నడిపించెను.

ఎవరీ సుందరుడని ప్రజలు అక్కజంపడ రేవుకడ కృష్ణలో సువర్ణశ్రీ గుఱ్ఱమును దింపెను. లంకలపై నడచుచు, అక్కడక్కడ సెల యేళ్ళవలె ప్రవహించు కృష్ణపాయలను ఆ గుఱ్ఱముపై పదిక్షణములలో దాటెను.

అతడు ప్లుతగతితో ప్రొద్దు నెత్తిమీదకు వచ్చునప్పటికి మహారాజ పథమున పదిగోరుతముల దూరము పోయెను. అక్కడ నొక సత్రమున నాగి స్నానాదికము లొనరించి, భోజనముచేసి పదిముహూర్తము లచ్చట విశ్రమించెను. గుఱ్ఱమును సేదతేర్చి, ఆహారమిచ్చి, ఒడలంతయు రుద్ది, అశ్వారూఢుడై ప్రయాణము సాగించెను.

అతడు రాత్రి మొదటియామములో మహాగ్రామము చేరెను.

## 3
## మహారణ్యము

నాలుగు రోజులలో సువర్ణశ్రీ మహారణ్యప్రవేశ మొనర్చెను. ఆతనికిముందు ఆంధ్రచమూపతులు ఇటు వెళ్ళిరి అటు వెళ్ళిరి అనువార్తతక్క హిమబిందుజాడగాని, చోరులజాడగాని ఇంతయైన తెలియలేదు. మంత్రకల్పమునవారందరు ధాన్యకటక పరిసరములనే మాయమైపోయిరా? లేక ఆంధ్రచారులను మించిన మాయాధురీణులా ఆ చోరులు? ఏమైపోయినారు? ఆ దివ్యమూర్తిని వారు తమకర్కశహస్తములతో అంటిరి కాబోలు ఆమె ఎంతబాధ పడుచున్నదో, ఎంత భయమందినదో? ఆ సుందరోజ్వలమూర్తి వడలిన పూపువలె సొమ్మసిల్లిపోయి వుండును. చిన్ననాటనుండియు కష్టమెట్టిదో ఎరుంగని

ముక్తావళీదేవి ఎంత అలమట చెందుచున్నదో? ఎంత పని చేసి రీ దుర్మార్గులు!

చారుగుప్త సర్వస్వము నపహరించుకొనిపోయిన ఈ దుష్టులు చోర మాత్రులు గారు. ధనరాసులు దిగవిడిచి బాలికల నపహరింతురా చోరులు? వారికి ముక్తావళీదేవితో నేమి పని? ఇందేదియో రాచకార్యమున్నది. ఇది యంతయు శత్రువుల కుతంత్రము. ఔరా! ఆంధ్రరాజధాని యేమి, రాజ దుర్గముకంటెదుష్ప్రవేశ మగు వణిక్సార్వభౌముని ప్రాసాదము చొచ్చుటేమి ఎంత అరాజకమైపోయినది. శత్రువుల కాంధ్రరాజధాని యింత అలుసై పోయిన దేమి! దేశద్రోహులగు ఆంధ్రు లెవరో, ఇంటి దొంగలవల్లే ఇంత పని చేసిరికాని శత్రువు లెన్నిగుండెలతో ధాన్యకటకమున గాలిడగలరు?

ఆ బాలిక పరీమళజలముల ఉదయమున స్నానమాడునది, తూలికా మృదు వస్త్రములు ధరించునది, సుగంధము నలదుకొనునది, మసృణకిసలయ సదృశము లగు పర్యంకముల పరుండునది. అయ్యబల శత్రువులచే నెట్టి ఇడుమలపాలైనదో! తానేమి చేయగలడు? ఎచట వెదుకగలడు? తనకు దూరదృష్టి, దూరశ్రవణాసిద్ధులు, ఆకాశ గమనాది విద్యలు తెలియవాయెను.

ఎంతమంది నడిగినను ఇసుమంతయైన జాడ తెలియుటలేదు. ఆ బాలిక బ్రతికియుండునా? “ప్రభూ మహాశ్రమణకా! ఆమెను రక్షించుము. ఆమె క్షేమముగ నున్న చాలును. జంబూద్వీపస్థము లగు మహాచైత్యము లన్నిటికి శిల్ప సేవ గావించుకొందును.”

సువర్ణశ్రీ ఇట్టి ఆలోచనలతో ఒక్కడు ఆ మహాశ్వముపై నవలీలగ క్రోశములు, క్రోశములు గడచి ముందునకు పోవుచుండెను.

పూవు ఎన్ని యోజనముల దూరముననుండిన నుండు గాక. దాని పరీమళములు పసిపట్టి సూటిగా భృంగబాలుడు ఆ పూవుకడకు పోవును. ప్రేమికులకు ప్రియురాలి జాడను ప్రణయమధుర పరీమళములు పసిపట్టి యిచ్చును. సువర్ణునకు చోరులజాడ నెవ్వరినడిగినను దెలియరాలేదు. అయినను క్షణక్షణము ఆమె అక్కడ ఉన్నది. ఆమె ఇటు పోయినది అని ఆతనియంతరంగమున స్పష్టమున తోచుచుండెను. దివ్యదృష్టి నిచ్చును గదా ప్రేమ!

సువర్ణశ్రీ కుమారుడు గుఱ్ఱమును నందపురము (నందిగ్రామము), గిలనకేర (గార్ల), మంత్రకూటము (మంథెన) దారిని పోనిచ్చి అచ్చట గోదావరీనదిని దాటిపోయెను.

నాగులలో జాతిభేదము లెన్నియో యున్నవి. ఆర్యనాగులు నాగపూజ చేయుదురు. పన్నగులనువారు మద్రజాతి నాగులు. వారిని ఆర్యా నార్య మిశ్రజాతి అందురు, అనార్య సంపర్క మెక్కువయున్నవారిని గూఢపు లందురు. వారే గోండులు. గోండులుండు కాంతారములకు గోండువనమని పేరు.

గోండులు ఆర్యబ్రాహ్మణ ప్రభువులగు సాతవాహనులయెడ పరమ భక్తులు. దక్షిణ కోసలమునకు బడమటనుండు దండకాటవిభాగమున శబరు లుండిరి. వీరు గాంధర్వ పన్నగ మిశ్రజాతికి జెందినవారు. పన్నగవంశములవారు నాగరపధములందే నివసించుచు, ఆంధ్రసాతవాహనదేశమున శూద్రులైరి. వారు మంగలి, చాకలి, ఉప్పరి వృత్తు లవలంబించియుండిరి.

శబరులకు, గోండులకు ఎప్పుడును ప్రబలశత్రుత్వ ముండెడిది. శబరులు ఆంధ్ర చక్రవర్తులకు భయముచే లోబడియుండిరిగాని భక్తిచేగాదు. శబరులు మాయావులు. వారు

మంత్రవిద్యను గంధర్వులకడ నేర్చినారు. ఆ శాబర మంత్రతంత్రములకు భయపడి గోండులు ఆర్యఋషుల నాశ్రయించి యుండిరి. కాని గోండులు బహుపరాక్రమవంతులు. గోండుయువకుడొంటియై సింహమునే ఎదుర్కొనును. గోండుమహాప్రభువు వీరమల్ల గోండమహారాజు సాతవాహన సామంతేశ్వరుడు. ఆతని పుత్రుడు మహామల్లగోండ యువరాజు ధాన్యకటక మహా సంఘారామ పరిషత్తునందు విద్యనభ్యసించినాడు. అప్పుడే సువర్ణశ్రీకిని ఆతనికిని గాఢస్నేహము కలిగినది. మహామల్లుడు సువర్ణశ్రీ ఇంటనే వాసముచేయువాడు. వారి ఇంట భుజించువాడు.

ధర్మనందియు, సువర్ణశ్రీయు దేవతలని వారి శిల్పములు చిత్ర లేఖనములు జూచి మహామల్లు డనుకొనువాడు. గోండు భాషలో తీయని పాటలు బాడుచు, అవి సువర్ణశ్రీచే బాడించుచు, చిన్నబిడ్డ యగుసిద్ధార్థినికను ఒక్క నిమేషమైన క్రిందకు దింపక ఆడించుచు, శక్తిమతీదేవికి రెండవ కొమరునివలె మెలగినాడు.

సువర్ణశ్రీ బయలుదేరు నప్పుడే మహామల్లుని తలచుకొన్నాడు. అత డప్పుడే యొక ఉత్తమ గోండసామంతునితనయను వివాహమైనాడనియు, యువరాజ పట్టాభిషేకము నందినాడనియు సువర్ణునకు దెలియును.

తనకు వార్తలంపు విధానము సువర్ణునకు మహామల్లుడే తెలిపినాడు. గిలనకేరపురము పుళిందరాజ్యమునకు దక్షిణమున నున్నది. పుళిందులు ఆంధ్ర సాతవాహనులకు దాసులయ్యు, నేడు స్థూలతిష్యుని మహిమవలన వారికి విరోధులై ఆంధ్ర సామ్రాజ్యమును విచ్ఛిన్నముచేయ సంకల్పించియుండిరి. కాని పుళిందులలో కొన్ని జట్టులనాయకులు శుకబాణుని అనుయాయులు. వారును గోండునాయకులును రహస్యముగ నెప్పటివార్త లప్పటికి శుకబాణునకు తెలియజేయుచుండిరి.

తన స్నేహితుడగు పుళిందయువక నాయకు డొకడు గిలనకేరపురమున నుండుననియు, నాతడు తనకువార్త పంపగలడనియు, తాను గోదావరి కావల ఉత్తరమున మూడు యోజనములు దూరముననున్న నగరిగ్రామమున కలుసుకొందుననియు మహామల్లగోండుడు తాను ధాన్యకటకనగరము వీడునప్పుడు తెలిపియుండెను. ఆనవాలుగా తన దండకడియము సువర్ణశ్రీ కిచ్చినాడు.

గిలనకేరపురమున నాగినప్పుడే ఆ పుళిందనాయకుని గలుసుకొని సువర్ణుడు మహామల్లుని దండకడియము సందేశ మంపినాడు. నగరి గ్రామమున రెండు దినములు విశ్రమించినాడు. దీర్ఘ ప్రయాణముచే అలసట నొందిన ఆతని ఉత్తమాశ్వమునూ అలసట తీర్చుకొని పదనుపట్టిన కరవాలమువలె మెరసిపోయినది.

మూడవనాటికి మహామల్లుడు పుష్కలమహా మేఘమువలె గజయూధ పతివలె వచ్చి సువర్ణశ్రీని కౌగిలించుకొనెను.

"అన్నా! ఏమిది, ఈ అడవుల సంచారము చేయుచున్నావు? భగవంతుని శిల్పము, చిత్రలేఖనము దర్శింపవచ్చినావా?"

"మహాబలా! నేనొకనాడు నీ రాజ్యమున నిన్ను దర్శించెదననలేదా? నేడు వచ్చినాను. కాని, సంతోషయాత్రాభిముఖుడనై కాదు. పవిత్రకార్య దీక్షాపరుడనై వచ్చినాను. నీవు తప్ప ఇంక నెరును నాకీ దుర్ఘటకార్యమున సహాయము చేయలేరు."

సమున్నతరూపుడు అతిరథుడు నగు సువర్ణుడును, మహాబలావతార మగువాడును,

మధ్యమోన్నతమూర్తియు నగు మహాబలగోండుడు బిగియార కౌగిలించుకొన్నారు.

## ౪

## శాపాభయముద్రలు

శ్రీకృష్ణసాతవాహనకుమారుడు మరునాడు ప్రభాతకాలముననే ఆఖేటనావ్యాజమున యుద్ధయాత్ర సలుపువాడై, రాత్రిద్వితీయయామమధ్య కాలమువరకు సంగీతలోలుడై యుండెను. ఒక సుందరి విపంచి మేళవించి మధురగీతముల నాలపించినది. వేరొక పాటలాధరి మురళిపై తరళరాగపూర్ణ కీర్తనల మ్రోయించినది, పద్మహస్త యోర్తు కాంస్య తాళములు చఱచినది. కలకంఠి యొకరిత మనోహరగానామృతశైవాలిని యైనది.

రెండవయామము పూర్తియగునప్పటికి రాజకుమారుడు లేచినాడు. సుగంధ తైలపోషితకరదీపికల దీపాంగనలు దారిచూప నాతడు శయనమందిరమున కేగి కలశాంభోధి సదృశ మగు తల్పముపై మేనువాల్చెను. ఆతడు వెను వెంటనే తీయని నిద్దురలో కనుమూసి ఒడలు మరచెను.

చీకట్లు ద్రవించి యామినీఫాలమున అలకలై, యమునావీచికలై మిన్నుమన్నా క్రమించి పరవడులెత్తినవి. చీకట్లురూపముమారి చైతన్య పూరితముల్లై, మహిషముల్లై, ఖడ్గమృగముల్లై, కాల కరియూథముల్లై పేరెములువారినవి. అవి యన్నియు మాయమైనవి. చీకట్లన్నియు కలిసి ఒక్కటే చీకటియైపోయినవి. ఆ చీకటి బరువు శ్రీకృష్ణసాతవాహనుని వక్షముపై ఆవహించి, ఆతని ఎదఱురొమ్ము ఎముకలు పిప్పియగునట్లు బరువెక్క నారంభించినది. నిర్మల నిద్రపరవశుఁడై యన్న ఆ యువకునికి భయంకర స్వప్న మొక్కటి ప్రత్యక్షమైనది.

కర్కోటక నాగేంద్రుడు తన శతవదనములనుండి నిప్పులు గ్రక్కుచు, కన్నులు భయంకర జ్వాలలుగా మహావేగమున శ్రీకృష్ణుని వైపు రాసాగెను. వీరుడగు నా రాజకుమారుడు ధనస్సు నెక్కిడబోయెను. అది ఎచ్చటను కనబడదు. ఖడ్గము దూయబోయెను. వట్టియొర మాత్రము దొరకినది.

ఆ భీషణోరగముబారినుండి తప్పించుకొనబోయి, పరుగిడలేక యాతడు పడిపోయెను. ఓ, ఓయను యార్తనాదము కంఠపుముడులలో మాత్ర మాగిపోయి గురగురలైనది. ఆతనికి చెమటలు పట్టి మెలకువ వచ్చినది. ఆ మందిరములోని సుగంధ తైలముల వెలుగు దీపములలో రెండు తక్క తక్కినవన్నియు నారిపోయినవి. సగము మందిరము చీకట్లమయమైనది. ఆ గుడ్డి వెలుగులో కాలసర్పమొక్కటి బుసలుకొట్టుచు ఎటుల శయన మందిరములోన ప్రవేశించినదో శ్రీకృష్ణసాతవాహనుని తల్పముకడకు చేరవచ్చుచుండెను. అ సర్పము కలలోనిదా, లేక నిజమాయని శ్రీకృష్ణుఁడాలోచించెను. భయమనునది ఎరుంగని యా రాచబిడ్డ నేడు గజగజవణంకెను. నోటమాటరాదు. పెదవులు, నాలుక, గళము పొడియారిపోయినవి. ఆ పాము కొట్టు బుసలలో అగ్నిశిఖలు కనిపించిన వా మహారాజునకు. ఆ క్రూరపన్నగము పన్నెండుపదముల పొడుగున నల్లనై, మహాకాళికావేణి వలె, మృత్యుపాశమువలె మిలమిలలాడుచు నాతనితల్పముకడకు వచ్చినది.

విభ్రాంతుడై చేష్టలుడిగి యా మహారాజు తల్పముపై నటులనే కూర్చుండి పోయినాడు. ఆ పాము చుట్టవేసికొనిపోయినది. అక్కడనుండి పడగ హస్తమున్నర పైకిఎత్తి నాల్కలు చాచుచు బుస్సనుచు కాటువేయ బోవుచు ఆడిపోవుచున్నది. శ్రీకృష్ణసాతవాహనుడు దీపమును జూచు శలభమువలె నట్లేకదల లేక ఆ పాము ఎట్లాడిన నటువైపునకు తల

త్రిప్పుచున్నాడు.

అంతకన్న అంతకన్న ఆ పామునకు కోప మెక్కువైనది. ఆవేశముచే పాము ఇటునటు ఊగిపోవుచుండెను.

ఒక్కసారిగా ఆ భయంకర కాలవిషధరము మహావాయువైనట్లు, సర్పాస్త్రమైనట్లు, ఇటునటు పరువులెత్తి, ఇంకను మంచముదాపునకు వచ్చి ఒక్కపెట్టున తోకపై లేచి మంచముపై కురికినది.

అంతపెద్ద పర్యంకముపై ఏ పామురకగలదు అన్న ధైర్యముతో నున్న కతమున నా పన్నగ ఉరుకునకు శ్రీకృష్ణుడొక పెద్ద హాహాకారము సలిపి వెనుకకు పడిపోయెను.

ఆ వెంటనే తెల్లని మొగలిరేకువంటి, గంగోత్తరకడ భాగీరథీ ప్రవాహమువంటి, మహర్షి దీవనవంటి, దేవతల పాణితలముల జగన్మోహినిపోయు అమృతపుధారవంటి శ్వేతోరగి ఒకర్తు మంచముపై కురికినది. శ్రీకృష్ణసాత వాహనునిపాదమున కాటువేయబోవు ఆ కాలసర్పము వెంటనే ఆగి పడగెత్తి ఆడుచు కదలక బొమ్మవలె నైపోయినది.

ఆ పాము నెదుర్కొనిన యాధవళపన్నగి కోపమెరుగని నిశిత సత్యమువలె మిలమిలలాడుచు పడగెత్తి యాకాలనాగము నెదుర్కొని కదలక, మెదలక ఒక్కసారి మాత్రము రామబాణమువలె, మహేశ్వర వీణానాదమువలె "గస్" అనిమాత్ర మనినది.

భయపడి, సిగ్గుపడి, ఓటమిని సూచించుచు తల ముడుచుకొని యా కాలనాగము మంచమునుండి క్రిందికి జారిపోయి ఎటుల మాయమైనదో మరల శ్రీకృష్ణున కది గోచరముకాలేదు.

శ్వేతపన్నగిమాత్రము ఒకసారి శ్రీకృష్ణసాతవాహనునివైపు తల త్రిప్పిచూచి యదియు మంచమునుండి యురికి మాయమైనది.

భయము ఒక ముహూర్తకాలమువరకు శ్రీకృష్ణసాతవాహనుని వదలలేదు. కొంతవడి కాభయముతీరి, వీరుడగు నా మహారాజు ఒక్కుమ్మడిలేచి మంచమునుండి యురికి, దాపున ఉన్నతపీఠముపై నుంచిన బంగారుగంట గణగణ వాయించెను. చెంతనున్న ఒరనున్న కరవాలము చర్రునలాగి, గుమ్మముకడకు బోవునప్పటికి బిరబిర తలుపులు తెరచి రక్షకస్త్రీలు లోనికి ప్రవేశించిరి. వారందరి హస్తముల కత్తులు తళతళలాడు చుండెను.

క్రోధపూరితనయనుడై కరవాలము ధరించి ద్వారముకడ తమకెదు రైన ప్రభువునుజూచి వారు సంభ్రమము నందిరి. ఇంతలో సేవకు రాండ్రు ద్వారపాలకులు, కంచుకులు శయనమందిరముకడకు వచ్చిరి.

శ్రీకృష్ణసాతవాహనునికి మెరుపువలె ధాన్యకటకమున జరిగిన శ్వేత పన్నగ దర్శన సంఘటన జ్ఞప్తికి వచ్చినది.

నిమిషమున మనస్సు త్రిప్పుకొని, యాతడు చిరునవ్వు నవ్వుచు,

"ఓయీ! అంతఃపురపాలకునికి వెంటనే ప్రయాణసన్నాహము చేయ మా ఆజ్ఞగా తెలుపుడు. స్నానార్థము మేము పోవుచున్నాము. శుభముహూర్తము కెంత కాల మున్నది?"

"ప్రభూ! ఇంకను మూడు గడియలు వ్యవధి యున్నది" యని కంచుకి మనవి యొనర్చెను.

## ౨౪

## మృగపథము

గోండువన యువరాజగు మహాబలగోండుడును, సువర్ణశ్రీయును మహా వేగమున అడవులన్నియు గడచిపోవుచున్నారు. "అటవీ సంచరణము ఒక మహావిద్య. శత్రువునకు తెలియకుండ ప్రయాణముచేయవలెనన్న నీవు అటవీ మృగమైపోవలెను. ఆకులో ఆకువై, కొమ్మలో కొమ్మఅయి పోవలెను. నీవు పక్షివలె ఎగిరిపోవలెను. ఉడతవు, ఉడుమువు, పామువు అయిపోవలెను. నేను వెనుకనే నీకు ఈ విద్య చాలావరకు నేర్పితిని. నేను చెప్పినది చేయుము సువర్ణా!" యని మహాబలు డనెను.

"మనకు హిమబిందు వార్త ఎప్పుడు ఎక్కడ తెలియగలదు?"

"మా గోండు అరణ్యములు తక్క, తక్కిన అరణ్యములన్నియు ప్రస్తుతము విరోధులగు కిరాత జాతులతో నిండియున్నవి. వారికి తెలియ కుండ మావాళ్ళు మనకు సర్వవిషయములు తెలియజేయవలెను. మీ హిమబిందును వారీ అరణ్యములోనికే కొనివచ్చియున్న యెడల మన కా విషయము తెలియగలదు. ఆ గుఱ్ఱమువలన మనకు ఎక్కువ ప్రమాదము సంభవించునని, గుఱ్ఱమును నగరి గ్రామమునుండి గోండుమార్గమున గోండువనము పంపించుట మంచిదే అయినది."

"గుఱ్ఱమునుబట్టి యానవాలు పట్టరా?"

"గుఱ్ఱము రంగు మార్చివేసినాము. కావున నీ గుఱ్ఱము నానవాలు పట్టలేరు. మే మా గుఱ్ఱమును ఎచ్చటనో తస్కరించి తీసికొనిపోవుచున్నామని మన ఎదిరికక్ష వా రనుకొనునట్లు చేసినాము."

"నీవు నా మిత్త్రుడవని తెలిసిన వెంటనే నిన్ను వారు బాధలనొనరించెదరేమో యని భయపడుచున్నాను."

"ఓయి వెఱ్ఱివాడా! నన్ను బాధలుపెట్టగల ఆటవికజాతి యున్నదా? మాకు భక్తులైన రాక్షసులజాతి యొకటి యున్నది. ఆ జాతివారు దండ కారణ్యాగర్భమందు, కటిక చీకటి నాట్యమాడు ప్రదేశాలలో ఉందురు. వారి జోలికి వెళ్ళుటకు ఆటవిక జాతులలో నాగరికపుజాతులవారికి భయము. నాతో మనకు కనబడక నూరుగురు రాక్షసులు గట్టివా రున్నారు."

సువర్ణశ్రీ మహాబలుడు మూడుదినము లా విధముగ ప్రయాణము చేసిరి. సువర్ణశ్రీ గోండు వేషము ధరించియుండెను. ఆతడు గోండు స్త్రీలద్దిన రంగు రంగుల కౌపీనమును ధరించియుండెను. రంగురంగు పూసల హారములు మెడను వ్రేలాడుచుండెను. దేహమంతయు వివిధవర్ణములతో విచిత్రాలంకరణ చేయబడెను. మోము పెద్దపులి ముఖము వలె వర్ణము లద్ద బడెను. చేతులకు వెండి దండ కడియములు, ఔషధీ మూలముల తాయెత్తులున్నవి. వక్షమున చిరుతపులి తోలు వలెవాటయ్యెను. తలపై రంగు రంగుల పక్షి ఈకెలు, రంగురాళ్ళు, గవ్వలు పొదిగిన ఎలుగుబంటితోలు కిరీటమునుండి పైకెగసి యాడుచుండును.

ఇంతలో వేగు గొనివచ్చిన పరిచారకునితో మహాబలగోండుడు మటలాడి, "అన్నా, హిమబిందును, ఆమె అమ్మమ్మను తూర్పు దండకాటవి దారినే తీసికొని పోయిరట" అని సువర్ణశ్రీ కెరిగించెను. "ఏమీ, దండకాటవికే! నేను భయపడినట్లే అయినది. ఎంతపని చేసినారు! వా రింకా ఎంతదూరాన ఉన్నారో! ఎచ్చట నున్నారో! క్షేమముగా నుండిరా? మన మచ్చోటికింక నెపు డేగెదము?"

"తొందరపడకుము. వీరుడు కోపమున కట్టి నిప్పును దాచుకొనినట్లు తనలో దాచుకొనును."

"నాకన్నియు చెప్పుము తమ్ముడూ! మనమచ్చటికి త్వరితముగ పోవలెను."

"వారిని ఎత్తుకొనిపోయినది సాధారణాటవికులు కారు. వారట్టి పనులు చేయరు, చేయుట చేతకాదు. నగరవాసు లన్న నే మాకు భయము. నగరమును జూచిననే మేము ముడిచికొని పోవుదుము. వారిని ఎత్తుకొని పోయినది ఎవరో చక్రవర్తి విరోధులట."

"మాగధులా?"

"మాగధులో, వందులో వారి నిరువుర నెత్తికొనిపోయి, ధాన్యకటక నగర ప్రాంతమున దాగికొనియున్న శబరులకు అప్పగించిరట!"

"నే ననుకొనినంతయు నైనది. వారికేమియు ప్రమాదము కలుగ లేదు గదా!"

"వారిని నర్మదాతీరమున నున్న స్ఫటికశిలాపర్వతములవైపు తీసికొని పోయిరట."

"నడు, మన మచ్చటికే పోదము."

"అచ్చటికే పోవుదము. ఈలోన మా నాయనగారికి గోండు సైన్యము నుండి సింహములవంటివారిని ఏరి మన సహాయమునకు పంపవలయు నని వార్త పంపినాను."

"అటులనే అన్నా!"

ఆ ఉదయమున వారొక సరోవరముకడ వంట చేసికొని భుజించి, మరల ప్రయాణము సాగించిరి. ఎంత వేగముగ నడచినను ఒక్క ఆకు కదలిన చప్పుడైన కాదు. మహాబలగోండుడు అనుమాన మేమైన తోచినప్పుడు, సైగచే సువర్ణుని ఆపి ముందునకు బోయి పరిశీలించి, అచ్చట చిన్న పక్షి ఈలవేయును. సువర్ణు డప్పుడు ముందుకు సాగిపోయి, యాతని గలిసికొనును. వా రిరువురు ముందుకు సాగిపోదురు.

మహాబలగోండునకు పాము చెవులు. ఎంత చిన్న చప్పుడెంత దూరమునుండి వినిపించినను ఆతని కర్ణములకు సోకును. ఆతడు ముక్కుపుటములు విస్ఫారితముజేసి, ఎట్టివాసననైన పసిపట్టగలడు.

వారట్లు మహావేగమున బోవుచుండ నొకమధ్యాహ్నము వారి ఎదుట నొక బాణము వచ్చి పడినది. గోండుడు వెంటనే ఆగి, భూమిపై వాలిపోయెను. సువర్ణునిగూడ భూమిపై వ్రాలమని సైగచేసెను. ఆతడును, సువర్ణుడును పాకికొనుచు, దట్టమైన యొకపొదలోనికి దూరిపోయిరి.

మహాబలుడు సువర్ణుని చెవికడ వదనముంచి మనలను విరోధులగు పుళిందులు

కనిపెట్టినారు. ఆ బాణమే ప్రశ్న. నీవును గోండుడవు అని వారికి తెలుపవలె. లేనిచో మనలను బాణములచే చెండివేసెదరట. ఆ బాణము వచ్చిన విధమునకు, నా ముందర పడుటకు, ఆ బాణమునకు కట్టిన ఈకలకు అర్థమది” అని తెల్పెను.

“అయిన నిప్పుడేమి చేయవలెను?”

“నీ వూరక చిత్రము చూచుచుండుము” అని చెప్పి మహాబలు డప్పుడు పెదవులు మూసి పాముపలె బుసకొట్టినాడు. వెంటనే దూరమునుండి వేరొక మహానాగము బుసకొట్టినది ఆకాశములో చిన్న చిన్న ఈటెల వంటివి వేలకువేలెగిరినవి. “కో” యని, “హో” యని పది, పదిహేను అరపులు వినబడినవి. తర్వాత నంతయు నిశ్శబ్దము. పాముబుస దీర్ఘమై విననైనది. మరల నిశ్శబ్దమా వహించినది.

సువర్ణున కిదియంతయు భయాశ్చర్యముల గొలిపినది. “అన్నా! మన విరోధులందరు మాసిపోయినారు. ఆ శవముల రాక్షసులు భక్షింతురు అని మహాబల గోండుడు పలికినాడు.

సువ: ఛీ! ఛీ ! నరమాంసభక్షణమే? బుద్ధం శరణం గచ్ఛామి.

మహా: నరమాంసభక్షణము మాకు మాత్రము ఇష్టమా! రాక్షసుల పాలబడినవాని గతి అంతియ. మహాబలగోండు నేమి, మఱి ఏ ఒక్క గోండునేమి శబరుడు, పుళిందుడు యుద్ధమున కాహ్వానించుట చావును తెచ్చుకొనుటే. రాక్షసులు గోండుల ఆజ్ఞచే వచ్చిరని తెలిసిన మరలగోండువిరోధి ఈ అడవుల నుండునా? రాక్షసుల నోడింపగలవా రొక్క గోండులే!

సువ: అబ్బ! నా హృదయమున వెర పింకను పోలేదు తమ్ముడూ!

మహా: నన్ను క్షమింపుము. నీకు నే నీ విషయము తెల్పియుండకూడదు. నీవు వీరుడవు. శిల్పిమాతృడ వేయైన అడవుల కేల వత్తువు? హిమబిందును తలచుకొనుము.

సువ: అన్నియు భగవంతుని చిద్విలాసములు. కానిమ్ము. విచారించుటకు నే నెవడను?

మన మొక్క ఘడియ ఆలసించినకొలది హిమబిందు, ముక్తావళీదేవుల ఇడుమలు ఒక్కొక్కటే అధికమగు నని నా భయము.

వా రంతట ఇంకను వేగముగ సాగిపోయిరి.

౬

## నాగరాజు

స్థాలతిష్యుడు ఓషధీ ప్రభావముచే విషబాలకు గాఢనిద్ర కల్పించెను. విషవైద్య విశారదులగు కొందరు సేవకులు ఆమెను ఏనుగుపై అరణ్యా మధ్యమునకు గొనిపోయిరి. శ్రీకృష్ణసాతవాహనుడు వేట నెపమున మాళవమునకు యుద్ధాభిముఖుడై వెళ్ళుచుండెనని యాత డూహించియుండనోపు.

శ్రీకృష్ణసాతవాహనుడు వెళ్ళుదారికి ఒక క్రోశము దూరమున నిబిడమగు నొక కాంతారభాగమున విషబాలను వదలిలేసినారు.

"నీరము లా చుట్టుప్రక్కల కొన్ని క్రోశములవఱకు నుండవు. ఫలములు కానరావు. కంటకావృతమై, ప్రాణరహితమై, బీభత్సమగు దుర్గమారణ్యమున వొంటి విడచి రండు. ఈమె ఇతరులకు మృత్యు వగుగాక!" అని స్థాలతిష్యుని యాజ్ఞ.

విషబాల కన్నులు దెరచి చూచినది. కర్కశస్థలమున నామె పడియున్నది. ఒక పెనుబా మామెపై ప్రాకుచు చోద్యము చూచుచున్నది. ఆమె ఉలికిపడి లేచి నిలుచున్నది, ఉన్నతములగు చెట్లు, మహోరగముల బోలు తీగలు, కంటకావృత్తము లగు పొదలు, కఠినశిలలతోనిండిన భూమి. ఆమె కన్నులు నులిమికొన్నది. విహ్వాలచిత్తయై యామె కెవ్వున నార్చినది. ఆమె కేక ఓ ఒ! ఒ! ఓఓఒ! అని మారుమ్రోగినది. ఆమె పూర్తిగా వివస్త్రయై యున్నది. ఏమి శిక్ష! విషకాంతుల వెలిగిపోవు ఆమె దిగంబరదేహము భయముచే, బిడియముచే ముడుచుకొనినది. ఆ ఉదయమున మలయపవనములు హాయిగా వీచి ఆమెను సేదదీర్చెదమని వచ్చినవి. కాని ఆచ్ఛాదనా రహితమగు నామెతనువు నవి సోకగనే ఆమెకు గజ గజలాడు చలి వచ్చినది. ముడివేసియున్న జటాభారము నామె విదలించి నది. అందమగు మంచు శిఖరమును కప్పివేయు నీల మేఘములవలె ఆమెతలకట్టు పాదములవరకు నల్లగా ప్రవహించి ఆమెను ముంచి వేసినది. ఒత్తుగా తన శిరోజముల నొడలంతయు గప్పుకొని ఆమె నిశ్చేతనయై కూలబడినది.

మరల మెలకువ వచ్చునప్పటికి సూర్యకిరణములు తీక్షణముగా నా యాకు జొంపముల నుండి లోనికి జొచ్చివచ్చి యామె నాస్వాదించు చున్నవి. ఆ బాలిక లేచి కూర్చుండి "నే నిక్కడనున్నానేమి? ఏల వచ్చినాను? ఎప్పుడు వచ్చినాను? ఎవరు తీసుకొని వచ్చినారు? నే నో వేళ చనిపోయినానేమో! ఇది యమలోకములో నొక భాగము కాబోలు! పూజ్యపాదులగు తాతయ్యమాటకు ఎదురాడినాను. వారి కోర్కె నెరవేర్చలేదు. వారి శాపమే నాకిట్లు తగిలినది. అప్పుడే యమకింకరు లీ యమలోకమునకు గొనివచ్చినారు. నే నిప్పు డేమి చేయుదును? అదిగో ఆ పెద్దనాగు బాము పడగయెత్తి ఆడుచు కరుణామయమగు చూపులు నాపై బరపు చున్నది. ఓ అయ్యా! నీ వెవరవు? నీవునూ ఈ యమలోకమున నొక బంటువా? ఇక్కడకూడ సూర్యుడు వెలుగునా? ఈతడు యమలోకపు సూర్యుడు కాబోలు. పూర్తిగా తన కిరణముల వెదజల్ల లేకున్నాడు" అని యామె వెర్రిమాట లాడుకొనుచున్నది.

ఆమె ఇటు నటు చూచినది. అక్కడ నాడుచున్న పామును సమీపించి బుజ్జగింపసాగినది. పాములతో ఆట నామె కలవాటేకదా! ఆ పామును చెంతకు తీసికొని కౌగిలించినది. ఆ పన్నగేంద్రము ఆమెను మెలివేసికొనిపోయినది. "ఓ నాగరాజా! నీవును శిక్షపడి ఈ యమలోకమునకు వచ్చినావా?" అని ఆమె ప్రశ్నించెను.

నాగరాజు కన్నులు: అమ్మా! నిన్ను స్పృశించిన కాలకూట విషా నందమూర్తివలే తోచుచున్నావు. సముద్రమున జనించిన హాలాహలమే నీలకంఠుని గళమునుండి యిట్లు నీ రూపు తాల్చెనేమో?

విషబాల: ఓ ఉరగాధిపా! నీపై నెవరికి కోపమువచ్చినది? నీ కీ భయంకర పాపలోకముల బాధనొందుమని ఎవరు శాపమిచ్చినారు? నీకును తాతగారున్నారా?

నాగరాజు ఫణిపాదములు: ఓ సౌందర్యగాత్రీ! శ్రీకృష్ణుని పాద రజమువలె సాక్షాత్కరించినావు. నీ దేహమున హిమశైత్యము, దావానలోష్మ వియ్యమందుచున్నవి.

విషబాల: ఓ వాయుభక్షకా! నీ కాకలి దహించుకొనిపోవుటలేదా? నీ గృహ మెక్కడ? నీ గృహముకడ పావనోదకములుగల నదీమతల్లి పారుచున్నదా? అందు చల్లని నీరములు కడుపునిండ త్రావుచుంటివా?

నాగరాజు చుట్టలువీడి, ఆ డొంకలలో నటు నిటు ప్రాకజొచ్చెను. విషబాల లేచి కచభారము సర్దుకొని యా దిక్కునకు పోవ ఒక్కవాడి ముల్లు కసుక్కున పాదమునకు గ్రుచ్చుకొనుటచే కెవ్వున నార్చెను. తెల్లబోయి యా పాము వెనుక కమితవేగముతో వచ్చి యామె కాలు చుట్టి చుట్టి చూచెను. విషబాల నెమ్మదిగ నా కంటకము నూడబెరకుకొనెను. పాములదారి బాలలకెట్లు సరిపోవును? ఎటుచూచినను ఆమెకు దారి కనబడ లేదు. ఆ పాము నాలుగువైపుల తిరిగివచ్చినది. కాని దాని హృదయమునకుగూడ మనుష్యస్త్రీ నడచుదారి ఏమియు కానరాలేదు.

ఉస్సురనుచు విషబాలిక కూలబడినది. స్థాలతిష్యుని అనుచరులు ఆ చుట్టునున్న దారులన్నియు ముండ్ల డొంకలతో కప్పి మరియు వెడలి పోయిరి. ఆమె నాల్క ఆరిపోయినది. దాహమని ఆమెనాలుగువైపుల మోముత్రిప్పి కనుగొన్నది. పాపము ఆపాము చేయునది లేకకాబోలు అంతర్ధానమైపోయెను.

అత్యంత పిపాసార్ధితయై దిగంబరియగు నా బాల తన తలకట్టే పక్కగా ఒక లెరుంగక నిద్రపోయెను.

మెలకువ వచ్చి చూచునప్పటికి సూర్యుడు నడినెత్తిపై నున్నాడు. ఆమె కాకలి దహించుకొనిపోవుచున్నది. దాహము! ఈ నిర్జనాటవిలో తన గోడెవరాలకింతురు? ఆ పాముజాడకూడ లేదు. మానవుడు వీడిన యా యనాథబాలను క్రిమికీటకాదులుకూడ వీడిపోయినవా? ఇంతలో బుస కొట్టుచు నెచ్చటినుండియో యా పా మచ్చుటకు వచ్చెను. దాని నోట ఒక కప్ప యున్నది. విషబాలిక కా పామాహారము కొనివచ్చినది కాబోలు!

విషబాల పక్కున నవ్వినది. “ఓ ప్రాణ స్నేహితుడా! నా కాహారము కొనివచ్చినావా? కాని నీ ఆహారము నాకు సరిపడదే! నీ ప్రేమయే నా కాహార మగుగాక! ఈ యది నరక మని నాకు తోచుటలేదు. గాఢారణ్యామై యుండు ననుకొనియెదను. అయిన నే నిచ్చట కెట్లు వచ్చితిని? అయ్యో! మా తాతయ్య ఇచ్చట దిగవిడిచి చనలేదుకదా! అమ్మో! నా ఒడలు వణకుచున్నది. నే నేమి చేయుదును? నాకు దిక్కెవరు?” అని గాఢవిషాదమున ఆమె అతికరుణముగా ఏడ్చినది. ఆమె మరల నొడలు మరచి పడిపోయెను.

ఆమెకు జ్ఞానము వచ్చుసరికి సాయంకాలమైనది. ఎల్లయెడల కారుచీకట్లు క్రమ్మినవి. కీకురుకీకురు మని కీచురాళ్ళ చప్పుడు, అడవి మెకముల అరపులు దూరమున వినబడుచున్నవి. విషబాల యిప్పుడున్న అడవి భాగమునకు వన్యమృగములుకూడ రా

వెరచును. అక్కడ చుట్టుప్రక్కల రెండామడలవరకు నీరములు లేవు. ఆకాశమువరకు పెరిగిపోయి, పాతాళమునుండి నీరుత్రావు పెద్ద పెద్ద వృక్షములు, వర్షకాలమున చిగిర్చి పెద్దవియై తరువాత ఎండిపోవును. కీటకములకుగూడ దారి యీయని కంటక నికుంజములుతప్ప అచ్చట నేమియు గానరావు.

ఆ నాగుబా మీ దినమున అడవిలో తిరుగుచు మనుష్యుల అడుగుల జాడ కన్పించి భయపడెను. మానవు డెచ్చటను కానరాలేదు. ఆ అడుగుల వాసనలచే నా భుజంగము ఆ పాదములజాడనే ధనువులు, క్రోశములు గడిచి యా విషబాలను కనుగొన్నది. మానవస్త్రీని చూడగనే భయపడి వెనుకకు బారి, భయము కలిగించు వాసనకొట్టనందున ఆ పన్నగము మెల్ల మెల్ల బాలికను సమీపించినది.

ఆకలిబాధ చేతను, దాహముచేతను ఆ విషబాలిక నిశ్చేతనమగు గాఢమూర్ఛలో మునిగినది. ఆమె రాత్రియంతయు నట్లే పడిపోయియుండెను. మరల తెల్లవారినది. ఒక యామము గడచినది. ప్రకృతియే యామెను సేద తీర్చినది. ఆకలిబాధ ఎట్లో మందగించినది. దాహముకూడ ఏ విధముననో తగ్గినది. కాని కదలలేనంత నీరసస్థితిలో ఆమె అట్లే పడియున్నది.

మరల నిద్రపోయినది. మధ్యాహ్నమగువేళ విషబాలకు మరల మెలకువ వచ్చినది. ఆమెకు కన్నులు విప్పుటకుగూడ శక్తి చాలలేదు. కాని తానొక్కతెయే యచ్చట లేదను నభిప్రాయ మామెకు కలిగినది. నరకలోకము వీడి దేవలోకము వచ్చిన ట్లామెకు భావ మొండు కలిగెను. కన్నులు విచ్చి చూచెదమా యని కోర్కె, కనులు విప్పనీయని నీరసము. ముక్కుపుటముల, గళమును, వాయకోశముల నార్పివేయు విషవాయువులు వీచు నీ ప్రదేశమున సువాసనాపూరితములై వీచు నీ తెమ్మెర లెక్కడివి? అనుకొనుచు ఆమె కన్నులు తెరచినది. ఎట్టఎదుట మబ్బులు గ్రమ్మియున్న యామె చూపులకు తలపై వంగిచూచు ఒక పురుషునిముఖము మిరుమిట్లు కొలిపినది. ఆమె మాట రాకపోవుటచే నోరు మెదపి మరల కన్నులు మూసివేసుకొనెను. ఇంతలో ఆమె పెదవులపై తీయని, పుల్లని శీతల మగు సుగంధపూరితములగు రసబిందువులు పడినవి. ఆమె నోరు చప్పరించెను. మరల రసబిందువులు వొలికినవి. ఆమె నాలుక జాపినది. అందుపై ప్రాణము లేచివచ్చు నాగరంగఫలరసము నెవ్వరో పిండినారు.

## ౭
## ఆచ్ఛాదనము

వేట రాజుల వ్యసనము. బ్రాహ్మణ ప్రభువులకుగూడ వేట తప్పదు. బుద్ధభగవానుని ధర్మము నాశ్రయించినను రాజులకు వేట ఏల తప్పును?

మృగయావినోదియై శ్రీకృష్ణసాతవాహనమహారాజు పరివారసమేతుడై వెడలినాడు. వేటకుక్కలు, డేగలు, గరుడులు, చిందుగులు, ఏనుగులు, కిరాతులు, సామువాండ్రు కూడ బోవుచుండిరి. వారితో శుల్బములు మృగబంధనములు, భారయష్టులు, డప్పులు, వృక్షాదనములు, క్రకచములు, మృగబంధనములు, భారయషులు, డప్పులు, నారాచములు, త్రిశూలములు, ఔషధములు, కాగడాలు, శిబిరములు, మంచములు, ఆసనములు మొదలగు పరికరము లెన్నియో తెచ్చుచుండిరి.

విషవైద్యులు, కార్తాంతికులు, భిషక్కులు, వంటవారు, ఆఖేటన విద్యాచతురులు తోడరా మహారాజు సేనాపతిద్వితీయుడై చనుచుండెను.

చిందుగులు వేటాడుటయందు ప్రసిద్ధినందిన జంతువులు. చిందుగులను సివంగు లనియు బిలుతురు. అడవి ఎర్రకుక్కలను కూడ చిందుగులవలె బోనులలో పెంచి మృగములను వేటాడించువారు ఆంధ్రులు.

ఆంధ్రశాతవాహనులు బుద్ధపదారాధనాతత్పరులయ్యు, సంధ్యార్చనాదికముల మరవరు. క్రతువుల నాచరింతురు కాని వానిని హింసాపూర్వకముగా జేయరు. శ్రీకృష్ణ శాతవాహనమహారాజును రేపకడనే స్నానమాచరించి సంధ్యార్చనాదికముల నిర్వర్తించి కవచము ధరించి సకలాయుధోపేతుడై శుభముహూర్తమున విప్రాశీర్వాదములు చెలగ ఏనుగు నెక్కబోవుచుండ దూరమునుండి తీయని ఒక బాలికాకంఠము తెల్లవారుగట్ల పాటపాడుచు వినంబడినది.

రాజజ్యోతిషికుని తనతో భద్రదంతావళము నెక్కగోరి శ్రీకృష్ణుడు గజారోహణ మొనర్చెను. గజమును కదలినది. వేటపరివారమంతయు గదలినది. శ్రీకృష్ణుడు జ్యోస్యునితో తన కలయంతయు తెలిపి దాని ఫలితము వినిపించ ప్రార్థించినాడు. ఒక యరనిమేషము ఆలోచనాధీనుడై యా కార్తాంతికుడు శ్రీకృష్ణుని జూచి,

"ప్రభూ! తమ స్వప్నమును, తాము ప్రాయాణోన్ముఖులై నప్పుడు వినిపించిన యా మధురగీతాలాపన పరమార్థమును సమన్వయించిన, తమకు కొన్ని చిక్కులు వివాహవిషయమై రాగలవనియు, అవియన్నియు తీరి పరమానందముగ వివాహమగుదు రనియు, తమకీ ప్రయాణమున అఖండ విజయము, ఆ విజయమునకు ముందు వివాహాదివిషయమువలెనే కొన్ని చిక్కులు, ప్రాణాపాయస్థితులు సంభవించుననియు, నాకు తోచుచున్నది" యని మనవి చేసెను."స్వప్నమువలన నట్లు చెప్పవచ్చునా? ఈ జ్యోతిష్యాదులు నిజమా? యన్న ప్రశ్నలు నాలో నప్పుడప్పు డుద్భవించును. ఈ ప్రపంచమంతయు మాయ యందురుకదా! ఈ ప్రపంచమెంతయున్నది? దీని కాధారము మేరు పర్వతమేనా? ప్రపంచమధ్యమున జంబూద్వీపమా? ఆ ద్వీపములో నవవర్షములు. అందు మనము నివసించు భారతవర్షము అనంతమైన జగత్తులో మనమేపాటి? మనస్వప్నము లేపాటి?"

"ప్రభూ! తాము సెలవిచ్చినది సత్యమే. మహత్తత్త్వమువలన ఈ సర్వ భూమండలము పరిభ్రమింపవచ్చును. లోకాలోకపర్వతము వరకు పోవచ్చును. మనవారు జంబూద్వీపాంతరములకుబోయి సువర్ణద్వీపములు చూచి రాజ్యము లేర్పరచుకొన్నారు. యవనరాజులతో వర్తకములు చేయుచున్నారు. అనేక వర్షములలో చిత్రచిత్ర మనుష్య జాతులను, మృగజాతులను జూచుచుండిరి. ప్రపంచమెంత విశాలమైనను సనాతనమైన ధర్మమొక్కటే దీనిని ధరించుచున్నదికదా!"

"అవును, మహాశ్రమణకుని బోధకు, ఆర్యఋషుల బోధకును సర్వవిషయముల నొకేభావము ద్యోతకమగుచున్నను, నిర్వాణాది విషయములందు, సత్యదర్శనమందు కొలది భేదములు మాత్రము కనబడుచున్నవి. సర్వప్రపంచమిట్లు ప్రత్యక్షమై రాజ్యములకై, సంపదకై దారాపుత్రాదులకై సంతోషాదులకై మనమిట్లు తాపత్రయముల బడుచుండియు, నిదియంతయు భ్రమ అనుకొనుట ఏల?"

"మహారాజకుమారా! అంతమాత్రమున జగత్తు సత్యమగునా? మనమును సత్యము కాము. ఒక మహాకర్మమున నేమియులేని శుద్ధానందములో నుండి వికృతినంది మన మీ విచిత్రనాటక మాడుచున్నాము. దానికి ద్రష్టలమును మనమే అయ్యు అహంకార మమకార వశుల మగుచున్నాము. అదియే దుఃఖనాటకము."

ఇట్లు సంభాషించుచు మహారాజు సపరివారుడై అటవీ మధ్యము జొచ్చెను.

ఆ దినమంతయు వేట జరిగినది. అనేకమృగములు హింసింపబడినవి. అరణ్యమంతయు గగ్గోలుపడిపోయినది.

ఆరాత్రి మహారాజు చిన్నపట్టణమునకు సరిపడు తన పరివార జనమందరితో నొక శైవాలినీకూలమున శిబిరముల వేయించి విశ్రమించెను.

యామములు యామము లాతనికి ఏదియో ఆవేదన. యుద్ధమెట్లుండునో? భరుకచ్ఛము పట్టుకొనుట, ఆభీరులతో యుద్ధము, వివాహము! ఈ ఆలోచనలు ఆషాఢ మేఘములవలె అతని మనఃపథమున సంచరించినవి.

కొంతకాలమునకు యౌవనశ్రీసుభగుడు నా శాతవాహన కుమారుడు తన మృదుపల్యంకమునుండి లేచి క్రిందికి దిగి మెత్తని పాదరక్షలు తొడుగుకొని మైనపువత్తి దీపములు వెలుగు దీపస్తంభముకడకు పోయి, యా దీపములకొడులన్నియు సరిచేసి, యక్కడనొక ఆసనముపై కూరుచుండి, తన్ను కలచివేయు వివిధాలోచనముల జెదరగొట్టుచుండెను.

ఎన్నిసారులు దూరముగ త్రోసిపుచ్చినను మరల మరల తన వివాహవిషయము అతనికి ప్రత్యక్షమగుచున్నది. ఏమి వివాహము? ఎవరితో? మహారాజుల కొమరితలు తనకు వలదు. వారు తనపుత్రులకు తల్లు లగుదురేగాని తనమనోవేదన తీర్చుశక్తి కలుగు వారగుదురా? వారలలో కొందరు అందకత్తియలు నున్నారట. అందచందములు జంతువులకు మాత్రము లేవా? తమ మాండలికులలో అద్భుతసౌందర్యముగల యువతు లున్నారని ఎన్నియో సంబంధములు వచ్చినవి. తండ్రిగారు తన భావ మేమని కోరినప్పు డా ప్రస్తావనకు తాను ప్రతియీయలేదు. వివాహ మేమి? కామ నిర్వహణమునకు తనకడనున్న బాలికలు చాలరా? అనాఘ్రాత పుష్పములై కుసుమపేశలదేహలై, పరిమళోచ్ఛ్వాసనాసికాసుందరులైన యా బాలల కన్న తన కామాగ్ని కింధనము లగుటకు వేరు వనిత లేల? అయిన వారిని తా నంటినదియు లేదు. వారి యౌవనామృతరసము నాస్వాదన చేసినదియు లేదు. తుచ్ఛానందము దేహసంయోగమాత్రమున జనించును. గాఢమై, గంభీరమై, అనంతమై, అత్యంత గోప్య మగు మానవప్రకృతి కాసౌఖ్యము తృప్తినీయగలదా? కురూపులై భరింపరాని దుర్గంధముల నోలలాడు ఈ కిరాతులలో స్త్రీ పురుషులానందమొందుటలేదా? ఈ దేహసౌఖ్యమాత్రమునకు అందముగూడ నెందుకు? సాధారణ వృక్షములును మహౌషధులు నన్నియు గుసుమించి ఫలించుటలేదా? బీజధర్మ మంతట నొక్కటియే కదా!

శ్రీకృష్ణశాతవాహనుడు పోయి మంచమున మేనువాల్చి నిదుర గూరెను. వేకువనే వైతాళికులు ఉషోదయగీతికల బాడిరి.

వేటజనమంతయు లేచెను. సర్వము సిద్ధముచేసికొని వేటసాగింప బయలుదేరెను, మహారాజు శ్రీకృష్ణశాతవాహన కుమారుడు.

ఏనుగుపై నెక్కి కొంతదూరము సాగెనో లేదో ఎదుట నొక గిరినాగు ఏనుగునకు కొలదిదూరములో కానవచ్చినది. గిరినాగము లన్న ఏనుగులకేమి, సింహములకేమి, మనుష్యులకేమి యన్నింటికిని భయమే. గిరినాగము కంటబడినవాడు దానిబారినుండి పారిపోలేడు. మంత్రవేత్తలు, పాములవాం డ్రానాగములవైపునకైన పోవరు.

“మనుష్యునకు కనంబడని యీ పాము నేడింత నిర్భయముగ నడవుల సంచరించుచున్నదేమి?” యని వారందరు సంభ్రమాశ్చర్యముల నందిరి.

అప్పుడొక పాములవాడు ముందునకు వచ్చి, మహారాజు గజము వైపు తిరిగి చేతులు జోడించుకొని “మహాప్రభూ! ఈపాము దేవరవారిని ఎక్కడకో రమ్మని అడుగుచున్నది. ఈ పాములమాట మే మెవ్వరము జవదాటి ఎరుంగము” అని మనవిచేసికొనెను.

## ౮
## మహావిష సాన్నిధ్యము

ఆ మహానాగము ముందు, వెనుక శ్రీకృష్ణశాతవాహనుడు కతిపయ పరివారము తోడను అమితవేగమున వెడలజొచ్చిరి. ఉత్తరాభిముఖమై ఆ పొదలలో, నిబిడ వృక్ష సమూహములలో, నల్లనిబండరాళ్ళలో ఆ పర్వత నాగేంద్రుడు వారిని కొనిపోయినాడు.

శ్రీకృష్ణసాతవాహనుని మత్తగజము లెక్క సేయక వేగమున బారు నా పన్నగేంద్రు ననుసరించి పోవుచుండెను. వెనుక ఏనుగులు, గుర్రములు, బండ్లు, ఎద్దులు వచ్చు చుండెను.

యువరా జెక్కిన మదగజముపై మంత్రగురువు, విషవైద్యుడు, పాములవాడును ఎక్కిరి. వారట్లు రెండుక్రోశములదూరము పోవునప్పటికి దారి దొరకుటయే కష్టమగు భయంకరారణ్యము చొచ్చిరి. ఆ ప్రదేశము మృత్యుదేవత విహరించు ఉద్యానవనభూమివలె నుండెను. భయ మనునది ఎరుగని శ్రీకృష్ణసాతవాహన భద్రదంతావళము “మందరాద్రి” యను పేరుగలది ముందునకు అడుగువేయుటకు జంకి ఆగిపోయెను. ఏనుగు లన్నియు నాగిపోయినవి. శ్రీకృష్ణసాతవాహనున కేదియో వివశత్వము కలిగినది. మావటీల నాయకుడగు మంద రాద్ర్యాధోరణుడు ఏలనో గజగజ వడంకెను.

విషవైద్య, మంత్రవైద్యులు వెంటనే తమ గజము నాపి, తాము దిగిరి. మంజూషలో నుండి విషవైద్యుడు ఒక కరండము తీసి, యందు కొన్ని చూర్ణములు వడివడిగా బోసి, చెకుముకి వెలిగించి యా చూర్ణమంటించెను. ఆ కరండమునుండి నల్లటి దూపములు ఘాటైనవి పొగమంచువలె పై కెగసినవి. ఆ కరండమును బట్టుకొని యా విషవైద్యుడు ఎండిన యా ముళ్ళపొదలో ఎటులనో దారిచేసుకొనుచు ముందునకు దూలుచున్న భద్రదంతావళము కడకు బోయెను. అందరికి తుమ్ములు, దగ్గులు వచ్చినవి. ఆ ప్రదేశమంతట నావరించియున్న భయంకర విషవాయువు ఈ పొగలచే సమసిపోయినది. మందరాద్రియు, మావటివాడును, శ్రీకృష్ణసాతవాహన మహారాజును మత్తుతెలిసి ప్రకృతిస్థులైరి.

మహారాజు: ఏమి ఈ విచిత్రము?

విషవైద్యుడు: ప్రభూ! ఈ ప్రదేశమంతయు భయంకర విషగంధ సమ్మిశ్రితమై యున్నది. సర్వవిషనాశకమగు ఈ దివ్యచూర్ణ మొక్క హాలాహల కాలకూటవాయువులదక్క తక్కినవిష వాయువుల నన్నిటిని సమయించును. తామును, మావటీడును, తమ మహాగజమును తూలిపోనారం భించితిరి. నాకును ఆ విషవాయువు తగిలినది. వెంటనే మా ఏనుగుపై వారమందరము “అమృతరస” మను నీ మందును మాత్రలుగా సేవించి, ఏనుగు నాపి, దిగి ఈ పనిని చేసితిని.

అప్పుడా భద్రదంతావళము భూమిపై నధివసింపజేసి శ్రీకృష్ణసాత వాహనుడును గజావరోహణ చేసెను. ఇంతలో పాములవాండ్రు, కిరాతులు మొదలగువార లనేకులా ప్రదేశముకడకు వచ్చుచు దూరముననే యాగిపోయిరి. అందొక్క పాములవాడు "హో" యని కేక పెట్టి యుచ్చైస్వనమున నిట్లు చెప్పినాడు.

"ఏలినవారు ఉన్నది మహావిషపుగాలులు వచ్చే ప్రదేశం. ఆ చుట్టు ప్రక్కలనే, అదిగో ఆ విధముగ ఆగి, వింతబడి చూచుచున్న ఆ పాపఱేని నివాసము ఉండి ఉండవలె. లేకపోయిన దొరా! అంత చావుగాలి రాదయ్యా" అని చెప్పినాడు.

"ఇప్పుడేమి చేయవలె?" అని విషవైద్యు డరచినాడు.

"స్వామీ! ఆ పొగలు బాగుగా వేయండి. మేమందరము అచ్చటికే వచ్చుచున్నాము" అని ఆ పాములవారిలోబెద్ద పెద్దకేక వేసి చెప్పెను. వారంద రచ్చటికి దారిని సరిచేసుకొనుచు వచ్చిరి. ఈలోన ధూపకరండము లయిదారింటిలో విషనాశక చూర్ణము పొగలువేయబడినది. రాజకుమారుడు, పాములవాండ్రు, కిరాతులు, విషవైద్యగురువు, మంత్రవైద్యుడు మాత్రము కాలినడక నా పన్నగేంద్రమును వెంటనంటిరి.

"అమృతద్రావక" మను ఒక మందు స్ఫటికశిలలో దొలచిన కలశములో నుంచిన దానిని విషవైద్యుడు వలిపెములపై పోసి తడిపి, ఆ వలిపెముల ముక్కలు అందరి ముక్కులకు కట్టి తానును కట్టుకొనెను. అప్పటికే సూర్యుడు చండకిరణుండై మధ్యాహ్న సింహాసనము నాక్రమింప వేగమున బోవుచుండెను. అందరికిని నాల్కలు తడియారి పోవుచున్నవి. చిరుచెమ్మటలైన వారి దేహముల నుద్భవించుటలేదు. దాహముకాకుండ వైద్యుడు యష్టిమధుకాదుల భావనచేసిన మాత్రల నెల్లవారికి నిచ్చెను. అవి ఒక్కొక్కటియే వారు నోటిలో వైచుకొనుచుండిరి. వారి దాహము కొంచెము తగ్గజొచ్చినది.

ఇంతలో ఎదుట విగతజీవివలె పడియున్న యొక దివ్యసుందరి విగ్రహము! ఆ విగ్రహము దిగంబరమై ఒరనూడ్చి పడవేసిన కృపాణమువలె నున్నది.

ఆ విగ్రహపు దీర్ఘవినీలకుంతల భారము చెదరి, యామెపై ఆచ్ఛాదన వస్త్రమువలె పడియుండెను. ఆ విగ్రహము అమరత్వముదాల్చిన రూపమే. అయినను ఏ మహావిధి సంఘటనవల్లనో వాడిపోయిన నందనవన పారిజాతకుసుమమువలె నున్నది.

ఆ నాగుబాము విషాదముతో, ఆ పడియున్న విగ్రహముచుట్టు బుసలు కొట్టుచు వీరందరు నిలుచుండియున్నవైపు చూచుచు, తిరుగుచు తొక్కట పడుచుండెను.

ఈ దృశ్యమేమి? ఆ బాలిక ఎవరు? ఆమె ఎక్కడిది? ఆమె బ్రతికియున్నదా, చచ్చిపోయినదా? యని యాలోచన లందరిహృదయముల నొక్కసారి జనించెను. ఆ వైద్యగురువు పడియున్న బాలికను దూరమునుండియే ఒక నిమేషము తీక్షణదృక్కుల పరికించి "మహాప్రభూ! ఆ బాలిక బ్రతికియున్నది. కొనయూపిరితో నున్నయది. ఆమెకు వెంటనే చికిత్స సేయకపోయినచో ఆమె చనిపోవును. కాని.... కాని...." అని తొందర తొందరగా మాటలాడెను.

"కాని ఏమి! వెంటనే ఆమెను రక్షింపవలెను. రండు పోవుదము"

విష: ఆగుడు మహారాజా! ఒక్క అడుగు ముందుకు వేయకుడు! ఆమె ఏ మహత్తరవిషమో సోకి అట్లయియుండవచ్చును. ఆమెదగ్గరకు పోవుటే మృత్యువదనమున

బడుట.

మహా: మఱి కర్తవ్యమేమి? వ్యవధి లేదు. ఆ దేవాంగన చనిపోవును. మీరు రానిచో నేను పోయెదను. ఏదిరా ఆ గొడ్డలి?

అని శ్రీకృష్ణసాతవాహనుడు ముందు కురకబోయినాడు. ఋషితుల్యుడగు నా విషవైద్యుడు మహారాజుకడకు పరుగెత్తి వారిని నివారించి, "ప్రభూ! ఒక్క అడుగు ముందుకు వేసితిరా, తథాగతునిపై నాన! తొందర పడకుడు. నేను ఇంకొక మహావిషమును సేవింతును. ఈ విష మా విషమును విరచును. ఇది సేవించినవారు మూడుదినములావల వేయి గజనిమ్మ పండ్లు సంపూర్ణముగ భక్షింపవలయును! ఆ భయంకరవిషము ఈ విషమును నాశనముచేయుచు తాను నశించును. ఇప్పుడు నేను పోయి, ఆ విషమును నా సంచిలోనున్న గజనిమ్మపండును ఒలిచి ఆ రసముతో రంగరించి, ఆ బాలికనోటిలో పిండెదను. మీరంద రిచ్చుటనే యుండుడు. ఆ వ్యాళగ్రాహియు, నేనును పోయెదము" అని వేగముగ బల్కెను.

వారందరట్లు చూచుచుండగనే, విషవైద్యునికడ విషము ఆ ఇరువురు భక్షించి, ముళ్ళకంచెలు గొడ్డలిచే ఛేదించుచుపోయి యా బాలికను చేరిరి. విషవైద్యుడు వెంటనే యామెపై తన ఉత్తరీయమువైచి యామె దిగంబరత్వమును కప్పెను.

## ౯
## ప్రణయా వేదన

ఆ విషవైద్యుడు విషబాల నాడిని పరీక్షించి, యా నాడిబలమున కచ్చెరు వంది, ఆమె పెదవులపై గజనిమ్మపండు రసమును పిండినాడు.

ఆ తీయని, పుల్లని, శీతల మగు సుగంధపూరితములగు రసబిందువులు అమృతరసబిందువులై పడినవి. ఆమె నోరు చప్పరించెను. మరల రసబిందువులు ఒలికినవి. ఆమె నాలుక జూపినది. అప్పుడా విషవైద్యుడు తన సంచిలోనుండి నాగరంగఫలము నొకదానిని తీసి ఒలిచి ప్రాణము లేచి వచ్చు ఫలరసమును ఆమె నాల్కపై పిండినాడు.

విషబాల "దాహము, దాహ" మని లేచినది. పాములవా డామెను "తల్లి! నువ్వు కదలకు; అన్నీ మేము చూచుకొందుము" అని అనునయించుచు, తన తలపాగాతీసి ఆమె తలకు దిండుగ నమర్చి, తనపై గొంగళిని పక్కనమర్చెను.

ఇంతలో విషవైద్యుడు పరుగున సేవకులకడకుబోయి తోలు తిత్తులలో నున్న జలమును ఒక కలశమున సేకరించి, విషబాలకడకు వేగముగ వచ్చి, యామెమోముపై నీరములు చల్లి, చేతులు పాదములు జలముల గడిగి, చల్లని ఆ నీటిని కొంచెము కొంచెముగ ఆమె తలయెత్తి తనయొడిలో పెట్టుకొని త్రావించెను. పాముల వాడామెకు ఎండతగులకుండ ఛత్రము నొకదానిని తెచ్చి అడ్డము పట్టెను.

శ్రీకృష్ణసాతవాహనుడు ఆశ్చర్యమున నిశ్చేష్టుడై, యా విషబాల వైపు తదేకదృష్టితో జూచుచుండెను. ఆమె భయంకర జగన్మోహనాకారము, ప్రళయతాండవేశ్వరద్రుత సంచార సంచలచ్చరణోద్భూతైకాదశ రుద్రమండల మహాగ్నిస్ఫులింగములవలె ఆమె మెరసి పోవుచుండ తన చూపులు, ప్రాణము, మనస్సు, హృదయము, ఆత్మయు ఆమె కర్పించి

వేసెను.

విపులమై, భారమై, సుదీర్ఘమైన ఆమె కైశ్యశ్రీ నిర్మలశర్వరీ నిశ్చలాకాశమువలె ఆమె అనంత చైతన్యసౌవర్ణపాటలత్వమును కప్పుచున్నది.

ఇంతలో ఆమె దిగంబరయైయున్నదన్న భావ మాతనికి మెరపు వలె స్ఫురించినది. వెంటనే యా మహారాజు తన నడుమున కట్టియున్న దుకూల బృహతికను ఆమె కంతరీయముగ నిమ్మని యా యహితుండిక వృద్ధున కిచ్చెను.

"ఓ వైద్యగురూ! ఆమె సేదతీరినంతనే వలయురక్షకుల నేర్పాటు చేయుడు. నా అంతఃపుర బాలికల నిరువుర నా మెకడ కంపుదునా?"

"చిత్తము ప్రభూ! ఆ ఏర్పాటు లన్నియు నొనర్చెదను. ఈ ప్రదేశమంతయు సూర్యకిరణములు చొరగానిది. దుర్మార్గు లెవరో ఈ బాలను ఇట దిగవిడిచి ఇటునటు బోకుండ ముళ్ళకోట కట్టినారు."

"అవును. ఆమెను ఎవరో మునుష్యులే ఇక్కడ క్రూరచిత్తులై దిగవిడిచిపోయినారు. ఇంతవరకు ఆమె శాపగ్రస్తయై భూమికి అవతరించిన ఏ దేవియో యను భ్రమలోనుండి, మానవులకు ఆమెకు సంబంధము ఊహించనైతిని. ఆమె నాగలోకవాసిని కాదుగదా!"

"ప్రభూ! ఆ గిరినాగము గడబిడలో ఏమైనదో కనిపెట్టలేకపోతిమి. మీ రనునది నిజమేమో? కానిచో ఈ బాల ఇంత విషయుక్తయయ్యు, ఎట్లు బ్రతుకగలిగినది?"
"విషయుక్తయా? అది యేమి?"

"ప్రభూ, ఈమెయందు మహావిషము కూడియున్నది. ఆమె కను కొలకులు పరీక్షించితిని. నఖములు పరీక్షించితిని. నాలిక చాపినప్పు డా జిహ్వాము తీక్షణముగ పరిశీలించితిని. ఆమె పెదవులు, చెవుల తమ్మెలు, భ్రూయుగ్మము, ముక్కుపుటములు అత్యంత నిశితముగ పరిశీలించితిని. మహారాజా! ఈ బాలికయందు సర్వవిషములు జీర్ణించియున్నవి. అవి ప్రస్తుతము విజృంభించియున్నవి. ఆ విషములే మనల నందర నంత చికాకు పరచినవి."

"అయిన నీ బాలిక ఎట్లు బ్రతికియున్నది? ఆమె ఇంతలోనే చనిపోవునా? ఆమెను బ్రతికించు ఉపాయములు లేవా? మీ శాస్త్రముల కాపాటి శక్తి చాలదా? ఏ దుర్మార్గులు, రాక్షసులు, పిశాచులు ఈ బాలిక నిట్లుచేసిరో వారిని వేయి ఖండములుగ నరికివేతును వారిని బ్రతికియుండగానే ఇటులనే తిండి పెట్టక, నీరమియ్యక, ఇట్టి మరుభూమిలో మాడ్చి, గ్రద్దలకు, రాపులుగులకు బలిచేయుదును!"

శ్రీకృష్ణశాతవాహనుని కండ్లు స్ఫులింగశకములైపోయినవి. ప్రచండ సూర్యగోళము లైనవి. ఆతని కుడిచేయి కరవాలమును దృఢతర ముష్టి బంధమున పట్టుకొనినది. ఆతడు ప్రళయకాలరుద్రునివలె మండి పోయినాడు.

ప్రక్కనున్న మంత్రగురువు ఎదుటికి వచ్చి, "శాంతింపుడు, మహారాజా! శాంతము ఎట్టికష్టములనైన నివారించునుగదా! ఇప్పుడు కర్తవ్య మాలోచింపవలయునుకాదా? ఆ బాలికకు ప్రాణాపాయ మేమియు నుండదు...." అనెను.

శ్రీకృష్ణ: మీ రెట్లు చెప్పగలరు?

విషవైద్యుడు: ఆమెకు ప్రాణాపాయ మేమియు లేదని నేను నా వైద్యశాస్త్ర జ్ఞానమంతయు నాధారముగ ప్రతిజ్ఞచేసి చెప్పగలను ప్రభూ!

మంత్ర: ప్రభూ! నేను నా మంత్రశాస్త్ర ప్రమాణముగ ప్రతిన చేయగలను.

శ్రీకృష్ణ: మనకందరకు ప్రాణభయము కల్పించునంతటి విషము లామెకు ఇచ్చినా రంటిరి. ఆమె ఎట్లు బ్రతుకును? మీ మాటలు నమ్ముటెట్లు?

విష: మహారాజా! అదే విచిత్రము. కారణ మిప్పుడు నేను చెప్పలేను. కాని ఎంతటి విషమునైన ఈమె హరించుకోగలదు.

శ్రీకృష్ణ: నాకు మీ యిరువురి మాటలవలన మతిపోవుచున్నది! ఈ లోన ఆ బాలిక ప్రాణము పోకుండ చూడుడు. ఆ బాలిక ప్రా-ణ-ము-పో-యె-నా, సర్వదేవతలు సాక్షిగ నాప్రాణములు మరుక్షణమున నా బొంది నుండవు!

ఇది యేమి యని చకితులై మంత్రగురువును, విషవైద్యులు నొకరి నొకరు చూచుకొనినిరి. వెంటనే మంత్రగురువు....

"ప్రభూ! ఈ విషగాలులు తమ నరములను క్షోభింపజేసినవి. తాము పోయి, గజ మారోహించి కొంచెము విశ్రాంతినందుడు" అని విన్న వించెను.

"నా కింతటినుండి విశ్రాంతి యనునది లేదు. ఈ బాలిక జీవితము ఏదియో మహత్తర విధివశమున నాబ్రతుకుతో అత్యంతగాఢసంశ్లేషత నందినది. ఆమెకు ప్రాణము నిలిచినది అన్నమీదట నా ప్రాణము తనంత నిలుచును" అని మహారాజు వచించెను.

విషవైద్యుడు భయముగదురు హృదయముతో చేతులు వడక, విషబాలకడకు బోయి, మరల నతిశ్రద్ధగ నామె ఉచ్ఛ్వాసనిశ్వాసములు, కన్నులు, కపోలకంఠ హస్తతల మణిబంధకూర్పరపాదగుల్ఫోరుపజిహ్వాదినాడులన్నియు బరీక్షించెను. అత డంత లేచి, మహారాజుకడకు బోయి "ప్రభూ! ఈ బాలిక బ్రతికియున్నది. ఆమెయందు మహాసర్పనాడి వ్యాప్తమై యున్నది. అయినను ఆమెలో భోజనము, నీరము గైకొనని నీరసముతప్ప వేరొండు దోషమేమియు లేదు. ఆ దోషములైనను ఇప్పుడు కొలదిగ మాత్రమున్నవి. ఆమె ఇప్పుడు నిద్రపోవుచున్నది. మహావిషదిగ్ధయగు నీ బాలిక ఇతిహాసములలో, విష శాస్త్రములలో చెప్పినట్లు ఈ.....బా....లి.....క....."వి......ష......క......న్య.....క..." యని వణంకుచు చెప్పి తలవంచుకొనెను.

శ్రీకృష్ణ: విషకన్యకయా!

సింహగర్జనవలె ఆ ప్రదేశముల మారుమ్రోగ నిట్లడిగిన యువరాజు వదనమాలోకించి,

"చాణక్యదేవుడు పర్వతకుని పై విషకన్య ప్రయోగముచేసెనని వినరా మహారాజ కుమారా!" అని మంత్రవేత్త పలికెను.

శ్రీకృష్ణ: అట్టి బాలిక ఇక్కడ నెట్లు పడియుండును?

విషవైద్యుడు: ప్రభూ! ఆమె నాశనము గోరి ఎవరో ఇచ్చుట వదలి యుండవచ్చును.

శ్రీకృష్ణ: కార్తాంతికులవారిని పిలువనంపుడు.

వెనుక వేరొక గజముపైవచ్చు కార్తాంతికు డచ్చటికి విరుగుడు మందులు సేవించి కొలదికాలమునకు వచ్చెను.

శ్రీకృష్ణశాతవాహను డాయనవైపు తిరిగి "పండితులవారూ, ఎవరు ఈ బాల? ఈమె నా కంటబడిన ఫల మేమి?" అని యడిగెను.

కార్తాంతికు డంతట తనలో నొకింతసేపు గుణించుకొని "మహారాజా! ఈ బాలిక రెండు మూడు సంవత్సరములు ఈ స్థితిలో నుండును. ఈమె సత్కులవంశజాత. ఈమె జాతకము పరమోత్కృష్ఠము. ఈమె మహారాజ్ఞి యగును. మీ జీవితమునకు ఈమె జీవితమునకు ఏమియో సంబంధమేర్పడు సూచనలున్నవి. ఈమెను వెంటనే వలయు నుపచారములతో, కట్టుబాటులతో మనతో గొనివచ్చు ఏర్పాటులు చేయుడు. ఒక శిబికపై ఈమె ప్రయాణము చేయును. ఈ మహావైద్యు లీమె రక్షణకై వలయున వన్నియు నిర్వర్తింతురు" అని మనవిచేసెను.

విషవైద్యుడు, "ప్రభూ! తాము నా అనుమతిలేనిదే రెండునెలల పాటు ఈమెను సమీపింపనని మాట ఇచ్చినచో నే నీ భారము వహింపగల" నని విన్నవించెను.

## ౧౦
## నర్మదానదము

నర్మదానదము ఎంత శ్యామలమో అంత ప్రసన్నము. ఎంత గంభీరమో అంత సుందరము. సింధునది మహాశక్తిమతి. ఆమె అనాది చరిత్రకలది. ఆమె వేదములతోడనే ఆవిర్భవించినది. ఆమె అదితిదేవి. దెస దెసల ఆవరించు వెలుగు వాకలై ప్రవహించు మహానది ఆమె. ఆమె గర్భమున దేవనదులే ఇమిడిపోయినవి. ఆమె కాళికారూపిణి. ఆమె సర్వమతములు తనలో జీర్ణించుకొన్నది. ఆమె దస్యులకు, అసురులకు, యవనులకు ఆశ్రయమిచ్చినది.

నర్మదానది నవోఢ. ఆమె భారతవర్ష దేవికి మణిమేఖల. ఆమె పాత్ర పూరితారుణ రాగరంజితావనతవదన. యమునాదేవి గంభీరచరిత్ర. ఆమె తరళనయన, ప్రేమ ప్రేంఖణిత మానస, కృష్ణభక్త్యంకిత, వినీల జలజనయన.

నర్మద అల్లరిపిల్ల. ఆమె నాట్యమాడును. కిరాతకన్యలతో ఆ అడవులలో దోబూచులాడును. అడవిపూలే అలంకరించుకొనును. అడవిలతల మేఖల నొనరించును. తీయని స్ఫటిక జ్యోత్స్నలలో, ఆ అడవిదారుల వనపత్రవస్త్రాలంకృతయై దీర్ఘకుంతలములు విరియబోసికొని, పురుకుత్సునకై వియోగ గీతికల బాడుకొనును. గంగానది మహావేగవతి, త్రిపథగామిని. పవిత్రాంబుపూరయై మానవజీవితములనే పూత మొనర్చును. ఆమె స్నిగ్ధసితాంగ. ఆమె పుట్టుకయే మహారహస్యము. ఒకనాడు విష్ణుపాదముల జనించును. వేరొకనాడు మహేశ్వరజటాజూటస్థ యోగనిద్రపరవశ. ఒక దినమున జాహ్నవి, మరు దినమున భాగీరథి. ఆమె సాగరసింహాసన పట్టాభిషిక్తమహాసామ్రాజ్ఞి. వరణుని దేవేరి.

నర్మద భర్తనుజేరు దివ్యసంగమస్థలముకకు డెబ్బది యోజనముల దిగువను గౌతమి ఉద్భవించినది. ఆమె నర్మదను చెల్లియని పిలుచును. కృష్ణ గౌతమినే చెల్లి ఏమి చేయుచున్నదని ప్రశ్నించును. వారి పెద్దక్కసింధునది. వార్తలు నర్మదయే గౌతమికి వినిపించును. సరస్వతీనది సంగీతమును వేసవిరాత్రులందు నర్మదా గౌతమీ కృష్ణా భీమరథీ తుంగభద్రావేణీ కావేరినదులు ఆలకించును. ఆమె వీణాస్వరముల మేళవించి తీయని

గీతికల పాడును. గంగా యమునా శోణా బ్రహ్మపుత్రికా మహానదులు తన్మయురాండ్రై విందురు.

ఆనాటి రాత్రి వైశాఖపూర్ణిమ. వెన్నెలకరుళ్ళు విశ్వమెల్ల ప్రవహింపుచున్నవి. సువర్ణశ్రీ కుమారుడు గోండువేషముతో నర్మదానది తీరమున ఆ తెల్లని రాలలో రాయియై, నీడలలో నీడయై, నదీజలమువంక చూచుచు నదీకంఠ మహా సౌందర్యము గమనింపుచు గూరుచుండెను.

మహాబలగోండుడు, హిమబిందు నింతవరకు విరోధులు గొనివచ్చి ఇచ్చట మాయమైనారని సువర్ణునకుజెప్పి రాక్షసులచే నా ప్రదేశమంతయు, గాలించి వెదకింపనెంచి యాతని సప్రమత్తుడై యుండగోరి మాయమయ్యెను. ఇన్నాళ్ళ నుండియు మహాబలుని స్నేహమువలన ఆటవీ సంచరణ విద్య సువర్ణునకు చాలవరకు అభ్యస్తమయ్యెను. ఆతడు ఎంత ప్రమత్తతతో నున్నట్లు కనబడుచుండెనో, అంత జాగరూకతతో అన్ని సవ్వడులను వినుచుండెను. సర్వదిశలు పరిశీలించుచుండెను.

“హిమబిందూ, శిల్పదేవీ! నీ వేమైతివి? నీ వెట్టికష్టముల నందుచున్నావో? ఆగర్భ శ్రీమంతురాలవు, వర్ణనాతీత సుందరశ్రీ మూర్తివి. శిల్పులు నీ యందమును మూర్తింప గలరా? కవులు నిన్ను కావ్యమున బాడగలరా? దేవీ! ఏ మహావిధి మనల నిద్దర గూర్చినది. నీవు నాకడ లేకున్న నా హృదయము సౌందర్యదూరమగును. ఏ బాలికనో పెండ్లియాడి బిడ్డలగనుచు జీవితమును సముద్రతీరపు పట్టినేలవలె పరచి యుంచువానికి శిల్ప మెందుకు? కవిత్వ మెందుకు? గాన మెందుకు?” అని లోలోన అస్పష్టవాక్యముల గొణుగుకొన్నాడు సువర్ణశ్రీ.

“ఈ యాత్ర నీకునై, ఈ మాహాటవిలోన,

ఈ గవేషణఫలము ఈవు నా కౌదువే?"

ఆమెకు దనకు నేమి సంబంధము? ఆకాశమున దివ్యదర్శనము దోచినది. అప్పుడే మాయమైనది.

తానట్టి సన్నివేశము కోరెనా? ఏల తనకా దివ్యదర్శనము కావలెను? దూరదూరము నుండియే పవిత్రాద్భుత సౌందర్యమును, రసజ్ఞ తపఃఫలమైన దానిని పూజించుకొను చుండియుందునే? తనకడ కామె నన్ను ఏల రానిచ్చినది? ఏల ప్రేమించినది? ఇంతలో నీ ఎడబాటేమి?

లోకములో సౌందర్యానేకశ్రుతులు శిల్పి సమీకరించుకొనును. ఒకచోట కన్నులు, ఒకచోట మోము, ఒకచోట హస్తములు, ఒకచో పాదములు, ఊరువులు, కటి, వక్షము వేరువేరు స్థలముల సుందరులయందు ప్రత్యేకముగ శిల్పి పరిశీలించును. దోషములు త్రోసివేసి వానిని ప్రమాణములు చేసికొనును. అటులుండ ఏ అపశ్రుతియులేని మొక్కవోని అపరాజిత సౌందర్య మొక యెడ భాసింప, నా దేవి స్వప్నగతజీవి యగుశిల్పికి ప్రత్యక్ష మగుటయా? అతడు రాశీభూతమైన ఆ అలౌకికసౌందర్యము సన్నిహిత మొనర్చుకొనలేక పోవుటా? “సువర్ణా! నీ వెట్టికాని ఆంధ్ర సింహాసన మెక్కదగిన ఆ దేవి యెక్కడ? శిల్పిమాత్రుడవు నీ వెక్కడ? ఆ దేవిసౌందర్యశ్రీని వేభంగుల శిల్పించుకొమ్ము. లోకమెల్ల నా సౌందర్యముతో నింపుము. నీ జన్మమున కదియే చరితార్థత” అనుకొని అతడు నిట్టూర్పు విడిచెను.

హిమబిందు తా నెటులైన వెదకి, యామెను శత్రువుల బారినుండి రక్షించి వణిక్సార్వభౌముడు చారుగుప్తున కప్పగించు పుణ్యము లభించునా? సార్వభౌముని సైన్యము లీయడవులలో నాశనమైనివో, వెనుకకుబోయినవో ఇంకను యుద్ధము చేయుచు ముందునకు వచ్చుచున్నవో?

చారుగుప్తున కా సౌందర్యనిధిని అప్పగించి తాను హిమాలయములకు పోవుట మంచిది. శాక్యసింహజనన పవిత్ర ప్రదేశముల దర్శించి, ఆ పవిత్రహిమాలయములలో నివసింపనిచో నా యారాధ్యదైవతము నారాధించి, రూపెత్తించు మనస్సమాధి తనకు లభింపదు. ఆ దేవిని గండరింప గన్నచో మహోజ్జ్వల మూర్తికి భరతఖండమంతటు నీరాజనము నెత్తింపగన్నచో, నపుడుకదా ఆ దేవి తన్ననుగ్రహించినదానికి ఫలము లభించుట, ఆ దేవి తన కింక నేమి వరమొసంగగలదు! తద్వారస్వీకృతికి అర్హత సంపాదించు కొనుటయే తనపని.

ఇంతలో, ఆ ఆలోచనామధ్యమున నీటిలో అస్పష్టధ్వను లొనరించుచు కొండచరియ క్రీనీడలో ఒక పడవ చనుచున్నట్లు చప్పుడు విననయ్యెను. సువర్ణుని యాలోచనలన్నియు ఆ ధ్వనివైపు తీక్షణతో ప్రవహించినవి. అతడు నెమ్మదిగా భూమిమీద వ్రాలిపోయెను.

ఆ పడవ నది ఈవలి వైపునకు దాటి, సువర్ణశ్రీయున్న కొండచరియ గట్టు క్రింద నాగిపోయెను. నెమ్మది నెమ్మదిగ సువర్ణశ్రీ జరిగి జరిగి పది హస్తముల దూరముననున్న నదీకూల శిలాతలమునకు బోయి, నదిలోనికి తొంగిచూచెను. క్రింది పడవగాని మనుష్యులు గాని కనబడలేదు. ఇంద్రజాలముచే వలె వారందరు మాయమైపోయిరి.

ఏమిది ఈ చిత్రము? ఏమైపోయిరి తనకు కలవచ్చినదా, లేక భ్రాంతి కలిగినదా? ఏమి జరిగెను? ఆతడు కన్నులు చిల్లులుపడ ఆ చీకటి లోనికి చూచుచుండెను. రెండు ముహూర్తములట్లు జరిగిపోయెను. ఇంతలో నా పడవ ఆ కొండచరియ గోడలనుండి వచ్చినట్లు బయలుపడు చుండెను. అందు ఇరువురు మనుష్యులుండిరి. వారు చల్లగ నా పడవను నడిపించుకొని పోయిరి. ఆవలి ఒడ్డున కరిగి ఆ గుట్టలలో, రాళ్ళలో చరియలనుండి నీటికడకు వ్యాపించు తీగలలో, వృక్షములలో, క్రీనీడలందు ఆ పడవ మాయమైపోయెను.

సువర్ణశ్రీ దడదడలాడు గుండెలతో ఆ గుట్టలలో నేరికి గనపడ కుండ ప్రాకుచుపోయి కొంచెము వీలయినచోట నదిలోనికి దిగజారెను. అక్కడ మొసళ్ళుండునేమో యను భయ మాతనికి కలుగలేదు. లోతులుండునో, వడులుండునో, ప్రచ్ఛన్నశిల లుండునో, ఒడ్డునకు మరల చేరుటకు వీలుండునో ఉండదో యని యాత డాలోచింపలేదు.

అతడు నెమ్మదిగ ఈదుకొనుచు ఆ పడవ యాగినదని తాను నిర్ణయించుకొన్న ప్రదేశముకడకు పోయెను. నీటివడి ఎక్కువగ నున్నది. అయినను వీరుడగు నా బాలకుడు మత్స్యాతరణవిధాన ముపయోగించుచు నెమ్మదిగ నా ప్రదేశమంతయు గాలించెను. ఆ పడవ యెచ్చుట మాయమైనదో ఆతనికి గ్రాహ్యాము కాలేదు.

ఇంతలో పెద్దస్ఫటిక శిలప్రక్క నొకగుహవంటి ద్వార మా శిలాతలమున నీటిమట్టమున గాన్పించినది. దానిని గుహాముఖమని ఏరును కనిపెట్టలేనంత విచిత్రముగ నచ్చుట శిలాశిఖరములు నీటిలోనుండి తలలెత్తియుండెను. వాన కాలపు వరద లెంతవచ్చినను ఆ గుహలోనికి పడవ కటాకటిగ పోవచ్చును.

సువర్ణశ్రీ యా గుహలోనికి ఈదుకొని పోయెను. అచ్చుట పడవ యాగుటకై ఎత్తయిన

వితర్దికయు, ఆ వితర్దికనుండి వ్రేలాడు తా డొకటియు నాతనికి గోచరమైనవి. అత డా త్రాడు పట్టుకొని నీటిలోనుండి వెడలివచ్చు చప్పుడు కొంచెముకాగా ఆ వితర్దికపై కెగబ్రాకి, యందు కొంతకాలము చప్పుడుకాకుండ పండుకొనియుండి బల్లివలె ముందునకు కటిక చీకటిలోనికి ప్రాకుకొని వెడలిపోయెను.

౧౧

# మహా గుహాంతరము

ఆ గుహాముఖమున అడుగడుగునావుండు రక్షకభటులలో మొదటి వంతు వారప్పుడే భోజనముకు వెళ్ళిరి. రెండవవంతువారు అప్పుడే వచ్చి వెళ్ళిన ఆగంతుకులు తెచ్చిన వార్తల విషయమై ఇతరులతో జర్చింప నేగి కొంత ఆలస్యమొనర్చిరి. ఆ తరుణముననే సువర్ణశ్రీ గుహలోనికి సగము వరకు బల్లివలె ప్రాకుచు పోయెను.

ఇంతలో మనుష్యులు మాట్లాడుకొనుచు తనవైపువచ్చు సవ్వడి విని సువర్ణుడు చైతన్యమును వదలి, రాయిలో రాయియైపోయెను. గోడకు ఒదిగిపోయి ఊపిరియేనియు వదలలేదు. మాటలాడుకొనుచు ఇరువురు రక్షక పురుషులు సువర్ణుని ప్రక్కనుండియే నడచివెళ్ళిరి. వా రట్లు నడచి నడచి గుహాద్వారమునకు వెడలిపోయిరి. వెంటనే సువర్ణుడు తథాగతుని ప్రార్థించి ముందునకు బ్రాకుచు సాగిపోయెను. ఆతడు ఇరువది ధనువు లట్లు పోవుటయు గుహాంతము దూరమున తోచినది.

ఎట్టి ప్రాంగణమునకు కొనిపోవునో యా గుహ, గుహవెలుపల వెన్నెల వెలుగు తెల్లని పూలప్రోవువలె కన్పించుచుండెను. అచట నొక వీరుడు విచ్చుకత్తులతో నిలువబడి యుండెను.సువర్ణశ్రీ పదినిమేషములు తీవ్రాలోచనలో మునింగి కర్తవ్యము నిశ్చయించుకొనెను. అతడు ఇటునటు తడవినంత రెండుచిన్న రాళ్ళు దొరకినవి. తన నడుమునకు కట్టియున్న చురకత్తియను వదులుచేసికొని, ఎడమచేత దృఢముష్టిని ధరించి, కుడిచేత నా రాయిని నేల పైగొట్టి “టికటిక” చిన్న చప్పుడు చేసెను.

గుహాముఖమున నున్న ఆ రక్షకభటుడు స్తంభించిపోయెను. ఇటు నటు పరిశీలించి యాతడు నెమ్మదిగ సువర్ణశ్రీ వైపునకు వచ్చెను. ఆ కటికచీకటిలోగూడ సువర్ణశ్రీ చూపు మార్జాలదృష్టివలె నైనది. అది అటవీ సంచరణ విద్యాఫలము.

సువర్ణశ్రీ లేడిపై నురుక పొంచియున్న శార్దూలమువలె సర్వావయవములు పొంగ ఛెంగున విరోధిపై నురుక సన్నద్ధుడైయుండెను. అజానుబాహుడైన యా రక్షకభటుడు తనతో నొక దివిటీ తీసికొనిరాక పోవుటయే దోషము.

తన ప్రక్కనుండి యాతడు పోవుచున్నప్పుడు చప్పుడుకాకుండ సువర్ణశ్రీ ఆ రక్షకభటుని వీపుపై ఉరికి కుడిచేత విరోధినోరు గట్టిగమూసి ఎడమచేత నా మనుష్యుని చుట్టి నొక్కిపట్టుచు, కుడిచేయి మణికట్టు గట్టిగ నొక్కిపట్టెను.

తనగురువు సోమదత్తాచార్యులు నేర్పిన మల్లయుద్ధపు నేర్పు నుపయోగించి విరోధిముద్దయై ఒరుగునట్లు మోకాలు డొక్కలో నొక్కి వేసెను. వాని చేతులు బంధించియే బొటనవ్రేల మెడరక్తనాళము గట్టిగ నొక్కుటయు, అయిదు నిమేషములలో స్పృహతప్పి ఆ మనుజు డొరగి పోయెను. క్రిందకు బడిపోవు ఆతని కత్తిని వెంటనే వేగమున పిడితో పట్టుకొని, వానిని క్రింద చల్లగ బరుండబెట్టి, వాని నడుమునకు బిగించు కొనిన కాసెకోక వదలించి, నెమ్మదిగ లాగి, ఒక చివర ఆతని నోటిలో కుక్కి కిక్కురుమనకుండ బంధించి వేసెను. తన నడుమునకు చుట్టియున్న త్రాటితో ఆ మనుష్యుడు కదలకుండ గట్టిగ కట్టివేసినాడు. అచ్చటినుండి త్వరితముగ తన అలంకరణవిధ మంతయూ నూడ్చి యా రక్షకభటుని గోండునుజేసి, తా నా రక్షకభటుని వేషము వైచికొనెను.

ఒక అరగడియలో సువర్ణశ్రీ మాళవ సైనికుని వేషమున నిర్భయముగ లేచి గుహ వెలుపలికి వెడలిపోయెను.

అక్కడ సువర్ణశ్రీ సందర్శించిన దృశ్యము పరమాద్భుతమైనది. అది వింధ్య పర్వతములో ప్రకృతి ఏర్పరచుకొనిన చక్రాకారమగు లోయ చుట్టును మనుష్యుడు ప్రాకలేని ఎత్తయిన శిఖరములు పెట్టని కుడ్యములై ఆకాశము నంటుచుండెను.

ఆ విశాల చక్రాకార కందరాప్రదేశము ఎనుబది ధనువుల వెడల్పు నూటఇరువది ధనువుల పొడవు నున్నది. ఆ భృగుకుడ్యము చుట్టును ముప్పది, నలుబది బిలము లున్నవి. కొన్ని గహ్వరము లయిదారు ధనువుల ఎత్తున నున్నవి. ఎత్తయిన యా బిలములకు పోవుటకు మెట్లున్నవి.

ఈ పర్వతాంతరస్థలమునకు వచ్చుటకు సువర్ణశ్రీ వచ్చినమార్గము తప్ప వేరొండు లేదనియే యాతనికి తోచినది. ఆ ప్రదేశమునందు మూడు నాలుగు వందల జను లుండవచ్చును. అందు బ్రాహ్మణులు, క్షత్రియులు, ఆటవికులు, నాగరజనులు అనేకులు కనబడిరి. కొందరు అక్కడక్కడ నులకమంచములపై పండుకొనియుండిరి. కొందరు తన గుహాప్రాంగణముల ప్రక్కలు వైచుకొనియుండిరి. అన్నింటికన్న మధ్యగానున్న గుహ యొక్కటి సువర్ణుని దృష్టి నాకర్షించినది. ఆ కందరము ఎత్తుగా అందముగా నలంకరింపబడియున్నది. అచ్చట పలువురు స్త్రీలు నడయాడుచుండిరి. అందు కొంద రాంధ్రస్త్రీలవలె కానవయిరి. సువర్ణశ్రీ గుండెలు తోడనే దడదడకొట్టుకొన నారంభించెను. ఎప్పుడు తాను కట్టివేసిన మనుష్యునివంతు మార్చుటకు కొత్త రక్షకభటులు వచ్చెదరో? దీర్ఘ కందరాగతుడై పడియున్న తన బందీని ఎవరైన గుర్తించెదరేమో? తా నేమి చేయవలసియుండునో?

ఇంతవరకు తన్నిక్కడకు కొనివచ్చిన యదృష్టదేవతయే తన్ను రక్షించుగాక యని సువర్ణుడు ప్రార్థించుకొనెను. తాను కానరాక మహాబల గోండుడేమి అలమటచెందునో యనియు నాతడు భయపడెను.

కొంతకాలమునకు మనుష్యులందరు సద్దుమణగుచుండిరి పోత పోసిన విగ్రహమువలె సువర్ణుడచ్చటనే నిలుచుండి యాలోచించుచుండెను. ఇంతలో ముక్తావళీ దేవి కంఠము స్పష్టముగ వినవచ్చినది. "ఎన్నిదినము లీ చీకటి గుహలో మా కీ నిర్బంధము?" అను ఆమెమాటలు ఆ నిశ్శబ్దతలో మారుమ్రోగినవి.

సువర్ణశ్రీ మ్రాన్పడిపోయెను. అతనికి సంతోషము, విషాదము, కోపము ఒక్కసారి ఉప్పొంగిపోయినవి. తాను వారి దగ్గరకు పోవుట మంచిపని కాదు. ఈ చాటుచోటు నెట్లయిన పట్టుకొని తీరవలయును. ఈ స్థలమును రక్షించు సైనికులు నూరు, నూట ఏబదికన్న ఎక్కువయుండరు. యుద్ధముచేసి ఈ స్థలము పట్టవలయు నన్న హిమబిందుదేవి కేమి కష్టము వాటిల్లునో? ఎవరో ఒక విరోధి ఈ స్థలము తెలిసికొన్నాడని వారికి తెలిసి పోయినచో నేమి మొప్పము వాటిల్లునోయని యాతడు తీవ్రాలోచనలో మునింగి "ఇప్పుడే వారిని రక్షింపవలెను. తరువాత కథయంతయు తారుమారు కాగలదు" అను నిశ్చయమునకు వచ్చెను.

ఆలోచన పొడముట ఏమి, అపుడపుడే వెన్నెల కొండశిఖరములపై దాటి యవతలకు ఒరిగిపోయిన కారణమున చిరువెలుగుతో నిండి యున్న యా ప్రదేశములోని కాతడు నడచిపోవుట యేమి?

ఒక రిద్ద రీతనివైపు చూచిరికాని గుహాముఖమున కావలికాయు మనుష్యుడిట్లు

వచ్చుచున్నా డని వా రనుకొనలేదు. ఎవరో రక్షకభటుడు ఆ క్రొత్తగ వచ్చిన ముసలమ్మను మందలించుటకును పోవుచున్నాడని భావించిరి.

అతడు తిన్నగ ముక్తావళీదేవి కేకలువిన్న గుహకడకు బోయెను. ఆ గుహ యందెన్నియో మృగచర్మములు పరచియున్నవి. అచ్చట ఇరువురు రక్షక స్త్రీ లాయుధపాణులై కావలిగాచుచు నిలిచియుండిరి. సువర్ణశ్రీ అనుమానమేమియు లేనివానివలెనే నిర్భయముగ నటకు బోయెను.

కాని అతని ప్రాణము లరచేత నున్నవి.

## ౧౨
## పునస్సందర్శనం

కంఠధ్వని మార్చుకొని, కొంచెము బొంగురుపోయిన గొంతుకతో సువర్ణశ్రీ మాగధిలో "ఏమి ఆ ముసలమ్మ కేకలు వేయుచున్నది? అని ప్రశ్నించెను.

"ముసలమ్మా! ముసలమ్మ కేకలు పెట్టదా మరి! మేము మనుష్యులము అనుకొంటిరా, పశువుల మనుకొంటిరా?" అని ముక్తావళీ దేవి కెంపులుగ్రమ్మిన కన్నులతో వణకుచు కేకలు వేసినది."ఏమి కష్టము వచ్చినది మీకు?"

"ఏమికష్టము వచ్చినదా? దుర్మార్గులారా, మీరందరు నాశనమై పోదురు. ఎక్కడి ధాన్యకటకము, ఎక్కడి యీ ప్రదేశము? బోనులో జంతువులను పట్టుకొని వచ్చినట్లు మమ్మిచ్చటకు కొనివచ్చెదరా?"

"ఊరుకో ముసలమ్మా! కేకలు పెట్టకు. మా కార్యము నెరవేరిన తోడనే మిమ్ము మీ స్థానములకు బంపివేసెదము."

సువర్ణశ్రీ ఆలోచనలు మెరుపులవలె ప్రజ్వలించి మాయమగు చుండెను. ఇంక కొంతతడవు వారితో మాట్లాడుచున్నచో, సహజ జిజ్ఞాసతో ఆ యా గుహలలోవారు, అచ్చటచ్చట తిరుగాడువారు ఇచ్చట చేరవచ్చును. అంతటితో ఎట్టి ఆపత్తయిన ఘటింప వచ్చును. వారికి దనరాక నెఱింగించు టెట్లు? వారు ఏమియు గడబిడ చేయుకుండు టెట్లు? ఏలాగున వారిని తప్పించుకొనిపోవుట?

ఈ ఆలోచనలు మహావాయుసంచలితసముద్రతరంగములై ఒక దానిపై నొకటి ఓరసి దొర్లుకొనిరా, దలయూపుకొనుచు వెనుకకుబోయి, తిన్నగా నా గుహావలయములో నంత్యగుహ కావలనున్న విశాలస్థలమున కేగి యచ్చట నొక రాతిప్రక్క గూరుచుండెను.

ముక్తావళీ దేవియు, హిమబిందును వసించు కందరమునకు కావలి కాచు రక్షక స్త్రీలు ఆ వచ్చిన రక్షకభటుని మాటలలో అధికారధ్వని గ్రహించి, యాతడు మారువేషముననున్న రాజాధికారి ఎవరోయైయుండునని యూహించుకొనిరి. వారు మాగధస్త్రీలని వేషభాషలను బట్టి సువర్ణశ్రీ చేసిన ఊహ సరియైనదే! వారును అతనినొక మాగధవీరునిగ నెంచిరి.

అతని నడకలో, మాటలో, ముఖమున అధికారము ప్రజ్వలితమగు చున్నది. అతనిమాటను తెరవెనుక మంచముపై ఒరగిపండుకొనియున్న హిమబిందు వినినది. బొంగురుగనున్నను ఆ మాటలలో ఎక్కడో వినిన ధ్వని యామెకు అస్పష్టముగ తోచినది.

ఎక్కడ నా మాటలు వినిపించినవి? ఎవరివి? ఆలోచించినకొలది ఆమెకు ఏదియో అనుమానము, ధైర్యము కలిగినది.

ఎవరును "మిమ్ము మీస్థానమునకు పంపివేసెదము, అని ఇంతకు మున్ను చెప్పలేదే? ఆ మాటల యర్థమేమై యుండును?" అని యాబాలిక ఆలో చింపజొచ్చెను.

సువర్ణశ్రీ కుమారునివెంట ఆరక్షక స్త్రీల చూపులు వెంబడించినవని యాతడు గ్రహించినాడు. ఇటులకాదటుల అని ఎన్ని మార్గములనో యాతడు త్రోసిపుచ్చినాడు. వెంటనే యాతడు లేచి, త్వరితగతిని గుహాముఖ ప్రాంతమునుండి నడచుచు, ఆ పర్వత నిమ్నాంత ప్రదేశము చుట్టి, అక్కడక్కడ నాగుచు, పనియున్నవానివలె నడచి నడచి, హిమబిందు ఉండిన గుహకడకు బోయి, ఒక రక్షకస్త్రీకడకు జేరి, యామె చెవిలో "ఉజ్జయిని!" యని అస్పష్టముగ బలికెను.

ఆతడు తన దగ్గరకు వచ్చుటయే గమనింపని యా స్త్రీ వెంటనే తలవని తలంపుగ "ఏమిటి?" యని రహస్యముగ ప్రశ్నించెను.

సువర్ణశ్రీ కన్నులు మెఱయ పెదవులకడ తన కుడిచేయి చూపుడు వ్రేలుంచి గుసగుసలతోడనే "వారిరువురకు వినంబడును! వీ రిద్దరిని వెంటనే ఇచ్చటనుండి సౌరాష్ట్రము తరలింప ఆజ్ఞ వచ్చినది. నన్ను పెద్ద సైన్యముతో పంపిరి. సైన్యము బయట నది కావలనున్నది. ఇచ్చటి నుండి రహస్యవచనము "ఉజ్జయిని!" నేను మరల వచ్చునప్పటికి మీరిరువురు లోనికిపోయి, వారిని మాటలాడక బట్టలు సర్దుకొనుడని చెప్పుడు. "ఉజ్జయిని!" మరువకుడు. జయ జయ శ్రీ శ్రీ శ్రీ కాణ్వాయన సార్వభౌమ!"అని మాగధిలో పలికెను.

ఆ ప్రతీహారిణి గుండెజల్లు మన నేదియో విచిత్ర మూహించుకొనినది. తాము సుశర్మకాణ్వాయనచక్రవర్తికడ ప్రతీహారిణులని చక్రవర్తి సందేశ హరు డీ యువకవీరు డెరిగియుండును అని ఊహించుకొన్నది.

"ప్రభువు ఆజ్ఞ ఏమి?"

"ఈ బాలికను ప్రభువే వివాహమాడునట! ఈ బాలిక చారుగుప్త తనయ. వణిక్సార్వభౌముని అట్టి బాలికను వివాహమాడిననాడు ఆంధ్రదేశము చక్రవర్తిదే! వీరందరికి ఈ రహస్యము తెలియదు. వీరికి తెలియకుండ అనగా మాళవులకు, ఆంధ్రులకు తెలియకుండ, మన మీబాలికను సౌరాష్ట్రమిషచే పాటలీపుత్రము చేర్పవలెను."

"మేము, మాళవస్త్రీ లిరువురు వచ్చువరకు కదలకూడదు కదా?"

"అవును, నాకు తెలియును. నీవును ఆ వనితయు ఊరకుండుడు, మీరు వారివెంటనే నాతో గుహలోనికి ఒక్క క్షణములో పరుగున రండు. మనలను మాళవులు, ఆంధ్రులు అనుమానింపగూడదు!"

"అయినచో చక్రవర్తి వేలిముద్ర చూపుము. అదిగదా నాయాజ్ఞ!"

"అవునవును! లోనికిరా! దీపపు వెలుతురున చూపెదను. నీకు ఆంధ్రము వచ్చునా?"

"రాదు."

“అయ్యయో! సరే, నేను వారితో రెండుమాటలాడెదను. నీకు ఉంగరము చూపెదను. నీ వీ లోన నీ తోటియామెకు విషయము బోధింపుము.”

అని సువర్ణశ్రీ లోనికి విసవిసబోయి, గుహను రెండుగదులుగా విభజించు తెరను ఒత్తిగించి, ముక్తావళీ దేవిని చూచి తన నోటి పై కుడి చేయి వ్రేలుంచుకొని ఎడమచేత మాటలాడవలదని సైగచేసి, తాను సువర్ణ శ్రీనని యామె చెవిలో నూదెను. ఆమె కెవ్వున కేకవేయబోయి, నోట ఉపవీతపు కొంగును కుక్కుకొనెను. దూరమున ప్రక్కపై పండుకొని యుండిన హిమబిందు తేరిపార చూసి, “ఓ” యని యరవబోయి, యుక్తాయుక్త విచక్షణ జ్ఞానము కలదికాన, మాట లణచుకొని, మంచమునుండి లేచి పరుగున వచ్చి, యాతని భుజములు పట్టి, మొగములోనికి తీక్షణముగ చూచి యాతని చిరునవ్వు గమనించి, “అమ్మయ్యా!” యని యాతని కౌగిలింతలో కరిగిపోయెను.

ముక్తావళీ దేవికి సంతసము, ఆశ్చర్యము ఒక్కసారి జన్మించినవి. సువర్ణశ్రీ వెంటనే యా కౌగిలిలోనే హిమబిందు చెవిలో “మీ ఇద్దరు ఆ రక్షక స్త్రీల వేషముతో నాతో రండు. వారిని లోనికి రప్పించి కట్టివేసెదను. అంతయు నీపై నాధారపడియున్నది. హిమబిందూ! నేను ఒక బాలికను కట్టగనే నీవు పోయి రెండవ బాలికను కొనిరా. మామ్మగారు రక్షక స్త్రీ వేషము వేసుకొనుచుందురు” అని మరుమాటలాడక, ఆమెను కౌగిలి నుండి వదలి, గుండె దడదడ మన గాలిలో నడచుచు, తెరయావలికి వచ్చి మొదటి ప్రతీహారిణిని లోనికి రమ్మకి సంజ్ఞ యొనర్చెను. ఆమె అప్పటికే రెండవ ప్రతీహారిణితో చక్రవర్తి శ్రీసుశర్మ కాణ్వాయనుల ఆజ్ఞగా వచ్చిన సేనాపతి యని చెప్పి, యామెను సిద్ధముచేసి చక్రవర్తి ఉంగరము ఆనవాలుగ చూచుటకు ఎదురుచూచుచుండుటయు, నా నూత్న పురుషుడు లోనికి రమ్మని పిలిచెను.

ఆ ప్రతీహారిణి లోకరక్షణభారమంతయు తాను మోయుచున్నట్లు భావించుకొనుచు లోనికి బోయినది. ఇరువది మూడుకలల కాలములో హిమబిందీవలకు వచ్చి రెండవ యామెను లోనికి బిలిచెను. మరి పదికాష్టలలో మొదటి ప్రతీహారిణి వచ్చి గుహాముఖమున నిలబడినది.

## ౧౩
## బంధ విమోచనము

ఈ చిన్ననాటకము నెడమ వైపుననున్న గుహనుండి ఆరుగురు నాయకులు గమనించిరి. బందీగా కొనిరాబడిన వారలలో పెద్దయామె మొదట ఏవియో కేకలు వేసినదనియు, అల్లరిచేయ ప్రారంభించుటచే గుహాముఖమున కావలికాచు యోధుడు వచ్చి సరైననియు వా రనుకొనిరి.

ఆతడు రెండవసారి వచ్చి, అక్కడ కావలిగాచు రక్షక స్త్రీలతో మాటలాడుట వారిలో నొకరికి అనుమానము కలిగినది.

“ఏమయ్యా, ఆ భటుడు రెండుసారులు గుహకడకు వచ్చినాడేమి?”

రెండవయతడు: ఎవరు వచ్చినది?

మొదటి: గుహాముఖమున కావలికాయు భద్రుడు.

మూడవ: అవును. భద్రుడు తనస్థానము కదలుట ఎందుకు? గుహాముఖమున

శక్తిముఖుడు లేడే? అత డేమయినాడు?

తక్కినవారు: ఏమీ! శక్తిముఖుడు లేడా?

మొదటి: అతడు కనపడలేదు, ఇది ఏదో వింతగ నున్నది. నీవు శంఖమూదుము. వెంటనే కత్తులు ధనుర్బాణములు పుచ్చుకొని రండు!

ఒకడు వెంటనే శంఖము నెత్తి, "భోం! భోం!" అని ఆ గుహా ప్రాంగణావరణమంతయు మారుమ్రోగునట్లు ఊదెను.

నిదురపోవు వా రులికిపడి లేచిరి. కత్తులతో, కటారులతో, శూలములతో గుహలనుండి వీరులు బయటి కురికిరి. పలువురు ధనుర్బాణములు ధరించి ఈవలకు పరువిడి వచ్చిరి. మన నాయకు లిర్వురలో ఇద్దరు హిమబిందు గుహపై పునకు, నలుగురు గుహాముఖమునకు పరువిడిరి.

ఈలోననే సువర్ణశ్రీ ఇరువురు రక్షకస్త్రీలతో గుహాముఖమువైపు పరుగిడెను. పెద్దదైన ముక్తావళి పరుగిడలేక మోకాళ్ళు బిగిసికొనిపోయి ముందునకు బోర్లగిలపడెను. తరుముకొని వచ్చువారు ఘుల్లున కేకలువేసి అటకు ఉరికిరి. కాని సువర్ణశ్రీ యామెను సునాయాసముగ నెత్తి, గుహాముఖమువైపు పరుగిడెను. ఈలోన మొదటి నలుగురిలో ఒకడు గుహా ముఖమును ముందుగా జేరెను.

కరవాలము మాత్రము చేత ధరించి, హిమబిందు తూలుచు సువర్ణశ్రీ వెనుకనే పరుగెత్తి వచ్చుచుండెను. సువ్వున పది బాణములు వీ రున్నదెసకు వచ్చి, పర్వత కుడ్యమునకు తగిలి ఖంగు ఖంగున మ్రోగినవి.సువర్ణశ్రీ ఆగి, హిమబిందును ముందునకు త్రోసి, ఆమె వెనుక ముక్తావళీ దేవితో పరుగిడ నారంభించెను. బాణములు వర్షమువలె కురియ నారంభించెను. ఆ కనుచీకటి వలనను, సువర్ణు డడ్డదిడ్డముగ పరుగిడుట వలనను, హిమబిందు కుమారికకుగాని, ముక్తావళికిగాని బాణము తగులకూడ దని విలుకాండ్రు శరములు వదలుచుండుటవలనను వా రింకొక పది నిమేషములలో గుహాముఖము చేరిరి. గుహాముఖమున ఖడ్గము త్రిప్పుచు నొకడు నిలిచియుండెను.

సువర్ణశ్రీ ముక్తావళీ దేవిని దింపి, వారి నిద్దరను సొరంగపుగోడ నానుకొని ముందుకు సాగిపోవుడని చెప్పి, సింహమువలె సొరంగముఖముననున్న వీరునిపై నురికెను. ఆ ఉరుకుటలో తనచేతిలోని ఖడ్గముచే ఎదుటి వీరుని ఖడ్గమును క్రిందకు గొట్టి, కాలితో నాతని పొట్టపై దన్ని, యాతడు పడిపోవుటతోడినే ఒక్క ఉదుటున సొరంగ మార్గములోని కురికి వెనుకనున్న విరోధిని కత్తితో నివారించుచు, సగము ఏడ్పుతో, సగము నవ్వుతో ఊగిపోవు హిమబిందును ఒక చేతితో పట్టి "రండ"ని బుసకొట్టి ముక్తావళిని రెండవచేతితో పట్టి ముందునకు సాగెను.

ముక్తావళీదేవి పరుగిడలేదు. కావున సువర్ణశ్రీ ఆమెను కుడిచేతితో బుజమున వేసుకొని "మామ్మగారూ! మీరేమియు భయపడకుడు. బోను దాటి వచ్చినాము ఇంక పది అడుగులలో నదికడకు వచ్చెదము. అచ్చట నా స్నేహితుడు పెద్దసైన్యముతో ఉన్నాడు. మనము తొందరగ పోవలెను అంతియ" అని చెప్పి ముందునకు వేగముగ సాగెను.

పదియడుగులు నడిచెనో లేదో, సువర్ణశ్రీ, కట్టిపడవేసిన శక్తిముఖునకు మెలకువ వచ్చినది కాబోలు నెమ్మదిగ దొర్లుకొనుచు గుహాముఖ మనకు వచ్చుచుండెను. ముందు వేగముగ బరుగిడు హిమబిందు కాలి కాతడు తగిలి, ఆతనిపై తలక్రిందులుగ పడి, "హా"

యని కేకవేసి నది. ఆమె మీదపడినప్పు డేమియైనది తెలియక "హో" యని యాతడు భయమున నరచెను.

ఈ రెండు ధ్వనులతో సొరంగమంతయు మారుమ్రోగెను. ఈ లోన సొరంగము లోనికి విరోధులు తండతండముల పొలికేకలు పెట్టుచు పరుగిడి వచ్చుచుండిరి. బాణములు వర్షము కురియుచు "ఖంగు ఖంగు" మని గోడలకు తగులుచుండెను.

సువర్ణశ్రీ ముక్తావళీ దేవిని దింపి "మీరు ముందు వీలయినంత వేగమునపొండు. హిమబిందూ! నీవు మామ్మగారి చేయిపట్టుకొని త్వరితముగ బోయి, సొరంగపు మొగమునకు కొంచెము దూరమున ఆగుము. అక్కడ ఇద్దరు కాపుండెదరు. నేను వచ్చిన వెనుక వారి పని పట్టెదను" అని అరచి, పడిన యతనితో "ఆ బాణములు నిన్ను చంపును. నీవు కేకలు వేయుచు నీ కట్లు విప్పించుకొని బ్రతుకుము. గోడ ప్రక్క దొర్లిపొమ్ము" అని కేక వేసి, పరుగిడెను.

ముక్తావళీ దేవికి యవనరక్త ముప్పొంగినది. ఈలోన ఆమెకు రక్తనాళముల బాగుగా రక్తము స్రవించినది కాబోలు, మనుమరాలు తన చేయిపట్టుకొని దారిచూప, ఆ రక్షక స్త్రీ వేషముతో ముందునకు సాగిపోయెను. కావలికాయువాని కవచమే తన్ను రక్షింప, నమితవేగమున సువర్ణశ్రీ హిమబిందును, ముక్తావళీ దేవిని కలుసుకొనెను. వెనుకవారు అతి వేగముగ కాగడాలు పట్టుకొని పరుగిడి వచ్చుచుండిరి. వారికిని, పారిపోవు వారికిని ఇరువది ధనువులకన్న ఎక్కువదూరములేదు. ఈ కేకలు, గడబిడయు, సొరంగద్వారమున నున్నవారికి వినిపించి నవికాబోలు వారు మాళవభాషలో "ఏమి టీ గడబిడ!" రా యని కేక వేసి చేత నున్న ధనస్సుల నెక్కుపెట్టిరి.

సొరంగమార్గము ఎచ్చుతగ్గులుగా పక్కల, పైన పెద్దరాళ్ళతో నిండియున్నది. వెనుకవచ్చు కాగాడాలు ముందుపోవు ముక్తావళీ హిమబిందు సువర్ణశ్రీలకు ఒకరకపు గుడ్డిదారిని చూపుచున్నవి. ఎదుట ఇద్దరు బాణము ఎక్కుపెట్టి "ఆగుడు" అని కేక వేసిరి.

సువర్ణశ్రీ హిమబిందు చెవిలో నేమియో యూదెను. హిమబిందు నిర్భయముగ ముందుకు పరుగిడుచు, "ఎవరోవిరోధులు కొండలమీద నుండి దిగి వచ్చిరి. కొందరము సొరంగములోనికి వచ్చినాము. కొందరు మనవారు గుహలలోనుండి యుద్ధము చేయుచున్నారు" అని మాళవభాషలో అరచినది.

తమస్నేహితుడు శక్తిమఖుడును, ఇరువురు రక్షక స్త్రీలు నిట్లు వచ్చుటయు "ఆపుడు, కొట్టుడు, పట్టుకొనుడు" అని వారి వెనుకనుండి కేకలు విన వచ్చుటయు, ఆ ఇరువురివీరుల మనస్సులను కలతపెట్టుటచే వారు ఇదమిత్థమని తేల్చికొనలేక, బాణము లెక్కుపెట్టియే వీరిదెస చూచు చుండ వెనుక మలుపులో దీపములువచ్చు వెలుతు రాడుచుండెను.

ఇంతలో శక్తిమఖుడని వారనుకొన్న వీరుడు విల్లునుండి విడువబడిన బాణమువలె రివ్వునవచ్చి ఒక రక్షకభటుని కౌగలించుకొని "కొంపలు మునిగినవి," అని కేకలువేయుచు, ఆతని పట్టుకొని, బరబర నీటికడకు లాగుకొనిపోయి, యాతనితో నీటిలో పడెను.

రెండవయాతడు ఏమిది యని వారి వెనుకనే పరుగిడి చూచుచుండ హిమబిందింతలో వచ్చి యా మనుష్యుని నీటిలోనికి త్రోసినది. ఆతడు నీటిలో మునిగిపోయి, పైకి తేలునప్పటికి సువర్ణశ్రీ యాతనిపై కురికి గొంతు పట్టుకొనెను.

సువర్ణశ్రీ నీటిలోనికి త్రోసినవాడు గట్టెక్కవలెనని ప్రయత్నించుచుండ హిమబిందు

ఖడ్గపు మొనతో నతనిచేయి గ్రుచ్చినది. అతడుచేయి వదలి నీటిలోనికి జారిపోయెను. రెండవవాడు ప్రాణభయమున గుహాద్వారమునుండి నదిలోనికి గబగబ ఈదుకొనిపోయెను.

ఆత డిట్లీదుకొనిపోవుటచే సువర్ణశ్రీ ముక్తావళీ హిమబిందుల ప్రాణ రక్షణయైనది.

## ౧౪

## "నేలయీనినట్లు నిండెదండు"

అట్లా రక్షకభటుడు ప్రాణరక్షణకై నదిలోనికి ఈదుకుపోవుటయు, అక్కడనే ఒక తెప్పయు, ఆ తెప్పనిండ గోండు లుండిరి.

ఆ తెప్పపైన గోండువీరులు ఈ మనుష్యుడు ఈదుకొనుచు ఎప్పుడు కనబడెనో వెంటనే తెప్పను తెడ్లతో నటకు త్రోసి, యా మనుష్యుని రెక్కపట్టి తెప్పపైకి లాగివేసిరి.

వెంటనే మాటలాడక ఆ మహాశిలలవెనుక దాగియున్న సొరంగపు ముఖ ద్వారమునకు తెప్పను త్రోయించినాడు మహాబలగోండుడు. అట్లు త్రోయించుచు ఆ పర్వతములలో, లోయలలో మారుమ్రోగునట్లు నెమలికేక పెట్టెను. ఆ ప్రతిధ్వనులకు ప్రతిధ్వనులా యనునట్లు నలువైపుల నుండి ఎన్నియో నెమలికేకలు వినవచ్చినవి.

ఆ మరుక్షణమున నది కీవ లావల గట్లపై, శిలలపై, కొండచరియ లపై వేలకువేలు గోండులు, రాక్షసులు మూగిపోయినారు. పది పన్నెండు తెప్పలు నది కెగువ దిగువలనుండి వేగముగ తెడ్లచే, వెదురుగడలచే నడుపబడుచు వీరి తెప్పవైపు పరుగిడివచ్చుట కారంభించినవి.

ఈలోననే మహాబలగోండుని తెప్ప గుహాముఖమునకు బోయెను. అచ్చట నీళ్ళలో ముక్తావళీ దేవిని పట్టుకొని ఈదయత్నించుచు మునుగుచు దేలుచున్న సువర్ణశ్రీని, హిమబిందును, వీరిని ముంచ ప్రయత్నించు నా రెండవ రక్షక భటుని సొరంగముఖమున గట్టుపై కాగడాలతో నీటిలోని మనుష్యులను, స్త్రీలను పట్టుకొనప్రయత్నించువీరులను, నీటిలోనికి ఉరుకు వీరులను మహాబలగోండుడు చూచెను. తెప్పను గుహలోని వారును చూచిరి.

తెప్పమీదవారిని నాశనము చేయుటకు ధనుస్సు లెక్కుపెట్టియున్న గుహలోని వీరులు కొందరు బాణములను వదలిరి. నలుగురు గోండులు ఆ బాణములు మొఖమున, ఎదురు రొమ్మున, భుజమున తగిలి క్రిందకు కూలిపోయిరి. ఒకడు నీటిలోనికి శవమై దొర్లిపోయెను.

ఇంతలో వేరొక తెప్ప గుహాముఖమునకు వచ్చెను. దాని వెనుక మరొక తెప్ప వచ్చినది. ఇవి చూచుటతోడనే కాగడాలు పట్టుకొనిన కొందరు క్రిందపడవేసిరి, కొందరు సొరంగములోనికి పారిపోయిరి.

మొదటనే మహాబలగోండునితెప్ప వచ్చుటఏమి, ఇరువురు ముగ్గురు వంగి నీటిలో మునుగుచు తేలుచు ప్రాణసంకటావస్థలోనున్న సువర్ణశ్రీని, హిమబిందును, ముక్తావళిని, రక్షకభటుని వారు తెప్పలపైకి లాగివేసిరి.

సువర్ణశ్రీ బారినుండి పారిపోవలెనని ప్రయత్నించిన రక్షకభటుడు నదిలోనికి ఈదుకొనిపోయెనుకదా! అప్పుడే నీటికడకు సొరంగమునుండి విరోధులు వచ్చిరి. వారు తారసిల్లుట గమనించి హిమబిందు చీర వెనుకకు విరిచికట్టి నీటిలోనికి ఉరికినది. నీటిలో

ఈదుచు అమ్మమ్మను నీటిలోనికి రమ్మని కేక వేసినది.

అటు విరోధు లేమి చేసెదరో యను భయము? నిటు ఈదుట ఎరుంగని కారణమున నీటి భయము? ఏడ్చుచు గజ గజ వణకుచు ఆ గట్టు మీద ముక్తావళి కూరుచుండుట ఏమి, గుహలోనికి తెప్పయు, ఆమెకడకు విరోధులు ఒక్కసారి వచ్చిరి. ఆ భయముననే యామె నీటిలో దొర్లిపడి పోయెను. విరోధుని ఒక్కతోపుత్రోసి, సువర్ణుడు ముక్తావళీదేవికడకు ఒక్కబార ఈతలో ఉరికి ఆమెను పట్టుకొనెను.

ఆమె సువర్ణుని గొంతు గట్టిగ కౌగిలించుకొనినది. సువర్ణుడెంత గజయీతగాడయిననేమి, ముక్తావళీ దేవి గొంతు గట్టిగ పట్టుకొనినతోడనే మునిగిపోయి, ఒక్కఊపున పైకిలేచి, మరల మునిగి, మరల లేచునప్పటికి ఇరువురను తెప్పపైకి ఎవరో లాగివేసిరి. అదివరకే ఎవరో హిమబిందును తెప్పమీదికి లాగిరి. సువర్ణశ్రీయు, ముక్తావళియు సొమ్మసిల్లి పడిపోయిరి. వారిరువురును రెండు మూడు గ్రుక్కల నీరు మ్రింగియుండిరి.

హిమబిందేమియు చెక్కుచెదరక, మహాబలగోండు డిచ్చిన వస్త్రముచే దీర్ఘమగు తన తల కట్టును తుడుచుకొనకయే సువర్ణుని, ముత్తవను తుడుచుచుండెను. తెప్పలన్నియు నదిలోనికి పోయినవి. సొరంగమునుండి వచ్చిన బాణములేమియు తగులకుండగనే వారా గుహముఖమునుండి ఈవలకు రాగలిగినారు.

సువర్ణశ్రీ ఇంతలో తెప్పరిల్లి లేచి, ముక్తావళీ దేవిని హిమబిందుతోపాటు ఉపచారములు చేయుచుండ తెప్పలన్నియు నావలిగట్టు చేరినవి. అచ్చట కొందరు గోండులతో మహాబలు డేమియో వారి భాషలలోపలుక, నొక ముదుసలి గోండుయోధుడు ముందునకు వచ్చి తన మొలనున్న సంచి కట్టు విప్పి, ఏదియో యెండిన యాకింత తీసి మహాబలున కిచ్చెను. మహాబలుడు సువర్ణశ్రీకుమారునికి ఆ ఆకు నిచ్చుచు ఇది వారి ముప్వురను నమలు డని చెప్పెను.

ఆ ఆకును హిమబిందును, సువర్ణశ్రీయు నమలి మ్రింగిరి. ముక్తా వళీదేవి నెమ్మదిగ కన్నులు తెరచి, తలయూపి కన్నులు మూసికొనెను.

“అమ్మమ్మా, ఈ ఆకు ఇంత నమలి మ్రింగుము. అమృతమువలె మాకు పనిచేసినది. నోరుతెరచి కొంచెము నములుము” అని హిమబిందు ముత్తవనోరు తెరిపించి యామెచే చిటికెడు ఆకు నమలించెను. వెంటనే ముక్తావళీదేవి కన్ను తెరచినది. హిమబిందు మరల కొంతఆకు నమలించినది. ఆమె లేచి కూర్చుండెను.

సువర్ణశ్రీ సహాయమున హిమబిందును, ముక్తావళీదేవియు తెప్పల నుండి క్రిందికి దిగిరి.

అచ్చట గోండువీరు లనేకులు బారులు బారులుగ వేనకువేలు కూర్చుండియుండిరి. ఎవరో మంటలు చేసిరి మెత్తనితోళ్ళ నక్కడ పరచిరి. అందుపై ముక్తావళీ దేవిని పండుకొన బెట్టిరి.

మహాబలగోండుడు: సువర్ణశ్రీ! నీ వేమైతివోయని ఒక్కనిమేషము నేను భయపడినాను సుమా! ఏలనన, నిన్ను నేను వదలిన ప్రదేశము నుండి నీవు నీటికడకు ప్రాకి వెళ్ళినది గమనించితిని. అటుపైన మరల వెనుకకు నీ గుర్తులు కనుపించినవి. అటనుండి నీటి ఎగువవైపు నీవు పోయితివి. అచ్చట ఒకచోట నీవు నీటిలోనికి జారిపోవుట చూచితిని. అది ఏమరుపాటున జారిపోవుటకాదు. జారిపోవలెనని నీవు జారితివని గమనించుటకు నాకు

కొంతకాలము పట్టినది.

సువర్ణ: అవును. నేను చల్లగ చప్పుడుకాకుండ నీటిలోనికి దిగవలెనని ప్రయత్నించుచుండ, చటుక్కున జారి నీటిలో పడితిని. కాని దెబ్బమాత్రమేమియు తగులలేదు.

మహా: యీలోననే ఆ అడవియంతయు గోండులు, రాక్షస మిత్రులు వెదకి అక్కడక్కడ కావలికాయు పుళిందులను, శబరులను పట్టుకొన్నారు.

సువర్ణ: మీ వారందరు ఎప్పుడు వచ్చినారు?

మహా: నేను మా దేశాభిముఖుడనై వెళ్ళినసంగతి ఎరుగుదువు. రాక్షసుల నీ ప్రదేశమంతయు వెదుక నాజ్ఞనిడితిని. ఇంతలో మన ప్రయాణములో పంపినవార్త అంది, మా గోండులు వచ్చి నన్ను కలుసుకొనిరి.

సువర్ణ: యీ అటవీ సంచరణవిద్య చాల అద్భుతమైనది.

హిమబిందు సువర్ణశ్రీ దెస కృతజ్ఞతయు, ప్రేమయు నుట్టిపడ గాంచుచు, స్మితవదనయై, "మేమున్నస్థల మెట్లు కనిపెట్టినారు? ఇతరు లందు చొరనేరరని వారందరు గర్వపుమాటలు పలికిరే!"

సువర్ణ: అయస్కాంత మెక్కడున్నదో, లోహశకలమునకు తెలియదా! ముక్తావళీ దేవి లేచి కూరుచుండి సువర్ణశ్రీని చూచి, "మన మిక్కడనే యున్నచో, విరోధులు వచ్చి మనల నాశనముముచేయరా?" యని యడిగెను.

మహా: అమ్మా! మే ముండ మీ కేమియు భయములేదు.

ముక్తా: ఇక్కడనుండి ఎచ్చటకు బోవుట? ధాన్యకటకమునకా?

సువర్ణ: మహాబలుడు ఏమి చెప్పిన అట్లు చేయుదము.

ముక్తా:' యీ మహాబలు డెవరు?

సువర్ణ: ఈతడు గోండుదేశ యువరాజు. గోండుమహారాజు మన చక్రవర్తికి ప్రాణ స్నేహితులు. యీతడు నాకు పరమమిత్రము, మామ్మగారూ!

ముక్తా: నాయనా? నాహృదయమున జనించిన భయమింకను దీరలేదు. ఇచ్చటనుండి తరలించి మమ్ము వెంటనే సురక్షిత ప్రదేశమున కెచటికైన చేర్పింపుము.

## ౧౫

## పాటలీపుత్రము

పాటలీపుత్రము గంగాతీరమున మాగధరాజధానియై భారతవర్ష చక్రవర్తులకు పెక్కు శతాబ్దములు రాజధానియై ప్రసిద్ధినందినది. యీ మహా నగరమునందు నంద సార్వభౌములు అఖండవైభవముగ రాజ్యము నేలిరి. వారివెనుక తద్వంశజుడైన చంద్రగుప్త మౌర్యుడఖండజంబూద్వీపమునకు చక్రవర్తి ఆయెను. ఆతని మనుమడు అశోక ప్రియదర్శి

మహాసామ్రాట్టయి బౌద్ధమతావలంబియై భరతవర్షమంతయు రాజ్యముచేయుచు బౌద్ధమతమును వెన్నెలవలె, అమృతమువలె సకలలోకమునందు వరదలు కట్టించెను.

ఒకనాడు జంబూద్వీపమునకు అయోధ్య ముఖ్యనగరము; మరొకనాడు ప్రాగ్జోతిష నగరము, వేరొకప్పుడు కుండిన నగరము, కురువంశ కాలమునకు హస్తినాపురము, హస్తినాపురమునుండి కౌశాంబియు నటనుండి పాటలీపుత్రము రాజధానులుగా మారినవి.

ఏది ముఖ్యనగరమో, అచ్చట సింహాసనాసీను డగువాడు సకల భరత వర్షమునకు చక్రవర్తి యగును. మౌర్యులలో చివరివాని వధించి పుష్యమిత్ర శుంగుడు చక్రవర్తి యయ్యెను. అంత్యశుంగుని పేరునకు రాజును చేసి, కాణ్వాయనబ్రాహ్మమంత్రులు నిజ మగు చక్రవర్తులైరి.

తుది కాణ్వాయనవంశజుడు సుశర్మ తానే చక్రవర్తియని లోకమునకు వెల్లడించెను. అయినను మగధదేశమునందింకను శుంగుల సేనా నాయకులు శుంగమహారాజు కే జోహారు లొనరించుచు, సుశర్మకాణ్వాయనుని లెక్కచేయుటలేదు.

సుశర్మకును దేశములోపలుకుబడి ఎక్కువగనే యుండెను. ఆతని సైన్యములు మగధదేశమంతయు నిండియుండెను. ఈ ఇరువాగుల సైన్యములకు, వారి వారి మాండలీకులకు సర్వదాపోరులు సాగుచునేయుండెను.

దేశ మరాజకమై, హిమాలయప్రాంతమందలి గంధర్వయక్ష జాతులకు, కామరూపప్రాంత నాగులకు, అరణ్యా జాతులగు పుళిందాదులకు కొల్లగొను ప్రదేశమై పోయినది. బలవంతుడగు చక్రవర్తి పరిపాలన లేకపోవుటచే వర్తకమును నీరసించినది. ఒక దేశమునుండి వేరొకదేశమునకు బేహారులు వస్తువులు కొనివెళ్ళుట మానిరి.

వింధ్యకు దక్షిణము మాత్రమే ఆంధ్రుల చల్లని పరిపాలనమువలన సర్వసంపదల తులతూగుచుండెను. దేశ మొకచో నీరసించియుండిన సర్వభరతవర్షము నీరసించి పోవుననియు, ప్రక్కదేశము లరాజకములైన, బలవంతమగు దేశములుకూడ అనేక కష్టముల పాలగుననియు, శాతవాహనులు సకల భూమండలమునకు చక్రవర్తులగుట మానవ కళ్యాణమునకే యనియు, ఒక దేశ భాగ్య మాదేశపువర్తకముపై నాధారపడి యుండుననియు, ఆంధ్ర వైశ్యుల వర్తకము ఉత్తరప్రదేశముల వృద్ధిపొందుటకే వీలులేకుండ పోయినదనియు, సర్వధర్మరక్షణకై ఆంధ్రులు యావద్భారత చక్రవర్తులు కాకతప్పదనియు, చారుగుప్తుడు వాదించి శ్రీముఖునకు పాటలీపుత్ర సింహాసనముపై కోర్కె పుట్టించెను.

ఆతనికి సర్వభూవలయమునకు చక్రవర్తి కావలయునను ఆశకంటె, సర్వభూవలయమునకు శాంతి చేకూర్చవలయునను వాంఛ ఎక్కువైనది.

సకలదక్షిణాపథము శాంతముగ నున్నది. పాండ్యులు, చోళులు, కేరళులు, కుంతలులు తమలో దా మేమియు కలహములు లేక శాంతులై యున్నారు. ఒకరిదేశము నొకరు వాంఛింపనేల? చిన్నదేశమునకు రాజయిన నేమి, మహాదేశమునకు రాజయిన నేమి? యశముకొరకై పురుషుడు రాజ్యములు కాంక్షింపవలయునా? రాజులు రాజ్యతృష్ణచే లోకకంటకులగు చున్నారు.

ఇదియంతయు కలిమహాత్మ్యమేనా? ధర్మజచక్రవర్తి సభలో భూమిలోని నిక్షేపమునకై తగవులాడినవారి గాథనిజమా? మొదటిదినమున "నీది, నీది, యని తగవులాడిరట; కలిప్రవేశించిన మరునాడు "నాది, నాది" యని తగవులాడిరట.

రాజుల ధర్మము లోకమున శాంతి నెలకొల్పుట. కాణ్వాయనులు ధర్మచ్యుతులైరి. బుద్ధ భగవానుడు సంచరించిన పవిత్రభూమి యగు ఆర్యావర్తమంతయు వీరివలన అధర్మములతో నిండిపోయినది.

భగవంతుని కనుగొను కర్తవ్యము మనుజునిది. తన నడవడిచే మహర్షులు, అర్హతలు, జ్ఞానులు, రాజులు లోకమునకు దారిచూపించవలయును. అధర్మము విజృంభించిననాడు భగవంతుడంతర్హి తుడగును. అధర్మము నణచుట రాజుల ధర్మము. తానుగాని తనపూర్వులుగాని రాజ్యకాంక్షచే ధాన్యకటక శ్రీకాకుళములనుండి పడమటి తీరమునకు విజృంభించినారా? మహామధ్యరథికులు, అభీరులు విజృంభించి దక్షిణా పథమును, కుంతలమును పాడుచేయ ప్రారంభించినప్పుడుకదా తా మారాజ్యముల నరాజకము నుండి యుద్ధరించినది.

ఈ విధమగు ఆలోచనలతో శ్రీముఖసాతవాహనుడు తన మదగజము పై ప్రయాణము చేయుచుండెను.

ఆంధ్రసైన్యములు మహావేగముతో సాగిపోవుచున్నవి. ముందు నడచు సైన్యములకు పాటలనగరము పదునైదు గోరుతములు మాత్రమున్నది. చారులు పట్టుకొని వచ్చిన వార్తవలన శ్రీ సుశర్మకాణ్వాయనుడు నగర కుడ్యములు, నగరచుట్టునున్న పదునెనిమిది కోటలు బాగుచేయించి తనకున్న అరువదివేల సైన్యమును, కౌశాంబీనగరమునుండివచ్చిన ముప్పది వేల సైన్యమును నగర రక్షణకై నచ్చటచ్చట నుంచినాడనియు, ప్రథమమున ఆంధ్రులు తనపై ఎత్తివచ్చుట నాతడు నమ్మలేదనియు, గయకడకు ఆంధ్రసైన్యములు వచ్చి విడియుటతోడనే భయపడి నగరరక్షణ సన్నాహములు ప్రారంభించినాడనియు తెలిసినది.

ఆంధ్ర సైన్యములో అరువదివేల కాల్బలము, వేయి ఏనుగులు, వేయి రథములు, రెండువేల ఆశ్వికదళము గయకడకు విడిపోయి, మాళవాభిముఖమైపోయినవి. ఆ సైన్యములకు సోమదత్తాచార్యులు సేనాధిపతియై, ఒక మద గజముపై నధివసించి ముందుకు సాగిపోవుచుండెను.

మహారాజు సైన్యసమేతముగా బుద్ధమహాచైత్యమునకు, మహాబోధి వృక్షమునకు పూజలొనరించి ముందునకు సాగెను. ధర్మనంది విన్యసించిన ధర్మచక్రము నొకదానిని సార్వభౌముడు చైత్యమున కర్పించెను. చారుగుప్తుడును వేయి నారికేళములు, భూరిదానములు, లక్షదీపములు, నవలక్ష సువర్ణము లా మహాచైత్యమునకు, సంఘారామమునకు నర్పించెను.

ఆంధ్రచక్రవర్తి గయాక్షేత్రమందు మహబోధి చైత్యమందు పది దినములు ఆగినాడు. ఆ దినములలో మూడవదినమున హిమబిందును చోరులు తస్కరించి ముక్తావళీ దేవితో ఎత్తుకొని పారిపోయినారని వార్త వచ్చినది. ఆ వార్త వినినవెంటనే చారుగుప్తుడు "హా" యని నేల కొరగి మూర్ఛపోయెను.

౧౬
# నిర్వేదము

చారుగుప్తుని ఉపశమింపజేయుటకు ముఖ్యమంత్రి అచీర్ణుడు, సర్వ సైన్యాధ్యక్షుడు స్వైత్రుడు, చక్రవర్తియు, మూర్తిమంతులవారును గుడారమునకు వచ్చిరి. చారుగుప్తుని శిబిరము చక్రవర్తి శిబిరమునకు కొలది దూరముననేయున్నది. ఆ వర్తకుని శిబిరమున నాలుగు గుడారములున్నవి.

వీరందరికన్న ముందరనే ప్రక్కగుడారముననున్న శ్వేతకేతుల వారు పరుగిడివచ్చి వైద్య మొనరించి చారుగుప్తునకు చైతన్యము గలిగించిరి.

చక్రవర్తి: మాకు నిన్ననే యీ వార్త వచ్చినది. మేము నెమ్మదిగ చారుగుప్తులవారికి యీ వార్త విన్పింపదలచితిమి. ఇంతలో ఎవరీ వార్తను తీసుకువచ్చినది?

చారుగుప్తుడు: (నీరసస్వరమున) ప్రభూ! ఇంద్రగోపుడు గూఢచారులతో మాటలాడుటవలన నీ విషయమును తెలిసి అత్యంత భయము నంది, నా కడకు పరుగిడివచ్చి చెప్పినాడు.

మహామంత్రి: చారుగుప్తులవారూ! మరేమియు భయపడవలసిన అవసరము లేదు. పదివేల సైన్యము ఆ దొంగలను వెంబడించినారట. ఆ దొంగలు మంజుశ్రీని ఎత్తుకొనిపోయిన స్థాలతిష్యులవారి శిష్యగణములై యుందురు.

సేనాధ్యక్షుడు: స్థాలతిష్యులవారివలన నీ పని జరిగియున్నచో ప్రాణమానములకు ఏమియ భయముండదు.

మూర్తిమంతులు: దేశములన్నియు తిరిగినవారు, సముద్రములను మోకాలి బంటిగ నొనర్చుకొనినవారు మీరు ఇంత బేలలైతి రేమి?

చక్ర: చారుగుప్తులవారూ! మన మీ పాటలీపుత్రముపై దండెత్తుట మాని, సకల భారతదేశము గాలించి మీ తనయను పట్టుకొందుము. మా కనుమతి నిండు.

శ్వేతకేతులవారు: నా కేలనో హిమబిందునకు ఏ ఆపదయు రాదనియు, కొలది దినములలోనే ఆమెను మనవా రెవ్వరో రక్షింతురనియు అటు వెనుక మనలను ఇచ్చటనే ఆమె త్వరలో కలుసుకొనుననియు తట్టుచున్నది. నా కిట్టి ఆలోచనలెప్పుడు వచ్చినను అవి నిజమగుచుండును.

మూర్తి: నా తమ్ముడు గొప్ప జ్యోతిష్కుడు. ఆతడు చెప్పినచో తప్పదు. చారు: మహాప్రభూ! వార్త తటాలున వినుటచే నామనస్సు కలత నందినదిగాని మరేమియులేదు. శ్వేతకేతులవారు చెప్పినది తప్పక జరుగునని నాకు తెలియును. ధర్మప్రేరితులమై, చక్రవర్తిని సకలభూమండల చక్రవర్తిగా పాటలీపుత్రసింహాసనమెక్కు డని మనము కోరియుంటిమి. అది జరిగితీరవలయును. నా బాలిక నాకు ఎంత ముఖ్యమో ఇదియును అంతముఖ్యము. మనకు పాటలీపుత్రమే గమ్యము.

మహామంత్రి: చారుగుప్తులవారూ! ఈ సాయంకాలములోపుననే మహాభాగు డగు శుకబాణునకు “హిమబిందు రక్షణకై మీరు పూనవలసిన” దని సందేశమంపుదము.

చక్ర: ఈ ఆలోచన ఎంతయు సమంజసము. స్థాలతిష్యుల దుర్నీతి మితిమీరిపోవు చున్నది. ఆ ముదుసలి బ్రాహ్మణు డేమి సంకల్పించెనో?

మహామంత్రి: ప్రభూ! మీ పాలనమున మనదేశమంతయు బౌద్ధ ధర్మపూర్ణమై ప్రజల నీతిదూరుల చేయుచున్నదట. మంజుశ్రీ కుమారులను గద్దె యెక్కించుట కాతడు పూనెను.

చారు: అట్టి ఆలోచన లాయనకున్నవని నాకును తెలియును. కాని ముక్కు పచ్చలారని నాబిడ్డ నెత్తుకొనిపోవుట యేటికో!

మహామంత్రి: మీ రాంధ్రదేశమున నొక మహాసంస్థ. శ్రీసార్వభౌముల శక్తివెనుక మీ అపార అర్థబల మున్నదట. హిమబిందును ఎత్తుకొనిపోవుట మిమ్ము నీరసింప జేయుటకై యుండును.

చారు: ఆమెను వా రేమియు చేయరుకదా! మహామంత్రులవారూ?

చక్ర: వర్తక చక్రవర్తీ! మీతనయ కేమియు భయములేదు. మే మీ దినముననే ధాన్యకటకమునకుగూడ వేగు పంపెదము. అచ్చటనున్న సర్వసైన్యమును ఆమె యుండిన తావు కనుగొని రక్షింపవలయునని.

చారు: కృతజ్ఞుడను మహాప్రభూ!

చక్ర: ఇందు కృతజ్ఞులు కాదగిన దే మున్నది? ఆంధ్రచక్రవర్తియే మీయెడ కృతజ్ఞుడు.

చారు: అటు లనకుడు ప్రభూ! దాసునిసర్వస్వము ప్రభువుదే కదా!

అందరు చారుగుప్తునికడ సెలవు నంది వెడలిపోయిరి. చారుగుప్తుడు చక్రవర్తి వెడలిపోవునప్పుడు లేచి నమస్కరించి, గూడారము గుమ్మమువరకు సాగనంపి వచ్చి మంచముపై వాలిపోయెను. శ్వేతకేతులవారు చారుగుప్తుని జాగ్రతగా పరిశీలించి చూచుచుండిరి.

ఎందుకు తన బాలికను చోరులెత్తుకొనిపోయినారు? తనతో తీసి కొనివచ్చి యుండిన ఎంతయు బాగుండియుండును. తా నా బాలికను ఇంటి కడ వదలివచ్చి ఎంత తెలివి లేని కార్యము చేసినాడు! తనముద్దుబిడ్డ ఎంత భయమందిపోవునో? ముక్తావళీదేవికూడ నుండుటవలన కొంతధైర్యముగా నుండును. ఆమెను యువరాజున కీయ దలచుకొనుటను శత్రువులు గ్రహించినారా? నిజముగ నిది స్థాలతిష్యుని పనియేనా? లేక ధనమున కాశించి ఏ తుచ్ఛులయిన నిట్టిపనిచేసినారా?

ఈ ఆలోచనలు తన్ను కలచివేయ, “ఇంద్రగోపా!” యని పిలిచెను. ఇంద్రగోపుడు పరువిడివచ్చెను.

“ఓయీ! నీవు నాస్వంత సైన్యమునకు అధిపతి యగు విజ్ఞాన కంఠీరవునకు నా ఆజ్ఞగ తన సైన్యములోని మాయాశీలురు, దక్షులగు యాదార్థ్యవర్ణుల, అపకృష్ణుల, గూఢపురుషుల వెంటనే పంపి ఎవరు హిమబిందు నెత్తుకొనిపోయిరో కనుగొని ఆ ముష్కరుల నాశన మొనరింపు మనుము. మన ఇంటికడనున్న యాదార్థ్యవవర్ణు లేల ప్రమత్తులై ఇట్టి మహాహాని నాకు సంభవింపజేసిరో కనుగొమ్మనుము. అట్టి ప్రమత్తులను నేను వచ్చువరకు కారాగారమున నుంచునటుల ఆజ్ఞల నంపుము. ఇదిగో నా వేలిముద్ర. పో!” అని

ఆనతిచ్చెను.

ఇంద్రగోపుడు వేగముగ వెడలిపోయెను. చారుగుప్తు డంత తన మామగారి తండ్రికి, వణిక్కుల శక్తులన్నియు నుపయోగించి హిమబిందెక్కడ నున్నదియు కనిపెట్టి ఆమెను రక్షింప వీళ్ళన్నియు చూడవలెనని గజసందేశహరులను బంపెను.

వేగవంతులు, ప్రజ్ఞావంతులు నగు గజసందేశహరులు మాళవ, మగధ, సౌరాష్ట్ర, కుంతల, విదేహ, విదర్భాది దేశములనున్న వణిక్స్థానము లన్నిటికి జని చారుగుప్త వణిక్సార్వభౌముని సందేశము నాజ్ఞగా విని పించిరి.

## ౧౭
## స్కంధావారము

మహాప్రవాహ మతివేగముగ వచ్చి కొండపై బడినట్లు, ఫెళఫెళార్భటుల దావానలము భయంకరకాంతారమును పొదివినట్లు, వర్షసమ్మిశ్రిత ప్రచండ ఝంఝానిలము వటవృక్షమును తాకినట్లు ఆంధ్ర సైన్యములు వచ్చి పాటలీపుత్ర మహాపురమును ముట్టడించినవి.

పాటలీపుత్రమున కొకవైపు గంగానది ప్రవహింపుచున్నది. తక్కిన మూడువైపుల గంగాజలములు నిండిన కందకము, ఆకాశము నంటు కుడ్యములున్నవి. కోటచుట్టు అయిదు వందల డెబ్బది బురుజులున్నవి. నదిచుట్టినవైపు మూడుగోరుతములు పొడుగుగాక, భూభాగముపై ప్రసరించిన నగరమహాకుడ్యము తొమ్మిది గోరుతముల పొడుగున నున్నది. నగరపుకోటకడకు వెళ్ళుటకుముందు, కోటచుట్టు ఎనిమిది చిన్నకోట లున్నవి. గంగానది యావలియొడ్డున నొకటియు, పట్టణమువైపు కుడ్యముల చుట్టును ఏడుకోటలు, నగరకుడ్యమునకు అర్ధగోరుతము దూరము చొప్పున నున్నవి. గంగానదివైపు ఇరువది గోపురములు, తక్కిన భూభాగమువైపు నలుబదినాలుగు గోపురమహాద్వారము లున్నవి. అశోకచక్రవర్తి నగరకుడ్యముచుట్టు కట్టిన ఏడుకోటలకు మహాకుడ్య మొకటి కలిపి, దానిచుట్టు శోణానదినుండి ఒక పాయను కొనివచ్చి పాటలీపుత్రమునకు దిగువను గంగానదిలో కలిపినాడు.

సుశర్మచక్రవర్తి ఈ కోటలన్నియు బాగుచేయించినాడు. కుడ్యములన్నియు బాగుచేయించినాడు. పట్టణమున నున్న కోటబురుజులు, గోడలు, పట్టణ మధ్యమున గంగానదీతీర ముననున్న సార్వభౌమదుర్గము, దుర్గముచుట్టునున్న కందకము అన్నియు బాగుచేయించినాడు. నగరమునందు ధాన్యాది ఆహారపదార్థములు సేకరించినాడు. ఎన్నియో యాయుధ విశేషములు, కోట గోడలనుండి శత్రువులపై కళపెళ కాచిపోయుటకు అవిసె మొదలగు నూనెలు, ఆయుధ యంత్రములు సేకరించినాడు.

ఆంధ్రులు పాటలీపుత్రము పై ఎత్తివచ్చెదరని యాతడు కలనైన ననుకొనలేదు. తనకున్న లక్షయేబదివేల సైన్యములో లక్షసైన్యము మాళవమునకు బంపినాడు. నేడా సైన్యము వచ్చుటకు వీలులేదు. లిచ్ఛవులు బౌద్ధులు. తన చుట్టునున్న దేశములవారందరు బౌద్ధులు. కాని కామరూపమునకు, వంగదేశమునకు, వారణాసికి, నేపాళమునకు అతివేగమున వార్త లంపుటచే వంగమునుండి ఇరువదివేల సైన్యము, నేపాళమునుండి ఎనిమిదివేల యక్షసైన్యము, కామరూపమునుండి నాలుగువేల సైన్యమును వచ్చినవి.

మగధదేశమునందు మాండలకులు ముప్పదివేల సైన్యము నంపిరి. ఈ లక్ష పదివేల

సైన్యము పాటలీపుత్రమును సంరక్షించుచుండ, ఉజ్జయిని పడిపోవుటతోడనే మాళవ మహారాజు తన లక్షసైన్యముతోడను, శివస్వాతి అరువదివేల సైన్యముతోడను, మాగధసైన్యము లక్షయు, పుళిందాదుల ఆటవిక సైన్యములు, ఔఘలుని సైన్యము అన్నియు వచ్చినచో ఆంధ్ర సైన్యములు తుత్తునియలైపోవును. ఆంధ్రదేశమునెత్తిపోయి, ఆంధ్రుల నోడించుటకంటె ఇదియ ఉత్తమమైనది అని సుశర్మ యూహించినాడు. పాటలీపుత్రమున విజయహోమములు, దేవతారాధనలు జరిగినవి. అంతకు ముందుగనే బౌద్ధులందరు పారిపోయిరి. సంఘారామములు పాడు పడిపోయినవి. మహా చైత్యముల నిదివరకే పాడు పెట్టి నాశనము చేసిరి.

గంగానది వేసవివరదలతో నిండియున్నది. ఉత్తరమున గండకీ నది పూర్తిగా ప్రవహించుచువచ్చి, గంగానదిలో కలియుచున్నది. శోణానదిలో గోగ్రలో జలములు చాల తక్కువయున్నవి. వైశాఖమాసాంతపు టెండలకు, వేడిగాడ్పులకు ముట్టడించిన ఆంధ్ర సైన్యములు మాడిపోవుచున్నవి. పాటలీపుత్రనగరము చుట్టును ఎన్నియో తోటలుండుట సైన్యమునకు మంచిదైనది.

సైన్యములు వచ్చి ముట్టడించిన మూడవదినమునుండి చారుగుప్తుడు ప్రత్యాసారులను చుట్టునుండు గ్రామగ్రామములకు పంపి, కోట్లకొలది తాళపత్రముల తెప్పించి ఏబదివేల శిబిరములు నిర్మించెను. మృణ్మయ కలశములు శిబిరములందుంచ బడినవి.

పానశాలలు, వీరపాణశాలలు, అంగడులు విరివిగ నేర్పరుపబడినవి. వైద్యశాలలు ఏర్పాటు గావింపబడినవి. వేరొక మహాపట్టణమే ఎత్తివచ్చినట్లు ఆంధ్ర సైన్యము లమరింపబడినవి.

చారుగుప్తుడు పదివేల గోవులను, ముప్పదివేల మహిషములనుకొని వచ్చెను. అవియుగాక అతడు ధనము వెదజల్లుటచే చుట్టుప్రక్కల గ్రామాదులనుండి గోపకులు పాడిపశువుల గొనివచ్చిరి. వర్తకులు వచ్చి అంగడులు పెట్టిరి. నర్తనశాలలు ఏర్పరుప బడెను. గాయకులు, కవులు వచ్చిరి. ఇదియంతయు నిట్లుండ, యుద్ధము విషయములో కోటలు, కుడ్యములు ఛేదించుటకు ఎత్తయిన దిబ్బలు చిన్నబురుజులు ప్రతిగా నిర్మింప బడినవి. వానిపై మహాధన్వులగు ఆంధ్రులు ప్రవేశించిరి. సర్వతో భద్రాదియంత్రములు నెలకొల్పినారు.

ఒక్కొక ఏనుగుపై పదిమంది విలుకాండ్రుందురు. అన్ని ఏనుగులకు సంపూర్ణ కవచములున్నవి. ఖడ్గమృగపు చర్మముచే చేయబడి, నున్నగ మైనము పూయబడి ధనువు ఎత్తుననున్న కేడెములు ధరించి తలపై రక్షక భటుడు అడ్డముపట్ట, ధన్వి బాణములు వేయును.

ధనుర్యుద్ధమం దాంధ్రు లప్రతిమానులు. కోట గోడలపై సైనికుడు పొడసూపుటేమి బాణము సువ్వునవచ్చి, ఎట్టికవచమునై నను దూసుకొని పోయి, ఆ సైనికుని ప్రాణము గొనును. అట్టి బాణములు మహా వర్షపాతపు జినుకులకు బాఠము నేర్పునట్లు ఆంధ్రుల విండ్లు వీడివచ్చి పడుచుండును. కోటగోడలపై, బురుజులపై, గోపురములపై పాటలీపుత్ర పుర సైనికుడు తలచూప భయపడిపోవుచుండెను. ఈలోన అగ్ని గోళములు, శతఘ్నులు శిలాఘ్నులు శిలావర్షము కురియుచున్నవి. ఆంధ్ర సైన్యములపై గూడ ఆ భయంకరా యుధములు వర్షము కురియుచున్నవి. ముట్టడి ప్రారంభించిన ఎనిమిదిదినములవరకు ఆయుధ వర్షములతోడనే ఇరువాగుల సైన్యములు పోరాటము సలుపుచుండెను.

ఇంతలో పదవదినమున శుకబాణునికడనుండియు, ధాన్యకటకము నుండియు వార్తలు వచ్చినవి. ధాన్యకటకపురి సేనానాయకులు హిమబిందు జాడలు తెలియుటకు సర్వప్రయత్నములు చేయుచుండిరనియు, శ్రీధర్మనందిగారి కుమారుడు సువర్ణశ్రీ అడవులలో ఆమెను వెదుకబోయెననియు ధాన్యకటకమునుండి వార్తలు వచ్చెను.

హిమబిందు మాళవులచేతిలో బడెననియు, ఆమెచే నుత్తరము వ్రాయించి సమవర్తిని యుద్ధ పరాఙ్ముఖునిచేయ బ్రయత్నించిరనియు, ఉజ్జయినిలో ఆంధ్రసైన్యములు ధైర్యముతో బోరుచున్నవనియు, తానుగూడ కొందరు చారులనుబంపి హిమబిందును వెదకించెదననియు వార్తనంపినాడు శుకబాణుడు. శ్రీకృష్ణ సాతవాహనుడు అభీరుల నోడించి, భరుకచ్ఛము పట్టుకొనినాడట. స్థూలతిష్యుడు శిష్యగణముతో కాశికాపురయాత్రకై బయలుదేరినాడట. ఆంధ్ర సైన్యములు పోయి ఉజ్జయినిని ముట్టడించిన మాళవ సైన్యమును తాకినారట. ఈలోన గోండులు వేలకు వేలు వచ్చి వేరొక ప్రక్క తాకినారట. గోండు సైన్యమువలన మాళవ సైన్యములకు సంభవించిన నాశనము వర్ణనాతీతము.

ఈ వార్తలన్నియు సమాలోచించుటకు చక్రవర్తి భవనమునకు చారుగుప్తుడేగెను. చక్రవర్తి పాటలీపుత్ర మాండలికుని భవనమొకటి యాక్రమించి యందుచేరినారు. ఆలాగుననే పట్టణము బయటనున్న అనేక భవనములలో, పరిసరములనున్న గ్రామాదులలో సేనాపతులు, మంత్రులు, ధర్మనంది మొదలగువా రందరు చేరినారు.

చారుగుప్తుడు చక్రవర్తిచే ననుజ్ఞాతుడై వారి సభామందిరము జేరి, సామ్రాట్టుకు నమస్కరించి, యుచితాసన మధివసించెను. ఇంతలో స్వైత్రుల వారు, అచీర్ణులవారును వచ్చిరి.

చారు: ప్రభూ! మన సైన్యములు నెమ్మదిగ ముట్టడిసాగింపనెంచినచో ముందు ముందు చిక్కు లెక్కువయగును. అఖండవేగమున మన కున్న శక్తినంతయు నుపయోగించి, పాటలీపుత్రమును ఛేదింపవలయును.

మహామాత్యుడు అచీర్ణుడు: ప్రభూ! ఆంధ్ర సైన్యములు హిమపాతము రీతి మహాకల్లోలమువలె పాటలీపుత్రముపై విరుచుకుపడుటకే నేను సర్వసన్నద్ధములు చేయుడని సైన్యాధ్యక్షులతో మనవి చేసియున్నాను.

స్వైత్రుడు: ప్రభూ! ఇక్ష్వాకులు ఉత్తరపు నదీతీరముననను, పూంగీయులు వారికి బాసటగాను, పల్లవులు వారి నంటియు మొనతీర్చియున్నారు. తూర్పున మంజిష్టులు, యక్షులు, నాగులు మోహరించియున్నారు. వేంగీయులు, వజ్రభూములవారు దక్షిణ తీరమున నున్నారు. ప్రతీకారపు బురుజులు సిద్ధమైనవి. సొరంగములు త్రవ్వుచున్నారు.

చక్ర: ఎన్నియైనను ముట్టడి ఆటపాటలుగ సాగుచున్నది. ఎవ్వరికిని వేడి ఎక్కలేదు. ఎక్కడో ఏదియో లోటు కనబడుచున్నది. చారు: కోటగోడలు సమీపించుటకు వీలులేకున్నది. మనము కోటలోనికి ప్రవేశింపవలయునన్న నాకు బది దినములు గడు విచ్చినచో ఒక ఉపాయము చేయగలను. అది మనవి చేసెదను.

చక్ర: ఏ మా ఉపాయము?

చారు: ప్రభూ! గంగానదియే మనకు దారిచూపునని నా అభిప్రాయము.

స్వైత్రుడు: చారుగుప్తులవారూ! ఆ వైపున తొంగిచూచుటకైన వీలు లేకుండ చేయలేదా

విరోధులు?

చారు: కావుననే అటువైపు ఛేదించుటకు ఎక్కువ వీళ్ళున్నవి.

చక్ర: ఈ పదిరోజులును ఆటపాటలతో కాలముపుచ్చవలసినదేనా?

స్వైత్రుడు: నే నొక యాలోచన చేసినాను. అది తమకు మనవి చేయగలను. ధర్మనందులచే పాటలీపుత్ర గోటలు, కుడ్యములు మట్టి బొమ్మలుగా రచింపజేసినాను. అది తమ అందఱి ఎదుటనుంచి నా ఆలోచన మనవిచేయగలను.

## ౧౮
## ముట్టడిపై ముట్టడి

ఉజ్జయిని పట్టణమున ముట్టడించిన మాళవాది సైన్యముల నాంధ్ర సైన్యములు ముట్టడించినవి. అదివరకే నాలుగురోజులనుండి పదివేల గోండులు ఎడతెగని దాడులచే మాళవులను చీకాకుపరచి నాశనము చేయుచుండిరి.

ఈ దాడులు సాధారణ గోండుల దాడులవలె లేవు. కొన్ని సంవత్సరములు క్రమశిక్షణ నందిన సంశప్తకాంధ్రులవలె గోండులు యుద్ధము చేయుచుండిరి. నేడు తూర్పువైపునవచ్చి తాకుదురు. విల్లులు ధరించి ముందు తీగెలతో దట్టముగా అల్లిన తడకలవంటి కేడెములు ధరించి వత్తురు. కేడెము నొకడు పట్టుకొనును. ఒకడు విల్లును లాగి బాణములు వదలును. ముందు పంక్తివారు వెల్లకిల పండుకొని పాదములతో విల్లు దండమును నొక్కిపట్టి రెండుచేతులతో రెండు చేతుల పొడవుగల ఈటెలను వదలుదురు.

ఆ వెనుక పంక్తివారు మోకాళ్ళపై గూరుచుండి బాణములు వదలుదురు. వెనుకపంక్తి వారు నిలుచుండి అంబుల వదలుదురు. బాణములు మృత్యుదేవతా కటాక్షాంచలములవలె పర్వును. వేలకువేలు విరోధులు చనిపోదురు.

మరునాడా దండంతయు మాయమైపోవును. తెల్లవారు ఘడియలలో, సాయంకాలపు ఘడియలలో శత్రువుల తాకుచుందురు. ఇంకొక దినమున పడమటి వైపున దాకుదురు. వేరొకరోజున ఉత్తరమున ప్రత్యక్ష మగుదురు. ఎంత వేగముగ వచ్చి దాడిసలుపుదురో, అంత వేగముగ మాయమగుదురు.

పట్టణమునకు పడమటగనున్న శీప్రానది వారి దాడుల నరికట్టలేదు. మాళవుల సైన్యముల వేలకువేలు సైనికులు మట్టి పాలగుచున్నారు. అశ్వములు, గజములు నాశనమైపోవుచున్నవి. మాళవాధిపతి "ఎవ్వరీ గోండుల నాయకుడు, ఈ గోండు లేల విరోధము పూని తమపై వచ్చిపడిరి?" అను ప్రశ్నలచే విహ్వాలచిత్తుడయ్యెను.

గోండులు వచ్చి తాకిరనువార్త ఉజ్జయినీ నగరములోని ఆంధ్రులకు తెలిసినది. వినీతమతి, సమవర్తి, శుకభాణాదుల యాశ్చర్య సంతోషములకు మేరలేదు.ఇంతలో నొకనాటి రాత్రి గోండు డొకడు ఎటుల కోటలోనికి వచ్చెనో, సమవర్తి ఎదుట నిలుచుండినాడు. సమవర్తి సంభ్రమంబున నాతని రమ్మని సైగ చేసి తమ రథంబున కూర్చుండబెట్టుకొని వినీతమతి భవనమునకు బోయెను. వా రిరువురు శుకబాణునకు వార్తనంపిరి. అతడు వెంటనే యచ్చటికే వచ్చెను. శుకబాణునకు సర్వభాషలు తెలియును. అతడు గోండునితో సంభాషించెను.

"ఎవరు పంపిరి?"

"సువర్ణశ్రీ."

"సువర్ణశ్రీయా!"

"ధాన్యకటకమున బొమ్మలు వేయువాడు. గొప్ప వీరుడు. మా మహామల్లగోండు మహారాజు స్నేహితుడు."

"ఆత డెట్లు మీ దేశము వచ్చెను?"

"హిమబిందుకుమారిని వెదకుచు వచ్చెను. మా యువరాజు సహాయము కోరెను. వారు రాక్షసుల సహాయమున ఆమెను దాచిన ప్రదేశము గుర్తెరిగినారు. సువర్ణశ్రీ నర్మదానదీతీరమునందున్న గుహాంతరమునుండి వారిని రక్షించినాడు దొరా!"

శుక: సమవర్తితో హిమబిందును రక్షించినారట!

సమవర్తి: హిమబిందును రక్షించినారా? నిజముగా ఆమె క్షేమముగా నున్నదా? ఆమె ఏమనుచున్నది? ఎచ్చటనున్నది? త్వరగా చెప్పు మనుడు శుకబాణులవారూ!

శుక: తొందరపడకండి. ఓయీ గోండువీరా! ఆ బాలిక, ఆ బాలికతో వచ్చిన ముసలిస్త్రీ క్షేమమా?

గోండు: దొరా! వారిద్దరు క్షేమము. వారికి మా దొరసానివారు పంపిన గోండు స్త్రీలు సేవలు చేయుచున్నారు. వారు ఇచ్చటకు ఏబదిమైళ్ళ దూరముననున్న నొక గ్రామమున బ్రాహ్మణుని ఇంట నివసించి ఉన్నారు.

శుక: సమవర్తి సేనాపతీ! వారిరువురు క్షేమం. ఆరాటపడకుడు.

సమ: అమ్మయ్య. సువర్ణశ్రీ ఎంతపనిచేసినాడు! ఈత డింతటి వీరు డెప్పుడైనాడు! ఆ దినమున బండిపందెములో నన్నోడించినాడు. నేడు హిమబిందును రక్షించినాడు. ఈ హార మీ శుభవార్త తెచ్చిన గోండు వీరున కీయుడు.

శుక: గోండువీరా! నిన్నెవ్వ రిచ్చటికి బంపినారు? నీవు తెచ్చిన శుభవార్తకు మా సేనాధిపతి నీకు బహుమాన మిచ్చుచున్నాడయ్యా!

గోండు: దొరా! సువర్ణశ్రీ దొరయు, మా దొరయు నన్నంపిరి. వారు చెప్పుమనిన ముఖ్యవార్త "ఆ కొండలలోని గుహాగ్రామమును మేము పూర్తిగ పట్టుకొనినప్పుడు, అచ్చట ఆంధ్రచక్రవర్తులవారి కుమారుడు మంజుశ్రీ రాజకుమారుడు మాకు దొరికినారు. వారును క్షేమముగ నున్నారు" అని మీతో చెప్పుమని మా దొరల ఆజ్ఞ.

శుకబాణుడు "ఏమిటి గోండు దొరా! నీవు చెప్పినది నిజమా! రాజ కుమారుడు మంజుశ్రీయే మీకు దొరికినది? ఓహో ఎంత సంతోషము!" అనుచు ఆంధ్రప్రాకృతమున "ఆంధ్రా సేనాధిపతులారా! ఈ మహోత్కృష్టమగు వార్తవినండి. రాజకుమార మంజుశ్రీ, సువర్ణశ్రీ పట్టుకొనిన గుహలలోనే దొరికినాడట. ఎంత ఆనందము! నేను చేయలేనిపని సువర్ణశ్రీ చేసినాడు. ఆ బాలునిఎప్పుడు కలుసుకొందును? ఎప్పుడు కౌగిలింతును" అని వివశుడై పలికెను. వినీతమతి, సమవర్తి: ఏమి, మంజుశ్రీ దొరికినాడా? ఎంత ఆనందము!

నిజమేనా?

వినీతమతి: ఓ దొరా! నీవు అసాధ్యుడవు. దేవదూతవలె నున్నావే! నీకు మా హారము లన్నియు ఇవిగో!

సమవర్తి: ఎవరక్కడ? ఈగోండుమహావీరుని నోటినిండ మిఠాయి లుంచుడు! నాకు నాట్యముచేయ బుద్ధివేయుచున్నది. ఈహారములను తీసికొనుము. శుకబాణుల వారూ! వెంటనే ఈ వార్త పాటలీపుత్రము చక్రవర్తికి అందజేయుడు.

గోండుడు చెక్కుచెదరని మోముతో గంభీరముగ గూరుచుండి, వా రిచ్చిన హారములు మెడను ధరించెను.

గోండు: మీలో "చిలుక ఈటె" అనువా రున్నారట.

శుకబాణుడు పకపక నవ్వుచు ఆంధ్రప్రాకృతమున వినీతమతి, సమవర్తులతో "నేను "చిలుక ఈటె" నట వినుటయ్యా!" యని మరియు నవ్వుచు "ఓ గోండుదొరా! నేనే యా చిలుక ఈటెను" అనెను.

గోండు డేమియు నవ్వక "ఓ చిలుకదొరా, నేను మా మహారాజు కడ నీ ఉద్యోగము వంటి ఉద్యోగమునే చేయుదును. నేను మా మహారాజును కొలుచు కొన్ని గూడెముల నాయకుడను. నా పేరు "గాలిదొర" అందురు. గాలివలె వచ్చి గతివలె పోగలను. గాలి రాకపోకలు తెలిసి తీరును. నా రాకపోకలు తెలియనే తెలియవు."

శుకబాణుడు సువ్వున లేచి యా గోండు దొరకు తమ యపసర్ప నమస్కారము లిడెను. అతడును తమజాతి యపసర్ప నమస్కారమును రెండు చేతులతో కళ్ళనుమూసి, చెవులు మూసి, నోరునుమూసి చూపించెను.

ఆ వెనుక వారిరువురును కౌగలించుకొనిరి.

గోండుడు: ఇదివరకే మా దొరలు పాటలీపుత్రమునకు వార్త పంపినారు. ధాన్యకటకమునకు వార్తలు పోయినవి. అటు తూర్పునుంచి సువర్ణశ్రీదొర గురువు ఆంధ్ర సైన్యములతో వచ్చుచున్నారు. వారునాలుగు దినముల దూరములో నున్నారు. పటమటవైపునుండి మహారాజు శ్రీకృష్ణ సాతవాహనులవారు వచ్చుచున్నారు. వారు పది రోజుల దూరములో ఉన్నారు. ఈ రాత్రి నేను మా దండును కలిసికొని మరల మీకు వార్తలను పట్టుకొని వచ్చెదను.

## ౧౯
## సైన్యాధిపతి - శిల్పి

శత్రువులను సర్వవిధముల నాశనము చేయుచు, కోటపై ఒత్తిడి తగ్గించుచు, సువర్ణశ్రీ అద్భుత యుద్ధము చేయుచుండెను. ఆతడు గోండు వీరుల యుద్ధవిధానమే మార్చివేసెను. ఒక దినమున తెల్లవారుఘడియలలో గోండువీరులను మూడు జట్లుగ విభజించినాడు. వారి నొక్కపర్యాయమే విరోధుల మూడువైపుల బోయి తాకుడని ఆజ్ఞయిచ్చెను.

ప్రథమ గోండుయుద్ధ విధానము మాళవాది సేనాపతులకు అవగత మగుటచే వారందుకు సిద్ధపడియుండిరి. సైన్యశిబిరములకు నాతిదూరము నుండి గూఢచారులు

దాగుకొని యుందురు. గోండులు వచ్చుచున్నా రనగానే యా ప్రక్కపెద్ద భోగిమంటలు లేచును. మంటలకు దూరము నుండి కుడ్యములవలె గట్టి గట్ల చాటుననుండి శత్రు ధనుర్వీరులు బాణ వర్షము కురిపించెదరు. మంటలు దాటి గోండువీరులు వెళ్ళుటకు వీలు లేదు. గోండువీరులకు మంట లావల ఏమగుచున్నది కనబడదు. అట్లు గోండులు చీకాకునందగనే వీరివెనుక చెట్లలో దాగికొనియున్న పుళిందులు ఒక్కుమ్మడి గోండులపై గవిసెదరు ఆ సంకులసమరములో శిబిరములనుండి అందుకు సిద్ధమైయుండిన వేలకు వేలు శత్రువులు వచ్చి గోండులను తాకెదరు. ఇట్లు జరిగిన ఒక రణమున గోండులు వేయిమంది వరకు హతమారిరి. సువర్ణశ్రీ హృదయము చివుక్కుమనిపోయినది. ఆతడాలో చించి ఒక దినమూరకొని, యుద్ధమున గాయపడినవారిని వైద్యమునకై దూరపు టడవులకు పంపివేసెను.

ఆ దినమంతయు ఆలోచించి, రాక్షస గోండు నాయకుల చేర్చి వారేమి కార్యము లొనరింపవలయునో బోధించి పంపెను.

ఆ రాత్రియంతయు రాక్షసులు శిబిరముచుట్టు నున్న చెట్లపై కొమ్మలలో దాగి యుండిరి. కొందరు రాక్షసులు కుండలతో నీళ్ళు పట్టుకొని పోయి, నూనెపోసి సిద్ధము చేసియుంచిన భోగిమంటల దుంగల పై, నూనె తడిపిన గుడ్డప్రోగులపై నీళ్ళుపోసి తడిపి వేసిరి. గోండులు తమబాణము లకు నూనెతో తడిపిన గుడ్డలను చుట్టిరి.

అటు అన్నివిధముల సిద్ధమై ఒక్కసారిగా మూడువైపులనుండి ప్రత్యూషకాలముననే వచ్చి, శత్రువుల తమ సింహనాదములచే కలచి వేయుచు దాకిరి.

యధాప్రకారము మూడువైపుల మంటలంటింపబోయిన నవియంటు కొనలేదు. ఈలోన గోండుల అగ్నినారాచములు వేగమునవచ్చి పాకల, గుడారముల తగులబెట్టు చుండెను. గుర్రములు, ఏనుగులు, పశువులు చెదరిపోయెను. అటు కోటలనుండి ఆంధ్ర వీరులు తలుపు తీసికొనివచ్చి తీవ్రముగ తలపడిరి. ఈ సంకులసమరములో మాళవ సైన్యములు ధైర్యము కోలుపోయి చిందరవందరయైపోయెను. వేలకువేలు నశించి పోయిరి. చెట్లపై దాగుకొనుటకుపోయిన పులిందులను, ఆ చెట్లపై ఇదివరకే దాగు కొనియుండిన రాక్షసులు నాశనముచేసిరి.

మరల తెల్లవారుసరికి గోండులు లేరు. కోటలోనికి ఆంధ్రసైన్యములు తిరిగి పోయినవి. సమరభూమిలో, శిబిరములలో, మాళవ సైనికులు, పుళిందులు, వైదేహులు, కాళింగులు, విదర్భులు, శూరసేను లనేకులు శవములై యుండిరి.

విజయులై గోండులు, రాక్షసులు అడవులలో మాయమైనారు. మాళవుల సైన్యాలు, నూరు గజములు, అయిదువందల ఆశ్వికులు, రెండు వందల రథములు, వేయి పదాతులుగా నాలుగువైపులకు జీలిపోయి, గోండులు దాగియున్న ప్రదేశములు కనుగొని, వారని వేటాడుటకు నిశ్చయించుకొన్నవి.

ఈ విషయము సువర్ణశ్రీ గ్రహించకపోలేదు. గోండు సైన్యాలు కనబడియు కనబడనట్లు, వేరువేరు భాగాలై శత్రుసైన్యములను గోండువన దేశమువైపు దూరాటవులకు కొనిపోయి, అచ్చట వారిని చిందరవందరచేసి నాశనముచేయ సువర్ణశ్రీ, మహాబలగోండు లాజ్ఞయిచ్చిరి. ఈ వ్యూహ విధానమునకు నాయకత్వ భారము మహాబలగోండునిపై బడినది. సువర్ణశ్రీ మాటుమణిగెను. హిమబిందు కుమారియు, ముక్తావళియు కొలది దినముల వరకు దాము ప్రచ్ఛన్నముగ నివసించియున్న ఇంటనే తలదాచుకొన సువర్ణశ్రీ యుపదేశించెను. సువర్ణశ్రీ

మారువేషమున హిమబిందు నివసించు గ్రామముననే యుండెను. అచ్చట నొక ఫలముపై దుకూల మంటించి, దానిని చిత్రరచన కనువగున ట్లమరించి, చిత్రము నొండు రచించెను. ఆతని కుంచెల వత్సకర్ణ రోమములచే, ఉడతతోక వెంట్రుకల నాతడే నిర్మించుకొనును. ఆతడు వర్ణము లెచ్చట వీలయిన నచ్చట సముపార్జించును. నీలిరంగు, ఇంగిలీకము, సత్తుభస్మము, హరిదళము, గైరికము కాసీసము, ఖజ్జలి, మంజిష్ఠ, లక్షారసము మొదలుగునవి సముపార్జించుకొనినాడు. వానిని నూరి రంగులుగ నొనర్చి, తూలికతో నా చిత్రము రచించినాడు.

ఆ చిత్రమునందు తన హృదయమునే చిత్రించినాడు. ఆకాశమున గంధర్వరాజు తేలిపోవుచున్నాడు. అతని యెదుట వీణవాయించు గంధర్వాంగన త్రిభంగాకారయై పద్మాసనాసీనయైయున్నది. దిగువ కొండల మధ్య చెరువుకడ తపస్సుచేయు నొక బాలకుడు.

ఆ చిత్ర మతిమనోహరము. ఆకాశమున మేఘములు, పక్షులు, కొండలలో జంతువులు, వృక్షములు; బాలతపస్వికడ పాములు, పూల మొగ్గలు, చెరువులో పద్మములు, ఆకులు, కొంగలు, అంచలు ఇవియన్నియు చిత్రభావమునకు శ్రుతిగ నున్నవి.

ఏ నాటికైన తనకు సన్యాసమే, భిక్షుకత్వమే! ఆమెను రక్షించి ఆమె తండ్రికి అప్పగించుట తోడనే తనధర్మము పూర్తియగును. అటుపైన ఆంధ్రదేశమునకు అతి దూరమున, ఏ సంఘారామ క్షేత్రముననైన ధర్మమును, సంఘమును కొలచుచు నుండవచ్చును.

హిమబిందు తనకు దేవత. ఆమె ప్రజ్ఞాపరితాదేవియే! ఆమెను దూరమునుండి పూజచేయును. తానామె దేహమును కాంక్షించియుండెను. తన్ను ఆమెకూడ అట్లే కాంక్షించి యుండునా? ఉండదు. అట్లు కాంక్షించియున్న ఇతరుల నెట్లు ఉద్వాహము కానిచ్చగించినది?

ఆమె ఇతరుల వివాహమాడ ఇచ్చగించియుండునా? తండ్రిమాట జవదాటలేక అట్లు ఒప్పుకొనియుండునా? ఏది అయిన నేమి? ఆమె పరతంత్ర. తన ప్రభువునకు కోడలు కాబోవుచున్నది. భావి ఆంధ్ర సామ్రాజ్ఞి.

ఆమెను మనస్సులోనైన తాను తలంపగూడదే! ఎంత ప్రయత్నించినను ఆమెను మరవలేని నీరసత్వము తనగుణములందు ఏర్పడినది. అట్లు మరచుట కుపాయ మేమి? అమృతపాదార్హతులు తన కుపశమన మీయలేరా? తన గురువు సోమదత్తాచార్యులు వచ్చుచున్నారు. వారికడ నేర్చిన విద్య నేటికిట్లు ప్రదర్శిత మగుచున్నది. ఈ మాత్రము ప్రభు సేవ మొనర్చి తన ప్రభుఋణమును, గురువుల ఋణమును, హిమబిందును రక్షించి ప్రేమఋణమును, ఎచ్చటనైన సంఘారామమునకు శిల్ప మర్పించి పితౄణమును తాను తీర్చుకొనుగాక! ఆ పైన హిమాలయములే తనకు శరణ్యములు. హిమాలయ శిఖరములు, మహానదులు, మహోన్నత ప్రదేశములు, హిమము ఏ అగ్నిపూరిత హృదయమునకైన పరమశాంతిని ప్రసాదించగలవు.

సువర్ణశ్రీ రెండుదినములవరకు హిమబిందుకడకు బోలేదు. ఆమెను దర్శించుట ఆమె ఆజ్ఞవల్లనే. కాబోవు మహారాణి ఆజ్ఞ అనుల్లంఘనీయము కదా!

సువర్ణశ్రీ వెళ్ళుటతోడనే హిమబిందుమోము రాకాచంద్రబింబము వలె వికసించెను.

అంతవరకు ముత్తవతో నామె వాదనలు సలుపుచునే యుండెను. తాను శ్రీకృష్ణ

అమృతపాదులబుద్ధిలో రెండు మహాప్రవాహములు సంగమించినవి.

ఒకటి - చిన్ననాటినుండి స్థాలతిష్య మహాద్రిజనితమై, వేగవంతమై, ఆదిని చిన్న శైవాలినీరూపమున, పోనుపోను మహానదియై ప్రవహించిన నందిదత్తజీవితము, ఆతని సంస్కారము, ఆతని జ్ఞానము, ఆతని విద్యయును, రెండు - గంగానదీజనితమై, ఆనందాశ్రమ పోషితమై, ఆనందాశ్రమ కులపతి ప్రజాపతి కాశ్యపాచార్యబోధితమై, ప్రవహించి ధాన్యకటక సంఘారామ కులపతియైన, అమృతపాదార్హతుల జీవితము, ఆతని సంస్కారము, ఆతని జ్ఞానము, ఆతని విద్యయును.

రెండును నేడు స్థాలశిష్యునిదెబ్బతో, శస్త్రవైద్యముతో పర్వతముల ఛేదించుకొని సంగమించినవి.

ఒక నది ధవళదేహ ఒక నది నీలశరీర, ఈనాడు రెండును కలిసి ఏమియగును? ఆతడు బౌద్ధుడా, వేదవతుడా? ఆతడు సన్యాసియా, విధురు డైన గృహస్థా?

మానవధర్మము, మానవాతీతధర్మము నాతనిలో సంఘర్షణకు బాల్పడినవి. రెండు చిత్తసంస్కారములు అమృతపాదులను కలతపెట్టినవి. ఆరోగ్యము కుదిరి ఇటునటు నడయాడుచున్న దినములలో స్థాలతిష్యులు తన కుమారుని జాగరూకతతో గమనింపుచుండెను. చక్రవర్తి వచ్చెను. చారుగుప్తుడు, శ్రీకృష్ణసాతవాహనుడు, అచీర్ణుడు, స్వైత్రుడు, ధర్మనంది, మహారాణి ఆనందాదేవి, శక్తిమతీదేవి, నాగబంధునిక, అమృతలతాదేవి, ముక్తావళీదేవి, సమవర్తి, కీర్తిగుప్తుడు, అనేకులు ఆంధ్రపల్లవాధరలు, పురుషసింహములు అమృతపాదులను దర్శింప వచ్చుచుండిరి. అనేకు లీ విచిత్రము చూడవచ్చుచుండిరి.

“ఏమి విడ్డూరము! ఈ అద్భుత సంఘటన ఎట్లు జరిగినది? తన కుమారుని ఈ మహర్షి ఎట్లు రక్షించుకొనినాడు?” అని స్థాలశిష్యునకు, అమృతపాదులకు నమస్కరించుచు వేలకొలది జనులు, బౌద్ధులు, భిక్షుకులు, బ్రాహ్మణులు, సన్యాసులు దర్శనము చేసికొని వెళ్ళుచుండిరి.

స్థాలతిష్యుడుగూడ నీ యద్భుతఘటనచే ఆలోచనలో పడెను. తన పుత్రు డేల బౌద్ధుడైనాడు? ఆతనికి పూర్వస్మృతి పోవుటయేమి? ఆతడు మరల ఆరునెలలో సర్వశాస్త్రములు నేర్చుకొనుట యేమి? బౌద్ధ సన్యాసి యగుట ఏమి? అర్హతుడై, కులపతియై తన చరితమువలన, మహోత్తమబోధవలన ఆంధ్రదేశమున బౌద్ధధర్మము విరివిగ వ్యాపింప జేయు టేమి? సహజప్రతిభచే, సహజ సత్యశాంతి శీలముచే, పరమకరుణా పూరిత హృదయముచే ప్రజల కోటానుకోట్లుగ నాకర్షించినాడు. బుద్ధుడే మరల నవతరించినాడని ప్రజ లనుకొందురట. తనకర్తవ్యమేమి?

తనపుత్రుడు ఆర్యధర్మము వీడనట్లా, వీడినట్లా? పూర్వస్మృతి లేనప్పుడు, సంపూర్ణజ్ఞానము లేనట్లు కాదా? అట్టివాడు బాలకుడే యగును. బాలకుడు స్వధర్మ మెట్లు వదులుకొనును? పరధర్మ మెట్లు గైకొనుట యగును?

అమృతపాదులకు లంబికాయోగము వదలి పూర్తిగ మెలకువ వచ్చినంతట ఏదియో అనుభూతి, ఏదియో మహాస్మృతి కలిగినది. తాను నందిదత్తుడు. తండ్రికడ వేదములు, వేదాంగములు, ఉపనిషత్తులు, దర్శనములు, సూత్రములు, ధర్మశాస్త్రములు, జ్యోతిషాది షట్ఛాస్త్రములు-వీనియన్నిటిలో మహాపండితు డైనాడు. తమ నివాస మగు కాశిలో ఒకనాడు తాను, తనభార్య, తనచిన్నబిడ్డ, తనతండ్రి, తనతల్లి వ్యాసకాశి పోవుచుండిరి. గంగానది

వేగముగా ప్రవహించుచుండెను. గాలి వీచినది. అనేకములగు పడవలును దాటుచుండెను. ఇంతలో తమ పడవయు, వేరొక పడవయు తారసిల్లి గట్టిగ కొట్టుకొన్నవి. తమపడవ మునిగిపోయినది.

ఆ వెనుక తన కేమియు స్మృతిలేకపోయినది. తనతండ్రి తన్ను కొట్టి, శస్త్రవైద్యముచేసి, తనకు పూర్వస్మృతి తెచ్చినాడు.

ఎంతవిచిత్రము! నీటి లోబడిన తన్ను పాటలీపుత్రపురమున కెగువను, ఆనందాశ్రమతీరమున గంగలో నుండి భిక్షుకులు పైకితీసినారు. తాను విద్యలు నేర్చుకొనెను. పలుచని తెరవలెనుండిన స్మృతివెనుకనుండి చదువులుమాత్రము వచ్చినవి. అచ్చటనుండి తాను బౌద్ధ సన్యాసి యాయెను. అర్హతు డాయెను. తనభార్య ఉత్తమాంగన, మహాసాధ్వి కనబడ దేమి? తమ యను రాగము ఎంత ఉచ్చస్థితిని నడచినది? తనబిడ్డ చంద్రబాల వెన్నముద్దల తల్లియై, బంగారుబాలయై మాటల నప్పుడే నేర్చుచున్నది. తనతల్లి అపర లోపాముద్ర, ఉత్తమ చరిత్ర ఏమయినది? వీరంద రేమయిరి? ఎవరును కనబడలేదు. తండ్రియొక్కడే రక్షింపబడినారా?

ఈ ఆలోచనలతో అమృతపాదులు తండ్రికడకు బోయి “నాయనా అమ్మ ఏమయినది? చంద్రబాలయు, మీ కోడలును ఏమయిరి?” అని ఆతురతతో ప్రశ్నించెను.

“నాయనా! నీతల్లి పదిరెండేళ్ళ క్రిందట మరణించినది. ఎంత చదువుకొన్నది అయిననేమి? కుమారుని స్మరింపని దినము లేకపోయిన దామెకు. పేరు తలచుకొనుచు, చిక్కి శల్యమై, పదియేడులు ధైర్యమున ఈ లోకమున నుండి, దేహము చాలించినది. మనపడవ మునిగినవెంటనే నేను తేలి ఈదుచు, నీబిడ్డను, కోడలిని బ్రతికించుకొంటిని. మీ యమ్మను మనపడవకు తగిలిన పడవ నావికుడొకడు రక్షించినాడు. నీవుమాత్రము కనబడవైతివి. బిడ్డను హృదయమునకు గట్టిగ అదుముకొనియే నీభార్య మునిగిపోయినది. ఆమె మూర్ఛపోయినది. ఆమెను ఒక పడవలోని కందిచ్చి, నీకై యా మహానదిలో వెదకితిని, వెదకితిని. అనేకులు వెదకిరి. నీవు దొరకలేదు. తండ్రీ! గంగబడ్డుననే శిష్యు లనేకులు వెదకిరి. పడవల మీద పోయి వెదకిరి. నీకు లంబికాయోగము నేర్పినందుకు, నీవు వెంటనే ఆ యోగము ప్రాణరక్షణార్థము సంధించితివి కాబోలు! నీభార్య నీకై బెంగగొని, మూడేడులు కృశించి, నీ దేవతార్చన మంజూషను పూజ సేయుచు ఒకరోజున నీకూతు నా కప్పగించి ప్రాణము విడిచినది. చంద్రను మీయమ్మ కొంతకాలము పెంచినది. ఆ బాలికకై బ్రతికి, తుదకు ప్రాణము వదలినది.”

“ఓహో! ఎట్టి విధిసంఘటనము! చంద్ర ఏది తండ్రీ?”

“చంద్ర నీకు కావలయునా?”

“నాకు కావలయునని చెప్పలేను, అక్కరలేదనియు చెప్పలేను. నా చిత్తము పరిపరివిధముల పోవుచున్నది.”

“ఓయి వెఱ్ఱివాడా! నీవు సన్యాసివి కావు, బౌద్ధుడవుకావు. నీవు స్వచ్ఛమగు ఆర్షధర్మజీవివి. ఈ మధ్యజీవిత మంతయు కలవలె వచ్చినది, కలవలె పోయినది.”

“మీమాటలు నేను వెంటనే ఆమోదింపలేను. నాజీవితము ఒక్కసారిగా రెండు నదులుగా చీలి మరల కలుసుకొనినది. కావున నా ఆత్మలో నే నొక నిశ్చయమునకు రావలెను. నేను ఆలోచింపగ విషకన్యయే చంద్రయని నాకు నిశ్చయము కలుగుచున్నది.

ఆమె తమపౌత్రిక నని నాతో చెప్పినది. తనతండ్రి నదిలోపడి చనిపోయినా డనియు తెల్పినది. తండ్రి, మహర్షి ఆమెనేనా మీరు విషకన్యను చేసినది?"

౧౮

## నిర్వికల్పపథము

కుమారుడు ఎప్పుడు తన్ను "తండ్రీ, మహర్షీ! ఆమెనేనా మీరు విషకన్యను చేసినది?" అని ప్రశ్నించినాడో, ఆ వెంటనే తాను పాతాళమునకు క్రుంగిపోయినట్లు భావించుకున్నాడు స్థాలతిష్యుడు. కుమారునకు బ్రతి వచన మీయక కన్నులు నిమీలితము చేసెను. ఈ బాలికను కాకపోయిన, వేరొక బాలికను విషకన్యను చేయవలయును కదా! ఇతర బాలికలను చేయుట కంటే తనబాలికయే విషకన్య యగుట యుత్తమముకదా!

విషకన్యాప్రయోగము ఉత్తమధర్మమా? ఏల కాదు? తా నధర్మ మెట్లు చేయగలడు? మఱి ధర్మమైనచో అట్టి కార్యము విఫలమగునా?అమృతపాదులు తండ్రిముఖము గమనించెను. తనలో ఒక విశ్వాంభోధి మథన మగుచున్నది. ఆతడు తండ్రి ఎదుట పద్మాసనాసీనుడై, యోగాసనబద్ధుడై నిర్వికల్ప సమాధిలోనికి పోయినాడు. అటు స్థాలతిష్యుడును సమాధిలోనికి పోయెను.

రెండును నిర్వకల్పములే. నిర్వికల్పము రెండురూపుల నెట్లుండును? అందు వారిరువురును లయమైరి. వారి ఆత్మలు రెండును ఒకటై, ఆ ఏకత్వము విశ్వమున లయమై, సర్వమును నిత్యమున లయమైనది. ఇరువురును ఒక్కసారి ప్రపంచమునకు దిగిరి. వారికి మాటలురావు. బుద్ధుడు నిజము. శ్రీకృష్ణ భగవానుడు నిజము, శ్రీకృష్ణుని భక్తుడు వ్యాసుడు నిజము. బుద్ధుని భక్తుడు ఆనందుడు నిజము. ఈ ఆలోచన వా రిరువురకు ఒక్కసారి తట్టినది.

స్థాల: భిక్షూ! నిర్వికల్పపథగాములమైన మే మేమి, నిర్వాణపథ గాము రగు మీ రేమి ఒక్కరమే! దిగువ మీదారి మీది, మాదారి మాది. విషకన్య అమృతకన్య యగును. ఆమెను శ్రీకృష్ణుడు వివాహమాడును. వారి వంశము మహాసామ్రాజ్యభారము వహించుగాక!

అమృత: మహర్షీ! అనిత్య, అనాత్మ, నిర్వాణము లను ముఖ్య సూత్రము లేమి, అనిత్య, ప్రత్యగాత్మ బ్రహ్మాసాయుజ్యమను ముఖ్య సూత్రము లేమి, రెండును ఒకటియ! ఆర్యధర్మమే వేదములు. ఆర్య ధర్మావతారమే బుద్ధుడు. జనకరాజర్షికి బిమ్మట శ్రీకృష్ణావతారము, వేద వ్యాసుల పరిణతియె బుద్ధావతారము.

స్థాల: ఈ విశ్వాతివిశ్వములో సూక్ష్మరూపమేగాని, స్థూలమైగాని, సత్యమై, నిత్యమై, సర్వాతీతమై, సర్వజ్ఞానపూర్ణమై, సర్వశక్తియుతమైన బ్రహ్మపదార్థము లేదు. విశ్వములో స్పర్శలు, భావములు, వికారములు పొందుచుండును. అందుండి మరియు గాఢమైనవి మనుష్యభావములై పరిణమించును. అవియే శరీరము లగును. అవి నశ్వరములేకాని వట్టి మాయకావు. అంతియకాని మాయాచ్ఛాదితమైన బ్రహ్మము ప్రత్యగాత్మత్వ మందుట అసత్యమని బుద్ధుడు ప్రవచించినాడు. ఆత్మభావమే సకలదుఃఖములకు హేతువందురు. బుద్ధు డట్లు చెప్పినంతమాత్రమున పరమాత్మ అసత్యము కాదు. పరమాత్మ లేనిమాట సత్యమైనచో ఉన్నదన్న మాత్రమున అది యుండదు. మీ దారి ధర్మపరము, మా దారి ధర్మపరము. మీలో అనధికారులు బుద్ధధాతువును నిక్షిప్త మొనర్చి, స్థూపమని, చైత్యమని దానిని పూజ లొనర్తురు. "బుద్ధం శరణం గచ్ఛామి" అందురు. మాలో అనధికారులు పూజలు, భక్తి, యోగము, యజ్ఞము, యాగము మొదలగునవి చేయుదురు. వీనితో నేమి

పోనిమ్ము! ఉత్తమచరిత్రయే ఎల్లరకు శిరోధార్యము.

అమృత: ఆర్యా! ఈ దినములలో ఈ విశాలప్రపంచమున ఎన్ని ఆత్మ విచారణలు లుద్భవింపలేదు? సంజయవైత్థిపుత్రవాదులు ఆత్మ లేదందురు. విశ్వజ్ఞానము మానవున కెప్పుడు అలభ్య మందురు. అజితకేశ కంబళీమతస్థులు ఆత్మ లేదందురు. మనుష్యుడు చాతుర్భూతాత్మక మందురు. పూర్ణకాశ్యపులు ధర్మము వలదు, అధర్మమువలదు పాపపుణ్యములులేవు అందురు. మస్కరి గోశాలజులు, అజీవకులు కర్మలేదని, మనుష్యునికి అధికారము లేదని అందురు. అంతయు నియతమే అందురు. మహాజిన మతము నంతియకదా! ఆత్మ లున్నవని మహా వీరుడు బోధించెను. ప్రత్యగాత్మ చావుతో నంతము కాదనెను; పరకాయప్రవేశమున్నదనెను; పుణ్య పాపములు ఉన్నవనెను. పాపములు చేయువాడు హీనజన్మ మెత్తుననెను; పురుగులు, వృక్షములు, రాళ్ళజన్మముల నెత్తు ననెను. మోక్షమునకు దారి సంసారత్యాగము, కర్మరాహిత్యము, అహింస, చివరకు ప్రాయోపవేశము అనెను. ఇట్టి మతములు మనుష్యులున్నంతకాలము ఉద్భవించును. సత్యము మానవునకు లభ్యమే! అతీత మనునది మేము ఒప్పము కాని నాలో రెండు నదులు సంగమించి అనేక విచత్రమహాభావములు రూపెత్తుచున్నవి. పరమ పవిత్రమైన వేదధర్మము, బుద్ధధర్మము రెండును నాలో నిడుకొని తపస్సునకు పోదును. నే నేమి కనుగొనెదనో!

స్థాల: స్వామీ! మీ పూర్వాశ్రమరూపమైన నాపుత్రుని ఆశీర్వదించుచున్నాను. మిమ్ము "నారాయణ" మహానామమున సాగనంపుచున్నాను. నాకు అద్భుతానందము విశ్వమునుండి సూక్ష్మాతిసూక్ష్మమై, బ్రహ్మమై దర్శన మిచ్చుచున్నది. ఈ అమృతత్వమే సర్వము నిండును. అదిగో చంద్ర!

ఇంతలో స్యందన మెక్కి విషకన్య అచ్చటకు వచ్చినది. విష వైద్యులు, ఆయుర్వేదరులు, విషవేత్తలు, మంత్రవేత్తలు కూడ నుండిరి.

విషకన్య పరుగునవచ్చి తాతగారి కాళ్ళకడ సమాలింగిభూతల యైనది.

అమృతపాదుల కన్నులు చెమరించినవి. స్థాలతిష్యు లామెను ఒడి లోనికి తీసికొని, తల్లీ! నీ దివ్యచరిత్ర విషాతీతమై ప్రేమమయమైనదా? నీ విషము అమృతమే అయినదా! నీవలన సర్వలోకములు జయింప బడినవా? తల్లీ, అరుగో ఆ మహానుభావుని ఎరుంగుదువా?" అని ఆనందమున ననెను.

విషకన్య: అమృతపాదార్హతులు, నాగురువులు తాతగారూ!

స్థాల: వారు నీకు ఏమిగా కనబడిరి?

విష: వారిని చూచినప్పుడు నిన్ను చూచినట్లయినది. వారును, నీవును ఒకటయిరి. వా రెవరు తాతయ్యా?

స్థాల: తల్లీ! ఆయన నీ తండ్రి, ఆ తండ్రిని చిన్నతనమున పోగొట్టుకొంటిని నే డాతడు మహర్షియై నాకడకు వచ్చినాడు.

స్థాలతిష్యుని శిష్యుడొకడు కొన్నిమాత్రలను అమృతపాదుల కిచ్చెను. వేరొక మాత్రను విషకన్యచే సేవింపజేసెను.

స్థాలతిష్యుడప్పుడు కంఠమెత్తి,

"శుక్రం తే అన్య ద్యజతంతే అన్వద్విషురూపేఅహనీ ద్యౌరివాసి!
విశ్వహిమాయా అవస్విధావో భద్రాతే పూష న్నిహరాతి రస్తు"

అని సూర్యమంత్రము పఠించెను. బ్రాహ్మణులందరు కంఠములు గలిపిరి.

ఇంతలో చక్రవర్తియు, శ్రీకృష్ణసాతవాహనుడు, మహారాజ్ఞి అందరును వచ్చి స్థాలతిష్యునకు, అమృతపాదులకు నమస్కరించిరి.

విషకన్య తండ్రికడకు పోయి నమస్కరించినది. అమృతపాదు లామెను అక్కున చేర్చుకొని, మూర్ధమున ముద్దిడి "తల్లీ! నీవలన నాకు బూర్వజ్ఞానము వచ్చినది. నాతండ్రి, నీ తాతగారు ప్రేమస్వరూపులైనారు. నీవు అమృతకన్య వగుదువు. నీవు ప్రేమించిన ఈ శ్రీకృష్ణమహారాజునే చెట్టపట్టుము" అని ఆశీర్వదించెను. శ్రీకృష్ణసాతవాహనుడు: స్థాలతిష్యమహరీ! తాతగారూ! ప్రథమమున నన్ను చిరంజీవ అని ఆశీర్వదించితిరి. అదియే నిజము. తమ బాలికను నాకు ప్రసాదింపుడు.

స్థాల: మహారాజా! నానోటినుండి మొదటవచ్చినదే సత్యము. నీ ప్రియురాలు మృత్యుంజయుని శరణ్యమునే పొందినది. ఇంక మీతండ్రి ఆంధ్ర చక్రవర్తిని, సకలజంబూ ద్వీపమునకు చక్రవర్తిగా నేనే ఈ పాటలీపుత్ర సింహాసనమున అభిషేకింతును. మీ మామగారును అభిషేకింతురు. ఇంక ఆరునెలలలో చంద్రబాల అమృతకన్య యగును. నీవామె నప్పు డుద్వాహ మగుదువుగాక!

అందరు తథాస్తనిరి. చక్రవర్తి స్థాలతిష్యుని కడ మోకరించెను.

౧౯

# విషకన్యకా శ్రీకృష్ణులు

విషకన్యక తాతగారి ఆశ్రమమునందే వాసముచేయ శ్రీకృష్ణుడు పంపించెను. ఆమెను గగనియు, కాశ్యపియు, అగస్తియు కలుసుకొని హృదయమార కౌగిలించుకొనిరి. ఆ పుణ్యబాలకును వారికిని కన్నులనీరు తిరిగినవి.

స్థాలతిష్యునకు ఇన్ని సంవత్సరములు అణగియుండిన ఆపేక్ష నేడుపొంగి వరదలై ప్రవహించినది. జడభరతునకు కురంగశాబకముపై ప్రేమ పూర్వకర్మ వశమున నదియై ప్రవహించినట్లు, నేడు మనుమరాలిపై ప్రేమ మిన్నుముట్టినది. ఇన్ని సంవత్సరములు తన మనుమరాలిని భయంకర మారణయంత్రముగ సిద్ధముచేసినాడు. కర్కశహృదయుడై బౌద్ధ జిన ధర్మనిర్మూలన మొనర్ప సంకల్పించిన యా వృద్ధునకు నేడు ఆ యావేశ మెల్ల సూర్యకిరణస్పర్శమాత్రమున విరిసిన మంచువలె మాయమైనది.

మనుమరాలే తనకు దేశికత్వము వహించినదా యని యా తపస్వి తలపోసినాడు. శాంతిజ్యోత్స్నావిలసితమూర్తియై, సౌందర్యశ్రీ విలసితమై అగస్తీ గగనీ కాశ్యపీ మధ్యస్థయై, కృష్ణాజినాసనయై యున్న యా బాలికను జూచి స్థాలతిష్యుడు విశ్వామిత్రునిబారినుండి రక్షింపబడిన నందినీ ధేనువును జూచిన వసిష్ఠ మహాఋషి వలె ఆనందపూర్ణహృదయు డయ్యెను.

విశాలములైన యామెకన్నుల కోటి తారాద్యుతులు వెలుగు నిర్మల యామినీ కాంతులు నృత్యము చేయుచున్నవి. ఆమె మోమున బాలికారేఖలు పోయి క్షీరనదీరేఖలు వికసించినవి. అడవి దొండపండువంటి యామె పెదవులు క్షీరసముద్రమున శ్రీమన్నారాయణశయనీయ పూర్ణకమల పరిసర జనిత సరోజ కుట్మములై అమృతస్విన్నములైనవి.

స్థాలతిష్యమహర్షిసంకల్ప మీనాడా బాలికను అమృతకన్యను చేసి, శ్రీకృష్ణ సాతవాహన ప్రభువున కుద్వాహ మొనరింపవలయు ననియే! వేదమంత్ర ద్రష్టలైన మహాఋషుల పావిత్ర్యమే జంబూద్వీపమును సకల ధర్మసంయుక్తను జేయుచుండును. ఏ మహావీరుడో, ఏ గౌతమబుద్ధుడో జనించి, వేదధర్మమందలి భిన్నభావముల ఒక్కొక్క కాలమున విలసిల్ల జేయుగాక! అందేమి దోషమున్నది? అమృతకన్య యగు విషకన్యకా ప్రభావమున సాతవాహనమహారాజులే యజ్ఞయాగాది క్రతువు లొనర్తురు. వారు సర్వధర్మ ప్రవర్తకులగుదురుగాక యని సంతుష్టుడైనాడు.

విషకన్య చంద్రబాలయే యైనది. ఆమె గగనితో తాంత్రికముల చర్చించును, కాశ్యపితో దార్శనికములు వాదించును, అగస్తితో త్రయీ గతములగు మహాసత్యముల విచారణచేయును. అమృతములైన దివ్యౌషధుల సేవించును పూర్ణవికసితములగు అంగములకు, విషపువిరుగుడు తైలముల పూయించుకొనును. ఆమె దినదినము పూర్ణిమోన్ముఖమైన చంద్రబింబమువలె తేజస్సును తాల్చుచున్నది.

ఆమె వీణియపై ఆనందగీతము లాలపించుచు దినదినము తన్ను చూచుటకు వచ్చు ప్రియునిరాకకై ఎదురు చూచుచుండును.

కీర్తిగుప్తుడు తనకడకు వచ్చి వెళ్ళిన సాయంకాలము శ్రీకృష్ణ సాతవాహన మహారాజు

చక్రవర్తి దర్శనము చేసికొనెను.

"మహాప్రభూ! సువర్ణశ్రీప్రభువు వారణాసి మృగవనసంఘారామానికి వెడలిపోయినాడు."

"అవును కుమారా! మీరు మా ప్రతినిధులుగా నేగి సువర్ణశ్రీప్రభువును సార్వభౌమప్రతినిధిగ పాటలీపుత్రసింహాసన మధివసింప పిలువుడు."

"అవధరించుచుంటిని మహాప్రభూ, హిమబిందుదేవియు, సువర్ణశ్రీ ప్రభువును ఒకరినొకరు ప్రేమించుకొన్నారు."

"అవును. శ్రీకృష్ణసాతవాహన మహారాజా బాలికను వివాహమాడునని, తాను పాటలీపుత్రపురమున నుండుటవలన హిమబిందు ఏదియైన బాధపడునేమో యనుకొని ఆ కుమారుడు పారిపోయినాడు. మీరు వెంటనే పోయి ఆ బాలప్రభువును వెంట గొనిరండు. మీ వివాహమున కాశిల్పి మూర్తిని ఆహ్వానింప నేను కొందరుమంత్రుల నంపెదను."

శ్రీకృష్ణమహారాజు జనకుని పాదముల కెరగెను. ఆ చక్రవర్తి కొమరుని గాఢముగ కౌగిలించుకొనెను. తండ్రియనుమతి నంది యువరాజు రథముపై, సేనాపతులు, మంత్రులు కొలువ గంగాతీరస్థ మగు స్థాలతిష్యా శ్రమమునకు వెడలెను.

స్థాలతిష్యమహర్షికి పాదాభివందన మాచరించి, వారి ఆశీర్వాదము లంది. యువరాజు, విషకన్యకాదేవిని చూడ లోని ఆరామములకు ఒంటిగ బోయినాడు.

తనస్వామి వచ్చుచున్నాడని వినిన చంద్రబాల గగన్యాదుల వదలి, ఆనంద పులకితహృదయయై, రాజహంసివలె నడచుచు ప్రియుని ఎదుర్కొనినది.

ఒకరి నొకరు చూచుకొని యా వనాంతరమున పూలపొదల వికసించి యున్న యా స్థలమున నటులనే నిలుచుండిపోయినారు. ఆ బాలిక నిలకడ నంది మెఱపువలె నిలుచుండిపోయినది. విడివడిన యా బాలిక పెదవుల చిరునవ్వులగూడి ఉషారుణ్యములు పొదవికొనిన మందారకుసుమ కోరకము లైనవి. శ్రీకృష్ణప్రభువు హిమాచలతనయను చూచిన కైలాసేశునివలె వెలిగిపోయినాడు.

చంద్రబాల చేతులు చాచి, "ప్రభూ! వచ్చితిరా! సర్వకాలముల మీ పాదములమ్రోల అధివసించియుండు భాగ్యము నా కెప్పుడు?"

"దేవీ! ఆ పొదరింట కూరుచుందము రమ్ము."

"మందులు పుచ్చుకొనియే వచ్చితిరా!"

"తాతయ్యగారు ఔషధముల సేవింపనీక నన్ను నీకడకు పంపెదరా ఆత్మేశ్వరీ!"

"తాతపాదుల దయ అనంతము." ఇరువురు పొదరింట అధివసించిరి. ఆ పొదరింట పూలపరీమళములలో చంద్రబాల శివజటాజూట శ్వేతపన్నగివలె స్వాతికాభిరూప యైనది. ఆమె వెనుకనే స్వచ్ఛోరగి ఉలూపి మెఱుమువలె శ్రీకృష్ణప్రభువు ఒడి లోనికి ప్రవహించి వచ్చెను.

"దేవీ! ఉలూపి ఈ దినములలో మెఱుమువలె వెలిగిపోవుచున్నది. ఆమె కింత

యానంద మేమి?"

"ప్రభువు ధూర్తులగుచున్నారు. నా ఆనంద మాపన్న గరాణిది యును"

"అటులనా!"

ఉలూపి ఎటులవచ్చినదో అటులనే మాయమైనది. విషకన్యక కడకు శ్రీకృష్ణుడు చటుక్కున చేరి యామె నక్కున జేర్చుకొని నంతట మందాకిని పాలసముద్రము చేరునట్టి, రాకాపూర్ణిమాజ్యోత్స్న సుధాకరహృదయమున చేరునట్టి అమృతమధురములగు సుస్వరముల నా విషకన్యక -

"చంద్ర స్త్వం, చంద్రికాహం,
దివిజసరి దహం, భాస్వర సాగర స్త్వం,
ఏత ద్విశ్వాంబుజం త్వం
సతత పరిచర ద్గంధ సందోహికాహమ్"

అని పాడెను. ఆమె మోము హాసప్రఫుల్లమైనది. "ఇది నేను రచించు నొక రూపకములోనిది సుమండీ! ఈ శ్లోకంకూడా వినండి -

"ఏషా సేయం ధ్వని రహ మమృతౌ
త్వం మహాకాశరూపః,
ఓం త్వం, త్వం తత్, త దహ, మహ మహో
సృష్టి రేషా సమస్తా"

అని తోడిరాగిణీయుక్త మగు కాకలీస్వనమున శ్లోకము పాడినది.

శ్రీకృష్ణప్రభుని యానందము వర్ణనాతీతము.

"దేవీ! నేను హిమబిందుకుమారిని ఉద్వాహ మగుదు ననుకొని సువర్ణశ్రీ ప్రభువు వారణాసి పారిపోయినాడు. రేపు వటువాతనే ఆయనను తోడి తే వారణాసి పోవుచున్నాను."

విషబాల "తప్పక కొనిరండు. మీరు ప్రార్థించినగాని యా మహాశిల్పి రాడు సుమండీ!" యనెను.

## ౨౦
## శిల్పి-ప్రణయిని

సువర్ణ అచ్చట శిల్పగృహమున బోధిసత్త్వుని విగ్రహము చెక్కుచుండెను. ఆ బోధిసత్త్వుడు త్రిభంగిమై నిలుచుండి లీలాకమలము కుడి చేత ధరించియుండెను. సువర్ణశ్రీ తన వేదన నంతయు నా విగ్రహమున వేదనాతీతు డగు మహానుభావునియందు మూర్తింపజేసెను.

మృగాజిన యజ్ఞోపవీత ధారియై, మణిస్థగిత కుండలకర్ణుడై, విశాల నేత్రుడై, విపుల భుజాస్కంధుడై యా బోధిసత్త్వుడు సువర్ణశ్రీ పోలికనే వరించెను."నీ పోలిక నీ విగ్రహ మేల చెక్కితివి?" అని గాంధార నివాసి యగు నొక బౌద్ధభిక్షుకు డడిగినాడు."

"నేను పొందలేని అర్థతత్వము నీవిధమున పొందింప చేసికొంటిని."

"ఓయి వెఱ్ఱివాడా! నీవుమాత్ర మేల బోధిసత్వుడవు కాలేవు?"

"కొన్ని జన్మలవరకు కాలే నని నాకు నిశ్చయముగ తెలుసును. నా మనస్సు అద్భుత మగు నొక విషయమున తగులము నందినది. ఆ వస్తువే నాకు స్వప్నము. ఆ వస్తువును మనసా నేను విడిచి ఉండలేను."

"ఏల నీ వా వస్తువును పొందకూడదు?"

"అది నేను పొందదగినది కాదు. నేను వేవిధముల పూజింపదగిన మహాపురుషుని దది."

ఆ భిక్షుకుడు ఈ బాలశిల్పి ఒక పరకీయను, బహుశః గురుపత్నిని, ఆశించెనేమో యని ఎంచినాడు.

"కుమారా! నీవు దీక్ష గైకొనుము. దీక్షయే ఈ ప్రపంచవాసనల నుండి నీకు విముక్తి కలుగజేయును" అని బోధించెను.

సువర్ణశ్రీ ఆలోచనాతీక్షణ మగు వదనమున "నేను దీక్ష పుచ్చుకొందును. రేపటి దినముననే పుచ్చుకొందును. బుద్ధుని చరణము తప్ప నాకు వేరు గతి లేదు. అని చెప్పెను.

"అయిన నీ దీక్షకు వలయు సన్నాహము చేయించెద" నని భిక్షుకు డా శిల్పభవనము నుండి వెడలెను.

సువర్ణశ్రీ అర్ధనిమీలితనేత్రుడై బుద్ధదేవుని ధ్యానించుచుండ మనో నయనమున హిమబిందు ప్రత్యక్షమయ్యెను. హృదయము చెదరి సువర్ణశ్రీ కన్నులు తెరచెను. ఎదుట చిరునవ్వు నవ్వుచు హిమబిందు నిలిచియున్నది. హిమబిందుమూర్తి ప్రత్యక్షమగుటయు, సువర్ణశ్రీ కళ్ళు మరియూ గట్టిగా మూసుకొనినాడు. ఆమె ఇంకను కనులలోనే నిలచియున్నది.

బుద్ధదేవునకు కామదేవు డటులనే ప్రత్యక్షమైనాడు. ఆమె అటుల తన చూపులలో, సర్వస్వములో ప్రత్యక్షమగుట అతనికి సంతోషమే కూర్చినది. అటుల నానంద ముద్భవించుట గమనించి యాతడు కించ పడినాడు.

తాను భిక్షుకుడయ్యు ఈ దేవిని మరచిపోలేడా? ఈ అద్భుత సుందరీమణినీ, సకలకళాధిదేవిని తాను మరువలేడా? తన హృదయము చిత్తము నిజముగా భిక్షుత్వ మందలేదా?

"దేవీ! హిమబిందూ! నాకళాతపస్సు మూర్తీభవించిన అపర తారాదేవీ! ఆనందమయీ! సౌందర్యమయీ! నిన్ను విడిచి ఎట్లు నేను భౌద్ధ బిక్షుకుడను కాగలను! కట్టిన పుట్టములు, కాషాయవర్ణములు, భావములు కాంక్షాపూర్ణములు" అని ఆతడు పెదవులు కదలించెను.

"అవునయ్యా! నీవు బౌద్ధభిక్షుకుడ వెట్టు కాగలవు" అని తీయని మాటలు వినబడినవి.

ఆత డా మాటలు తన హృదయమునుండి వినబడిన వనుకొనెను.

"నా బుద్ధసేవకు నీ వడ్డము రావలదు. దేవీ! నిన్ను ప్రేమించితిని, ప్రేమించు చున్నాను. నిన్ను మరచిపోవు శక్తి నాకు నీవే ప్రసాదింప వలయును." ఆతడు కన్నులు తెరచెను. హిమబిందు కన్నుల నీరునిండ, ఆతని ఎదుట చేతులు జోడించి నిలిచియున్నది.

"స్వామీ! మీరు నన్ను నిజముగా మరచిపోవలయుననియే సంకల్పించినారా?"

ఆతడు చకితుడై తనయెదుట నున్నది హిమబిందే అని గ్రహించి లేచి నిలుచుండినాడు. ఆతడు గజగజ వణకినాడు. ఒక్కసారి పరచింత లెల్ల విడిచి ఈ దివ్యమూర్తిని తనహృదయమున కదిమికొని, మనుష్య లోకమునకు దూరముగ నామెను తస్కరించుకొనిపోయి, యావెయే తానై, ఆ నిర్జనపథములలో దివ్యానంద మనుభవింపవలయు ననుకొనినాడు.

ఒకసారి ఈబాలిక ఈ మహో తమచరిత్ర మహారాజ్ఞియై, చక్రవర్తిని లోక మేల నున్నప్పుడు, తానామెకు ధూమకేతువువలె ఆమె పాలిట దుర్దైవమువలె తటస్థించుట మహాదోషము అనుకొనును.

ఈమె ఇట్లేల వచ్చినది? అయ్యయ్యో! ఏ మనుకొందురు! ఎంత తప్పు! నాకై ఇట్లు వచ్చుట ఏమి? వృషభశకట పరీక్షలో నెగ్గుటయే ఈ యనర్థముల కన్నిటికి మూలము. తా మిద్ద రట్లు ప్రేమించుకొననేల? తథాగతుడు తన కేదారి చూపునో? ఇంతదనుక తాను భిక్షుకత్వ మేల పుచ్చుకొన లేకపోయినాడు?

"సువర్ణశ్రీకుమారా! మాటలాడ రేమి? నేమి దోష మొనర్చితి నని ఇటుల పారిపోయి వచ్చితిరి?"

"దేవీ! నీవు దోష మొనర్చుటా! నేను దోషముల ముద్దను, మా నాయనగారి మాటలు విన్నచో నా ప్రభువునకు, నాధర్మమునకు దోషము వచ్చెడిదిగాదు."

"మీ రేమి దోష మొనరించినారు? నాదే దోషమంతయు. నా కీ విద్య లెందుకు, నా కీ జన్మ ఎందుకు? ఏల నేను మాతండ్రికి ఉద్భవించి నాను? మిమ్ము ప్రేమించితిని. మీరు నాకు భర్తలు. ఒండొకని భర్తగా ఎట్లంగీకరింపగలను? అది ఆర్యధర్మము కాదు. స్త్రీధర్మ మంతకన్నను గాదు. మీరు భిక్షుకులగుదురా, నేనును భిక్షుకురాల నగుదును. మీకు సేవ చేయుదును."

"నీవు మహారాజ్ఞివి కావలయును! భారతవర్షమును రక్షింపవలయును. ధర్మ భావనమునకై ఉద్భవించిన నీకు భిక్షుకత్వము తగదు."

"మీకన్న నాకితరధర్మము, దైవములేదు. కానీ నాడు నాకీ ప్రాణములు నిలువవు."

"బుద్ధ! బుద్ధ! అట్టిమాట లనకు దేవీ!"

సువర్ణశ్రీ ఏమిచేయును? ఎదుట తాను రచించిన బోధిసత్వవిగ్రహము! కుడివైపున హిమబిందు! ఆమె బోధిసత్త్వునిదేవియై, యాతనికి తోచినది. కాని ఆ బోధిసత్త్వుడు తనపోలిక! ఆ బోధిసత్త్వుడే తా నయినాడు.

హిమబిందునకు ధైర్యము పటాపంచలగుచున్నది. తాను చారుగుప్తుని తనయ యై తన చిరకాంక్షితమును పొందలేకపోయినది. భిక్షురాలై సంఘసేవ చేయుచు ఈ మహాత్ముని, ఈ బోధిసత్వావతారుని, మనస్సులో పూజించుచు, నశించిపోవుటకంటె మార్గ మింకొకటి లేదని యామె తలంచి భయపడి గజగజ వణకిపోయినది. ఆమె ముడుచుకొని క్రుంగిపోయినది. తానెట్లు మరల తండ్రి ఇంటికి పోగలదు? తనకు చక్రవర్తినీత్వ మావం తయు అవసరము లేదు. తనకు కుబేర వైభవము వలదు. ఏల తాను ఒక కర్షకసుతయై జన్మింపలేదు? సుందరీనందుల చరిత్ర ఏమైనది? అటులనే తామును సన్యాసము పుచ్చుకొందుము గాక! దూరమున నుండియే తాను తన స్వామిని దర్శింతును. ఆయన కొరకే తన సన్యాసము. ఆయన తన తపస్సు. ఆయన తన నిర్వాణము!

"ప్రభూ! మీరు సన్యాసులగుడు. నన్నును దీక్షపుచ్చుకొన నిండు. అంతియ నా తుదికోర్కె" అని హిమబిందు సువర్ణుని ఎదుట మోకరించి నది.

సువర్ణశ్రీ "వలదు, హిమబిందూ! అట్లనకుము. నీ పితృదేవుల కోర్కె నిరాకరింపకుము. బుద్ధదేవుడు నిన్ను రక్షించును. నీకు సన్యాస మేమి?" అని చేతులు రెండుజోడించి విచారముతో, గద్గదికతో పలికి వేదనతో నిలుచుండెను.

"సువర్ణశ్రీకుమారా! నీకు మాత్రము సన్యాస మెందుకయ్యా!" అని చారుగుప్తుడా మందిరములోనికి వచ్చెను. చారుగుప్తుని వెనుక ఆ సంఘారామ కులపతియు, వారివెనుక కీర్తిగుప్తుడును వచ్చిరి.

## ౨౧

# రాజప్రతినిధీ జయ!

హిమబిందు లేచి నిలుచున్నది. ఆమె భీతచిత్తయై, ధైర్యము కుదుర్చుకొని, కోపఘూర్ణయగు ఆడుపులియైనది.

చారుగుప్తుడు తనయను గట్టిగ హృదయమున కదుముకొని, "నా తల్లీ! నిన్ను సువర్ణశ్రీకి ఉద్వాహమొనరింప నేను సంపూర్ణముగ సంకల్పించుకొనినాను. నే నందులకే నీవెంట వచ్చితిని తల్లీ! అందుకే మీ తాతగారును నీ మామగారును వచ్చినారు. మేము నీ వెనుకనే ఈ మందిరముకడకు వచ్చి, గుమ్మముకడ ఆగి మీ సంభాషణ వినుచుంటిమి. సువర్ణశ్రీ! నీవు పవిత్రచరిత్రుడవు. నేను మూర్ఖుడనై ఐహికభోగములు కాంక్షించితిని. నీవు నాతల్లిని నీ ఆత్మతోడనే ప్రేమించితివి. నీవు సన్యాస మెట్లు గ్రహింపగలవు నాయనా? నీవు భిక్షుకత్వము స్వీకరించి, ధర్మమునకు ద్రోహము చేతువా?" అని సువర్ణుని వైపు తిరిగియనెను.

హిమబిందు తండ్రిమాటలకు చకితియై తండ్రికంఠము చుట్టు చేతులు వైచి, ఆతని హృదయమున తన మోము దాచుకొని, అతి సంతోషమున వెక్కివెక్కి ఏడ్చినది.

సువర్ణశ్రీ ఇది కల యనుకొన్నాడు. తన్ను తాను నమ్మలేకపోయి నాడు. చారుగుప్తుని వైపు వెఱ్ఱివానివలె చూచినాడు. కీర్తిగుప్తునివైపు చూచినాడు. ఆ వెనుక ఆచార్యుల చూచి మోము వాల్చినాడు.

"బిడ్డా! నీవు భిక్షుకుడ వెట్లగుదువు తండ్రీ! నా కా గాంధారభిక్షుకుడు వచ్చి చెప్పినప్పుడే నవ్వువచ్చినది. నీవు కాబోవు తాతగారికి, మామ గారికి నమస్కరింపుము!" అనినారు.

సువర్ణశ్రీ తెల్లబోయి ఇటునటు చూచినాడు. ఎట్లు వీరంద రిచ్చటికి వచ్చినారు? వీరు తన సంకల్పమును కొనసాగనీయరా?

హిమబిందు వచ్చినది. ఆమెతండ్రివచ్చినాడు. ఆమె తాతయు వచ్చినాడు.

చారుగుప్తుడు కొమరితపై యత్యంత ప్రేమచే యామె కోర్కెనే పాలించుటకు వచ్చినారా? లేక ఆ బాలికను తనెదుట యువరాజునకై ఒప్పించుటకా? మొదటివిషయము నిజమైనచో తానెట్లు ఒప్పుకొనగలడు? రెండవ విషయమున హిమబిందునే ఒప్పించుటకు తాను ఆమెపాదముల బడును.

ఏది కర్తవ్యము? ఏమిటిది? తనకై ఇంతమంది వచ్చిరి. తానెప్పుడు ఇట్టి సంకటములే ఇతరులకు తీసుకొనివచ్చుచుండునా? ఏది కర్తవ్యము?

తన ప్రభువునకు తాను ద్రోహమెట్లు చేయును? ఇదే తనకు మార పరీక్ష? తథాగతుడు తన పక్షము రానేరాడా? తనలోని దోషములే తన్నీ పరీక్షకు తెచ్చినది.

ఓం నమ చ్ఛాక్యమునయే

సువర్ణశ్రీ మ్రాన్పడిపోయెను. ఆతడు కన్నులు మూసెను. ఆతడు రచించిన

బోధిసత్వుడైన తానే తన ఎదుట తనకు ప్రత్యక్షమైనాడు.

కన్నులు తెరచి హిమబిందును చూచినాడు. ఆమె కన్నుల నీరు కారి పోవుచున్నది. చారుగుప్తుడు చిరునవ్వు నవ్వుచున్నాడు. కీర్తిగుప్తుడు తనపై కరుణార్ద్రచంద్రిక లగు చూపుల పరచుచున్నాడు. సంఘారామ కులపతి భ్రూయుగ్మముమధ్య ఈ ప్రపంచమున ఇట్టి దుఃఖమయ చరిత్రలు వ్యక్తమగుట మారదేవుని మహిమయేగదా యను విచారణాత్మకము లగు కాంతులు ప్రసరించుచున్నవి.

సువర్ణశ్రీ మూర్తిమంతుడు, సుందరశ్రీలేఖా సమన్వితుడు, మనోహర కాంతియుతుడు, వీరావతంసుడు, మహాశిల్పి. సువర్ణశ్రీ కుమారుడు ఏమియు మాటలాడలేక మ్రాన్పడి నిలుచుండెను.

చారుగుప్తుడు "నీకుమాత్రము సన్యాస మెందుకయ్యా?" అని గంభీరములు, ఆర్ద్రములు, ప్రేమమయములయిన వాక్యములు పలికిన పలుకులే ఆతనికి స్థూప ఘంటికా నిస్వనములై, వీణతీగల మ్రోతలై వినిపించినవి.

ఆ పలుకులు వినంబడి ఇరువది నిమేషములైన కాలము జరుగ లేదు. సువర్ణశ్రీ ఆ శిల్పశాలయం దుండియు చతుర్ధశభువనములు మహా వేగమున పరిభ్రమించి పోవుచున్నాడు.

ఏ భావము స్పష్టముగ దర్శనమీయదు. ఏ వెలుగును పూర్ణకాంతి యుతముకాదు. ఏ చీకటియు గాఢతమస్సు కాదు.

ఆతడు గడగడ వణంకిపోవుట కీర్తిగుప్తుడు చూచి ఆ బాలుని కడకుపోయి "నాతండ్రీ! నీవు హిమబిందును ప్రేమింపలేదా, ప్రేమించి వదలుకొంటివా?" అని అస్పష్టముగ ప్రశ్నించెను. కాని కీర్తిగుప్తుని కన్నులు నవ్వుచున్నవి.

చారుగుప్తుడు కొమరిత చుట్టును తనచేయి చుట్టి, సువర్ణశ్రీని చూచి, "కుమారా! ఈ బాలిక నీపై ప్రాణము పెట్టుకొని బ్రతికియున్నది. ఆమెపై ప్రాణ ముంచుకొని నేను బ్రతికియుంటిని-" అని అనుచుండ సంఘారామ కులపతి, "మీపై జంబూద్వీపమంతయు నాధారపడియున్నది వర్తక సార్వభౌమా!" అని యనినాడు.

సువర్ణశ్రీ ఏమి చేయవలయునో, ఏమి యనవలయునో తెలియక మౌనమూర్తియై నిలుచుండెను. ఒక్కొక లిప్త ఒక యుగమువలె జరుగు చున్నది. తన మహారాజు, హిమబిందు తాను, చారుగుప్తుడు-మహారాజు, హిమబిందు -

"జయజయ! జగన్ మ్మహాపథనృత్యత్ కీర్తిసుందరీపాదా! జయ చతుస్సముద్ర ముద్రిత ధరావలయ సార్వభౌమకుమారా! సాతవాహనపవిత్ర వంశపారావార రాకాసుధాకరా! జయ శ్రీప్రతిష్ఠాన నగర మహాపాలకా! జయభరుకచ్ఛపట్టణ చంద్రసైంహితేయా! జయ జయ మాళ వాభీర కుంత లాశి కాశ్మికాది నానాదేశ రాజన్య కిరీటరత్న నీరాజితసుందర శ్రీపాదుకా! జయ జయ జయశ్రీ ఆనందీపుత్ర శ్రీకృష్ణ సాతవాహన మహారాజా!" అన్న జయ వాక్యములు గంభీరస్వరమున ఆ విహారమున మారుమ్రోగి అందరు చకితులై యావంక కనుగొనిరి.

శ్రీకృష్ణసాతవాహన మహారాజు, వినయభిక్కులు, ధర్మనందియు, శక్తిమతీదేవియు, ముక్తావళీదేవియు లోనికి విచ్చేసిరి. వారివెనుకనే హర్షగోపుడు పెన్నిధిని వెదకు లోభివలె వచ్చెను. హిమబిందు వెంటనే ముక్తావళీదేవి కడకు పరువిడి యామె కౌగిలిలో వ్రాలినది.

ముక్తావళీదేవి కనుల నీరు చెమరింప “నా తల్లీ!” అని ఆమెమూర్ధము పుణికినది.

శక్తిమతీదేవి నవ్వుచు, “కోడలా! క్షేమమా తల్లీ!” అని ప్రశ్నించినది.

సువర్ణశ్రీ మహారాజునకు వీర నమస్కారమిడి, తండ్రికి పాదాభి వందన మాచరించి, ముక్తావళీదేవికి, తనతల్లికి నమస్కృతులిడెను.

శ్రీకృష్ణసాతవాహనుడు సంఘారామకులపతికి నమస్కారమిడి ఆశీర్వాదమందెను. ఆ మహారాజు సువర్ణశ్రీని కనుంగొని, “సువర్ణశ్రీ ప్రభు! యాత్రలన్నియు పూర్తియైనచో మిమ్ము గొనిరమ్మని సార్వభౌములు మా కాజ్ఞ నిడిరి. మిమ్ము చక్రవర్తి సామ్రాజ్యాభిషేకమునకు, మీ వివాహమునకు, మా సమవర్తిసోదరుల వివాహమునకు ఆహ్వానింప మేమే వచ్చితిమి!” అని సాభిప్రాయపూరితము లగు చూపుల పరపెను.

సువర్ణశ్రీ “మహాప్రభూ! అవధరించుచుంటిని” అని వినయముతో బలికెను.

యువరాజు “సువర్ణశ్రీ ప్రభు! చారుగుప్తులవారు తమపుత్రికను హిమబిందుదేవిని తమకు పాణిగ్రహము సలుప కోరుటకు వచ్చిరి. తమ ప్రతినిధిగ సార్వభౌములు మమ్మంపిరి. కాని మాకన్న ముందుగనే శ్రీ చారుగుప్త మహాభాగులు విజయము చేసినారు” అని దరహసిత వదనమున పలికినాడు.

సువర్ణశ్రీ “మ-మ-హారాజా!” అని గద్గదిక మొందినాడు.

శ్రీకృష్ణుడు “సువర్ణశ్రీ మహాప్రభూ! మీరు కుసుమపురమున సకల ధరాధీశేశులైన శ్రీ శ్రీముఖసాతవాహన చక్రవర్తుల రాజప్రతినిధులుగా సింహాసన మధివసింప చక్రవర్తులు మిమ్ము ఆహ్వానింప మా కాజ్ఞ నిచ్చినారు” అని గంభీరస్వరమున పలికినాడు.

మాగధులు, జయ జయ శ్రీసువర్ణశ్రీమహారాజులకు! జయ విరోధి వీరమత్తేభకుంభ విదారణకంఠీరవులకు! జయజయ శ్రీపాటలీపుత్రపురసింహాసనాధీనా! జయ జయ సకలభూమండల ప్రసర్పితశ్వేతచ్ఛత్రాధిప శ్రీ శ్రీముఖసాతవాహన మహాజాధిరాజ ప్రసాదలబ్ధ సింహాసనా!” అని జయ ధ్వానములు పలికినారు.

చారుగుప్త ధర్మనంది కీర్తిగుప్తుల హృదయములు ఝల్లుమని పోయినవి. శక్తిమతీ ముక్తావళీదేవులు ఉప్పొంగిపోయినారు.

సువర్ణశ్రీకడకు శ్రీకృష్ణసాతవాహనుడు పోయి చెవిలో “మిత్రమా! సువర్ణశ్రీప్రభూ! నాకు హిమబిందుదేవి ఎప్పుడును చెల్లెలు. నీవు వేరభిప్రాయమంది నాకు తలవంపులు తెచ్చెదవా! నా చెల్లెలు హిమబిందు కుమారి నీ అర్ధాంగిసుమా!” అని రహస్యము చెప్పెను.

సువర్ణశ్రీ ఆచార్యునిపాదములకడనే సాష్టాంగపడినాడు. ఆచార్యులంతట అత్యంతదయతో సువర్ణుని లేవనెత్తి ఆతని చేతిలో హిమబిందు చేయి నుంచినారు. అక్కడకుచేరిన భిక్షుకులు:

“నమచ్ఛాక్యమునయే
తథాగతాయ అర్హతే
సంయుక్ సంబుద్ధాయ”

అని పాడిరి.

## ౨౨

## అఖండభూవలయు సామ్రాజ్యాభిషేకము

"అగ్నిః పూర్వేభికృషిభిరీధ్యో నూతనైరుత స దేవా ఏహవక్షతి."

అను మంత్రముచే అగ్ని ప్రజ్వరిల్లుచుండెను. మహర్షులు మంత్రములు చదువుచుండిరి. స్థాలతిష్యమహర్షి వసిష్ఠు డయ్యెను.

"ఇంద్ర స్యను వీర్యాణి ప్రకోచం యాని చకార ప్రథమాని వజ్రీ
అహ న్నహి మన్వప స్తదర్ద ప్రవక్షణా అభినత్పర్వతానాం"

ఇంద్రమంత్రములైనవి.

"తత్సూర్యస్య దేవత్వం తన్మహిత్వం మధ్యా కర్తరి తతం సంజ
భార య దేత దయుక్త హరితః సదస్థా దాద్రాత్రీ వాసస్తను తే సి మస్మై."

సూర్యుని పూజించినారు. సర్వదేవతలను అర్చించినారు.

"నా విష్ణుః పృథివీపతిః" గావున విష్ణు నట్లర్చించిరి.

"ఇవ ద్విషోః పరమం పదం సదా సశ్వంతి సూరయంః దివీవచక్షు రాతతం|
త ద్విప్రాసో విపన్యవో జాగృవాం సః సమింధతే విష్ణోర్య త్పరమం పదం||"

చక్రవర్తి సింహాసన మహావితర్దికకు దిగువను ఒక సామాన్య సింహాసనముపై శ్రీముఖసాతవాహనుడా శ్రావణశుద్ధ పంచమినాడు, ఉత్తరఫల్గుణీనక్షత్ర తృతీయ పాదయుక్త కన్యాలగ్నమునందు, సింహాసనారూఢుడు కా సముచితాలంకారుడై అధివసించియుండెను.

కర్కాటకమున రవియు, దశమమున బుధశుక్రులును, మీనము నందు గురువును బలవంతులై యుండి, చంద్రుడు లగ్నమందుండెను.

ఈ మహాముహూర్తమునందు సింహాసనాభిషేకము నేర్పాటు చేసినాడు స్థాలతిష్యుడు. అంతకుముందునుండియు అనేకహోమములు జరుగు చున్నవి.

పాటలీపుత్రము దేవనగరివలె నలంకరింపబడెను. మగధ దేశమంతయు నలంకరింపబడెను. ధాన్యకటకమహానగరము వైకుంఠమే ఆయెను.

ఆంధ్రదేశమంతయు పండుగలే! సకలభూవలయము మహదాంధ్ర దేశమయినది వారికి.

మహదాంధ్రసార్వభౌముడు హరిశ్చంద్రాది మహాచక్రవర్తుల వంశములోనివా డైనాడు. తెల్లని భద్రదంతావళముపై నధిరోహించి చక్రవర్తి ఆ ముందు రాత్రి యంతయు నూరేగినాడు. ఆ దంతావళాలంకారమే కోటిపణములు విలువ చేయునట.

చక్రవర్తి సింహాసనమున కెడమభాగమున దేవి ఆనందమహారాజ్ఞి వేరొక సింహాసనముపై నధివసించియుండెను. ఆమె కెడమప్రక్క రెండు సింహాసనములపై

శ్రీకృష్ణసాతవాహన మహారాజు, మంజుశ్రీ రాజకుమారు లధివసించియుండిరి.

దేశదేశములనుండి మహారాజులు, మహాప్రభువులు, భూపతులు, సామంతులు, సేనాధికారులు, వర్తకచక్రవర్తులు, మహామంత్రులు, మహా పండితులు వచ్చియుండిరి.

లోకమంతయు ప్రసిద్ధినందిన నాయకులు, కవులు, శిల్పులు, నాట్య వేత్తలు వచ్చియుండిరి.

సాముగరిడీలవారు, ఆయుధవిద్యావిశారదులు, మంత్రవేత్తలు, మల్ల ముష్టి యుద్ధపునిపుణులు వచ్చిరి.

ఉత్సవమునందు పాల్గొన అనేకులు జానపదులు, నాగరులు వివిధ దేశములనుండి వచ్చిరి. యవనరాజ్య రాయబారులు, ప్లేచ్ఛదేశ రాయబారులు వచ్చియుండిరి.

స్త్రీమండలమున కౌస్తుభమణివలె చంద్రబాల యొక సింహాసనము నలంకరించి యుండెను. ఆమెప్రక్కను చక్రవర్తికుమారికలు మాయా దేవియు, శాంతశ్రీదేవియు అధివసించి యుండిరి. చంద్రబాల కుడిప్రక్కనే అపర ప్రజ్ఞాపరిమితా దేవివలె హిమబిందు అధివసించియుండెను. అచ్చటనే ముక్తావళియు, అమృతలతాదేవియు, శక్తిమతీదేవియు, నాగబంధునికా సిద్ధార్థినికలు ఉచితాసనముల నధివసించి యుండిరి.

చక్రవర్తి కుడివైపున ఉచిత సింహాసనముపై చారుగుప్తవర్తక సార్వభౌములు నివసించి యుండిరి. వారివెనుక అచీర్ణమహామంత్రియు, ధర్మనందియు అధివసించి యుండిరి. సంపూర్ణ కవచాఢ్యులై స్వైత్రులవారు సార్వభౌమ సింహాసనము కడ కత్తిదూసి నిలిచియుండిరి.

ఆవలప్రక్క సోమదత్తాచార్యులుండిరి. సింహాసన వితర్దికా సోపాన పంక్తి మ్రోల సమవర్తి సాతవాహనుడు, శుకబాణులవారును, సువర్ణశ్రీయు ఉండిరి.

స్థాలతిష్యునకు చంద్రస్వామి ఉపవసిష్ఠు డయెను.

అమృతపాదార్హతులు సింహాసనమునకు ఎడమప్రక్క సువర్ణపద్మ పీఠముపై అధివసించి యుండిరి. వారి ననుసరించి వివిధసంఘారామ కులపతులు, అర్హతులు, ఆచార్యులు, భిక్షులు, పీఠముల పై అధివసించి యుండిరి.

మంజుశ్రీని పెంచిన చంద్రస్వామి చెల్లెలు కరుణశ్రీదేవి ఆనంద మహారాణి వెనుక పీఠమున అధివసించి యుండెను. ఆమెభర్త గౌతమ పండితులు, స్థాలతిష్యుని శిష్యులు వారికి యాజకత్వమున సహాయముచేయు చుండిరి.

అభిషేకము జరిగినది.

బౌద్ధులు బౌద్ధవిధానమున వినయపిటకమునుండియు, దమ్మసుత్త ములనుండి మంత్రములు పఠించిరి.

“నమో తస్స భగవతో అర్హతో,
సమ్మ సముబద్ధస్స!
బుద్ధం శరణం గచ్ఛామి,

దమ్మం శరణం గచ్ఛామి,
సంఘం శరణం గచ్ఛామి,
దుతియంపి బుద్ధం శరణం గచ్ఛామి,
దుతియంపి దమ్మం శరణం గచ్ఛామి,
దుతియంపి సంఘం శరణం గచ్ఛామి,
తతియంపి బుద్ధం శరణం గచ్ఛామి,
తతియంపి దమ్మం శరణం గచ్ఛామి,
తతియంపి సంఘం శరణం గచ్ఛామి,
పానాతిపాతా వరమనీ సిఖ్ఖాపదం సమాదియామి.
అదిన్నాదానా వరమనీ సిఖాపదం సమాదియామి.
కామేసు మిచ్ఛాచారా వరమనీ సిఖ్ఖాపదం సమాదియామి.
ముసాపాదా పరమనీ సిఖ్ఖాపదం సమాదియామి.
సురా-మెరయా మజ్జ-పమాద-దానా వరమనీ.
సిఖ్ఖాపదం సమాదియామీ"

అని పాడిరి.

బౌద్ధధర్మాభిషేక విధానమును, ఆర్యధర్మాభిషేక విధానమును ఒకటియే.

రెండు ధర్మముల ప్రకారము అభిషేకము జరిగెను. చారుగుప్తుని భుజముపై కుడిచేయి నిడి చక్రవర్తియు, అతని ఎడమ పార్శ్వమున చక్రవర్తినియు, చెలికత్తె శక్తిమతి చేయిబట్టియు సింహాసనము చెంతకు వచ్చిరి. సర్వవాద్యములు మ్రోగుచున్నవి. నృత్యగీతాది కళాప్రదర్శనములు జరుగు చున్నవి.

ఐతరేయబ్రాహ్మణము ననుసరించి స్థాలతిష్యమహర్షి సార్వభౌమ పట్టాభిషేక మొనర్చి, సార్వభౌమకిరీటములు వారితలలపై నుంచేను. మహ దాశీర్వచనము, సుమంగళుల హారతియు జరిగినవి.

దమ్మసూత్తముల ననుసరించి బౌద్ధార్హతశిరోమణియైన అమృత పాదులు చక్రవర్తికి అభిషేకము చేసెను.

చక్రవర్తి చారుగుప్తుని సకలజంబూద్వీపసామ్రాజ్యమునకు మహామంత్రిగ అభిషేకము చేసి ముద్రిక లందిచ్చెను.

## ౨౩
## శుభమంగళ గీతములు

అభిషేకమహోత్సవములు సకలభారతావనియుందును కొన్నినెలలు జరిగినవి. కుసుమపురము కన్నుల వైకుంఠమై, ఆనందకోలాహలమై పోయినది.

అభిషేక మహోత్సవమైన కొలదిదినములకు శుభముహూర్తముల సువర్ణశ్రీ హిమబిందుల వివాహమును, నాగబంధునికా సమదర్శుల వివాహమును జరిగినవి.

సమదర్శిసాతవాహనుడు ఆంధ్రశత్రువులకు సమవర్తి కావున, సమవర్తి బిరుదనామ ప్రసిద్ధుడు. ఆతడు రాజముద్రిక లంది, భార్యాద్వితీయుడై, చంద్రస్వామి మహా పండితయుక్తుడై, తన సైన్యము గూడుకొని భరుకచ్ఛ పట్టణమునకు బోయినాడు.అచ్చట

నొక శుభముహూర్తమున నాగబంధునికా సమదర్శులకు రాజ ప్రతినిధి మహారాజ పట్టాభిషేకమహోత్సవము జరిగెను.

సమదర్శి సమదర్శియే! సమదర్శి సమవర్తియే. నాగబంధునికయు భర్తను ప్రోత్సహించి, ఆంధ్ర నౌకలపై దూరదేశములకు ప్రయాణము చేయుచు, ఆంధ్ర శిల్పము, నాగరికత వెదజల్లించుచుండెను.

ఓడదొంగలు విజృంభింపకుండ వర్తకము సర్వతోముఖముగ వృద్ధినంద సమదర్శి రాజ్యపాలన చేయుచుండెను.

నాగబంధునికాదేవి మాట సమదర్శికి చక్రవర్తిశాసనము. ఇరువురు సమముగ యుద్ధములకు బోదురు. ఇరువురు సమముగ సభయం దధివసించి తీర్పుల నిత్తురు. ఇరువురు ఆలోచనామందిరమున చంద్రస్వామి మొదలగు మంత్రులతో రాజ్యవ్యవహారము లాలోచింతురు.

నాగబంధునిక గర్భము ధరించియు తల్లితండ్రులకడకు పురిటికి వెడలి పోవ నిరాకరించినది. అమృతలతాదేవి కోడలిని చూచి తనయంత యదృష్టవంతురాలు లేదని పొంగిపోవుచుండునది. నాగబంధునిక పురిటికి శక్తిమతీదేవియు, సిద్ధార్థినికయు, ధర్మనందియు విచ్చేసిరి.

అక్కకు పుట్టిన బంగారుశిశువును చెల్లెలు వదలునది కాదు. శిశువునకు ఏడునెలలు వచ్చువరకు ధర్మనంది కుటుంబముతో భరుకచ్ఛముననే యుండెను. అక్కడ నొక చైత్యనిర్మాణము తల పెట్టి ధర్మనంది ఆరు నెలలలో ముగించెను. అచ్చటనే యొక సంఘమును స్థాపించి మహా చైత్యవాద పక్షమునకు జెందిన సంఘారామము నిర్మించెను.

నవశిశువునకు శక్తిమతియే పెంచునది. నాగబంధునిక మరల సమదర్శికి మంత్రియు అంగరక్షక సేనాపతియు నైనది.

* * *

వివాహమైన కొలదిదినములకు చక్రవర్తి సువర్ణశ్రీమహారాజునకు, హిమబిందునకు పాటలీపుత్రమున ఉత్తరాంధ్ర సామ్రాజ్యమునకు రాజ ప్రతినిధి పట్టము గట్టినారు.

జ్యోతిష్యులు వీరిరువురికుమారుడు చారుగుప్తమహారాజ నామ ధేయుడై ఒక మహా సామ్రాజ్యమునకు పాటలీపుత్రపురమున మూలపురుషు డగునని సెలవిచ్చి యుండిరి. ఆ విషయము స్థాలతిష్యులవారీ వరకే భవిష్యత్తును తెలిపియుండిరి.

ధాన్యకటకమునకు చక్రవర్తియు, శ్రీకృష్ణసాతవాహన మహారాజు, ధర్మనందియు, శక్తిమతీదేవియు, మహామంత్రులు, సైన్యాధ్యక్షులు, సేనాపతులు మొదలగు వారందరు తరలిపోయిరి.

ఆరునెలలు శ్రీకృష్ణమహారాజునకు చంద్రదేవికిని (విషకన్య) ఎట్లు గడచినవో! స్థాలతిష్యుల ఆశ్రమమునందు విషకన్యక అమృతకన్యక యగుచుండెను. శ్రీకృష్ణ మహారాజునకు మహర్షి దివ్య ఓషధుల సేవింప జేయుచుండెను.

శ్రీకృష్ణసాతవాహనప్రభువు తన భవిష్యద్దేవిని దర్శింపని దిన మొక్కటియు లేదు.

విషకన్యక అపరాజితాదేవి వలె ప్రకాశించిపోవు చుండెను. అమృతపాదార్యతులు తండ్రిని అప్పుడప్పుడు దర్శించుచు వివిధవాదముల విశ్వతత్వము నిర్ణయించుకొనుచుండెను. తండ్రి తాతగారల వాదనలలో విషకన్యక బ్రహ్మానందసుఖ మనుభవించుచు తనప్రియుని మూర్తియే తనకు పూజామూర్తిగా దినదినాభివృద్ధిగ చంద్రికామృత తేజస్సున విలసిల్లిపోవుచు, ప్రియుని హృదయాన చేరు శుభముహూర్త మెప్పుడని ఎదురు చూచుచున్నది.

*　　　*　　　*

పాటలీపుత్రమును పాలింపుచు సువర్ణశ్రీ కోశలదేశమున స్థూపమున కొన గోపురము స్వయముగ విన్యసించి యర్పించెను.

సువర్ణశ్రీ హిమబిందులప్రేమ మహాకావ్యముల కవులచే పాడబడినది.

హిమబిందు సువర్ణశ్రీల ప్రేమ అతిలోకసుందరమై మహాద్భుత శిల్పవిన్యాసరూపమై ఆర్యావర్తమంతయు విలసిల్లిపోయినది. సువర్ణశ్రీ శిష్యులు గాంధార, పారశీక, కొహరస్థాన, బాహ్లిక, మంగోలు, కాశ్యప సముద్రదేశాదులు పోయి ఆంధ్రశిల్ప చిత్రలేఖనాదులు వికసింపజేయు యత్నమున నుండిరి.

శిల్పదీక్ష ఎంత ప్రతిభాయుక్తమైయున్నదో సువర్ణశ్రీకి రాజ్యపాలనాదక్షతయు నంతపట్టుబడినది. ముక్తావళీదేవియు, కీర్తిగుప్తులవారును పాటలీపుత్రముననే ఆగిపోయిరి. చారుగుప్తవణిక్సార్వభౌముడు హిమబిందు ఆనందములో తాను మహానంద మనుభవించుచు, ఆంధ్రమహా సామ్రాజ్యమును వేయికన్నుల కాపాడుచు, పాటలీపుత్ర, ధాన్యకటకనగరములమధ్య తిరుగుచుండెను.

హిమబిందు సౌందర్యము సంపూర్ణవికాస మందినది. ఆమెయే యరణము నిచ్చి బాలనాగిని హర్షగోపునకును వివాహముచేయించి, హర్ష గోపునకు పాటలీపుత్ర పురమున ఉద్యోగమిప్పించినది.

హిమబిందు మహత్సౌందర్యమును అణువు పూజింపుచు సువర్ణశ్రీ దివ్యపథముల సంచరించుచున్నట్లు జీవితాన్వేషియైనాడు. హిమబిందు వెన్నెల, సువర్ణశ్రీ శశికళా ప్రియంభావుకుడు.

హిమబిందు: ఆత్మేశ్వరా! ఏమట్లు మీరు అత్యంత తీవ్రాలోచనా ధీనులైయున్నారు?

సువర్ణశ్రీ: జీవితేశ్వరీ! నాకీ రాజ్యభారము వహించుట ఎందుకు? ఏదియో శిల్పము చేసుకొనువానికి.

హిమ: పాటలీపుత్రపురమును జయించి చక్రవర్తికి స్వాధీనము చేయునాడు మీ కా ఆలోచనలేదూ?

సువర్ణ: ఆపని చక్రవర్తికై చేసితిని.

హిమ:

“ఇదియు చక్రవర్తికై కదా?
ఏనాటి నాకోర్కె నీకనుల రూపొందె,

ఆనాడే ఈ లోక మావహించెను కళలు
ఏనాడు నీమూర్తి నా సర్వమై వెలిగె
ఆనాడే ఈ భూమి ఒక శిల్పమైపోయె”

“ప్రభూ! అశోకుడు శిల్పరసజ్ఞు డగు చక్రవర్తి, మరి నా ప్రభువు శిల్పి చక్రవర్తి! శిల్పియే చక్రవర్తి ప్రతినిధి!”

ఆమె ఆతని హృదయమున వ్రాలినది.

సువర్ణ డామెను బిగియార కౌగిలించుకొనెను. వారిరువురి మోములు శశికళాపరమ శోభాయుతములై పోయినవి.

“ఓం అసతో మా సద్గమయ
తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ.”

“బుద్ధం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి.”

సర్వము సంపూర్ణము

*     *     *